సర్వదా యుగయుగాంతరముల పరమేశ్వరుడు ప్రసాదించిన మహాప్రబోధములను సర్వజన సులభముగా లభింపజేయుట. విశ్వసందేశమని శ్లాఘియయ్యెను.

మతములలోనికెల్ల ఆది ఆర్యమతము ఆర్యధర్మమునకు వేదము మూలము. వేదములు షడంగములతో సహా ప్రకటించుట జ్ఞాన విజ్ఞానములకు సాధనమార్గము. "ఆంధ్రావని మోదమున్ బొరయు" ఆంధ్రవాఙ్మయము పరిపూర్ణతనొంద, ఆంధ్రుల జ్ఞాన వైరాగ్యములు సర్వతోముఖవ్యాప్తిపొంద, లోకోద్భవమునకు కారణభూతుడైన పరమేశ్వరునుండి వెలువడిన ఋగ్యజుస్సామాథర్వ వేదంబుల తదంగ సమేతంబుగా సుబోధకమగు శైలిలో యనువదించి ఆంధ్ర వేదంబులు"గా ఆంధ్రలోకంబునకు లభింపజేయుట కడు కర్తవ్యము ఇట్లు మనోవీధిలో తాండవమాడుచున్న భావపరంపరకు కాలపరిణామముబట్టి కార్యరూపమొందు కాలము సంఘటిల్లెను. ఒకానొక స్నేహితుని వార్తను అవలంబనమయ్యెను. చిరకాల స్నేహితులును, సంపన్న గృహస్థులును, అగు శ్రీయుత ఆలపాటి దేవయ్యగారు యజుర్వేద శాఖలలో నొకదానికి నూనుకొని తన కుమారుడు వెంకటకృష్ణయ్యగారి ద్వారా ౨౩-౧౨-౩౭ తేదీన జరుపబడిన వార్షికోత్సవమప్పుడు చదివించిన ధనము కార్యోపక్రమణకు తోడ్పడెను. తాతలనాటినుండి మా కుటుంబమునకు పోషకులుగా నున్న శ్రీ రామారు జమీందారగు శ్రీ రాజా మాణిక్యారావు వెంకట హయగ్రీయరావు బహదూరుగారు గత ముక్కోటి ఏకాదశినాడు తమ తల్లి శ్రీ రాజా రాజలక్ష్మమ్మ బహదూరుగారి జ్ఞాపకార్థమై శుక్లయజుర్వేదమునకై యిచ్చిన సనదు మరింత ప్రోత్సాహ మొనర్చెను. ఆశ్రమ రాజపోషకుడు శ్రీయుత ముద్దు వెంకట రంగయ్యగారు సామవేదమును భరించ సమకట్టుట సంతోషప్రదమయ్యెను. బాల్యస్నేహితుడు శ్రీయుత మంతెన సుబ్బరాజుగారు తన తండ్రి జ్ఞాపకార్థమై ఋగ్వేదభారమును వహించి కార్యలోపము రాకుండ రక్షించె. అధర్వవేదమునకు పూనుకొననున్న ఒకానొక స్నేహితుని కృషి ఈ కార్యసమాప్తికి తోడ్పడనున్నది. అనాదిగా ఈ వేదమంత్రములను పండిత వరేణ్యులు భద్రపరచియున్నారు. అందు నిగూఢములైన భావపరంపరలు పండిత పామరులకెల్ల సులభముగా బోధపడునట్లు మధురశైలిలో తేలికయైన పదములగూర్చి ఆంధ్రానువాదము జరుగుచున్నది. వేద విమర్శకుల భావములు, ప్రకాశకుల స్వంత భావములును ప్రత్యేకసంపుటములలో తెలుపబడును. కరుణామయుని అపారమైన అనుగ్రహముచేతనే సనాతనులైన పండితులు యీ అనువాదమునకు పూనికొనిరి. ఋగ్వేదమును సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులును, సంస్కర్త

లును, పురాణవాచస్పతి బిరుదాంకితులు నగు బ్రహ్మశ్రీ బంకుపల్లె మల్లయ్యాశాస్త్రిగారు ఆంధ్రీకరించియున్నారు. సామ, అథర్వ వేదములను వారే అనువదింతురు. వ్యాకరణ శిరోమణి బ్రహ్మశ్రీ రామవరపు కృష్ణమూర్తిశాస్త్రిగారు కృష్ణయజుర్వేదమును అనువదించిరి. శుక్లయజుర్వేదమును గూడ అనువదింతురు. యజుర్వేదమునందలి మంత్రభాగమునకు ఆనందాశ్రమ ముద్రణాలయమువారు అచ్చొత్తిన గీర్వాణ మూలగ్రంథముల ననుసరించి సర్వము ఏర్పాటు చేసితిమి. తెలుగు లిపిలో ప్రకటింపబడిన కొన్ని యజుర్వేద మంత్రములకు (క᳚) యిట్లు పైన రెండు నిలువుగీట్లు గల స్వరములు కన్పించుచున్నవి ఈ సంస్కృత గ్రంథములందవి లేకుండుటచే వేయ మానితిమి. అంతమాత్రమున స్వరస్ఖాలిత్యములని యపోహ పడకుందురుగాకయని మనవి.

ఆంధ్రవేద ప్రకటనకు అనివార్యములైనచోటతప్ప స్వదేశవస్తువులనే వాడుచున్నాము. యుద్ధకాలమగుటచేత ధరలు పెరుగుటయు, వస్తువులు సులభముగా లభింపకుండుటయు కొంత ఆటంకమును కల్పించుచున్నవి మూడేండ్లనుండి మురియు చున్న ప్రకటన అంతరాయములచే అప్పటప్పటికి ఆలస్యమగుచుండెను. బాల్యమిత్రుడు వెంకటప్పయ్య తనతల్లి శ్రీమతి కైవారం బాలాంబగారి పేర వేదగ్రంథముల కొన్నిటి నిప్పించెను. కాని పరుచూరు ప్రాంతవాసులు మాఆలస్యమునకు జంకక, మా వాయిదాలను నిరసింపక వేలకొలది ధనమిచ్చి ఆదరాభిమానములతో తోడ్పడుటచేతనే ఈ పని యిప్పటికి సాధ్యమైనది. హిందూధర్మాదాయముల పరిపాలనా సంఘమువారు చేయూతనొసంగిరి. విద్యాశాఖవారు సాయపడిరి. స్థానిక స్వపరిపాలన సంఘములు తోడ్పడుచున్నవి. ఆంధ్రవేదములు సంపూర్తియగుసరికి కొన్ని యేండ్లు పట్టును. ఆంధ్రులందరును, ఆరంభశూరులుగాక సుస్థిర సమగ్రోత్సాహముతో ఈకార్యక్రమమునకు తోడ్పడుదురుగాక యని ఆశించుచున్నాము.

విక్రమ వైశాఖ శు॥ పౌర్ణమి జయవారము ( ౨౧-౫-౧౯౪౦ ) మద్రాసుహైకోర్టులో న్యాయమూర్తులుగానుండి విరమించిన శ్రీ వి భాష్యమయ్యంగారి అధ్యక్షతక్రింద జరిగిన మహాసభలో ఋగ్వేద ప్రథమ సంపుటము వెలువడెను. వినయాశ్రమసప్తమ జన్మదినమగు మార్గశీర్ష బ॥ ౧౦ సోమ వారము (౨౩-౧౨-౪౦) న కృష్ణయజుర్వేద ప్రథమసంపుటము వెలువడెను ఇపుడు సామవేదప్రథమ సంపుటము వెలువడుచున్నది పిమ్మట అథర్వవేదప్రథమ సంపుటము వెలువడును. అటులే ఋగ్యజు

సామాథర్వవేదములు ౨-౩ సంపుటములు వెలువడును. సంవత్సరమునకు ౫సంపుటములనొప్పున ప్రకటించ వలెనని మా ఆశయము. కాని యుద్ధ కాలమగుట వలన కాగితముల ధర అపరిమితముగా పెరుగుట చేతను, ప్రకటించిన సంపుటముల విక్రయము అలస్యముగా జరుగుట చేతను అనుకొనినట్లు సంపుటములు ప్రకటించ జాలనందుకు చింతిల్లుచున్నాము. వేదాభిమానులగు ఆంధ్రులుమాపై ఆదరాతిశయమువలన ఈప్రయత్నము కొనసాగ గలదు.

మొదటి ఐరోపా మహాసంగ్రామమునకు పూర్వము తలపెట్టిన కార్యము రెండవ సంగ్రామకాలమున కార్యరూపము నొందుట కరుణామయుని కార్యలీలయే, గదా! ఈ లీల నెరపుచున్న ఆ జగన్నాటక సూత్రధారునకును, తత్ప్రేరితమైన మిత్రబృందమునకును కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

కార్తికశుద్ధఏకాదశి స్థిరవాసరము,
౧౫-౧౧-౪౧,
వినయాశ్రమము.

ఇట్లు,
గొల్లపూడి సీతారామశాస్త్రి.

# ఉపోద్ఘాతము.

—(౦)—

ఋగ్యజుస్సామాథర్వములను నాలుగు వేదములలో ఋగ్వేదమే అన్నిట నాక్రమించి యున్నదన వచ్చును. అనగా ఋగ్వేదము లోని మంత్రములే యితరవేదంబులలో జాలవఱకును గలవని తాత్పర్యము. ఋగ్వేదమంత్రములే చిన్నపాఠభేదము తోను, పాఠభేదము లేకను ఇతరవేదములలో గలవు

సామవేదమంతయు ఋగ్వేదమంత్రములకే గానము. అయితే సామవేదమునకు ప్రత్యేకత యెటులంటే ఏ కొద్ది మంత్రములు మాత్రము కలవు. దాని చేతనేగాక గానవిశేషము చేత గూడ సామమునకు ప్రత్యేకత గలదు. శ్రీవిద్యారణ్యులవారుకూడ ప్రత్యేకముగా సామవేదమునకు భాష్యము వ్రాసి యున్నారు. దానిం బట్టియే నేననువదించితిని. పాదబద్ధములై నియతాక్షరములు కల మంత్రములకు ఋక్కులని పేరు. అథర్వమందలి మంత్రములకు కూడ ఋక్కులన్న పేరు కలదు. గానమునకింత ప్రాధాన్యమివ్వ వలెనా యంటే—ఇవ్వ వలెను. తపస్సుల వలన గాని సమాధి వలన గాని గానము చేత కలిగిన భావోద్రేకము కలుగదు. భావోద్రేకమే భగవంతుని గనుంగొనుటకు సాధనము. అందుకనియే యాగములలో సామవేదగానముతో మన పూర్వులు స్తుతులు చేసి దేవతల నారాధించి సిద్ధిని బొందిరి. "సామగానలోల" అని భగవంతునకు సంబోధనము కలదు.

నారదశిక్షలో సామగానమును గూర్చి యిట్లు చెప్పంబడెను. —సామ వేదే తు వక్ష్యామి—స్వరాణాం చరితం యథా—తానరాగ స్వరగ్రామ మూర్ఛనానాం తు లక్షణం=సామవేద స్వరములను వాటి నడకలను చెప్పుచున్నాను. ఎట్లంటే—తానము—రాగము—స్వరము-గ్రామము-మూర్ఛన అనువాని లక్షణములను జెప్పుచున్నాను. శ్లో॥ సప్తస్వరాస్త్రయో గ్రామా। మూర్ఛనాస్త్వేక వింశతిః। తానా ఏకోనపంచాశ దిత్యేతత్స్వర మండలం। షడ్జశ్చ ఋషభశ్చైవ। గాంధారో మధ్యమ స్తథా పంచమోధైవతశ్చైవ। నిషాదస్సప్తమస్స్వరః॥

ఏడు స్వరములు, మూడు గ్రామములు, ఇరువైయొక్క మూర్ఛనలు, నలభైతొమ్మిదితానములు. అందు షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములని యేడు స్వరములు. ఇత్యాదిగా నన్నిటి లక్షణములును జెప్పంబడె. నారదాది శిక్షలు వేదాంగములలోనివి. వీనిలో సంగీతశాస్త్రములైన

పారిజాతాదులలో చెప్పినట్లే స్వరగ్రామతానాదులు, లక్షణములను జెప్పంబడెను. కావున సంగీతమంతయు సామవేదమునందు బుట్టినదనదగును. కనుకనే గాంధర్వ వేదమని సంగీతశాస్త్రమును ఉపవేదములలోఁ బరిగణించినారు. ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేదములు ఉపవేదము లనబడెను. గ్రామాదుల లక్షణోదహారణములు చూపుటకిది తావు గాదని విడచితిని అయినను గానస్వరూపము కొంత వివరింపవలె

“గానస్యతు దశవిధాగుణావృత్తిః। తద్యథా-రక్తం-పూర్ణం-అలంకృతం-ప్రసన్నం-వ్యక్తం-వికృష్టం-శ్లక్ష్ణం-సమం-సుకుమారం-మధురం అని పది గుణములు గానమునకుఁ గలవు అందు గొన్ని వివరింతును. రక్తం--వేణు వీణాస్వరముల యొక్క గానము రక్తమనఁబడును. పూర్ణము—స్వరశ్రుతి ఛందఃపాదాక్షరములవల్ల పూర్ణత గలిగితే పూర్ణము.

వ్యక్తము—పదపదార్థ స్ఫూర్తి కలుగు నట్లు గానము చేయుట. వికృష్టం—ఉచ్చ స్వరములో పాడినను అర్థము పదములు స్పష్టముగా నుంట. మధురము—స్వభావము చేత లలితాక్షరవిన్యాసము, పదోచ్చారణ లాలిత్యము కలుగుట. ఇట్లే యితరములు నారదశిక్షలో వ్రాయబడెను. ఈ పది విధముల గానములో సమగానమాచార్యులామోదింతురు. పదచ్ఛేదమును పండితులామోదింతురు. మధురగానమును స్త్రీలామోదింతురు. అని ఆగ్రంథమందే వ్రాసిరి.

ఒక విశేషము గమనించవలెను.

శ్లో॥ యస్సామగానాం ప్రథమః, సవేణోర్మధ్యమస్స్వరః। యో ద్వితీయస్స గాంధార। స్తృతీయ స్త్వృషభస్స్మృతః॥

సామగానమునందలి ప్రథమ స్వరము (షడ్జము) వేణుగానమున మధ్యమ స్వరమగును. మూడవది (గాంధారము) ఋషభమగును. ఇత్యాదిగా సామవేద స్వరములకు వేణునాద స్వరములకును భేదముగలదని చెప్పఁబడెను.

మఱియు, శ్లో॥ దారవీ గాత్రవీణాచ। ద్వేవీణే గానజాతిషు। సామికీగాత్రవీణాతు తస్యాఃశ్రుణుత లక్షణం॥ గాత్రవీణాతు సాప్రోక్తా। యస్యాం గాయన్తి సామగాః। స్వరవ్యంజన సంయుక్తా। అంగుళ్యంగుష్ఠ సంజ్ఞితా। హస్తౌ సుసంయుతౌ ధార్యా। జానుభ్యా ముపరిస్థితా॥ ఇత్యాది కఱ్ఱతోఁ జేసినదొక వీణ, శరీర మొకవీణ (గాత్రవీణ) అని వీణలు రెండు. గాత్రవీణతో సామగానము చేతురు. కాలి ముణు

కులమీద చేతులుచాచి వ్రేళ్లు అంగుష్ఠమును గలియకుండ చాచి ఆ వ్రేళ్ళతో స్వరముల సంజ్ఞలు చూపుచు శిష్యులకు సామగానము గురువు నేర్పవలెను. ఫలానా వ్రేలు ఫలానా స్వరమునకు గురుతని పరిభాష కలదు. "హస్తేన నాధ్యాపయేచ్ఛిష్యాన్। శైక్షేణ విధినా ద్విజః॥" శిక్షలో చెప్పిన విధమున చేతితో శిష్యులకు గానము నేర్ప వలెనని నారదశిక్షలో గలదు.

మఱియు ॥ఉదాత్తే నిషాద గాంధారౌ। అనుదాత్తే ఋషభ ధైవతే స్వరిత ప్రభవాహ్యేతే। షడ్జ మధ్యమ పంచమాః॥

ఉదాత్తమందు నిషాద గాంధారములు అనుదాత్తమందు ఋషభ ధైవతములు, స్వరితమందు షడ్జ మధ్యమ పంచమములు పుట్టెను. కావున సప్త స్వరములును ఉదాత్తాది మూడు స్వరములలో నిమిడియున్నవని తా॥ ఈ యుదాత్తాది స్వరత్రయము కొంత మార్పు గలిగి యయిను స్వరముగా నంబడెను.

నారద శిక్ష॥ ఉదాత్తశ్చానుదాత్తశ్చ। స్వరిత ప్రచితేతథా। నిఘాతశ్చేతి విజ్ఞేయః॥ స్వరభేదస్తు పంచధా॥ అని ఉదాత్తానుదాత్త స్వరితములు కాక సామవేదమున ప్రచయము-నిఘాతము అని మఱి రెండు స్వరములు చెప్పంబడెను.

మఱియు, అంకస్వరము, అక్షరస్వరము అని వ్రాత గ్రంథములలో గలదు. క-మొదలగు నక్షరములు, ౧, ౨, ౩, ౪, అంకెలు కొన్నిటిలోను గలవు. ఆ సంకేతములు సామవేదపాఠకులకు దెలియును. హస్తస్వరముకూడ వాడుకలో గలదు. అట్లే, ఉ-అంటే ఉచ్చైస్వరము. క-అంటే కర్షణము. ర-అంటే రంగప్లుతము అని సంకేతము. వీటి యన్నిటిని గురుముఖంబున దెలియనగును. ఇందు వివరించుట నిష్ప్రయోజనము. ఇదిమాత్రమేల వ్రాయవలసి వచ్చినదంటే;—సామవేదము నుండియే సంగీతశాస్త్రము ప్రత్యేకముగా నుద్ధరింప బడినది యని తెలియుటకే.

సామవేదమున "అగ్న ఆయాహివీతయే" అన్న మొదలు "శోచిష్కేశం విచక్షణ" అన్న వఱకుంగల ఆరు అధ్యాయములు పూర్వార్చికము. అదే సామ సంహిత అదే అపౌరుషేయము. ఆ తర్వాతిది ఉత్తరార్చికము. అది పౌరుషేయము అనగా నిటీవల పురుషులు కల్పించిన భాగము ఇందు మొదటి సంహితలోని ఋక్కునకు ఇతర ఋక్కులు చేర్చి గానమున కుపయోగముగా పెద్దలు నిర్మించిరి. పూర్వార్చికము ననుసరించి చేసినగానమునకు యోని గానమని ప్రకృతి గానమని

సేయు. పూర్వఋక్కును విడచి ఉత్తరార్చికమం దితర ఋక్కు గానము చేసితే వికృతి గానమందురు.

వేదము లన్నియు అపౌరుషేయములు. బ్రహ్మవల్ల ఋషులకు గోచరించినవి. పురుషులు నిర్మించినవి కావని సిద్ధాంతము. వ్యాసాది రచితములైన పురాణాదులును, కాళిదాసాదులు రచించిన కావ్య నాటకాదులును పౌరుషేయములనంబడును, కావున ఉత్తరార్చికమంతయు పౌరుషేయమందురు.

వేదముల కర్థమును తెనుగున వ్రాయుటే మా యుద్యమ మయ్యును సామవేద ప్రత్యేకత్వమును తెల్పుటకు వేదాంగములలో నొకటైన నారద శిక్ష ననుసరించి కొంత గాన స్వరూపమును వ్రాసితిని. ఇట్లే, అరమాత్రమునకు మా యుద్యమమయ్యెను. అధర్వవేద సూక్తములకు వినియోగములంగూడ వ్రాయుచున్నాము. మానవులకుం గావలసిన సమస్తాశలును అధర్వవేద వినియోగములు తెలిసినచోం బూర్ణములగునని అది చదువగానే బోధపడంగలదు. ఇంతవఱకును నా అనుభవముచేత నాంధ్రలోకము మా ఉద్యమమునకుం దోడుచూపలేదు. అచ్చయిన గ్రంథములు చెల్లినంగాని ముందు ముందు అచ్చగువానికి మదుపు లేకుండును

౧౫—౧౧—౮౧,
వినయాశ్రమము.

బంకుపల్లె మల్లయ్యశాస్త్రి.



ఋక్సామాథర్వణవేద అనువాదకర్తలు :

శ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు



యజుర్వేద అనువాద కర్తలు :

వ్యాకరణ శిరోమణి

శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రిగారు



కృష్ణయజుర్వేద ప్రచురణకై శ్రీబాలకోటీశ్వరస్వామి ప్రీత్యర్థం రు ౨౫౦౦/-లు

అర్పించిన దాతలు

## శ్రీ ఆలపాటి దేవయ్యగారు,

గోవాడ.



ఋగ్వేదప్రచురణకై తమతండ్రి బాపిరాజుగారి జ్ఞాపకార్థము

రు ౧౦౦౦/-లు అర్పించిన దాతలు

శ్రీ మంతెన సుబ్బరాజుగారు

మంతెనవారిపాలెం.



శుక్లయజుర్వేద ప్రచురణకై తమతల్లి శ్రీరాజా రాజలక్ష్మాయమ్మ బహదూరుగారి
జ్ఞాపకార్థము రు ౨౧౦౦/-లు అర్పించిన దాతలు

శ్రీరాజా మాణిక్యారావు వెంకట హయగ్రీవరావు బహద్దరు
జమీందారుగారు రాచూరు.



సామవేద ప్రచురణకై తమతల్లి లక్ష్మీదేవమ్మగారి జ్ఞాపకార్థమై రు ౨౧౦౦/-లు

అర్పించిన దాతలు

## శ్రీ మద్ది వెంకట రంగయ్య గారు,

## గుంటూరు.

ఓమ్.

శ్రీ మాత్రే నమః

# ఆంధ్రవేదములు

ప్రథమాధ్యాయము
ప్రథమఖండము.

ఛందఆర్చికము
ఆగ్నేయ పర్వము
లేక కాండము॥

భరద్వాజఋషి-గాయత్రీఛందస్సు-అగ్నిదేవత॥

౨౩ ౧౨ ౩౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ర
౧ అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే। ని హోతా సత్సి
౩ ౧ ౨
బర్హిషి॥

దండాన్వయము॥ ఓ యగ్నీ నీవు మాచేత స్తుతింపఁబడుచుఁ జరు పురోడాశాది హవిస్సులభక్షించుటకును (దేవతలకు) హవిస్సుల నందిచ్చుటకును రమ్ము॥ (వచ్చి దేవతలను) బిలుచువాఁడవై పరచిన దర్భలమీఁదను గూరుచుండుము॥

ఋష్యాదులు పూర్వవత్॥

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౨ త్వమగ్నే యజ్ఞానాగ్ం హోతా విశ్వేషాగ్ం హితః। దేవేభిర్మానుషే జనే॥

ఓ యగ్నీ! సర్వ యాగములకును హోమమును జరిపించు వాఁడవు; లోక యాగార్హు లయిన దేవతల నందఱిని బిలుచుకొని వచ్చువాఁడవు నగు నీవు యజ

మానుని విషయమయి ఋత్విజుల చేత నిలుపఁ బడితివి. లేక ఇంద్రాది దేవతల చేత నిలుపఁ బడితివి. అని కానియర్థము॥

కణ్వపుత్ర మేధాతిథి ఋషి- తక్కినవి పూ. స.

3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
3 అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసం। అస్య యజ్ఞస్య
3 ౧ ౨
సుక్రతుం॥

దేవతలకు దూతయు దేవతలను బిలుచుకొని వచ్చువాఁడును సమస్తము నెఱింగినవాఁడు లేక సకల ధనములకుఁ జోటయిన వాఁడునగు నగ్నిని సేవించుచున్నాము- ఈ యజ్ఞము నడిపించువాఁడు లేక మంచిజ్ఞానము కల వాఁడునగు నిన్ను నో యగ్నీ! సేవించుచున్నాము.

( క్రతు= యాగము-కార్యము-జ్ఞానము. )

భరద్వాజఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ 3 ౧ ౨ 3౧ ౨3౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ర
౪. అగ్నిర్వృత్రాణి జంఘనద్ద్రవిణస్యుర్విపన్యయా। సమిద్ధశ్శుక్రఆహుతః

( స్తుతికర్తలకు ) ధనము కోరినట్టి ( లేకహవీరూప ) ధనమును దనకుఁ గోరుచున్న యగ్ని మాచేఁ జేయఁ బడిన స్తుతి మంత్రముచేత స్తుతింపఁ బడుచు లోకకంటకులైన రాక్షసులను లేక చీఁకట్లను మాటి మాటికి లేక మిక్కిలిగా నశింపఁ జేయుఁగాక. ఆ యగ్ని యెట్టివాఁడంటే బాగుగ బ్రజ్వలింపఁ జేయంబడినవాఁడు. ప్రకాశించువాఁడు ( హవిస్సులచే )ఁ బిలువంబడినవాఁడు ॥

ఉశనస ఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ ౨ 3 ౨ 3 ౧ ౨ర
౫. ప్రేష్ఠం వోఅతిథిగ్ంస్తుషే మిత్రమివప్రియం। అగ్నేరథంనవేద్యం॥

(మాకు) నత్యంత ప్రియుఁడవును, అతిథివలె నందఱిచేతను బూజింపఁ దగిన వాఁడవు స్నేహితునిం బోలి ప్రీతిని గలిగించు వాఁడవు రథమువలె ధనముతో నిండియున్న వాఁడవునగు నిన్ను నో యగ్నీ! నేను (ఉశనస ఋషి.) స్తుతించు చున్నాను.

(ఋగ్వేదములో అగ్ని అని సామవేదములో అగ్నే అని పాఠభేదము కలదు.)

సుధీతిపురు మీఢులు ఋషులు-ఛందో దేవతలు పూర్వవతు.

౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3౨3 ౧ ౨ర
౬. త్వంనో అగ్నేమహోభిః పాహివిశ్వస్యా అరాతేః। ఉతద్విషోమర్త్యస్య॥

ఓ యగ్నీ! నీవు అనేకులయిన శత్రువులనుండి (అరాతి=ఇవ్వనివాఁడు అని వ్యు॥) పలువిధములగు ధనములతో మమ్ము రక్షింపుము. మఱియు మనుష్యుఁడగు శత్రువునుండి మమ్ము రక్షింపుము॥

భరద్వాజఋషి. -ఛందో దేవతలు పూర్వవతు.

౨ 3 ౧ ౨ర ౧ ౨ 3౧౨ 3 ౧౨ 3౧౨ 3 ౧౨
౭. ఏహ్యూషు బ్రవాణి తేఽగ్నఇత్థేతరా గిరః। ఏభిర్వర్ధాస ఇన్దుభిః॥

ఓ యగ్నీ! రమ్ము నీకొఱకు స్తుతులను నీ విధముగాఁ జక్కఁగాఁ బఠించు చున్నాను। (ఆస్తుతులను వినుము) ఇతరులు (అసురులు) చేయుస్తుతులను గూడ వినుము॥ (వచ్చి) ఈ సోమములతో వృద్ధి నొందుము॥

కణ్వగోత్ర వత్సఋషి -ఛందో దేవతలు పూర్వవతు.

౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౧ ౨
౮. ఆ తేవత్సోమనో యమత్పరమాచ్చిత్సధస్థాత్। అగ్నే త్వాం కామయే
3 ౨
గిరా॥

వత్సఋషి నీయొక్క మనస్సు నుత్కృష్టమైన (అనగా నన్నిఁటిలో గొప్పదగు) ద్యులోకము నుండి యోయగ్నీ! ఆకర్షించుచున్నాఁడు- (= లాగుకొనుచున్నాఁడు) ఓయగ్నీ! నిన్ను నేను (వత్సఋషి) స్తుతివాక్కుతోఁ బ్రార్థించుచున్నాను-(మీఁది వాక్యము పరోక్షము-క్రిందివాక్యము ప్రత్యక్షము—ఇట్లే ఒకే మంత్రమున ప్రత్యక్ష పరోక్ష వాక్యములు క్రిందు మీఁదయి యచ్చటచ్చట నుండుననిగ్రహింపవలెను)

భరద్వాజఋషి - ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౯. త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత। మూర్ధ్నో విశ్వస్య వాఘతః॥

ఓ యగ్నీ! అథర్వఋషి శిరస్సువలెఁ బ్రధానమైనట్టి సర్వజగత్తునకు నాధారమైనట్టి పుష్కరపర్ణమందు—(అరణులు రాపాడినభాగము-అరణి=జమ్మి-రావి-కఱ్ఱలతో చేసిన వస్తువులు ఆరెంటిని రాపాడించి యగ్నిని బుట్టింతురు) నిన్ను బుట్టించెను॥

వామదేవ ఋషి- ఛందోదేవతలు పూర్వవతు.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౨
౧౦. అగ్నే వివస్వదా భరాస్మభ్య మూతయే మహే। దేవో హ్యాసినో దృశే॥

ఓ యగ్నీ నీవు మాయొక్క గొప్ప రక్షణము కొరకు స్వర్గాదిలోక నివాసహేతువగు నీకర్మను సంపాదించుము ఏమంటే—నీవు మాకుఁ జూచుటకుఁ బ్రకాశమానుఁడవై యున్నావు (అనఁగా నీవే విశేషముగా గార్హపత్యాద్యగ్ని రూపుఁడవై మాకుఁ గనిపించుచున్నావు కనుక నిన్నే ప్రార్థించుచున్నాను) (గార్హపత్యము-ఆహవనీయముదక్షిణాగ్ని, యని మూఁడు)

ఇట్లు ప్రథమాధ్యాయమందు ప్రథమ ఖండము సమాప్తము.

## ౧ అధ్యాయము

### ౨ ఖండము.

—:•:—

ఆయుంక్ష్వాహిఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౧౧. నమస్తే అగ్న ఓజసే గృణన్తి దేవకృష్టయః। అమై రమిత్ర మర్దయ॥

ఓ యగ్నిదేవా! నీకొఱకు మానవులు ( అనఁగా యాగకర్తలు తమబలము కోరి ) నమస్కార శబ్దమును బలుకుచున్నారు. నీవు నీ బలముతో శత్రువును నశింపఁ జేయుము॥

వామదేవఋషి -ఛందోదేవతలు పూర్వవతు.

౩ ౨ ౨౩౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౧ ౨ ౩ ౨
౧౨. దూతంవోవిశ్వవేదసగ్ం హవ్యవాహమమర్త్యం॥ యజిష్ఠమృఞ్జసేగిరా॥

సకల ధనములు కలట్టి, ( సర్వము నెంఱిగినట్టి కాని ), హవిస్సులను మోసి కొని పోవునట్టి, మరణధర్మము లేనట్టి—అత్యన్త యాగశీలుండగు నట్టి, ( దేవతలకు ) దూత యగునట్టి, నిన్ను నోయగ్నీ దేవా! నేను ( వామదేవఋషి) వృద్ధినొందించుచున్నాను. లేక అలంకరించుచున్నాను॥

ప్రయోగఋషి -తక్కినవి పూర్వవతు.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౨ ౧ ౨ ౮
౧౩. ఉపత్వాజామయోగిరో దేదిశతీర్హవిష్కృతః। వాయోరనీకే అస్థిరన్॥

ఓ యగ్నీ! యజమానునికై, హవిస్సులు సమకూర్చుచున్న స్తుతివాక్కులు అక్క సెల్లెండ్ర వలె నీ గుణములను బ్రకటించుచు, నిన్ను సేవించుచున్నవి. వాయు సమీపమందు నిన్ను సమీపించి యున్నవి॥

మధుచ్ఛందఋషి-శేషముపూర్వవతు.

౧౪. ఉపత్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియావయమ్। నమోభరన్త ఏమసి॥

ఓ యగ్నీ! మేము (యాగకర్తలమని తా॥) ప్రతిదినమందును రాత్రింబవళ్లు బుద్ధితో నమస్కార వాక్కును బలుకుచు నీ సమీపమును బొందుచున్నాము.

శునశ్శేఫఋషి పూ. స.

౧౫. జరాబోధ తద్వివిడ్ఢి విశేవిశే యజ్ఞియాయ। స్తోమగ్ంరుద్రాయ దృశీకం॥

స్తుతిచేత బోధింపఁబడినవాఁడా! అగ్నీ! ఆయాయజమానుల ననుగ్రహించుటకై యజ్ఞము జరిపించుటకొఱకు దేవయాగ గృహమును బ్రవేశింపుము భయంకరుఁడవయిన నీకొఱకు చక్కని స్తోత్రమును (వ్రజమానఋషి) చేయుచున్నాఁడు.

మేధాతిథిఋషి పూ. స.

౧౬. ప్రతిత్యం చారుమధ్వరం గోపీథాయ ప్రహూయసే। మరుద్భిరగ్న ఆగహి॥

ఓ యగ్నీ! ఏ యజ్ఞము లోపములేనిదగునో దానినిగూర్చి సోమపానము కొఱకు (గో=సోమము) నీవు గట్టిగాఁ బిలువఁబడుచున్నావు కనుక ఆయాగమునకు మరుత్తులతోఁ గూడరమ్ము.

శునశ్శేపఋషి పూ. స.

౨౩ ౨౩ ౧౨ ౩౧౨ ౩౧ ౨ర ౩ ౧ ౨
౧౭. అశ్వం నత్వావారవన్తం వన్దధ్యాఅగ్నిం నమోభిః సమ్రాజం తమ
౩ ౧ ౨
ధ్వరాణాం॥

యజ్ఞములకుఁ జక్రవర్తియనందగు నగ్నిని నిన్ను స్తుతులతో తోకగల గుఱ్ఱమును స్తుతించునట్లు స్తుతింపఁ బ్రవర్తిల్లుచున్నాము. (అనఁగాఁ దోకగల గుఱ్ఱము తనతోకతో నీఁగలను దోలునట్లు జ్వాలలతో శత్రువులను దోలుదువని తా॥)

ప్రయోగఋషి - శేషంపూర్వవతు.

౩ ౧ ౨ర ౩౧ ౨ర ౩౧౨ ౨౩ ౧ ౨
౧౮. ఔర్వభృగువచ్ఛుచి మప్నవానవదాహువే। అగ్నిగ్ం సముద్రవాససం॥

సముద్రమధ్యమందున్నట్టి (అనఁగా బడబాగ్ని) పవిత్రమయినట్టి యగ్నిని ఔర్వభృగుఋషివలెను, నప్నవానఋషివలెను ప్రార్థించుచున్నాను.

ప్రయోగఋషి - శేషంసమానము.

౩౧౨ ౩ ౧ ౨ర ౩౧౨ ౩౧ ౨ ౩౧ ౨ ౩౧౨
౧౯. అగ్నిమిన్ధానో మనసాధియగ్ం సచేతమర్త్యః। అగ్నిమిన్ధే వివస్వభిః

మనుష్యుఁడు అగ్నిని (కట్టెలతో) ప్రజ్వలింపఁజేయుచు మనసుతో శ్రద్ధకలిగి (కాలమందు) కర్మను ఆచరించును. ఋత్విజులచేత నగ్నిని ప్రజ్వలింపఁజేయును. (ఋగ్వేదములో ఇన్ధేకు బదులు ఈధే-అని పాఠము)

వత్సఋషి - శేషముపూర్వవతు.

౨ఉ ౨౨ ౩ ౧౨౩౧ ౨ ౩౨ ౩౨ఉ ౩ ౧ ౨౩౨
౨౦. ఆదిత్ప్రత్నస్య రేతసోజ్యోతిః పశ్యన్తి వాసరం పరోయదిధ్యతేదివి॥

ద్యులోకముమీఁదిభాగమునందు నెపుడీ వైశ్వానరుఁడు (అనఁగా సూర్యరూపాగ్ని) దీపించుచున్నదో ఆ వెంటనే, పురాతనమైనట్టి, గమనించునట్టి, యింద్రుని యొక్క పగఁటిని గలిగించునట్టి తేజస్సును జనులందఱు చూచుచున్నారు. లేదా-పగలంతయుఁ జూచుచున్నారని కాని అర్థము

ప్రథమాధ్యాయమున ద్వితీయఖండము, సమాప్తము.

—*—

## ౧ అధ్యాయము.

## ౩ ఖండము.

—:-o-:—

ప్రయోగఋషి-ఛందోదేవతలు ఖండమంతటికిని పూర్వసమములు.

౩౧ ౨ ౩౧౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౨ ౩ ౨౩ ౧౨
౨౧. అగ్నింవో వృధన్తమధ్వరాణాం పురూతమం। అచ్ఛానప్త్రే సహస్వతే॥

హింసా రహితములైన బలులకు బద్ధుడైయున్న, బలవంతుఁడైన జ్వాలలతో మిగుల వృద్ధినొందుచున్న, యగ్నికి ఓ ఋత్విజులారా! మీరు అభిముఖులుకండు॥

భరద్వాజర్షి-ఛందస్సు దేవత.

౩ ౨ ౩ ౧ ౨౩ ౨ ౩ ౨౧ ౩౨ ౩ ౨ ౧౨ ౩౧ ౨ ౨ ౨ ౩
౨౨. అగ్నిస్తిగ్మేనశోచిషాయగ్ంసద్విశ్వం న్యత్రిణం। అగ్నిర్నో వగ్ంసతేరయిం

ఈయగ్ని తీక్ష్ణమైన తేజస్సుతోఁ బ్రపంచము నంతటిని దినునట్టి ( రాక్షసాదులను ) నశింపఁజేయుఁగాక॥ మఱియు మాకొఱకు నీయగ్ని ధనము నిచ్చుఁగాక॥
( యంసతే కుయాసతే అని-వంసతే- కు-వనతే అని ఋగ్వేద పాఠము)

వామదేవఋషి ॥

౨౩. అగ్నేమృడ మహాఀ అస్యయ ఆదేవయుం జనం। ఇయేథ బర్హిరాసదమ్॥

ఓ యగ్నీ! మమ్ము సుఖింపఁజేయుము. ఆ నీవు గొప్పవాఁడ వయియున్నావు ఏ నీవు గమనశీలుండవై దేవతలఁ గోరుచున్న యజమానుని దర్భలమీఁదఁ గూరుచుండుటకై వచ్చుచున్నావో ( ఆ నీవని పూర్వాన్వయము )

వశిష్ఠఋషి.

౨౪. అగ్నేరక్షాణో అఀహసః ప్రతిస్మ దేవరీషతః॥ తపిష్ఠై రజరోదహ॥

ఓ యగ్నీ! నీవు మమ్ములను పాపమునుండి రక్షించుము॥ మఱియు నో దేవా ముదిమిలేని నీవు హింసకులగు ( శత్రువులను) మిగులఁ దాపకరములైన తేజస్సులతో దహించుము॥

భరద్వాజఋషి ।

౨౫. అగ్నేయుక్ష్వాహి యేతవాశ్వాసో దేవసాధవః॥ అరంవహన్త్యాశవః॥

ఓ దేవా! అగ్నీ! యే నీ యశ్వములు సాధువులయినవో ఆ యశ్వములను రథమందుఁ బూన్పుము. వేగవంతములైన యా గుఱ్ఱములు పూర్తిగా రథమును మోయంగలవు॥

వశిష్ఠ ఋషి ।

౧౨ 3 ౧౨ 3౨ 3౧౨
౨౬. నిత్వాగ్నత్య విశ్వతే ద్యుమన్తం ధీమహే వయం । సువీరమగ్న ఆహుత ॥

సమీపింపఁ దగియున్నట్టి, ప్రజలను బాలించునట్టి, యజమానులందఱచేతను బిలువంబడునట్టి, యో యగ్నీ! దీప్తిమంతుఁడవును శుభమయిన స్తుతికర్తలుకలట్టి నిన్నుమేము నిలిపియున్నాము॥

విరూప ఋషి ॥

3 ౨ 3 ౨ 3౨ 3౧ ౨ర 3 ౨ 3 ౨ 3౧౧ ౨ర౧
౨౭. అగ్నిర్మూర్ధా దివఃకకుత్పతిః పృథివ్యా అయం । అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి ॥

దేవతలలో శ్రేష్ఠుండును, ద్యులోకమునకు ఉన్నతుండును, (ఆబోతుభుజములమీఁద నున్న మాంసపుకండకు-కకుత్తని పేరు. ద్యులోక మనెడు వృషభమునకు కకుత్తువలె నున్నతముగా నున్నాఁడని తా॥) భూమికిఁ బాలకుండునగు నీ యగ్ని స్థిర చర జంతు జాలమును బ్రీతి నొందించుచున్నాఁడు॥

శునశ్శేఫ ఋషి ॥

3 ౨ 3 ౨ఉ 3 ౧ ౨౧ 3౧ ౨3 ౧ర ౨ర ౧ ౧౨ 3 ౨ 3
౨౮. ఇమమూషు త్వమస్మాకగ్ం సనిం గాయత్రం నవ్యాగ్ంసం । అగ్నే దేవేషు
౧౨
ప్రవోచః ॥

ఓ యగ్నీ! నీవు మా సంబంధమైన యీ యెదుటనున్న హావిర్దానమును అత్యంత నూతనమైన గాయత్రీ ఛందస్సుకల స్తుతివాక్కును దేవతల యెదుటను బలుకుము॥

గోపవన ఋషి ॥

౧ ౨ 3౧౨ 3 ౧ ౨ర ౧౨ 3౧౨
౨౯. తంత్వాగోపవనో గిరా జనిష్టదగ్నేఅఙ్గిరః ॥ సపావక శ్రుధీహవమ్ ॥

ఓ యగ్నీ! గోపనఋషి స్తుతిచేత ఆ నిన్ను వృద్ధినొందించుచున్నాఁడు॥ సర్వత్ర గమనించునట్టి లేక అంగిరసుల గోత్రమందుఁ బుట్టినట్టి యో యగ్నీ! (పావక=శుద్ధిచేయువాఁడా!) (గోపవనర్షి) యాహ్వానమును వినుము॥ (యంత్వా అని ఋగ్వేదులపాఠము)

వామదేవఋషి.

౨3౧ ౨ 3౨ 3౨3 ౧ ౨ ౨3౧ ౨ 3౧ ౨
3౦. పరివాజపతిః కవిరగ్నిర్హవ్యాన్యక్రమీత్। దధద్రత్నానిదాశుషే॥

అన్నములను బరిపాలించువాఁడును, మేధావియు, హవిస్సులనిచ్చిన యజమానునకు శ్రేష్ఠధనముల నిచ్చునట్టి యగ్ని హవిస్సులను అందుకొను చున్నాఁడు॥

కణ్వఋషి-సూర్యదేవత,ఛందస్సుపూర్వవతు.

౨3 ౨ 3౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨
3౧ ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః। దృశేవిశ్వాయసూర్యం॥

జండాలవలె సూర్యునకు జ్ఞాపకములైన సూర్యాశ్వములు లేక సూర్యకిరణములు సమస్తలోకమును దర్శించుటకై (అనఁగా జనులందఱును జూచుటకు) ధనములను బుట్టించునట్టి ఆప్రసిద్ధుఁడైనసూర్యునిమీఁది కెత్తిపట్టుకొన్నవి.

మేధాతిథిఋషి.

3౨3 ౧ ౨ర 3౧ ౨ 3 ౨ 3౧ ౨ 3 ౧ ౨
3౨. కవిమగ్నిముపస్తుహి సత్యధర్మాణమధ్వరే దేవమమీవచాతనం॥

ఓ స్తుతికర్తలారా! మేధావంతుఁడును, సత్యవచనము కల ధర్మముకలవాడును, హింసకులైన శత్రువులు మొదలగు వారిని జంపువాఁడు, నగు నగ్నిని యజ్ఞమందుస్తుతింపుఁడు॥

సింధుద్వీపుడు లేక అంబరీషుఁడు కాక తృతఆప్త్యుఁడుగానిఋషి.

౩౩. శంనో దేవీరభిష్టయే శంనోభవన్తుపీతయే। శంయోరభిస్రవన్తునః

దేవతా రూపములైన యుదకములు మాకు (పాప పరిహారము ద్వారా) సుఖములఁ గలిగించుఁగాక॥ మఱియు మాపానమునకు సుఖములగునుగాక॥ పుట్టిన రోగములను (శం=పుట్టిన రోగములు) శాన్తింపజేయుఁగాక। పుట్టిన రోగములను (యోః=పుట్టని రోగముల) వేఱుగా నుంచుఁగాక॥ లేక దూరముగాఁ బోఁ ద్రోయుఁగాక॥

ఉశనర్షి.

౩౪. కస్యనూనం పరీణసిధియోజిన్వసిసత్పతే। గోషాతాయస్యతేగిరః॥

సత్పురుషులఁ బాలించువాఁడా! ఓ యగ్నీ! ఇపుడు ఎట్టి జనుని బ్రహ్మ కర్మలను ప్రీతి నొందించుచున్నావు? (బ్రహ్మ=వేదము వైదిక కర్మలని తా॥) ఏ నీసంబంధమయిన స్తుతులు, గోవులలాభమున కగుఁగాక॥ (కనుక నీవెక్కడ నున్నావని తా॥) లేక? ఓ యగ్నీ! యెవరికర్మల నిపుడు నీవు ప్రీతిఁజెందించు చున్నావు? (ఇతరులెవరివికావు మా కర్మలనేయని తా॥)

ఇట్లు ప్రథమాధ్యాయతృతీయ ఖండము సమాప్తము॥

—:-o-:—

## ౧ అధ్యాయము,

## ౪ ఖండము.

—*।*—

శంయుఋషి-అగ్ని దేవత, ఛందముపూర్వవతు.

౩ ౧ ౨ ౩౧ ౨ ౩౧౨ ౩౧౨ ౧౨౩౨ ౩౧ ౨ ౩౧
౩౫. యజ్ఞాయజ్ఞావోఅగ్నయే గిరాగిరాచదక్షసే। ప్రప్రవయ మమృతం జాత
౨ ౩౨ ౩౧ ౨ర
వేదసం ప్రియం మిత్రం నశగ్ సిషమ్॥

ఓ స్తుతికర్త్రులారా! మీరుసర్వ యజ్ఞములందును వృద్ధినొందిన యగ్నికొ అను స్తుతి రూపమయిన వాక్కుతో స్తుతిచేయుఁడు, మేమును మరణధర్మములేనట్టి, సర్వభూతముల నెఱుఁగునట్టి, ప్రియ మిత్రునివంటి, యగ్నిని మాటి మాటికి స్తుతింతుము లేక ఓ స్తుతికర్తా! నీవు స్తుతిచేత నగ్నిని వృద్ధిపఱచిన మేమూ యగ్నిని స్తుతింతుమని కాని యర్థము।

భర్గఋషి-ఛందో దేవతలు, పూర్వవతు.

౧౧ ౨౩ ౧౨ ౩ ౨ ౨౩౧ ౨ ౩ ౨౩౨౩ ౧౨
౩౬. పాహినోఅగ్నఏకయాపాహ్యుతద్వితీయయా। పాహిగీర్భిస్తిసృభిరూర్జాంపతే
౩ ౧ ౨౩౧ ౨
పాహిచతసృభిర్వసో॥

ఓ యగ్నీ! మమ్ములను ఒక్క ఋక్కుతో (అనఁగా మంత్రముతో) రక్షింపుము-మఱియు రెండవ ఋక్కుతో రక్షింపుము॥ మూఁడు వాక్కులతో ఓ అన్నపతీ! రక్షింపుము? నాలుగు ఋక్కులతో నాపురమున కాధార భూతుండవయిన యగ్నీ! మమ్ము రక్షింపుము॥

శంయుఋషు.

౩౭. బృహద్భిరగ్నే అర్చిభి శ్శుక్రేణ దేవశోచిషా। భరద్వాజే సమిధానో
యవిష్ఠ రేవత్పావకదీదిహి॥

ఓ దేవా! అత్యంత యౌవనశాలీ! పవిత్రము చేయువాఁడా! అగ్నీ! నిర్మలమయిన కాన్తితో నా( అన్నదమ్ముఁడైన) భరద్వాజుని విషయము ప్రజ్వలించుచు నీవు గొప్పవగు తేజస్సులతో మాకొఱకు ధనముతోఁ గూడునట్లు ప్రకాశింపుము॥

వశిష్ఠఋషి.

౩౮ త్వేఅగ్నే స్వాహుత ప్రియాసస్సన్తుసూరయః యన్తారోయే మఘవానో
జనానామూర్వ్వదయన్తగోనాం॥

( యజమానులచేత )ఁ జక్కఁగా హోమము చేయఁబడిన యగ్నీ! నీయొక్క స్తుతికర్తలు ప్రియులయి యుందురుగాక॥ ధనవంతులయిన యే దాతలు మాసంఘమునకు గో సమూహామును ఇచ్చుచున్నారో వారు ( నీకుం బ్రియు లగుదురుగాకని పూర్వాన్వయము. )

భరద్వాజఋషి.

౩౯. అగ్నేజరితర్వ్విశ్పతి స్తపానోదేవరక్షసః। అప్రోషివాన్గృహాపతే మహాఁ
అసి దివస్పాయుర్దురోణయుః ॥

ఓ యగ్నీ! దేవా! స్తుతింపఁదగినవాఁడా! నీవు ప్రజలకుం బాలకుఁడవు, రక్షసులకు సన్తాపము కలిగించు వాఁడవు నగుచున్నావు॥ (యజమాని ) గృహా

మును బాలించువాఁడా! అగ్నీ! (యజమాను) నిల్లు విడువనివాఁడ వగుచు గొప్పగాఁ బూజింపఁదగియున్నావు. ద్యులోకముఁ బాలించు వాఁడవు (యజమాని) గృహమందు సదా నివసించువాఁడవు నగుచున్నావు॥

ప్రస్కణ్వ ఋషి।

౪౦. అగ్నేవివస్వ దుషసశ్చిత్రగ్ంరాధోఅమర్త్య। ఆదాశుషే జాతవేదోవహా
త్వమద్యాదేవాగ్ం ఉషర్బుధః॥

ఓ యగ్నీ! ఉషోదేవతయొక్క సమీపమునుండి ధనమును, హవిస్సుల నిచ్చు యాగకర్తకు నీవు తెచ్చియిమ్ము॥
మరణ ధర్మము లేనట్టి సమస్తభూతముల నెఱింగనట్టి అగ్నీ! విశేషనివాసముతోఁ గూడిన నానా విధమయిన ధనమును ఇమ్ము॥ ఈ దినమందుఁ బ్రాతఃకాలమున మేల్కొన్న దేవతలను దీసికొని రమ్ము॥

తృణపాణి ఋషి॥

౪౧. త్వంనశ్చిత్ర ఊత్యా వసోరాధాగ్ంసి చోదయ। అస్యరాయస్త్వ మగ్నే రథీ
రసి విదాగాధం తుచేతునః॥

నివాసమునకుఁ గారణమైనయగ్నీ! చూడఁదగిన నీవు రక్షణముతోఁగూడ ధనములను మాకుఁ గలిగింపుము. ఈకనిపించుచున్న ధనమునకు నీవు అధికారి వగుచున్నావు. (కనుక మాకుధనములిమ్మని తా॥) మాసంతానము కొఱకుఁ బ్రతిష్ఠను (అనఁగా స్థిరముగానుంటకని తా॥) శీఘ్రముగాఁగలిగింపుము.

విరూపఋషి.

౪౨. త్వమిత్సప్రథా అస్యగ్నే త్రాతఋతః కవిః। త్వాంవిప్రాస స్సమిధాన దీదివ ఆవివాసన్తి వేధసః॥

ఓయగ్నీ! రక్షకా! సత్యమయినట్టి, కవివైనట్టి, నీవేఅన్నివిధముల గొప్పవాఁడవయియున్నావు. చక్కఁగా మండుచు వెలుఁగుచున్నయగ్నీ! నిన్ను మేధావంతులగు స్తుతికర్తలు ప్రార్థించుచున్నారు.

శునశ్శేపఋషి.

౪౩. ఆనోఅగ్నే వయో వృధగ్ం రయింపావక శగ్ంస్యమ్। రాస్వాచన ఉపమాతే పురుస్పృహగ్ం సునీతీ సుయశస్తరం॥

శుద్ధిసిజేయునట్టియోయగ్నీ! అన్నమును వృద్ధిచేయునట్టి, స్తుతింపఁబడునట్టి ధనమును మాకుఁదెచ్చియిమ్ము. అట్టియగ్నీ! మాకు మంచినీతితోఁ బలువురు కోరందగిన అత్యంతకీర్తిమంతమైన ధనమును ఇమ్ము.

సౌభరిఋషి.

౪౪. యోవిశ్వాదయతే వసుహోతా మంద్రో జనానాం। మధోర్న్నపాత్రా ప్రథమాన్యస్మై ప్రస్తోమా యంత్వగ్నయే॥

దేవతలంబిలుచునట్టి, సంతోషమును గలిగించునట్టి, యేయగ్ని సమస్తధన
ములను జనులకొఱకు నిచ్చుచున్నాఁడో ఆయగ్నికొఱకు సోమముయొక్క ముఖ్య
ములగు పాత్రలవలె స్తుతులు చెందుచున్నవి.

ప్రథమాధ్యాయమునఁ జతుర్థఖండము పూర్ణము.

—:♦:—

౧ అధ్యాయము

౫ ఖండము.

వామదేవఋషి ॥

౪౫. ఏనావో అగ్నిం నమసోర్జో నపాతమా హువే। ప్రియం చేతిష్ఠ మర
తిగ్ స్వధ్వరం విశ్వస్య దూతమమృతం॥

బలమునకుఁ బుత్రుఁడును, అధికప్రజ్ఞావంతుఁడును స్వామియు లేక గమన
శీలుండును, మంచియాగములు కలవాఁడును, సర్వయజమానులకును దూతయగు
వాఁడు, నిత్యుఁడునయిన యగ్నిని యీస్తోత్రముతో నోస్తుతికర్తలారా! మీకొఱకుఁ
బిలుచుచున్నాను.

భర్గఋషి.

౪౬. శేషే వనేషు మాతృషు సంత్వా మర్తాస ఇన్ధతే। అతన్ద్రో హవ్యం వహసి
హవిష్కృత ఆదిద్దేవేషు రాజసి ॥

ఓయగ్నీ ! వనములందు, తల్లులందును, నిద్రించు చున్నావు. (అనఁగా నున్నావని తా॥) అట్టినిన్ను మనుష్యులు(అధ్వర్యుఁడు మొదలగు ఋత్విజులని తా॥) మథించి నిన్నుఁ బుట్టించుచున్నారు. (ఇచట తల్లులయిన వనములని విశేషణముగాఁ జేసి వనములంటే కఱ్ఱలని తాత్పర్యముచెప్పిన బాగుండును. భాష్యశైలి యట్లులేదు.) పిమ్మటవృద్ధి నొందిన నీవు మాంద్యములేనివాఁడవై, యజమానునిహవిస్సుల నందుకొన్నవాఁడవై, హవిస్సులను (దేవతలకు)ఁజేర్చుచున్నావు. ఆతర్వాతనే దేవతలమధ్యను విరాజిల్లుచున్నావు.

సౌభరిఋషి.

౪౭. అదర్శిగాతు విత్తమో యస్మిన్వ్రతా న్యాదధుః । ఉపోషు జాతమార్యస్య
వర్ధనమగ్నిం నక్షన్తునోగిరః ॥

ఏయగ్నియందు వ్రతములు (అనఁగాఁ గర్మలు.) యజమానులు కూర్చుచున్నారో, చక్కఁగా మార్గము లెఱింగినట్టి యాయగ్ని ఉద్భవించెను. చక్కఁగాఁబుట్టిన ఆర్యుని (అనఁగా నుత్తమవర్ణము కలవాఁడు.) వృద్ధిపొందించుచున్నట్టియగ్నిని మాస్తుతి వాక్కులు సమీపించుఁగాక.

మనుఋషి.

౪౮. అగ్నిరుక్థే పురోహితో గ్రావాణో బర్హిరధ్వరే । ఋచాయామి మరుతో
బ్రహ్మణస్పతే దేవాఅవో వరేణ్యమ్ ॥

స్తోత్ర, శస్త్ర(స్తుతిమంత్రములలోనే యొకవిధమయినయుచ్చారణకలది.) రూపమయిన యీయజ్ఞమందు (గానరూపస్తోత్రమే శస్త్రము ) అగ్ని ఉత్తరవేదియందు ఋత్విజులచే అభిషవమునకు శిలలును దర్భలును ఎట్లు ముందుంచఁబడినవో యట్లు

ఉంచంబడినదై యుండెను. ఓమరుత్తులారా! స్తోత్రపాలకుఁడా! (బ్రహ్మణస్పతియని యొక దేవత) ఇంద్రాదిదేవతలారా! సేవింపఁదగిన రక్షణమునుగోరి సూక్తరూపమయిన స్తుతిమంత్రముతో మిమ్ములను బ్రార్థించుచున్నాను.

సుదీతిఋషి-లేక పురుమీఢుఁడు-లేక స్కంభుఁడు.

21 231 23 1 1 312 32 31 2 32u
౪౯. అగ్నిమీడిష్వావసే గాథాభిశ్శీరశోచిషం। అగ్నింరాయే పురుమీఢశ్రుతం
3 1 2312 32
నరోగ్నిః సుదీతయే ఛర్దిః॥

ఓపురుమీఢర్షీ! పడుకొనియుండు స్వభావముకల కాంతులుకలవాఁడైన యగ్నిని రక్షణమునిమిత్తమై స్తుతిమంత్రములఁతో స్తుతింపుము. వినంబడిన యీ యగ్నిని యితరయజమానులుకూడ స్తుతింతురు. కనుక సుదీతిఋషికొఱకు అగ్ని నీచేత స్తుతింపఁబడినవాఁడై గృహమునిచ్చుంగాక. (అని యీవాక్యము సుదీతి పురుమీఢునితో ననుచున్నాఁడు.)

ప్రస్కణ్వఋషి-బృహతీఛందము, అగ్నిదేవత.

312 312 312 312 12 31 23 1
౫౦. శ్రుధిశ్రుత్కర్ణ వహ్నిభిర్దేవై రగ్నే సయావభిః। ఆసీదతు బర్హిషిమిత్రో
23 1 2312 32
అర్యమా ప్రాతర్యావభి రధ్వరే॥

వినసమర్థమైన చెవులుకలయోయగ్నీ! మావాక్కును వినుము. మిత్రదేవుఁడు అర్యముఁడు ఉదయకాలమందుఁజేయు సవనమందువచ్చు నితరదేవతలతోఁ గూడ యాగమునిమిత్తములగు దర్భలమీఁదను గూరుచుండుగాత.

సౌభరిఋషి బృహతీఛంద-అగ్ని దేవత.

౫౧. ప్రస్యైవో దాసో అగ్నిర్దేవ ఇన్ద్రోనమజ్మనా। అనుమాతారం పృథివీంవివా వృతే తస్థౌనాకస్య శర్మణి ॥

దివోదాసుని చేత నాహ్వానింపఁబడిన (= పిలువఁబడిన) పరమైశ్వర్యముకలిగి ప్రకాశించు నగ్నిలోకమాత యయిన భూమిని (దేవతలకు హవిస్సులనిచ్చుటకై) మిగులఁ బ్రేరేపించుచున్నాఁడు. ఏమంటే ఈయగ్నిని దివోదాసుఁడు బలముతో నాహ్వానించెను. కనుక ఈయగ్ని స్వర్గగృహమందునే (అనఁగాఁ దనయింటనే) ఉండెను.

మేధాతిథి-మేధ్యాతిథి యిద్దఱుఋషులు। బృహతీఛందస్సు-ఇంద్రుడు, దేవత.

౫౨. అధ జ్మో అధవా దివో బృహతో రోచనాదధి। అయావర్ధస్వ తన్వాగిరా మమాజాతా సుక్రతోపృణ ॥

ఇప్పఁడు భూమినుండి, మరియు ద్యులోకముచుండి, గొప్పదయిన స్వర్గమునుండి కాని వచ్చి, యీవిస్తరించిన నాస్తుతివాక్యముతో నింద్రుఁడా ! వృద్ధిపొందుము. మంచికర్మలు సేయు నింద్రుఁడా ! మావారలయిన జనులను ఇష్టఫలములతోఁ తృప్తిపొందించుము

విశ్వామిత్రఋషి-బృహతీ ఛందస్సు-అగ్ని దేవత।

13. కాయమానో వనాత్వం యన్మాతౄరజగన్నపః। నతత్తే అగ్నే ప్రమృషే నివర్తనం యద్దూరే సన్నిహాభవః ॥

ఓయగ్నీ ! వనములను భక్షింపఁగోరుచున్న నీవు ఏకారణమువల్ల వాటిని విడచి తల్లులయియున్న యుదకములను బొందితివో, ఆకారణమువల్ల అక్కడనే నీయొక్క యునికి దానియందే నాశనమును గనఁబడుచున్నది. అది మాకు సహింపదు. (=మేము ఇష్టపడమని తా॥) ఏ ×ంటే ఏకారణముచేత దూరముగా (అదృశ్యరూపమున ) నున్ననీవు ఇచట మాయరణులయిన కట్టెలందు ఉద్భవించుచున్నావో ఆకారణమువల్ల నీవుదూరముగానున్నావంటే మేమిష్టపడము. (నీవు లేకుంటే యాగము నడవదని తా॥)

కణ్వఋషి- బృహతీఛందస్సు-అగ్ని దేవత.

౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౫౪. నిత్వామగ్నేమనుర్దధే జ్యోతిర్జనాయ శశ్వతే। దీదేథ కణ్వ ఋత
౨ ౩ ౧ ౨ర౩ ౧ ౨ ౩౧ ౨
జాత ఉక్షితో యంనమస్యన్తి కృష్టయః॥

ఓయగ్నిదేవా ! ప్రకాశరూపమును మనువు ప్రజలకొఱకుఁగలిగించెను. (దేవయజనస్థానమందు నిలిపెనని తా॥) ఓయగ్నీ ! నీవు యాగమునిమిత్తము పుట్టి హావిస్సులతోఁ దృప్తినందింపఁబడి కణ్వఋషియందు (నాయందని తా॥) దీపించుచున్నావు. (అనఁగాఁ గణ్వఋషిగృహమందు వెలుఁగుచున్నావని తా॥) ఏయగ్నిని మనుష్యులు నమస్కరించుచున్నారో ఆయగ్ని (యని పూర్వాన్వయము.)

ప్రథమాధ్యాయమునఁ బంచమఖండము సమాప్తము.

—:-౦-:—

## ౧ ఽధ్యాయము,

## ౬ ఖండము.

—*—

వశిష్ఠఋషి-బృహతీఛం-అగ్ని దేవత॥

౫౫ దేవో వో ద్రవిణోదాః పూర్ణాం వివష్ట్వాసిచం। ఉద్వా సించధ్వముప
వా పృణధ్వమాదిద్వో దేవ ఓహతే॥

ధనములనిచ్చునట్టియగ్ని మీసంబంధమయిన నిండుగానున్న తడుపఁబడిన స్రుక్కును (గరిటవలెనుండునట్టి హోమముచేయు కఱ్ఱపాత్ర.) గోరునుగాక. పాత్రము సోమముతో నింపుఁడు. సోమమును చమసలోఁబూరింపుఁడు. అనంతర మందే అగ్నిదేవుఁడు మిమ్ము సహించును (అనఁగా నగ్నిలో సోమము హోమము చేసిన వెంటనే అగ్ని మిమ్ము రక్షించునని తా॥)

కణ్వఋషి-బృహతీఛందము-అగ్ని దేవత॥

౫౬. ప్రైతు బ్రహ్మణస్పతిః ప్రదేవ్యేతుసూనృతా। అచ్ఛావీరం నర్యం
పంక్తిరాధసం దేవాయజ్ఞం నయన్తునః॥

బ్రహ్మణస్పతి దేవత (=మంత్రమునకధిపతి) వచ్చునుగాక. దేవియయిన సత్యవాణి మమ్ముఁ జేరుఁగాక. దేవతలందఱు శత్రువును దూరముగాఁ బారఁదోలుదురుగాక. మనుష్యులకు హితమొనర్చునట్టి పంక్త్యములతో సమృద్ధినొందినట్టి యాగమును గూర్చి దేవతలు మాకభిముఖముగా వత్తురుగాక.

కణ్వఋషి-బృహతీఛందము-అగ్ని దేవత।

౩౨ ౩౧ ౨ ౩౨౩ ౧ ౨ ౩౧ ౩౨౩ ౨ ౩ ౧ ౨౩౧౨ ౨౩౧
౫౭. ఊర్ధ్వఊషుణఊతయే తిష్ఠాదేవోనసవితా। ఊర్ధ్వోవాజస్యసనితా యదఞ్జి
౨౩ ౧౨౩ ౧ ౨
భిర్వాఘద్భిర్విహ్వయామహే ॥

ఓయూప (=యజ్ఞపశువునుగట్టు స్తంభము) స్తంభమా! లేక యూపసంబంధిగి యున్న యగ్నిదేవా! మాయొక్క రక్షణముకై యున్నతమైయుండుము. సూర్యుని వలె నున్నతముగానుండి యన్నదాతవగుదువు. ఏ కారణమువల్ల యజ్ఞమందు యూపమును నేతితోఁదడుపునట్టి ఋత్విజులతోఁగూడ నిన్ను (అన్నదానమునకు) విశేషముగాఁబిలుచుచున్నామో ఆకారణమువల్ల (అన్నదాతవగుదువు అని పూర్వాన్వయము.)

సౌభరిఋషి-బృహతీఛందము-అగ్ని దేవత.

౨ఉ ౩ ౧ ౨ర ౩ ౨౩౧ ౨ ౩ ౧ ౨ ౨౩౧ ౧
౫౮. ప్రయోరాయేనినీషతి మర్తోయస్తే వసోదాశత్। సవీరంధత్తే అగ్నఉక్థశంసినం త్మనాసహస్రపోషిణం ॥
౨౩ ౧ ౨ ౩౧ ౨

నివాసమునకాధారమయినయగ్నీ! నిన్ను నేస్తుతికర్తధనముకొఱకు ప్రణాయింప (= వెలిగించుటకు) దలంచునో, యేమనుష్యుఁడు నీకొఱకు హవిస్సునిచ్చునో అతఁడు మంత్రస్తుతులను బలించునట్టి, స్వయముగా ననేకులను బోషించునట్టి, (బహుధనము కలవాఁడని తా॥) పుత్రుని ధరించును

కణ్వఋషి-బృహతీఛందము-అగ్ని దేవత.

౧ ౨౩ ౧ ౨౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩ ౨౩౧
౫౯. ప్రవోయహ్వం పురూణాం విశాం దేవయతీనాం। అగ్నిꣳసూక్తేభిర్వ చోభిర్వృణీమహే యꣳసమిదన్యఇన్ధతే ॥
౩ ౨ఉ ౩౨ ౩౧౨

ఓఋత్విగ్యజమానులారా! దేవతలంగోరిన అనేకులయిన ప్రజాహూపులగు మీయొక్క యనుగ్రహముకొఱకు గొప్పవాఁడగునగ్నిని సూక్తవాక్కులతో స్తుతింతము. ఇతరఋషులు ఈయగ్నిని జక్కఁగా వెల్గించుచున్నారు.

ఉత్కీలఋషి-బృహతి-అగ్ని.

3౨ 3 ౨ 3౨3 ౨3౧ ౨ర 3 ౧౨ 3౨ 3 ౧ ౨3౧౨
౬౦. అయమగ్నిస్సువీర్యస్యేశేహిసౌభగస్య। రాయఈశేస్వపత్యస్య గోమతఈశే
3 ౧౨౨
వృత్రహథానాం ॥

ఈకనఁబడుచున్నయగ్ని మంచిసామర్థ్యముగల సౌభాగ్యమున కధికారి. అట్లే గోవులుకలట్టి మంచిసంతానముగలట్టి, ధనమునకును అధికారి. ఆయగ్నియే శత్రువైన పాపమును నశింపఁజేయ సమర్థుఁడగును.

వశిష్ఠఋషి-బృహతీ ఛం॥ అగ్నిదే॥

౧౨ 3 ౧ ౨3౧ ౬ ౨ర 3 ౨ ౧ ౨ర 3
౬౧. త్వమగ్నే గృహపతిస్త్వగ్ హోతానోఅధ్వరే। త్వం పోతావిశ్వవార
౧౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
ప్రచేతా యక్షియాసిచవార్యం ॥

ఓయగ్నీ! మాయొక్కయజ్ఞమందు నీవు గృహపతివి (= యజమానుఁడవు) అగుచున్నావు. నీవేదేవతలంబిలుచువాఁడవు. అందఱిచేతను గోరఁదగినవాఁడవు. పోతయనెడు ఋత్విజులలో నొకండవయియున్నావు. కనుక నీవు బహుబుద్ధిమంతుఁడవు. కోరఁదగిన హవిస్సును హోమము చేయుచున్నావు. మాకు ధనమును గలిగింపుము.

విశ్వామిత్రర్షి - ఛందోదేవతలు-పూర్వవతు॥

౧ ౨ ౩౧ ౨ర ౩౧౨ ౩ ౧ ౨ర
౬౨. సఖాయస్త్వా వవృమహే దేవం మర్తాసఊతయే । అపాంనపాతగ్
౨ ౧ ౨ఉ ౩౧ఉ ౨ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨
సుభగగ్ సుదగ్ ససగ్ సుప్రతూర్తిమనేహసం ॥

ఓయగ్నీ! మిత్రులైనట్టి, (హవిస్సునిచ్చుటచేత యాగకర్త లగ్నికి స్నేహితులని తా॥) మనుష్యులు (అనఁగా ఋత్విజులమగు మేము) ఉదకములకు మనుమఁడును, శుభమయిన ధనముకలవాఁడును, సత్కర్మలాచరించువాఁడు, సుఖముగాఁ జేరఁదగినవాఁడును, ఉపద్రవములు లేనివాఁడును అగు నిన్ను (అగ్నిని) రక్షణము కొఱకు వరించుచున్నాము.

ప్రథమాధ్యాయ షష్ఠఖండము సమాప్తము.

—*—

౧ అధ్యాయము,

౭ ఖండము.

శ్యావాస్యఋషి - లేక వామదేవర్షి॥ త్రిష్టుప్ఛందము॥ అగ్నిదేవత॥

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౬౩. ఆజుహోతా హవిషామర్జయధ్వం నిహోతారం గృహపతిం దధిధ్వం ।
౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩క ౨ర
ఇడస్పదేనమసా రాతహవ్యగ్ సపర్యతా యజతం సస్త్యానామ్॥

ఓఋత్విజులారా! అగ్ని నాహ్వానించుఁడు. (= పిలుచుట) హవిస్సుతో సుఖింపఁజేయుఁడు. ఉత్తరవేదియందు దేవతలంబిలుచునట్టి, గృహపాలకుఁడైనట్టి, యగ్నిని పూర్తిగా ధరించుఁడు. (ధరించుట=ఆరిపోకుండ నిల్పుట) నమస్కారముతో

లేక హవిస్సుతోఁగూడినట్టి, హవిస్సులను స్వీకరించినట్టి యజ్ఞగృహములమధ్యను బూజింపఁదగిన అగ్నిని సేవింపుఁడు.

వాజ్ఞహవ్యఋషి. జగతీఛందము-అగ్నిదైవత్యము.

3 ౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౬౮. చిత్రఇచ్ఛిశో స్తరుణస్య వక్షథో నయోమాతరావన్వేతి ధాతవే।
3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౨ ౧ ౨
అనూధాయదజీజన దధాచిదా వవక్షత్సద్యో మహిదూత్యంచరన్॥

శిశువయినట్టి, తరుణుఁడయినట్టి, యగ్నియొక్క హవిస్సులవహించుపని ఆశ్చర్యకరమైయున్నది. పుట్టగానే యేయగ్నికి అన్నిఁటి నిర్మించిన తల్లులైయున్న ద్యులోకభూలోకములు లేక అరణులుపాలుపెట్టుటకై పోవు. (బిడ్డయగు నగ్నికిఁ బాలుపెట్టవలెనని తా॥) పొదుగులేనట్టి యీలోకము ఈయగ్నిని బుట్టించితే పాలుపెట్టఁబోతే దన్నది యుక్తమే. అట్లుకాదుగదా! (ద్యులోకభూలోకములన్నిఁటికిఁ గోర్కెల నిచ్చునవేకదా! భూలోకమందుఁబుట్టిన యగ్నికేలపాలుపెట్టలేవని తా॥) పుట్టిన తర్వాత వెంటనే మహిమను దూతభావమును బొందుచు (దేవతలకు) హవిస్సుల నందిచ్చుచున్నాఁడు.

బృహదుక్థఋషి-త్రిష్టుప్ఛందము-అగ్నిదేవత॥

3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧
౬౯. ఇదంత ఏకం పరఊతఏకం తృతీయేన జ్యోతిషాసం విశస్వ॥ సంవే
౨ 3 ౨ ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
శనస్తన్వే3 చారురేధి ప్రియోదేవానాం పరమేజనిత్రే॥

(బృహదుక్థుఁడనుఋషిచనిపోయిన వాజియనేడు తనకుమారునితో ననుచున్న మాటలివి) ఓ (మృతపుత్రా!) నీయొక్క యీయగ్ని (అనఁగా శవముమీఁద నుంచినది) ఒకభాగముకనుక నీయొక్కదేహమందున్న యగ్నిభాగముతో బయటనున్న యగ్నిలోఁ బ్రవేశింపుము. ఇతరమైన నీయొక్కభాగము (అనఁగా వాయ్వంశ) ప్రాణవాయ్వంశతోఁజేరుకొనుఁగాక. మూఁడవదయిన సూర్యతేజస్సుభాగముతో నీచైతన్యముగూడునుగాక. మరల శరీరమును బొందుటకు సుందరమైనవాఁడవై

సూర్యునందుఁ బ్రవేశించినవాఁడవుకమ్ము. దేవతలందఱు జన్మించినచోటయిన యుత్తమమయిన యాసూర్యునందు బ్రియుఁడవై జన్మించుము.

కుత్సర్షి-జగతీఛందము, అగ్ని దేవత.

౩ ౨ఉ　౩ ౧ ౨　౩ ౧ ౩ ౧౨ ౩౧　౨　౩ ౧ ౨
౬౬. ఇమఁ గ్ స్తోమమర్హతే జాతవేదసే రథమివసం మహేమా మనీషయా।
౩ ౨ఉ　౩　౧ ౨　౩ ౧ ౨ర ౩ ౧ ౨ర　౩౧ ౨ర
భద్రాహినః ప్రమతిరస్య సగ్ సద్యగ్నే సఖ్యేమారి షామ వయంతవ॥

పూజనీయుఁడైన యగ్నికొఱకు సూక్ష్మబుద్ధితో నీస్తోత్రమును రథమును నిర్మించునట్లు చక్కఁగా (నిర్మించి) పూజించుచున్నాను. ఈయగ్ని సేవయందు మాబుద్ధియుత్తమము కళ్యాణమగునదియగునుగదా! (కనుక నాబుద్ధితోఁ జేతుమని తా॥) ఓయగ్నీ! మాకు నీస్నేహమున్నపుడు మేము హింసనొందము.

భారద్వాజఋషి-త్రిష్టుప్ఛంద-అగ్ని దేవత॥

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧　౨ ౩ ౧　౨　౩ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౨
౬౭, మూర్ధానం దివో అరతిం పృథివ్యా వైశ్వానరమృత ఆజాతమగ్నిం।
౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩　౧ ౨　౩ ౨ ౩ ౧ ౨　౩ ౨
కవిగ్ సమ్రాజమతిథిం జనానా మాసన్నః పాత్రం జనయన్త దేవాః॥

ద్యులోకమునకు శిరస్సువంటిదయిన భూమిని బొందియున్న లేక భూమికి స్వామియయిన, సమస్తనరులకు సంబంధించిన యజ్ఞము నిమిత్తమభిముఖముగాఁ బుట్టిన, కవియయిన, బాగుగా విరాజిల్లుచున్న, యజమానుల కతిథియయిన, (అప్పటప్పటికి దనయింటికి వచ్చువాఁడతిథి) (దేవతలకు) నోరయినట్టి, (అగ్నియనెడిది దేవతల నోరు. అందుఁబోయిన హవిస్సు దేవతలకుఁ దృప్తికలిగించుఁగనుక అని తా॥) రక్షించునట్టి, వైశ్వానరాగ్నిని మాయజ్ఞమందు స్తుతికర్తలు లేక ఋత్విజులు అభిముఖముగాఁ బుట్టించిరి.

భారద్వాజఋషి-త్రిష్టుప్ఛందము-అగ్ని దేవత.

౧౮. వి త్వదాపో న పర్వతస్య పృష్ఠాదుక్థేభి రగ్నే జనయన్త దేవాః తం త్వా
గిరః సుష్టుతయో వాజయన్త్యాజిం నగిర్వవాహో జిగ్యురశ్వాః॥

ఓయగ్నీ ! నీవద్దనుండి స్తోత్రములచేతను యజ్ఞములచేతను స్తుతికర్తలు పలువిధములుగాఁ గోర్కెలను మేఘములోనుండి యుదకములను బుట్టించునట్లు పుట్టించుచున్నారు స్తుతివాక్యములపై స్వారిచేయునగ్నీ ! స్తుతికర్తలు ప్రసిద్ధుఁడవగు నిన్ను బలపఱచుచున్నారు. లేక అన్నముఁగోరుచున్నారు. నిన్ను మంచిస్తవములుగలవారు యుద్ధము నశ్వములు వశపఱచుకొనునట్లు వశపఱచుకొనుచున్నవి.

వామదేవఋషి-త్రిష్టుప్ఛందము-అగ్ని దేవత!

౧౯. ఆవో రాజాన మధ్వరస్య రుద్రగ్ం హోతారగ్ం సత్య యజగ్ం రోదస్యోః॥
అగ్నిం పురా తనయిత్నో రచిత్తా ద్ధిరణ్యరూప మవసే కృణుధ్వం॥

ఓఋత్విగ్యజమానులారా ! యజ్ఞముయొక్క అధికారియయిన, దేవతలం బిలుచునట్టి, ధ్వనించుచున్న లేక శత్రువులనశింపఁజేయు ద్యులోక భూలోకములకు అన్నమునిచ్చునట్టి, బంగారురూపుగలట్టి, యగ్నిని మీరక్షణమునకై పిడుగువలె హఠాత్తుగావచ్చు మరణమునకుముందు, హవిస్సులతో సేవింపుఁడు.

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛంద—అగ్ని దేవత॥

౨౦. ఇన్ద్రే రాజా సమర్యో నమోభి ర్యస్య ప్రతీక మాహుతం ఘృతేన।
నరో హవ్యేభిరీడతే సబాధ అగ్నిరగ్ర ఉషసామశోచి॥

ప్రజ్వరిల్లుచున్న, స్వామియయిన యగ్ని స్తుతులతోఁగూడ మండుచున్నది.

ఏయగ్నియొక్క-రూపము నేతితో ఆహుతిచేయఁబడుచున్నదో యేమావారలు కూడిన వారయి హవిస్సులతోఁగూడ స్తుతించుచున్నారో ఆయగ్నిఉషస్సుల ప్రారంభమున (అనఁగాఁ ప్రాతఃకాలముననని తా॥) దీపించుచున్నది.

త్రిశిరుఁడగుత్వాష్ట్రఋషి-త్రిష్టుప్ఛందము-అగ్నిదేవత॥

౭౧. ప్రకేతునా బృహతా యాత్యగ్నిరా రోదసీ వృషభోరోరవీతి॥ దివశ్చిదన్తా దుపమా ముదాన డపాము పస్థే మహిషో వవర్ధ॥

అగ్నిగొప్పదయిన చిహ్నముతోఁగూడినవాఁడయి యిపుడు ద్యులోక భూలోకములను ఉత్కర్షతోఁ జేరుచున్నాఁడు. దేవతలంబిలుచునపుడు వృషభమువలె ధ్వనించును. అన్తరిక్షలోకములచివరనుండికూడను మేఘసమీపమును ఊర్ధ్వముగాఁజేరుచున్నాఁడు. (ఆదిత్యరూపముగానని తా॥) వర్షోదకములసమీపమున (విద్యుత్తు=మెరుపురూపముగా) గొప్పగావృద్ధినొందెను.

వశిష్ఠఋషి. త్రిష్టుప్ఛందస్సు-అగ్నిదేవత.

౭౨. అగ్నిం నరో దీధితిభి రరణ్యో ర్హస్తచ్యుతం జనయత ప్రశస్తం॥ దూరేదృశం గృహపతి మథవ్యుం॥

ఋత్విజులు ప్రశస్తమయిన దూరమునకుం గనంబడునట్టి, గృహములకుఁ బాలకుండగునట్టి, చేరశక్యముగానట్టి, హస్తమునుండి పుట్టినట్టి, అరణులయందు (అగ్నిని బుట్టించుటకై రాపాడించు రెండు కఱ్ఱలకుఁబేరు) ఉన్నట్టి అగ్నిని వ్రేళ్లతోఁ బుట్టించుచున్నారు. (అనఁగా అరణులను జేతులతో రాపాడించి యగ్నితీయుచున్నారని తా॥)

ప్రథమాధ్యాయ సప్తమఖండము సంపూర్ణము.

—:♦:—

## ౧ అధ్యాయము

### ౭ ఖండము.

బుధుండు-గవిష్ఠురుండు-నిద్దరు ఋషులు. త్రిష్టుప్ఛందము- అగ్ని దేవత॥

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౭౩ అబోధ్యగ్నిః సమిధా జనానాం ప్రతిధేను మివాయతీ ముషాసం॥ యహ్వా
౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
ఇవ ప్రవయా ముజ్జిహానాః ప్రభానవః సస్రతే నాకమచ్ఛ॥

ఈయగ్ని జనులయొక్క (అనఁగా ఋత్విజులని తా॥) సమిధలచేత వృద్ధి నొందింపఁబడెను. ప్రాతఃకాలమందు హోమధేనువును (పాలు పితుకుటకు) గూర్చి లేచినవిధమున వచ్చుచున్న యుషస్సునుగుఱించి మేల్కొనెను. వృద్ధి నొందిన యగ్నియొక్క కిరణములు అనగా జ్వాలలు కొమ్మలను బెఱిగించుచున్న చెట్లవలె, విస్తరించుచు నంతరిక్షమున కభిముఖముగాఁ బ్రసరించుచున్నవి.

వత్సప్రిఋషి-త్రిష్టుప్ఛందము-అగ్ని దేవత॥

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨
౭౪. ప్రభూర్జయన్తం మహాం విపోధాం మూరైరమూరం పురాం దర్మాణం
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨
నయన్తం గీర్భిర్వనాధియంధా హరిశ్మశ్రుం న వర్మణా ధనర్చిం॥

ఓ స్తుతికర్తా! నీవు జయశీలుఁడును, గొప్పవాఁడును, మేధావులనుపోషించు వాఁడును, మూఢులైనవారి శరీరములను రక్షించువాఁడును, మూఢుఁడుకాని వాఁడును, అగునగ్నిని స్తుతింప సమర్థుఁడవుకమ్ము. స్తుతివాక్కులతోఁ సేవింపఁ దగినట్టి, ధనముల నిచ్చునట్టి, కవచమనఁదగు జ్వాలలతోఁ గూడినట్టి, పచ్చని కేశములు (జ్వాలలు) గలట్టి, స్తోత్రములకు స్థానమైయున్న యగ్నినిగూర్చి సేవను జేయుము.

భరద్వాజర్షి-త్రిష్టుప్ఛంద-పూషదేవత.

3 ౧ 2 3౧ 2 3 ౧ 2 3౧ 2ర 3 ౧ 2 3 ౧ 2 2 3
౭౫. శుక్రన్తే అన్యద్యజతంతే అన్యద్విషురూపే అహనీ ద్యౌరివాసి। విశ్వా
2 3 ౧ 2ర 3 ౧ 2 3 2 3౧ 2
హిమాయా అవసి స్వధావన్ భద్రాతే పూషన్ని హరాతిరస్తు॥

ఓ పూష (=సూర్య) దేవా! నీయొక్క తెల్లనిరంగుగల పగలును, అట్లే నీయొక్క ప్రకాశముగల్గి స్వతఃకృష్ణవర్ణమైన రాత్రియుఁ గలవు. ఇట్లు నానా రూపములైన దినరాత్రులు నీమహిమచేతనగుచున్నవి. (అనఁగా నహోరాత్ర నిర్మాణమునకు సూర్యుండే కర్తయని తా॥) ఆదిత్యునివలెఁ బ్రకాశింపఁ జేయు వాఁడవు. అన్నవంతుడవగు నో పూషదేవా! సర్వప్రజలను ఏకారణము వల్లరక్షించుచున్నావో (ఆకారణమువల్ల నీవు సూర్యునివంటివాఁడవనితా॥) అట్టి నీయొక్క కళ్యాణమయిన దానము మాయందుఁ గలుఁగుఁ గాక.

విశ్వామిత్రఋషి-త్రిష్టుప్ఛంద-అగ్ని దేవత.

౧ 2 3౧ 2 3౧ 2ర 3 ౧ 2ర
౭౬. ఇడామగ్నే పురుదగ్ సగ్ సనింగోః శశ్వత్తమగ్ హవమానాయసాధ।
౧ 2 3 ౧ 2ర 3 2 3 ౧ 2 3 ౧ 2 3 2
స్యాన్నస్సూనుస్తనయో విజావాగ్నే సాతే సుమతి ర్భూత్వస్మే॥

ఓ, యగ్నీ! అనేకకర్మలు గలట్టి, గోవులు మొదలగు పసుసంపదను గల్గించు నట్టి, యిడ యనెడు (గోరూపదేవతను) ఎల్లపుడు యజమానుఁడనగు నాకొఱకు నిమ్ము. మా కొమారుఁడు మనుమఁడును కలుఁగుఁగాక యనెడు నీయను గ్రహ బుద్ధిసఫలంబయినది మాకుఁగలుగుఁగాక.

వత్సఋషి-త్రిష్టుప్ఛందము-అగ్ని దేవత.

౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౨ ౩ ౨
౭౭. ప్రిహోతా జాతో మహాన్నభో విన్నృషద్మా సీదదపాం వివర్తే॥ దధద్యో
౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨
ధాయీ సుతేవయాగ్ంసి యన్తావ సూని విధతే తనూపాః॥

ఏయగ్ని యన్తరిక్షముయొక్క సమీపమందు (మెరుపురూపముగా) ఉండెనో, అతఁడే యిపుడు యజమానులకు హోమమును నిష్పాదించువాఁడగుచు పూజ్యుఁడయి యున్నాఁడో అన్తరిక్షమునెఱింగినవాఁడును నరులందున్నవాఁడయి (వేదియందు) అనుగ్రహించుచున్నాఁడో ఆయగ్ని హవిస్సులనుధరించుచు (వేదియందు) ఉంచఁబడెను. ఓ స్తుతికర్తా! ఆయగ్ని సేవించు నీకొఱకు నన్నములను ధనములను గలిగించుఁగాక. శరీరరక్షకుఁడగుఁగాక.

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛంద-అగ్ని దేవత.

౨ ౩ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౭౮. ప్రిసమ్రాజ మసురస్య ప్రశస్తం పుగ్ంసః కృష్టీనా మను మాద్యస్య॥
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
ఇంద్రస్యేవ ప్రితవస స్కృతాని వన్దద్వారా వన్దమానా వివష్టు॥

వీరుండయినట్టి, జనులకు స్తవనీయుఁడగునట్టి, బలవంతుడగునట్టి, యింద్రుని స్వరూపమువలెను అగ్నియొక్క ప్రశస్తమయిన చక్కని స్వరూపమును స్తుతించుదురుగాక. స్తవము మొదలయిన యెన్నదగిన పనులను బాగుగాఁ గోరుదురుగాక, (యజమానుఁడు కర్త.)

విశ్వామిత్రఋషి-త్రిష్టుప్ఛంద-అగ్ని దేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩
౭౯. అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ ఇవేత్సుభృతో గర్భిణీభిః॥ దివేదివ
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩ ౨
ఈడ్యో జాగృవద్భి ర్హవిష్మద్భి ర్మను ష్యే భిరగ్నిః॥

సర్వజ్ఞుండైన యీయగ్ని గర్భిణీస్త్రీలచేత గర్భము ధరింపఁబడునట్లు

( దేవతలచేత ) అరణులందునుంచఁబడెను. ఆయగ్ని హవిస్సులను ధరించి జాగరూకులైన మనుష్యులచేతఁ బ్రతిదినము స్తుతింపఁదగి యున్నవాఁడు.

పాయుఋషి-త్రిష్టుప్ఛంద-అగ్నిదేవత.

3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౮౦. సనాదగ్నే మృణసి యాతుధానాన్ నత్వారక్షాగ్ సిపృతనాసు జిగ్యుః।
౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
అనుదహ సహమూరాన్ కయాదో మా తే హేత్యా ముక్షత దైవ్యాయాః

ఓయగ్నిదేవా ! నీవు చాలాకాలమునుండి రాక్షసులను బాధించుచున్నావు. అయినను నిన్ను యుద్ధములందు రాక్షసులుజయింపలేదు. అట్టి నీవు వరుసగా కూరవ్యాపారముగల క్రవ్యాదులను (=మాంసభక్షకులను) కాల్చివేయుము నీసంబంధమైన దివ్యాయుధములవల్ల నారాక్షసులు విడువంబడకుందురుగాక.

ప్రథమాధ్యాయమున అష్టమఖండము.

—:-o-:—

౧ అధ్యాయము

౯ ఖండము.

గాయత్రిఋషి-అనుష్టుప్ఛందము-అగ్నిదేవత॥

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ ౨ ౨ 3 ౧
౮౧. అగ్న ఓజిష్ఠమా భరద్యుమ్న మస్మభ్య మధ్రిగో। ప్రనో రాయే
౨ర 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
పనీయసే రత్సి వాజాయ పన్థామ్॥

ఓయగ్నీ ! అతిబలవంతమైన ధనమును మాకు నిమ్ము. వారింపరాని గమ

నముగలవాఁడా ! మెచ్చఁదగిన ధనముతో మమ్ములను గూర్పుము. అన్న లాభము నకు మార్గమును జూపుము.

భరద్వాజర్షి - లేక నామదేవుడు-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత.

౮౨. యది వీరో అనుష్యా దగ్నిమిన్ధీత మర్త్యః॥ ఆజుహ్వ ద్ధవ్య మానుష క్శర్మ భక్షీత దైవ్యం॥

ఎపుడు మానవునకుఁ బుత్రుఁడుకలుగునో యపుడు ఆతఁడుఅగ్న్యాధానము (యాగారంభమని తా॥) చేయవలెను. ఎడతెగకుండ హోమము జరిగించుచుండ వలెను. మఱియు దివ్యమయిన సుఖమును బొందవలెను. లేక దేవసంబంధగృహ మును సేవింపవలెను.

భరద్వాజఋషి-అనుష్టుప్ఛందము-అగ్ని దేవత॥

౮౩. త్వేషస్తే ధూమ ఋణ్వతి దివి సంఛుక్ర ఆతతః। సూరో న హి ద్యుతా త్వం కృపా పావక రోచసే॥

ఓయగ్నీ ! ప్రకాశించు నీనిర్మలకాన్తిగల పొగ యంతరిక్షమందు విస్త రించినదై మేఘముగామాఱుచు గమనించుచున్నది. ఓయగ్నీ ! సూర్యునివలె స్తుతింపఁబడుచుఁ బ్రకాశించుచున్నావుకదా !

భరద్వాజఋషి-అనుష్టుప్ఛందము-అగ్ని దేవత.

౮౪. త్వꣳ హి క్షైతవద్యశోఽగ్నే మిత్రో న పత్యసే॥ త్వం విచర్షణే శ్రవో వసో పుష్టిం న పుష్యసి॥

ఓయగ్నీ ! మెండినయన్నము (అనఁగా నగ్నికిన్నము కల్గుయని తా॥ ) ను సూర్యుని

వలెను ఆక్రమించుచున్నావు. లేక హవిస్సులతో నిండిన యజమానగృహమును స్నేహితునింబోలి చేరుచున్నావు. కనుక సర్వమును బాగుగ నెఱింగినవాఁడా! నివాసమున కాధారమగు వాఁడా! నీవు అన్నమును బుష్టిని (యజమానగృహమందు) వృద్ధినొందించుచున్నావు.

భృక్తవాహోద్వితఋషి-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత.

౮౫. ప్రాతరగ్నిః పురుప్రియో విశ స్తవేతాతిథిః। విశ్వేయస్మి న్నమర్త్యే
హవ్యం మర్తాస ఇన్ధతే॥

పలువురకుఁ బ్రియుఁడు యజమానునందు ధనముకలిగించువాఁడు అతిథివలెఁ బూజ్యుండునగు నగ్ని ప్రాతఃకాలమున స్తుతింపఁబడుచున్నాఁడు. మరణధర్మము లేని యేయగ్నియందు సమస్తనరులును హవిస్సును వేల్చుచున్నారు. (ఆయగ్ని)

ఆత్రేయులఋషులు-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత॥

౮౬. యద్వాహిష్ఠం తదగ్నయే బృహదర్చ విభావసో। మహిషీవ త్వద్రయి
స్త్వద్వాజా ఉదీరతే॥

మిగుల వహించునట్టి స్తోత్రము అగ్నికొఱకుఁ జేయఁబడెను. (అనఁగా స్తుతిమంత్రము దేవతలకు వాహనమని తా॥) కనుక నోకాన్తిధనముగాఁగలయగ్నీ! అధికమయిన యన్నమును ధనమును మాకిమ్ము. ఏకారణమువల్ల నీవద్దనుండి గొప్పధనమును బొందుచున్నారో (సర్వప్రజలును ఆకారణమున మాకును ఇమ్మని తా॥)

గోపవనఋషి లేక సప్తవధ్రి-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత॥

3౧ ౨3 ౧౨ 3౧౨ 3 ౨ 3౨3 ౨3
౮౭. విశో విశోవో అతిథిం వాజయన్త పురుప్రియం। అగ్నింవో దుర్యం
౧౨ 3౨3 ౨3౧౨
వచః స్తుషేశూషస్య మన్మభిః॥

ఓఋత్విగ్యజమానులారా! మీరు అన్నముం గోరుచుం బ్రజలందఱికి బహు ప్రియుండై యతిథివలెం బూజనీయుండయిన యగ్నిని స్తుతింపుండు. నేనును మీకొఱకు గృహముచకు మేలుచేయున గ్నిని మంత్రములతో సుఖముకొఱకు స్తుతించుచున్నాను.

పురు ఆత్రేయఋషి-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత॥

3౨ఉ 3 ౨ 3౧ ౨ర 3౨3 ౧౨ ౨3౧
౮౮. బృహద్వయోహి భానవేzర్చా దేవాయాగ్నయే। యంమిత్రం నప్ర
౨ర 3 ౧౨ 3౨ 3౨
శస్తయే మర్తాసో దధిరే పురః॥

యజ్ఞమునందు దీప్తికలిగియున్న యగ్నికొఱకు గొప్ప యన్నమును (అనంగా హవిస్సులని తా॥) ఇవ్వబడుచున్నది. కనుక నీవును అన్నము నిమ్ము. మానవులు ఏయగ్నిని స్నేహితుని మిగుల స్తుతించుటకు ముందుంచుకొనుచున్నారో (ఆ యగ్నినని పూర్వాన్వయము.)

గోపవనఋషి అనుష్టుప్ఛంద-అగ్ని దేవత.

౧౨ 3౧ ౨3 ౧౨3౧ ౨ర ౧ ౨ 3 ౧౨ 3
౮౯. అగన్మవృత్రహన్తమం జ్యేష్ఠమగ్నిమానవం। యస్మ శ్రుతర్వా న్నాక్షే
౨ 3౧౨ 3౧౨
బృహదనీక ఇధ్యతే॥

పాపములను బాగుగాంబోంగొట్టునట్టి, శ్రేష్ఠుండైనట్టి, మానవుల సంబంధియైన లేక మనుష్యులకు మేలుకూర్చు నగ్నిని మేము ఆశ్రయించుచున్నాము. ఏ

యగ్ని ఋషునికొడుకైన శ్రుతవంతుఁడను రాజు నిమిత్తము గొప్ప మంటల సమూహాముతో దీపించెనో (ఆయగ్ని నాశ్రయింతుము.)

వామదేవ-కశ్యప-మరీచి-మనువు లలో నొకఁడు ఋషి-అనుష్టుప్ఛంద-అగ్ని దే॥

౩ ౨ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨
౯౦. జాతః పరేణ ధర్మణా యత్సవృద్భి స్సహాభువః। పితా యత్కశ్యప
౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర౩౨
స్యాగ్నిః శ్రద్ధామాతా మనుఃకవిః॥

ఓయగ్నీ ! నీవు ఎక్కువగు ధర్మముచేతఁబుట్టితివి (ధర్మము=కర్మ) ఏనీవు ఋత్విజులతోఁగూడ భూమిసంబంధమయిన యజ్ఞమందుఁ బ్రవర్తించుచున్నావో, ఏనీకు గశ్యపుఁడు తండ్రియో, శ్రద్ధాదేవి తల్లియో, మేధావియగు మనువు స్తుతికర్తయో, ఆనీవు అగ్నీ ! యజమానునికోర్కెను సఫలము చేయుము.

ప్రథమాధ్యాయ నవమ ఖండ సమాప్తము.

౧ అధ్యాయము,

౧౦ ఖండము.

అగ్నిస్తాపస ఋషి-అనుష్టుప్ఛంద-విశ్వేదేవ దేవత.

౨ ౩౧ ౧ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩౧
౯౧. సోమగ్ రాజానం వరుణ మగ్ని మన్వారభామహే। ఆదిత్యం విష్ణుగ్
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
సూర్యం బ్రహ్మాణంచ బృహస్పతిం॥

విరాజిల్లుచున్న సోమమునువరుణుని, యగ్నిని, స్తుతిమంత్రములతో రక్షణముకొఱకు

నాహ్వానించుచున్నాము. అట్లే అదితిపుత్రుఁడగు విష్ణుని సూర్యుని బ్రహ్మను బృహస్పతిని ఆహ్వానించుచున్నాము

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-విశ్వేదేవ దేవత.

౯౨. ఇత ఏత ఉదారుహన్ దివః పృష్ఠాన్యా రుహన్। ప్రభూర్జయో యథాపథో ద్యామఙ్గిరసో యయుః॥

ఈయంగిరసులు ఎట్లు ఉన్నతిమార్గముద్వారా స్వర్గమును జెందిరో హవిస్సులను పచనము (=వంట) చేసిన జనులు అట్లే మార్గముద్వారా గాత్రమాదులను జేరుచున్నారు. అట్లే భూభాగమునుండి స్వర్గస్థానమును ఎక్కిరి.

కశ్యప-లేక దేవల-లేక అసితఋషి-అనుష్టుప్ఛంద-అగ్నిదేవత

౯౩. రాయే అగ్నే మహే త్వా దానాయ సమిధీమహి। ఈడిష్వాహి మహే వృష ద్యావా హోత్రాయ పృథివీ॥

ఓయగ్నీ! నిన్ను గొప్పదయిన ధనముయొక్క దానముకొఱకు బాగుగ మండించుచున్నాము. వర్షముకురియించువాఁడా! అగ్నికొఱకు గొప్పహోమము కొఱకు ద్యులోక భూలోకములను స్తుతింపుము.

భార్గవజమదగ్నిఋషి-సోమఋషి-అనుష్టుప్ఛందము-అగ్నిదేవత.

౯౪. దధన్వే వా యదీమను వోచద్ బ్రహ్మేతి వేరుతత్। పరి విశ్వాని కావ్యా నేమిశ్చక్రమివాభువత్॥

అదియునుంగాక ఋత్విజులీయజ్ఞమునుగూర్చి హవిస్సులు మొదలగు సాధనములను బట్టుకొనియున్నారు. ఏస్తోత్రమును వారు పఠించుచున్నారో దాని

సంతటిని అగ్ని తెలియుచున్నాఁడు. ఈయగ్నిసకలములైన ఋత్విజుల కర్మలను నేమిరథచక్రముచుట్టు నావరించునట్లు ఆవరించుచున్నాఁడు

పాయుఋషి-అనుష్టుప్ఛంద-అగ్నిదేవత॥

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
౯౫. ప్రత్యగ్నే హరసా హరః శృణాహి విశ్వతస్పరిః। యాతుధానస్య
౩ ౨ ౩ ౨ ౩క ౨ర ౩క ౨ర
రక్షసోబలం న్యుబ్జవీర్యః॥

ఓయగ్నీ! నీవు నీతేజస్సుతో (లేక క్రోధముతో) రాక్షసులను సంహరించు బలముతోఁగూడియున్నావని యంటేటను వినుచున్నాము. రాక్షసుల సామర్థ్యమును బూర్తిగాఁ గ్రుంగదియుము.

పరిస్కణ్వఋషి-అనుష్టుప్ఛంద-అగ్నిదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౮ ౩ ౨ ౩ ౧ ౮ ౨ ౩ ౨ ౮ ౩ ౨ ౧ ౨
౯౬. త్వమగ్నే వసూగ్ం రిహ రుద్రాగ్ం ఆదిత్యాగ్ం ఉత। యజా
౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨
స్వధ్వరం జనం మనుజాతం ఘృతప్రుషం॥

ఓయగ్నీ! నీవు ఈకర్మయందు వసువులను రుద్రులను ఆదిత్యులను బూజించుము. మఱియు మంచియాగములుగల్గి ప్రజాపతి (=సృష్టికర్త) చేత బుట్టింపఁబడిన ఉదకమును వర్షించునితర దేవతాజనమును బూజింపుము,

ఇట్లు ప్రథమాధ్యాయదశమఖండము పూర్ణము

—*।*—

## ౧ అధ్యాయము.

### ౧౧ ఖండము.

దీర్ఘతమఋషి-ఉష్ణిక్ఛంద-అగ్నిదేవత.

౩౧ ౨ ౩౧౮ ౨ ౩ ౧౨౩ ౧౨౩ ౨ ౩ ౧ ౨
౯౭. పురుత్వాదా శివాగ్ వోచేzరిరగ్నే తవస్విదా। తోదస్యేవ
౩౨ఉ ౩ ౧ ౨
శరణ ఆమహాస్య॥

ఓయగ్నిదేవా ! నిన్ను పలువిధములఁ దానములఁగోరుచు స్తుతించుచున్నాను. కోరిన హవిస్సులనిచ్చుచున్నాను. ఏమంటే ఓయగ్నీ! నీకే నేను సేవకుఁడనుగనుక ప్రభుగృహమును సేవకుఁడు విడువనట్లు గొప్పవాఁడవయిన నిన్ను విడువక సేవించు చున్నాను.

విశ్వామిత్రఋషి-ఉష్ణిక్ఛంద-అగ్నిదేవత.

౧ ౨ర ౨ఉ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧
౯౮. ప్రహోత్రే పూర్వ్యం వచోzగ్నయే భరతాబృహత్। విపాం
౨ర౧౩ ౧౨ ౩ ౨౩౧౨
జ్యోతీగ్‌షి బిభ్రతే నవేధసే॥

(యజమానుఁడు హోత మొదలగు వారితో ననుచున్నాఁడు.) మేధావులయిన యధ్వర్యుడు మొదలైనవారికిఁ గర్మ సామర్థ్యములను గలిగించుచు జగత్తును నిర్మించు నట్టి దేవతలంబిలుచుచున్న యగ్నినిమిత్తము పురాతనమై గొప్పదయిన వాక్కును (అనఁగా వేదస్తుతులను) బఠింపుఁడు.

గోతమఋషి-ఉష్ణిక్ఛంద-అగ్నిదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨
౯౯. అగ్నేవాజస్య గోమత ఈశాన స్సహసోయహో। అస్మేదేహి జాత
౩ ౨ ౩ ౧ ౨
వేదో మహిశ్రవః॥

ఓబలపుత్రా ! అగ్నీ ! (అరణులు బలముతో మథించుటచేఁ బుట్టినందున బలపుత్రుఁడనఁబడును.) అనేకగోవులతోఁగూడిన యన్నమునకు నీవీశ్వరుఁడవు కనుక మానిమిత్తము ఓయగ్నీ ! విస్తారమగు నన్నమును ఇమ్ము.

విశ్వామిత్రఋషి-ఉష్ణిక్ఛంద-అగ్ని దేవత

२ ३ १ २ ३ २ ३१ २ ३ १ २ १ २ ३ १
౧౦౦. అగ్నేయజిష్ఠో అధ్వరే దేవాం దేవయతే యజ। హోతా మన్ద్రో
२र३ ३ १ २
వి రాజస్యతి స్రిధః॥

యాగసంపాదకులలో శ్రేష్ఠుండవగు నోయగ్నీ ! నీవు యాగమందు దేవతలం గోరుచున్నవానికై దేవతలను బూజింపుము. దేవతలంబిలుచువాఁడు, యజమానుని మదింపఁజేయువాఁడునగు నీవు ఓయగ్నీ ! యజమానశత్రువులను నశింపఁజేసి విరాజిల్లుము.

త్రితఋషి-ఉష్ణిక్ఛంద-పవమానసోమదేవత.

३ २ ३ २ ३ १ २ ३ १ २र ३ २ ३ २ ३ १
౧౦౧. జజ్ఞానస్సప్త మాతృభిర్మ ధామాశాసత శ్రియే। అయంధ్రువో
२ ३ १ २ ३ २
రయీణాం చికేతదా॥

సిద్ధుఁడయిన యీయగ్ని ధనములనెఱుఁగును. హవిస్సులను గొలువ సమర్థములైన యేడు నాల్కలతో (=జ్వాలలు) హవిస్సులనందుకొనుచుం బుట్టిన యీయగ్ని కర్మను సాధించు సోమమును సేవించుటకు ఆజ్ఞాపించుచున్నాఁడు, లేక కోరుచున్నాఁడు.

ఇరిమిఠిఋషి-ఉష్ణిక్ఛంద-అదితి దేవత.

३ २उ ३ १ २ ३१ २र ३ १ २ १ २र १ २
౧౦౨. ఉతస్యానో దివా మతిర దితి రూత్యా గమత్। సాశన్తాత మయస్కర
३ २ ३ १ २
దప స్రిధః

మఱియు బూర్వోక్తమయిన స్తుతింపఁదగిన అదితిరక్షణముతోఁగూడ (బగల్లు యందు మమ్ముఁజేరుఁగాక. చేరి శాన్తికరమయిన సుఖమును గలిగించుఁగాక. శత్రువులను బారఁదోలుఁగాక.

వైయశ్వఋషి-ఉష్ణిక్ఛంద-అగ్ని దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩
౧౦౩. ఈడిష్వా హి ప్రతీవ్యా౩ యజస్వ జాతవేదసం। చరిష్ణు ధూమ
౧ ౨
మగృభీత శోచిషం॥

శత్రువులనెదిరించునట్టి అగ్నినేస్తుతులతోఁబ్రార్థింపుము. అంతట నావరించు ధూమసముదాయముకల శత్రువులకు లొంగని తేజస్సుగల భూతముల నెఱింగిన యగ్నిని బూజింపుము.

వైయశ్వఋషి-ఉష్ణిక్ఛంద-అగ్ని దేవత.

౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౪. నతస్య మాయయాచ నరిపురీశీత మర్త్యః॥ యో అగ్నయే దదాశ
౩ ౧ ౨
హవ్య దాతయే॥

ఏజనుఁడు హవిస్సుల స్వీకరించు నగ్నికొఱకు హవిస్సుల నిచ్చుచున్నాఁడో యాతనిని మనుష్యుఁడయిన శత్రువుఁడు మాయలతోనైనను ఎదిరింప సమర్థుఁడు కానేరఁడు.

భారద్వాజ ఋజిశ్వఋషి-ఉష్ణిక్ఛంద-వైశ్వదేవాగ్ని దేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ర ౨ర ౧ ౨
౧౦౫. అప త్యం వృజినగ్ం రిపుగ్ం స్తేనమగ్నే దురాధ్యం। దవిష్ఠమస్య
౩ ౨ ౩ ౨
సత్పతే కృధీ సుగమ్॥

ఓయగ్నీ! ఆకుటిలుఁడైన దుష్టాభిప్రాయముఁగల దొంగయిన శత్రువును

దూరముగాఁ దొలఁగింపుము సత్పురుషులఁ బాలింపువాఁడా ! అగ్నీ ! మాకు సులభముగాఁ బొందఁదగిన సుఖమును గలిగింపుము.

విశ్వమనఋషి-ఉష్ణిక్ఛంద-వైశ్వదేవాగ్ని.

౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౧౦౬. శ్రుష్ట్యగ్నే నవస్య మే స్తోమస్య వీర విశ్పతే। నిమాయిన స్తపసా
౩౧ ౨
రక్షసో దహ॥

శత్రువుల నశింపఁ జేయువాఁడా ! ప్రజలఁ బాలించువాఁడా ! అగ్నీ ! యిపుడు చేయఁబడుచున్న క్రొత్తదయిన నాస్తోత్రమును విని మాయావంతులగుచుఁ గర్మ విఘ్నముచేయు రాక్షసులను దపింపజేయు తేజస్సుతోఁ బూర్తిగా భస్మము చేయుము.

ఇట్లు ప్రథమాధ్యాయైకాదశఖండము సమాప్తము.

౧ అధ్యాయము,

౧౨ ఖండము.

ప్రయోగభార్గవఋషి-కకుప్ఛంద-అగ్ని దేవత.

౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౩
౧౦౭. ప్రమగ్ హిష్ఠాయ గాయత ఋతావ్నే బృహతే శుక్రశోచిషే॥ ఉపస్తు
౧ ౨ ౩౧ ౨
తాసో అగ్నయే॥

ఓస్తుతికర్తలారా ! మీరు మిగుల దాతయయిన, యాగనిర్వాహకుఁడైన, గొప్పవాఁడయిన, దీపించు తేజస్సుకల యగ్నినిమిత్తము స్తోత్రమును బఠింపుఁడు

సౌభరిఋషి-కకుప్ఛందము-అగ్ని దేవత.

౧ ౨ర౩ ౨ ౩౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩
౧౦౭. ప్రసో అగ్నే తవోతిభి స్సువీరాభి స్తరతి వాజ కర్మభిః। యస్య
౨ ఁ ౩ ౧ ౨ర
త్వగ్ం సఖ్యమావిథ॥

ఓయగ్నీ ! ఆయజమానుఁడు మంచి పుత్రులనిచ్చునట్టి, బలమును లేక అన్నమును గలిగించునట్టి, నీరక్షణములతో వృద్ధి నొందుచున్నాఁడు. అగ్నీ! నీవు ఏ యజమానుని స్నేహమును బొందుచున్నావో (వాఁడని పూర్వాన్వయము.)

సౌభరిఋషి-కకుప్ఛందము-అగ్ని దేవత.

౧ ౨ ౩క ౨ర ౩ ౧ ౨ ౩౧౨౩౧ ౨ ౩ ౨
౧౦౮. తంగూర్ధ్యా స్వర్ణరం దేవాసో దేవమరతిం దధన్విరే। దేవత్రా
౩ ౧ ౨
హవ్యమూహిషే॥

సర్వమును నడుపువాఁడు, స్వామియు,నగు నగ్నిదేవుని ఋత్విజులు స్తుతికర్త చేతఁ బ్రార్థితులుగాక. అగ్నీ ! దేవతలకు హవిస్సులను బొందింపుము.

ప్రయోగభార్గవఋషి-సౌభరికాని-కాణ్వస్యైకాని-కకుప్ఛందము॥ అ॥ దే॥

౧ ౨ ౩ ౧౨౩ ౧ ౨ ౩ ౨ ౨ ౩ ౨ ౩ ౨ ౨ ౩
౧౦౯. మానో హృణీథా అతిథిం వసు రగ్నిః పురుప్రశస్త ఏషః। య స్సు
౧ ౨ ౩ ౨ ౩ ౨
హోతా స్వధ్వరః॥

ఓఋత్విజుల సమూహమా ! యేయగ్ని దేవతలను బాగుగాఁ బిలుచునో, యెవఁడు మంచి యజ్ఞముకలవాఁడో , యతిథివలెఁ బూజనీయుఁడు మాసంబంధియు నగు నగ్నిని హరింపఁ బోకుము. ఈయగ్ని పలువురచే స్తుతింపఁబడుచు నివాసాధార మయినవాఁడు నగుచున్నాఁడు.

సౌభరిఋషి-కకుప్ఛంద-అగ్నిదేవత.

3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౧౧౧. భద్రోనో అగ్నిరాహుతో భద్రారాతిః సుభగ భద్రో అధ్వరః।
3 ౨ 3 ౧ ౨ర
భద్రా ఉతప్రశస్తయః॥

హవిస్సులతోఁదృప్తి పఱుపఁబడిన యగ్ని మాకుఁ గళ్యాణప్రదుఁడగుఁగాక. శుభధనముగల యగ్నీ! కళ్యాణమగు దానము మాకు నగుంగాక. యాగము శుభమయినదగుఁగాక. ప్రశస్తములగు స్తుతులును గలుగుఁగాక.

సౌభరిఋషి-కకుప్ఛందము-అగ్నిదేవత.

౧ ౨ 3 ౨ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨
౧౧౨. యజిష్ఠంత్వా వవృమహే దేవం దేవత్రా హోతార మమర్త్యం। అస్య
3 ౧ ౨ 3 ౧ ౨
యజ్ఞస్య సుక్రతుం॥

ఓయగ్నీ! యాగకర్తలలో శ్రేష్ఠుఁడవయి దేవతలలో మిక్కిలి ప్రకాశించువాఁడవు. దేవతలం బిలుచుచు మరణధర్మము లేనివాఁడవును, ఈయాగమును బాగుగ నొనర్చువాఁడవగు నిన్ను సేవించుచున్నాము.

సౌభరిఋషి-కకుప్ఛంద-అగ్నిదేవత,

౧ ౨ 3 ౧ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౧౧౩. తదగ్నే ద్యుమ్నమా భర యత్సాసాహా సదనే కంచి దత్రిణం।
3 ౧ ౨ర 3క ౨ర
మన్యుం జనస్య దూఢ్యం॥

ఓయగ్నీ! యెపుడు యాగగృహమందున్న యెవనినయిన కర్మవిఘ్నకారియగు రాక్షసుని గట్టిగాఁ దిరస్కరింతువో, యెపుడు పాపాలోచనగల జనుని క్రోధమును దిరస్కరింతువో, యపుడు ఆధనమును దెచ్చియిమ్ము.

విశ్వామనఋషి-ఉష్ణిక్ఛందము-అగ్నిదేవత.

౧౧౪. యద్వా ఉ విశ్పతిః శితః సుప్రీతో మనుషో విశే। విశ్వేదగ్నిః ప్రతి రక్షాగ్ంసి సేధతి॥

ప్రజలను బాలించువాఁడయి తీవ్రమయిన ఆయగ్ని చాల ప్రీతిచెందినవాఁడగుచు మనుష్యుని గృహమందు నెపుడుండునో యపుడు అగ్ని సమస్త రాక్షసులను దప్పక హింసించును.

ఇట్లు సామవేదమున నాగ్నేయపర్వంబను ప్రథమాధ్యాయము సంపూర్ణము.

—:♦:—

## ద్వితీయాధ్యాయము—ఐంద్రపర్వము.

—*।*—

### ౧ ఖండము.

శంయుర్బార్హస్పత్యఋషి-గాయత్రీఛందము-ఇంద్రదేవత.

౧౧౫. తద్వో గాయ సుతే సచా పురుహూతాయ సత్వనే శంయద్గవే న శాకినే॥

ఓస్తుతికర్తలారా ! మీరు సోమ మభిషవింపఁ (పిండ) బడియుండఁగాఁ బలువురు యజమానులచేఁ బిలువఁబడినవాఁడు, శత్రువుల నణఁచువాఁడు, నగు నింద్రుని కొఱకు ఆస్తోత్రము నందఱు కలిసి గానము చేయుఁడు. ఏస్తోత్రము ఇంద్రునకు సుఖకరమగునో (దానిని లని పూర్వాన్వయము)

శ్రుతకక్షఋషి-గాయత్రిఛంద-సోమదేవత.

౧౧౬. యస్తేనూనగ్ శతక్రత వింద్ర ద్యుమ్నితమో మదః। తేన నూనం మదే మదేః

అనేక ప్రజ్ఞలుకలయింద్రా ! అత్యంతకీర్తిగల యేసోమముకలదో, యేసోమము నీకొఱకుఁ బూర్వము మాచేత నభిషవింపఁబడినదో, ఆసోమముతో నిపుడు నీకు మదముకలిగియుండగా మమ్మునుగూడ (ధనదానాదులతో) మదింప జేయుము.

హార్యత (ప్రిగాథ) ఋషి-గాయత్రిఛంద-సోమదేవత.

౨౩౧౨ ౩ ౨ ౩౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౧౧౭. గావఉపవదావటే మహీ యజ్ఞస్యరప్సుదా। ఉభాకర్ణా హిరణ్యయా॥

ఓగోవులారా ! మీరు మహావీరమును (అదొకపాత్రము) సమీపించుడు. ఘర్మమను పేరుగల యాగమునకు సాధనమయిన, మంత్రములతోఁ బిదుకఁదగిన, పాలను చాల యవసరమయినవానిని ఇందు. ఈ మహావీరపాత్రమునకు రెండు ప్రక్కల చెవులు బంగారుతోఁ జేయఁబడియున్నవి. (ఘర్మయాగమునకు మేకపాలు కూడ నుపయోగింతురు.)

శ్రుతకక్షఋషి-గాయత్రి॥ ఇంద్రిదేవత.

౨౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౨౩౧ ౨ ౩ ౧ ౨
౧౧౮. అరమ శ్వాయ గాయత శ్రుత కక్షారం గవే। అరమింద్రిస్య ధామ్నే

(ఋషి తనకుఁదానే చెప్పుకొనుచున్నాఁడు.) ఓ శ్రుతకక్షఋషీ ! ఇంద్రు డిచ్చునట్టి యశ్వముకొఱకు ఇంద్రస్తోత్రమును బాగుగా గానము చేయుము. ఆవు కొఱకును ఇంద్రుఁడిచ్చు గృహముకొఱకును గానము చేయుము. (అనఁగా గవాది లాభమునకై యింద్రుని స్తుతిమంత్రములను గానము చేయుమని తా ॥)

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత

౧ ౨ర ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ర ౩ ౧
౧౧౯. తమిన్ద్రిం వాజయామసి మహే వృత్రాయ హన్తవే॥ సవృషా వృషభో

౨
భువత్॥

(యజమానులవాక్యము) ఆయింద్రుని స్తుతులతోఁగూడిన సోమముతో గొప్ప శత్రువగు వృత్రునిం జంపుటకు బలపఱచుచున్నాము. వర్షముకురియించు నింద్రుఁడు స్తుతికర్తలకు ధనదాతయగును.

ఇంద్రమాతలగు దేవజాములు ఋషులు-గాయత్రీఛందము-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౨3 ౨3 ౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨ర3౧ ౨ర
౧౨౦. త్వమింద్ర బలాదధి సహసో జాత ఓజసః। త్వం సన్ వృషన్వృషేదసి॥

ఓయింద్రా ! నీవు బలమునుండి పుట్టితివి. (పుట్టుకయనగా నిచట ఖ్యాతి. వృత్రాదులను జయింపఁజాలిన బలమువల్ల ఖ్యాతిజెందితివని తా॥ ) ధైర్యము వల్లనుగూడఁ బ్రఖ్యాతి జెందితివి. వర్షముకురియించువాఁడవగుచుఁ (గోర్కెలను) వర్షించువాఁడవగుదువు.

గోపవన-అశ్వసూక్తిఋషులు-గాయత్రీఛందము—ఇంద్రదేవత.

3౧ ౨ర 3 ౨ఉ ౧ ౨ 3 ౧ ౨3౨ 3౨
౧౨౧. యజ్ఞ ఇంద్ర మవర్ధయ ద్యద్భూమిం వ్యవర్తయత్। చక్రాణ ఓపశం దివి॥

(యజమానులుచేయు) యాగము ఇంద్రుని వృద్ధిపొందించెనుగదా ! ఆ యింద్రుఁడు అన్తరిక్షమందు మేఘము నావరించిన వానిని సాధించుచు భూమిని (వర్షాదికముచేత) బాగుచేసెను. లేక వృద్ధిపఱచెను.

గోపవన—అశ్వసూక్తిఋషులు-గాయత్రీఛంద-ఇంద్రదేవత

౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ర3 ౨ 3 ౨3 ౨ 3 ౨3 ౧
౧౨౨. యదింద్రాహం యథాత్వమీశీయ వస్వ ఏక ఇత్। స్తోతామే గో

౨
సఖా స్యాత్॥

ఓయింద్రా ! నీవొక్కఁడవేధనమున కీశ్వరుఁడవు. నేనును అట్లే అధిపతి నయియుంటే, యపుడు నా (యాగములోని) స్తుతికర్త గోవులతోఁ గూడిన వాఁడగును.

మేధాతిథి-అంగిరసఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౨౩. పన్యం పన్య మిత్సోతార ఆ ధావత మద్యాయ। సోమం వీరాయ
శూరాయ॥

అభిషవకర్తలు (సోమ మభిషవమొనర్చినవారు) అనఁగా నధ్వర్యులు మదింపఁ జేయఁదగి, వీర్యవంతుఁడు శూరుఁడు నగు నింద్రునికొఱకు సర్వత్ర స్తుతింపఁదగిన సోమమునే యిత్తురుగాక.

కణ్వగోత్రుఁడగు ప్రియమేధర్షి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౨౪. ఇదం వసో సుతమన్ధః పిబా సుపూర్ణ-ముదరం। అనాభయిన్ రరిమా తే॥

నివాసము కలిగించు నోయింద్రా! యీయెదుటనున్న అభిషవించిన సోమరూపాన్నమును పానము చేయుము. ఏయన్నముతో నీయుదరము నిండునో (అట్లు త్రావుము.) ఎచటను భయము లేనివాఁడా! ఇంద్రా! నీకొఱకుఁ బూర్వము చెప్పంబడిన సోమము నిచ్చుచున్నాము.

ఇట్లు ద్వితీయాధ్యాయ ప్రథమఖండము సమాప్తము.

——:o:——

౨ అధ్యాయము.

౨ ఖండము

సూతకక్షుఋషి-గాయత్రీఛంద-సూర్యరూపేన్ద్ర దేవత.

౧౨౫. ఉద్ఘేదభి శ్రుతామఘం వృషభం నర్యాపసం। అస్తార మేషి సూర్య॥

(పన్నిద్దఱు సూర్యులలో నింద్రుఁడొకఁడు) ఓసూర్యరూపుఁడవయిన యింద్రా ! ప్రసిద్ధధనము గలిగినందుననే ధనమందఱకును వర్షించునట్టి, నరులకు హితము కలిగించు కర్మ గలట్టి, దానశీలుఁడయినట్టి, వాఁడవై యంతట నుదయించు చున్నావు.

సూతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩౧ ౨ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౨౬. యవద్య కచ్చ వృత్ర హన్నుదగా అభిసూర్య। సర్వం త దింద్రతే వశే॥

మేఘమును జీల్చువాఁడా ! సూర్యరూపేంద్రా ! యీదినమందు, నేయొకానొకవస్తువు నభిముఖముగాఁ జేసికొని యుదయించితివో యావస్తువు నీవశమయి యున్నది. (అనఁగా సర్వవస్తువులును నీవశములని తా॥ )

భరద్వాజఋషి-గాయత్రిఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర ౩౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩
౧౨౭. య ఆనయ త్పరావ త స్సునీ తీ తుర్వశం యదుం। ఇంద్రస్సనో

౨ ౩ ౧ ౨
యువా సఖా॥

ఏయింద్రుఁడు తుర్వశుని యదువును (శత్రువులచేత దూరదేశమందుఁ ద్రోయంబడిన రాజులను) తగిన యుపాయముతో దూరదేశమునుండి తెచ్చెనో పిన్నవయసువాఁడయిన యాయింద్రుఁడు మాకు సఖుఁడగునుగాక.

శ్రుతకక్షఋషి గాయత్రిఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ ౩ ౧
౧౨౮. మాన ఇంద్రాభ్యా౩ దిశ స్సూరో అక్తుష్వా యమత్। త్వాయుజా

౨ ౩ ౨
వనేమతత్॥

అంతటను ఆయుధములను బ్రసరింపఁజేయు రాక్షసుఁడు రాత్రులందు

మాకభిముఖుడై రాకుండుగాక. (ఒకవేళవచ్చితే) అపుడు ఆరక్షున్నునీసాహాయ్యముతో మేము చంపుదుముగాక.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౨ ౩౧౨ ౩౨౦ ౩౧౨ ౦ ౩౧౨ ౧౨౩ ౩ ౧౨
౧౨౯. ఏన్ద్రసానసిగ్ం రయిగ్ం సజిత్వానగ్ం సదాసహం। వర్షిష్ఠ మూతయే భరా॥

ఓయింద్రుండా ! మారక్షణముకొఱకు శత్రువుంజయింపందగినది, యెల్లపుడు శత్రువులం దిరస్కరించునది, విస్తారమయినది, యగు ధనమును మాకుం దెచ్చిపెట్టుము.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩౧ ౨ ౩౨౫ ౩౧౨ ౧ ౨ ౩౧౨
౧౩౦. ఇంద్రంవయం మహాధన ఇంద్రమర్భే హవామహే। యుజం వృత్రేషు
౩౧ ౨
వజ్రిణం॥

సహకారియు, శత్రువుల వధించుటకై వజ్రాయుధముకలవాండును, అగు నింద్రుని కర్మలు చేయునట్టి మేము అధిక ధనమునిమిత్తము స్వల్ప ధననిమిత్తము పిలుచుచున్నాము. (ప్రార్థించుచున్నామని తా॥)

విశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవతలు.

౧౨ ౩ ౧౨ ౩౧ ౨ర ౩౧ ౨ ౧౨ ౩ ౧౦ ౨
౧౩౧ అపిబత్కద్రువః సుతమింద్ర స్సహస్ర బాహ్వే। తత్రాదదిష్ట పౌగ్ంస్యం॥

ఇంద్రుండు కద్రుఋషి యభిషవించిన సోమమును ద్రావెను. సహస్రబాహువు అనేక శత్రువును సంహరించెను. ఆసమయమందింద్రుని పౌరుషము మిగులం బ్రకాశించెను.

వసిష్ఠఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౩౨. వయ మింద్ర త్వాయవోऽభిప్రనోను మో వృషన్। విద్ధీత్వా౩ స్య నోవసో॥

(కోర్కెలను) వర్షించునట్టియింద్రా! నిన్ను గోరిన మేము (అనఁగా వసిష్ఠులము) నిన్ను మిగుల స్తుతించుచున్నాము. నివాసముగలిగించు నింద్రా! (అనఁగా నింద్రసాహాయ్యము కాపురము నకాధారమని తా॥) యీమాస్తోత్రమును దెలిసికొమ్ము.

త్రిశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౩౩. ఆఘా యే అగ్నిమిన్ధతే స్తృణన్తి బర్హిరానుషక్। యేషా మింద్రో యువా సఖా॥

ఏఋషులగ్ని నభిముఖముగా దీపింపఁజేతురో, నిత్యయౌవనుఁడైన యింద్రుఁడేఋషులకు సఖుఁడో, వారు వరుసగా దర్భలను పరుచుచున్నారు.

త్రిశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౩౪. భిన్ధి విశ్వా అపద్విషః పరిబాధో జహీ మృధః। వసు స్పార్హం తదాభర॥

ఓయింద్రా! శత్రువులనందఱిని జీల్చివేయుము, హింసించునట్టి యుద్ధములను నీవు హింసించుము. రమ్యమైన ఆశత్రుధనమును మాకుఁ దెచ్చియిమ్ము.

ద్వితీయాధ్యాయ ద్వితీయఖండ సమాప్తి.

—:-O-:—

## ౨ అధ్యాయము,

## 3 ఖండము.

కణ్వపుత్రుడైన ఘోరఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3౧ ౨ 3 ౨ 3 ౧ ౧ 3 ౧ ౨ర ౧ ౨ర 3౧
౧౩౫. ఇహేవశృణ్వ ఏషాం కశా హస్తేషు యద్వదాన్। ని యామం చిత్రి
౨
మృఞ్జతే॥

ఈమరుత్తుల చేతులందుఁ గొరడాలు (పశువులను దోలునట్టి కమ్చీ) ఏ ధ్వనిని జేయుచున్నవో, ఆధ్వనిని యిక్కడనుండియే వినుచున్నాను. ఆధ్వని యుద్ధమందుఁ జిత్రమయిన శౌర్యమును అలంకరించుచున్నది.

త్రిశోకఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత.

3౧ ౨ 3 ౧ ౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౧౩౬. ఇమ ఉత్వా వి చక్షతే సఖాయ ఇన్ద్రసోమినః। పుష్టావన్తో యథాపశుం॥

ఓయింద్రా! సోమమభిషవించియున్న సఖులు అనఁగా మాఋత్విజులు పాశములను బట్టుకొన్నవారు, పశువును జూచునట్లు నిన్ను జూచుచున్నారు. (సాయంకాలమున దొడ్డిలోఁ గట్టుటకని తా॥)

కణ్వగోత్రుఁడగు వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత,

౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౧౩౭. సమస్య మన్యవే విశో విశ్వా నమన్త కృష్టయః। సముద్రాయేవ సిన్ధవః॥

కాపురములు చేయుచున్న ప్రజలందఱును ఈయింద్రునియొక్క క్రోధమునకు లేక స్తోత్రముకొఱకు నదులు సముద్రమునకు వశమగునట్లు వశులగుచున్నారు

కుసీదీకణ్వఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3 ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ర 3 ౨ ౧ ౨ 3 ౧ ౨
౧౩౮. దేవానామిదవో మహత్తదా వృణీమహే వయం। వృష్ణామస్మభ్య
3 ౧ ౨
మూతయే॥

ఓదేవతలారా! గొప్పదయిన మీపరిపాలనమేదికలదో, కోరికలను వర్షించు మీయొక్క పరిపాలనమును మేము మారక్షణమునకై పూర్తిగా సేవించుచున్నాము

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రిదేవత.

3 ౨ 3 ౦ ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౧౩౯. సోమానాగ్ స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే కక్షీవన్తం యఔశిజః

ఓబ్రహ్మణస్పతీ! నీవు సోమమును అభిషవించిన నన్ను (అనగా యాగ కర్తను) ఉశిజపుత్రుడగు కక్షీవంతుని జేసినట్లు దేవతలందు ప్రఖ్యాతునిం జేయుము.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౧౪౦. బోధన్మనా ఇదస్తునో వృత్రహా భూర్యా సుతిః శృణోతు శక్ర ఆశిషం॥

వృత్రునింజంపిన వాడు, ఎక్కువగా నభిషవించిన సోమముకలవాడు, కోర్కెల నెఱింగినవాడు, యుద్ధములో శత్రువులంజంప సమర్థుడగు నింద్రుడు మాస్తోత్రమును వినుంగాక,

శ్యావాశ్వఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ ౦
౧౪౧. అద్యనో దేవసవితః ప్రజావత్సావీగ్ సౌభగం। పరాదుష్వప్న్యగ్ సువ॥

ఓ సవితృదేవా ! (=సూర్య !) మాకు నీయాగదినమందుఁ బుత్రాదులతోఁ గూడిన ధనమును ఇమ్ము. దుస్స్వప్నమువలెఁ బీడించు దారిద్ర్యమును దూరముగాఁ బాఱఁదోలుము.

కాణ్వఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౮౨. క్వ3స్య వృషభో యువా తువిగ్రీవో అనానతః। బ్రహ్మాకస్తగ్ం
సపర్యతి॥

వర్షించువాఁడు, నిత్యయౌవనుఁడు, వృద్ధిఁజెందినమెడకలవాఁడు, ఒకరికి లొంగనివాఁడు, నగు నాయింద్రుఁడు ఎక్కడున్నాఁడు ? (ఎవరెఱుంగుదురు? అని తా ॥) ఏస్తుతికర్త యాతనిని స్తుతించును?

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౮3. ఉపహ్వరే గిరీణాగ్ం సంగమేచ నదీనాం। ధియావిప్రో అజాయత॥

పర్వతప్రాంతములందు, నదీసంగమములందుఁ, జేయఁబడిన స్తుతిచేత మేధావియగు నింద్రుఁడు పుట్టుచున్నాఁడు. (స్తుతినివిని వచ్చుచున్నాఁడని తా ॥)

ఇరిమిఠఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౮౪. ప్రసమ్రాజం చర్షణీనామిన్ద్రగ్ం స్తోతా నవ్యంగీర్భిః। నరం నృషాహం
మగ్ంహిష్ఠం॥

మనుష్యులలో బాగుగఁ బ్రకాశించువాఁడు, స్తుతివాక్కులతో స్తుతింప నర్హుఁడును, నాయకుఁడును, శత్రుమానవులం దిరస్కరించువాఁడును, మహాదాతయు, నగు నింద్రుని ఓస్తుతికర్తలారా ! బాగుగ స్తుతింపుఁడు.

ద్వితీయాధ్యాయ తృతీయఖండ సమాప్తి

—*|*—

## ౨ అధ్యాయము.

### ౪ ఖండము.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౨ ౩ ౨ ౩
౧౪౫. అపాదు శిప్ర్యంధసః సుదక్షస్య ప్రహోషిణః। ఇందో రిందో

౧ ౨
యవాశిరః॥

చక్కని దవుడలుకలవాఁడు లేక మంచితలపాగాఁగలవాఁడగు నింద్రుఁడు బాగుగా దేవతలనిమిత్తము హోమముచేయుచున్న సుదక్షుడను ఋషి సంపాదించిన ధాన్యపుఁబిండితోఁగలిపి పాకముచేసి పాత్రలందుఁ బోసినసోమరసాపాన్నమును బానము చేసెను.

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩౧ ౨
౧౪౬. ఇమా ఉత్వా పురువసోభిప్రనోనవు గిరః। గావో వత్సంన ధేనవః॥

బహుధనములు లేక యజ్ఞములు కలవాఁడా ! ఇంద్రా ! నిన్ను మావాక్కులు పాడిమొదవులు దూడను బ్రేమించునట్లు, బ్రేమించుచున్నవి (అనఁగా స్తుతించుచున్నవి.)

గోతమఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత,

౨ఉ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౧౪౭. అత్రా హ గోరమన్వత నామత్వష్టురపీచ్యం। ఇత్థా చంద్రమసోగృహే॥

గమనస్వభావుఁడైన యీచంద్రుని మండలమందే త్వష్టయొక్క (త్వష్ట యనునది పన్నిద్దఱు సూర్యులలో నొకనిపేరు.) రాత్రియందుఁగియున్న తేజస్సు ఈ విధముగాఁ దెలియఁబడుచున్నది. (సూర్యునందున్నపుడే సంజ్ఞకిరణములకుఁ గలదో ఆసంజ్ఞనే యుదకమయమయి స్వచ్ఛమయిన చంద్రబింబమందు రాత్రిప్రవేశించి పొందుచున్నదని; సూర్యుఁడే రాత్రింబవళ్లకుఁ గర్త యనియు దాత్పర్యము)

భరద్వాజఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౪౮. యదింద్రో అనయ ద్రితో మహీరపో వృష న్తమః। తత్ర పూషా
భువత్సచా॥

ఎపుడింద్రుఁడు మిగుల వర్షించుచు గమనించుచున్న గొప్ప వర్షోదకములను ఈలోకమునకుఁ దెచ్చెనో అప్పుడు అక్కడ పూషదేవుఁ డింద్రునకు సహాయుఁ డయ్యెను.

పూతదక్ష-లేక విందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౪౯. గౌర్ధయతి మరుతాగ్ శ్రవస్యుర్మాతా మఘోనాం। యుక్తావహ్నీ
రథానాం॥

ధనవంతులైన మరుత్తుల తల్లియగు (పృశ్నియను) గోవు (అనఁగా మధ్యమలోకవాక్కు = వర్షధ్వని) అన్నమును గోరుచున్నది, మరుత్తుల రథములను బూన్చుచున్నది, అంతటఁ బూజింపఁ బడుచున్నది, యగుచు సోమమును ద్రావుచున్నది. లేక తనపుత్రులను సోమమును ద్రావించుచున్నది.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౫౦. ఉపనోహరిభిః సుతం యాహి మదానాం పతే। ఉపనో హారిభిస్సుతం॥

సోమములకు స్వామియగు నింద్రా! యనేకాశ్వములతో, మాయజ్ఞమందు నభిషవించిన (= పిండిన) సోమమును (ద్రావుటకు) శీఘ్రముగ రమ్ము. (పునరుక్తి ఆదరము కొఱకు)

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩౧ ౨ర ౩౧ ౨ ౩౧౨ ౩ ౨ ౧ ౨ ౩౧
౧౪౧. ఇష్టాహోత్రా అసృక్షతేంద్రం వృధన్తో అధ్వరే। అచ్ఛావభృథ
౨ర
మోజసా॥

మాయజ్ఞమందు హవిస్సులతో నింద్రుని వృద్ధినొందించుచు, యాగము చేయుచు, నేఁడుగురు ఋత్విజులు సుత్యాభిషవమునుగూర్చి (అనఁగా యజ్ఞాంతి మందుఁ జేయు స్నానము) తమ తేజస్సుతోఁ గూడి, యింద్రునికై హోమము చేయుచున్నారు.

కణ్వగోత్రియగు వత్సఋషి=గాయత్రీఛంద—ఇంద్రదేవత.

౩ ౨ఉ ౩౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర
౧౪౨. అహమిద్ధి పితుష్పరి మేధామృతస్య జగ్రహ। అహగ్ం సూర్య ఇవాజని॥

పాలకుఁడైన, సత్యస్వరూపియయిన, యింద్రునియొక్క యనుగ్రహబుద్ధిని నేనే సంపాదించితిని. లేక తీసుకొంటిని. కనుక సూర్యునివలెఁ బ్రకాశించుచుఁ గనఁబడుచుంటిని,

శునశ్శేపఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౧౪౩. రేవతీర్నస్సధమాద ఇంద్రేసన్తు తువివాజాః। క్షుమన్తో యాభిర్మదేమ॥

అన్నము గోరుచున్న మేము ఏగోవులతో సంతసించుచున్నామో, ఇంద్రుం డుంగూడ మాతో మదించియుండఁగా మాకాగోవులు (క్షీరము = నేయి మొదలగు) సంపదకలవై మిగుల బలిసినవియు నగునుగాక.

శునశ్శేపఋషి లేక వామదేవుఁడు - గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౫౪. సోమః పూషాచ చేతతు ర్విశ్వాసాగ్ం సుక్షితీనాం। దేవత్రా రథ్యో
ర్హితా॥

దేవతలందు రథమున కర్హమగు సోమము లేక సోముఁడు, సూర్యుఁడును ప్రజలందఱిసంబంధమైన యింద్రునికొఱకుఁ జేయఁబడిన హవిస్సుల నెఱుంగుదురు.

ద్వితీయాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

౨ అధ్యాయము.

౫ ఖండము.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౫౫. పాన్తమావో అన్ధస ఇంద్రమభి ప్రగాయత। విశ్వాసాహగ్ం శతక్రతుం
మగ్ంహిష్ఠం చర్షణీనాం॥

ఓఋత్విజులారా! మీరు సోమరూపమయిన యన్నమును ద్రావుచున్నట్టి, సర్వశత్రువులను దిరస్కరించునట్టి, బహువిధ ప్రజ్ఞలుగలట్టి, ధనము నిచ్చునట్టి యింద్రుని స్తుతింపుఁడు.

వశిష్ఠఋషి-గాయత్రీఛం ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨3 ౧ ౨ ౧ ౨ 3
౧౪౬. ప్రవయింద్రాయ మాదనగ్ం హర్యశ్వాయ గాయత। సఖాయ సోమ
౧ ౨
పావ్నే॥

ఓస్నేహితులారా ! హరియను పేర్లుగల గుఱ్ఱములు కలవాఁడు, సోమపానము చేయువాఁడు నగు నింద్రునకు మదముకలిగించు స్తోత్రమును గానము చేయుఁడు.

మేధాతిథిఋషి ప్రియమేధుఁడును-గాయత్రీఛం-ఇంద్రదేవత

3 ౧ ౨ 3౧౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ 3౧౨
౧౪౭. వయ ముత్వా తదిదర్థా ఇంద్రత్వాయన్త స్సఖాయః। కణ్వా ఉక్థేభి
ర్జరన్తే॥

ఓయింద్రా! నిన్ను గోరుచున్న స్నేహితులమగు మేము నీవే ప్రయోజనము కలవారమై నిన్ను స్తుతించుచున్నాము. కణ్వగోత్రమందుఁ బుట్టిన మాపిల్లలుం గూడ స్తుతింతురు.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3౧౨ 3౧ ౨ 3 ౧౨
౧౪౮. ఇంద్రా యమద్వ నేసుతం పరిష్టోభన్తు నోగిరః। అర్కమర్చన్తు కారవః॥

మదించు స్వభావముకలట్టి యింద్రునికొఱకు నభిషవించిన సోమమును మా స్తుతివాక్యలు స్తుతించుచుగాక. స్తుతికర్తలు పూజనీయమైన సోమమును బూజింత్రుగాక.

ఇరిమిఠ ఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత॥

3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3౧ ౨ ౧ ౨3 ౨ఉ 3౧౧౨
౧౪౯. ఆయాన్త ఇంద్ర సోమాని పూతో అధి బర్హిషి। ఏహీమస్య ద్రవాపిబ॥

ఓయింద్రా ! నీకొఱకు ఇదిగో ! సోమము వేదియందుఁ బరిచిన దర్భలందు బాగుగా దశాపవిత్రముతో శుద్ధిచేయంబడినది. ఇపుడాసోమమునుగురించి రమ్ము. సోమమెచట హోమము చేయఁబడుచున్నదో, యచ్చటికిఁ బరువెత్తి త్రావుము.

మధుచ్ఛందఋషి-గాయత్రి-ఇంద్ర॥

౧౬౦. సురూప కృత్ను మూతయే సుదుఘా మివ గోదుహే। జుహూమసిద్యవిద్యవి॥

మంచిరూపముతోఁగూడిన కర్మనుజేయు నింద్రుని మమ్ము రక్షించుకొఱకుఁ బ్రతిదినమును బాగుగాఁ బాలిచ్చుగోవును పాలు పిదుకుకొనుటకు నభిముఖముగాఁ బిలుచునట్లు పిలుచుచున్నాము. (స్తుతించుచున్నామని తా॥)

త్రిశోకఋషి-గాయత్రిఛంద-ఇంద్రదేవత॥

౧౬౧. అభిత్వా వృషభా సుతే సుతగ్ం సృజామిపీతయే। తృమ్పా వ్యశ్నుహీ మదం

(కోర్కెలను) వర్షించునింద్రా ! సోమమభిషింపఁబడినదై యుండఁగా ఆ సోమమును త్రావుటకు నీకర్పించుచున్నాను. తృప్తిని గలిగించునట్టి, మదము కలిగించునట్టి, సోమమునుగూడ గ్రహింపుము. (దీసికొమ్మని తా॥)

కుసీదఋషి-గాయత్రిఛం-ఇంద్రదేవత॥

౧౬౨. య ఇంద్ర చమ సేష్వా సోమశ్చ మూషు తేసుతః। పిబేదస్య త్వమీశిషే॥

ఓయింద్రా ! నీనిమిత్తమై యభిషవించిన యేసోమము పాత్రలందు సర్వత్ర కలదో, ఆయాసోమమును నీవే త్రావుము. ఓయింద్రా ! దానికి నీవధిపతివికదా ! (కనుక త్రావుమని యన్వయము.)

శునశ్శేపఋషి-గాయత్రి-ఇంద్ర॥

౧౬౩. యోగే యోగే తవస్తరం వాజే వాజే హవామహే। సఖాయ ఇన్ద్ర మూతయే॥

ప్రతికర్మ ప్రారంభమందును, గర్మ విఘ్నము చేయు (రాక్షసుల యుద్ధమందు) మిగుల బలవంతుఁడగు నింద్రుని మా రక్షణము కొఱకు ఫలకాంక్షవంతు ప్రియులమయిన మేము పిలుచుచున్నాము. (స్తుతించుచున్నామని తా॥)

మధుచ్ఛందఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత॥

౧౬౪. ఆ త్వేతా నిషీదతేన్ద్ర మభి ప్రగాయత। సఖాయస్తోమ వాహసః॥

ఓ స్నేహితులైన ఋత్విజులారా! శీఘ్రముగా నీకర్మవిషయమై రండు. వచ్చి కూర్చుండుడు. (త్రివృత్-పంచదశ-మొదలగు) స్తోమములను (=స్తుతులను) వహించుచు (అనఁగా బఠించుచు) అన్నివిధముల నింద్రుని స్తుతిగానము చేయుఁడు.

ద్వితీయాధ్యాయ పంచమఖండము పూర్ణము.

—:-O-:—

౨ అధ్యాయము.

౬ ఖండము.

విశ్వామిత్రఋషి-గాయత్రిఛంద-ఇంద్రదేవత॥

౧౬౫. ఇదగ్ హ్యన్వోజసా సుతగ్ం రాధానాం పతే। పిబా త్వా౩స్య గిర్వణః॥

ధనములకు స్వామివై, మంత్రములతోఁ స్తుతింపఁదగిన యింద్రా! బలముతోఁ

గూడినవాఁడవగుము. నీవు ఈవరుసగా [illegible] బిలువఁబడితివి. యీసోమ మును శీఘ్రముగాఁ బానము చేయుము.

మధుచ్ఛందఋషి-గాయత్రీ ఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ర 3౧౨ 3 3 ౧ ౨ర 3 ౧
౧౬౬. మహాఀం ఇంద్రః పరశ్చ నో మహిత్వమస్తు వజ్రిణే। ద్యౌర్న ప్రథినా
౨ర
శవః॥

ఈమాయింద్రుఁడు (శరీరముచేత) గొప్పవాఁడు. గుణములచేతనుగూడ నధికుఁడు. వజ్రాయుధధారియగు నీయింద్రుని గొప్పతనము ఎల్లప్పుడు నుండుఁగాక. ఇంద్రుని బలము ద్యులోకమంత విస్తారమగుఁగాక.

కుసీదుఁడగు కణ్వఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర 3 ౧౨ 3 ౨ 3 ౧ ౨ర 3
౧౬౭. ఆతున ఇంద్ర క్షుమంతం చిత్రం గ్రాభం సంగృభాయ॥ మహా
౧ ౨ర
హస్తీ దక్షిణేన॥

ఓయింద్రా ! గొప్ప బాహువులుగల నీవు వెంటనే మాకిచ్చుటకై మెచ్చందగిన, సంపాదింపఁదగిన, పుచ్చుకొనఁదగిన, ధనమును కుడిచేతిలోఁ బట్టుకొనుము.

ప్రియమేధర్షి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3౧ ౨ర 3౧ ౨ 3 ౧ ౨ 3 3 ౨ 3౨ 3 ౧౨
౧౬౮. అభిప్రగోపతిం గిరేంద్రమర్చ యథావిదే। సూనుం సత్యస్య సత్పతిం॥

సత్పురుషులయిన యజమానులను బాలించువాఁడు, యజ్ఞమునకుఁ బుత్రుడు, గోవులకు స్వామియగు నింద్రుని ఆతఁడు తెలిసికొనునట్లు గట్టిగా స్తుతిమంత్రములతోఁ బ్రార్థింపుఁడు. (యజ్ఞమారంభించినారు. నన్ను బిలుచుచున్నారు. అని ఇంద్రుఁడు తెలిసికొనునట్లని తా ॥ )

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౬౯. కయానశ్చిత్ర ఆ భువదూతీ సదావృధస్సఖా। కయాశచిష్ఠ యావృతా॥

సర్వదా వృద్ధినొందుచున్న సంపాదింపఁదగిన స్నేహితుఁడై యున్న యింద్రుఁడు ఏకర్మచేసి తృప్తిపఱచితే మాకభిముఖుఁడగునో? ప్రజ్ఞతో నాచరించిన యేకర్మతో మాకభిముఖుఁడగునో?

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద ఇంద్రదేవత.

౧౭౦. త్యమువస్సత్రాసాహం విశ్వాసు గీర్ష్వాయతం। ఆచ్యావయ స్యూతయే॥

(యజమానుఁడు స్తుతికర్తతో ననుచున్నాఁడు.) ఓస్తుతికర్తా! పలువుర నోడించువాఁడు, మీయందఱ స్తోత్రములందు విస్తరించినవాఁడు, నగు నాయింద్రునే మనరక్షణముకొఱకు స్తుతులతో యాగాభిముఖునింగాఁ జేయుము.

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౭౧. సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యం। సనిం మేధా మయాసిషం॥

ఆశ్చర్యకరుఁడైనవాఁడు, యింద్రునకు ప్రియుఁడు, సుందరుఁడు, ధనదాత యగు సదసస్పతియను దేవతను ధారణబుద్ధిని బొందుటకు నాశ్రయించితిని.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౭౨. యేతే పన్థా అధో దివో యేభిర్వ్యశ్వ మైరయః। ఉత శ్రోషన్తు నో భువః॥

ఓయింద్రా ! ద్యులోకము క్రిందభాగమున నేమార్గములుకలవో, యేమార్గములతోఁ బ్రపంచమునంతటిని బొందితివో, యామార్గములు యజమానులచేత స్తుతింపఁబడుఁగాక. మఱియు మానివాసస్థానములను నీయనుగ్రహముచేత దేవతలు లేకప్రజలు విందురుగాక. అనఁగా మేము పరిసిద్ధులమవుదుమని)

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧
౧౭౩. భద్రం భద్రం న ఆ భరేష మూర్జగ్ం శతక్రతో। యదింద్ర మృడ
౨
యాసినః॥

పలువిధకర్మలొనరించు నింద్రా ! యత్యంత సుఖమును గలిగించు ధనమును మాకొఱకుఁ దెచ్చియిమ్ము. అట్లే యన్నరసమును లేక బలముకల యన్నమును ఇమ్ము. మమ్మునఁగాని సుఖంపఁజేసితివా (ధనమునిమ్మని పూర్వాన్వయము)

బిందుఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర 3౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౧౭౪. అస్తిసోమో అయగ్ం సుతః పిబన్త్యస్య మరుతః। ఉతస్వరాజో
3౧ ౨
అశ్వినా॥

ఈమొదటనున్న సోమము మరుత్తులకొఱకై యభిషవించి యుంచఁబడినది. కనుక నీసోమమును స్వయంప్రకాశముకల మరుత్తులు ప్రాతఃకాలమందుఁ బానము చేయుచున్నారు. అశ్వినీదేవతలుగూడఁ ద్రావుచున్నారు.

ద్వితీయాధ్యాయ షష్ఠఖండము పూర్ణము.

——:o:——

## ౨ అధ్యాయము.

### ౭ ఖండము.

(ఇంద్రమాతలగు) దేవజాములు ఋషులు-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౭౫. ఈఙ్ఖయన్తీ రపస్యువ ఇంద్రం జాతముపాసతే। వన్వానాస స్సువీర్యం॥

(ఇంద్రునిం) జేరుచున్నట్టి కర్మలను, దమకుం గోరుచున్నట్టి ఇంద్రమాతలు అవి ర్భూతుండైన యాయింద్రుని సేవించుచున్నారు. మంచి వీర్యముగల ధనమును గోరుచున్నారు.

గోధాఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత,

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౧౭౬. నకి దేవా ఇనీ మసి నక్యా యోప యామసి। మన్త్ర శ్రుత్యం చరామసి॥

ఓయింద్రాదిదేవతలారా ! మీవిషయమై దేనిని హింసింపము. మోహింపనుం జేయుము. (కర్మలు తప్పుగాం జేసుకొని, చేయక కాని, దేనిని మోసపుచ్చము) మంత్రముతో స్మరింపందగినట్టి, మీవిషయమగు కర్మను ఆచరించుచున్నాము. (=చేయుచున్నాము.)

దధ్యఙ్ఙాథర్వణఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧
౧౭౭. దోషో ఆగా ద్బృహద్గాయ ద్యుమద్గామన్నాథర్వణ। స్తుహిదేవ

౨ ౩ ౧ ౨
గంసవితారం॥

బృహత్తు అనెడు సామమును గానము చేయువాఁడా ! దీపించుగమనముకలవాఁడా ! అథర్వణఋషిపుత్రా ! (తన్నుతానే పలుకునట్టిమాటలు) (ఋత్విగ్యజమానుల పొరపాటువల్ల) దోషము ఏదైనగలిగెనేని దానింబోగొట్టుటకు సవితృదేవుని (=సూర్యుడే) స్తుతింపుము. దీప్తిమంతమైన యితర స్తోత్రముంగూడ గానము చేయుము.

ప్రస్కణ్వఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత.

౧౭౮. ఏషో ఉషా అపూర్వ్యా వ్యుచ్ఛతి ప్రియా దివః స్తుషే వా మశ్వినా బృహత్ ॥

ఈకనంబడుచున్నట్టి, యందఱికిని ప్రియమగునట్టి, పూర్వకాలమందు లేనట్టి (అనఁగా నిపుడేకలిగినదని తా ॥) ఉషోదేవత (అనఁగాఁ దెల్లవాఱుకాలమని తా ॥) ద్యులోకమునుండివచ్చి చీఁకటెనిఁబోఁగొట్టుచున్నది. ఓయశ్వినీదేవతలారా ! మిమ్ము విస్తారముగా స్తుతించుచున్నాను.

గోతమఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౭౯. ఇన్ద్రో దధీచో అస్థభిర్వృత్రాణ్యప్రతి ష్కుతః। జఘాన నవతీ ర్నవ॥

ఇతరు లెదిరింప శక్యముకాని యింద్రుఁడు అథర్వణఋషి పుత్త్రుఁడైన దధీచఋషి యొక్క-యెముకలతోఁ దొమ్మిది తొంబదుల యసురసమూహములను (౯ × ౯౦ = ౮౧౦) సంహారించెను. దధీచుఁడు బ్రతికియున్నపుడతనింజూచి యసురులు ఆతనికి లొంగిపోయిరట ! అతఁడు కొన్నాళ్లకు స్వర్గస్థుఁడయ్యె. అసురులు మరల భూమి నావరించినారు. వారితో నింద్రుఁడు యుద్ధము చేయలేక "దధీచుని అవయవము లేవయిన మిగిలి యున్నవా" యని నచటివారినడిగెను. ఆతని అశ్వముఖమున్న దని వారుచెప్పిరి (ఆముఖముతోనే అశ్వినీదేవతలకుమధువిద్య నతఁడుపదేశించెను) అది కురుక్షేత్రముపద్ద నున్నసరస్సులో దొరికినది. దానినే అనేకాయుధములుగా నొనర్చి యింద్రుఁడసురుల జయించెనని కథ.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ఉ3 ౧ ౨ర 3 ౧౨ 3౧౨ 3 ౧ ౨ 3౧ ౨ర
౧౮౦. ఇం ద్రేహి మత్స్యంధసో విశ్వేభి స్సోమపర్వభిః॥ మహాఁ౧ం అభిష్టిరోజసా॥

ఓయింద్రా! ఈకర్మవద్దకు రమ్ము (వచ్చి)సోమరసరూపమయిన యన్నము లన్నింటితోను మదించుము. (తృప్తినొందుమని తా॥) (తర్వాత) బలముతో గొప్పవాఁడవై శత్రువులందిరస్కరింపుము.

వామదేవఋషి- గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౧౮౧. ఆతూన ఇన్ద్ర వృత్రహ న్నస్మాక మర్ధమాగహి। మహాన్మహీభి
3 ౧ ౨
రూతిభిః॥

శత్రుహింసకుఁడవగునింద్రా ! నీవు మావద్దకు శీఘ్రముగారమ్ము. గొప్పవాఁడవగు నీవు గొప్పవయిన రక్షణములతోఁగూడ మాసమీపమునకు రమ్ము.

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨3 ౧౨ 3౨ఉ 3౧౨ ౨ 3౧ ౨ 3 ౧౨
౧౮౨. ఓజ స్తదస్య తిత్విష ఉభే యత్సమవ ర్తయత్। ఇంద్రశ్చ ర్మేవరోదసీ॥

ఈయింద్రుని బలము ప్రకాశించినది. ఏబలముతో నీయింద్రుఁడు ద్యులోకభూలోకముల రెంటిని చర్మమును వలెను వాడుకొనెను. (అనఁగాఁ జన్మము తన వద్దనున్నపుడు నగుడు ఒకప్పుడు విప్పి పరచుకొనును. ఒకపుడు చుట్టియుంచును. అనఁగా దనయిష్టానుసారము వాడుకొనునని తా॥ )

శునశ్శేపఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ 3 3౧౨ ౨ ౨ ౨3 ౧ ౨
౧౮౩. అయము తే సమతసి కపోత ఇవగర్భధిం। వచ స్తచ్చిన్న ఓహసే॥

ఓ యింద్రుండా! యీ కనంబడుచున్న సోమము నీకొఱకుఁగా సంపాదింపఁబడెను. గర్భమును ధరించుకొను నాడపావురమును మగపావురము సమీపించునట్లు ఏ సోమమును నీవుసమీపింతువో (ఆసోమమని వెనుకకన్వయము.)

వాతాయన ఉల్లఋషి-గాయత్రీఛం-ఇంద్రదేవత.

౧౮౪. వాత ఆ వాతు భేషజగ్ం శమ్భు మయోభు నోహృదే। ప్రన ఆయూగ్ంషి తారిషత్॥

వాయువు మాహృదయమునకు రోగములను శమింపఁజేయునట్టి, సుఖముంగలిగించునట్టి, యౌషధమును లేక ఉదకమును నిచ్చుఁగాక. మఱియు మాఆయుర్దాయములను వృద్ధినొందించుంగాక.

ఇట్లు ద్వితీయాధ్యాయ సప్తమఖండము సంపూర్ణము.

—*—

౨ అధ్యాయము,

౮ ఖండము.

కణ్వఋషి- గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౮౫. యగ్ం రక్షన్తి ప్రచేతసో వరుణో మిత్రో అర్యమా! నకిస్సదభ్యతే జనః॥

ఉత్తమజ్ఞానముగల వరుణుడు మిత్రుండు అర్యముండు ననుదేవతలు ఏయజ

మానుని రక్షింతురో ఆయజమానుఁడు ఎవనిచేతను హింసింపఁబడఁడు.

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

 ౩ ౨ఉ  ౩  ౧ ౨  ౩ ౨ ౩ ౧  ౨ర౩ ౨  ౩  ౨ ౩౧  ౨
౧౫౬. గవ్యో షు ణో యథా పురాశ్వయోత రథయా। వరివస్యామహోనాం॥

ఓ యింద్రా! (మాయాగములందు గోవులను మాకివ్వఁదలఁచి పూర్వము ఎట్లు వచ్చితివో అట్లే) మాకుగోవుల నీఁదలఁచి రమ్ము. మఱియు గుఱ్ఱముల నీఁదలఁచియు రథముల నివ్వఁదలఁచియుంగూడ రమ్ము. అధికధనముల నివ్వఁదలఁచి రమ్ము.

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

 ౩౧ ౨  ౩ ౧ ౨  ౩ ౧ ౨  ౩౧ ౨ ౩ ౨౩ ౧ ౨
౧౫౭. ఇమాస్త ఇంద్ర పృశ్నయో ఘృతందుహత ఆశిరం। ఏనామృతస్య
 ౩ ౧ ౨
 పిప్యుషీః॥

ఓ యింద్రుఁడా! యజ్ఞమును వృద్ధిపొందించునట్టి యీనీగోవులు కారుచుండు పాలను (సోమముతోఁగలుపందగుపాలు ఆశిరమనఁబడును) పూరించుచున్నవి. (అనఁగానిచ్చుచున్నవని తా॥)

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

 ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౧ ౨ర ౩
౧౫౮. అయాధి యాచ గవ్యయా పురుణామన్ పురుష్టుత। యత్సోమే సోమ
 ౧ ౨
 ఆ భువః॥

అనేకనామములుకలిగి పలువురచే స్తుతింపఁబడువాఁడా! యింద్రా! నాసకల సోమములను (పానముచేయుటకు) నీవుఎప్పుడు వచ్చితివో, యప్పుడు మేము గోవులనుగోరెడుతలంపుతో నుందుముగాక.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3 ౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౧౮౯. పావకాన స్సరస్వతీ వాజేభిర్వాజినీ వతీ। యజ్ఞం వష్టుధియావసుః॥

పవిత్రముచేయునది, అన్నముగలది, కర్మలచే ధనముబొందినది, యగుసరస్వతి హవిస్సులనెడు నన్నముల నిమిత్తము మాయజ్ఞమునుగోరి దానిని సంపూర్ణము చేయుఁగాక.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౧ ౨ ౨ 3 ౨ 3 ౧
౧౯౦. క ఇమం నాహుషీష్వా ఇన్ద్రగ్ం సోమస్య తర్పయాత్। సనో వసూన్యా
౨
భరాత్॥

ప్రజలయందు నెవఁడీయింద్రుని సోమముతోఁదృప్తినొందింపఁగలఁడు? (అప నిశక్యముకాదని తా॥) ఆయింద్రుఁడు (యజ్ఞమందుఁదృప్తుఁడయి) ధనములను దెచ్చి యిచ్చుఁగాక.

ఇరిమిఠఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౨ఉ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ ౨క 3 ౧
౧౯౧. ఆయాహి సుషుమా హి త ఇంద్రసోమం పిబా ఇమం। ఏ దం బర్హిః
౨ 3 ౧ ౨
సదో మమ॥

ఓ యింద్రా! నీవురమ్ము. మేము సోమమునభిషించిన వారమయియున్నాముకదా! యీయభిషవించిన సోమమును ద్రావుము. నీవు (కూర్చొనుటకు వేదియందు) ఈదర్భ పరువంబడినది. దానిమీఁదఁ గూరుచుండుము.

( వరుణపుత్ర ) సత్యధృతిఋషి-గాయత్రీఛంద-ఇంద్రిదేవత.

౧౯౨. మహిత్రీ ణామవ రస్తు ద్యుక్షం మిత్రిస్యార్యమ్ణః। దురాధర్ష వరుణస్య

మిత్రుఁడు అర్యముఁడు వరుణుఁడను ముఫ్వురిగొక్క, యితరులెదిరింప శక్యముగాని గొప్పనై దీపించురక్షణము మాకుఁగలుగుఁగాక.

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౯౩. త్వావతఃపురు వసో వయమింద్రిప్రిణేతః। స్మసిస్థాత ర్హ్వాణాం॥

బహుధనముకల్గి కర్మలను సంపూర్ణములఁజేయు నింద్రా! మేము నీవంటి వాని సేవకులముఅగుచున్నాము. (అనఁగా నింద్రసముఁడితరుఁడు లేడు గనుక నీవంటియని ఉత్కృష్టము)

ద్వితీయాధ్యాయమున అష్టమఖండము సంపూర్ణము.

—*।*—

౨ అధ్యాయము.

౯ ఖండము.

ప్రగాథఋషి-గాయత్రిఛంద-ఇంద్రిదేవత.

౧౯౪. ఉత్వామదన్తు సోమాఃకృణుష్వ రాధో అద్రివః। అవబ్రహ్మద్విషోజహి॥

ఓయింద్రా! సోమములు నిన్ను మదింపఁజేయుఁగాక. వజ్రాయుధధారీ! నీవుమాకు ధనమునిమ్ము. బ్రహ్మద్వేషులను జంపుము.

విశ్వామిత్రఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩
౧౯౫. గిర్వణఃపాహి నస్సుతం మధోర్ధారాభి రజ్యసే। ఇంద్రత్వా దాత
౧ ౨ర
మిద్యశః॥

స్తుతివాక్కులతో వశమగునట్టి యింద్రా! అభిషవించిన యీమాసోమమును పానముచేయుము. ఏమంటే—నీవుసోమముయొక్క-ధారలచేత స్నానము చేయుదువు. ఇంద్రా! నీచేతశుద్ధిచేయంబడినట్టి యన్నమేమాకుంగలదు.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ఉ
౧౯౬. సదావ ఇంద్రశ్చర్కృషదా ఉపోను స స పర్యన్। నః దేవో వృతః
౩ ౧ ౨
శూర ఇన్ద్రః॥

ఓఋత్విగ్యజమానులారా! యింద్రుఁడు ఎల్లపుడుమిమ్ము (యజ్ఞానుష్ఠానము) చేయఁగోరుచున్నాఁడు. మీసమీపమంటే మాటిమాటికిఁ బ్రార్థింపఁబడుచున్నాఁడు. మేముప్రార్థించిన దేవుఁడయిన యింద్రుఁడు శూరుఁడు.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౩ ౧ ౨ ౨ఉ ౩ ౧ ౨
౧౯౭. ఆత్వావిశన్త్విందవః సముద్రమివ సిన్ధవః। న త్వామిన్ద్రాతిరిచ్యతే॥

ఓయింద్రా! మేమిచ్చుచున్న సోమములు, నదులు సముద్రమును జేరునట్లు నిన్ను జేరుచున్నవి. కనుక నోయింద్రా! (యేదేవుఁడును ధనముచేతనుగాని బలముచేతనుగాని) నిన్నుమించలేఁడు.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత,

౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨
౧౯౮. ఇన్ద్రమిద్గాథినో బృహదిన్ద్ర మర్కేభి రర్కిణః। ఇన్ద్రం వాణీరనూషత॥

సామమును గానముచేయుచున్న ఉద్గాతలు ఇంద్రుని బృహత్సామము చేత స్తుతించుచున్నారు. స్తుతిమంత్రములతోఁగూడిన హోతలు (ఋగ్వేదపాఠకులు) మంత్రములతో స్తుతించుచున్నారు. మిగిలినయధ్వర్యులు (అనఁగాయజుర్వేద పాఠకులు) వాక్కులతో నింద్రుని స్తుతించుచున్నారు.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧౨ 3౧౨ 3౧౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨
౧౯౯. ఇన్ద్ర ఇషేదదాతు న ఋభుక్షణ మృభుగ్ంరయిం। వాజీ దదాతు
3౧౨
వాజినం॥

ఇంద్రుఁడు ఋభుక్షుఁడనెడు దేవుని ధనదాతయగు ఋభుదేవునింగాని మా యన్నముకొఱకు నిచ్చుఁగాక. (వీరు సోమపానము చేత మనుష్యత్వము పోయి దేవత్వముపొందినారు.) బలవంతుఁడయిన యింద్రుఁడు మాయన్న లాభమునకై వాజియనువానినిచ్చుఁగాక. (వీరుముగ్గురన్నదమ్ములు-వాజి-ఋభుక్షు-ఋభు)

గృత్సమదఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3౧ 3 ౨ 3 ౨ 3౧ ౨ర ౨ఉ 3౧ ర
౨౦౦. ఇన్ద్రో అఙ్గ మహద్భయ మభీష దప చుచ్యవత్। స హిస్థిరో విచర్షణిః॥

ఇంద్రుఁడు గొప్పభయమును శీఘ్రముగాఁద్రోసివేయును. వెంటఁదరుమును. ఏమంటే—అతఁడెవ్వరిచేతను గదలింపశక్యముగానివాఁడు.

భరద్వాజఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 3 ౨ఉ 3౧౨
౨౦౧. ఇమా ఉత్వా సుతేసుతే నక్షన్తే గిర్వణో గిరః। గావోవత్సం న ధేనవః

స్తుతిమంత్రములకు వశమయినయింద్రా! సోమాభిషవముచేసి నపుడెల్లను ఈ మాస్తుతివాక్కులు, పాలిచ్చునావులు దూడనుజేరునట్లు, నిన్నుజేరుచున్నవి.

భరద్వాజఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨౩
౨౦౨, ఇంద్రానుపూషణా వయగ్ం సఖ్యాయ స్వస్తయే। హువేమ
౧ ౨
వాజసాతయే॥

ఇంద్రదేవుని, పూషదేవుని, ఇపుడు సఖ్యముకొఱకును, సుఖముకొఱకును, అన్నమిచ్చుటకును, ప్రార్థించుచున్నాము.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ ౩ ౨ఉ ౩ ౨
౨౦౩. నకి ఇన్ద్ర త్వదుత్తరం నజ్యాయో అస్తి వృత్రహన్॥ నక్యేవం యథాత్వం।

వృత్రునిజంపిన యింద్రా! నీకంటెగొప్పవాఁడులేడు. పెద్దవాఁడు (వయసులో) లేడు. నీవులోకములోనెట్లు ప్రసిద్ధుఁడవో అట్లువాఁడులేడు.

ద్వితీయాధ్యాయమున నవమఖండము సమాప్తము.

——:o:——

౨ అధ్యాయము,

౧౦ ఖండము.

త్రిశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౨౦౪. తరణింవో జనానాం త్రదంవాజస్య గోమతః। సమానముప్రశగ్ంసిషం॥

ఓమావారలారా! మీపుత్రపౌత్రాదులను దరింపఁజేయునట్టి, పశువులతోఁగూడిన యన్నమునుఇచ్చునట్టి, యింద్రుని అందఱివలెనే నేనునుస్తుతించుచున్నాను.

మధుచ్ఛందఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౦౫. అసృగ్రమింద్రతే గిరః ప్రతిత్వా ముదహాసత। సజోషావృషభం పతిం॥

ఓయింద్రా ! నీస్తుతిమంత్రములను సృజించితిని. ఆస్తుతులు స్వర్గమందున్న వర్షమును గురియించునట్టి, పాలకుఁడవగునట్టి, నిన్ను జెందినవి, వానిని నీవు సేవించితివి.

వత్సఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౦౬. సునీథోఘా సమర్త్యో యంమరుతోయమర్యమా। మిత్రాస్పాన్త్యద్రుహః॥

ఏయజమానుని ద్రోహవర్జితులైన మరుత్తులు (=దేవతలని యిచటనర్థము.) పాలించుచున్నారో, అర్యముఁడెవ్వని రక్షించునో, మిత్రుఁడెవ్వనిం బాలించునో, ఆయజమానుఁడు మంచియజ్ఞములు కలవాఁడగుచున్నాఁడు.

విశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౦౭. యద్వీడావింద్ర యత్స్థిరే యత్పర్శానే పరాభృతం। వసుస్పార్హం తదాభర॥

ఓయింద్రా ! దృఢమైన (అనఁగా నీవును ఇతరులును గదలుప శక్యముగానట్టి పురుషునందని తా॥) సంపాదించియుంచఁబడినట్టి, స్థిరుఁడైనపురుషునందునేది సంపాదింపఁబడినదో, విమర్శలేని పురుషునందేది సంపాదించియుంచఁబడినదో, కోరఁదగిన ఆధనముమాకుఁదెచ్చియిమ్ము.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత

౨౦౮. శ్రుతంవో వృత్రహన్తమం ప్రశర్ధం చర్షణీనాం। ఆశిషే రాధసే మహే॥

ప్రసిద్ధుఁడును, వేగముకలవాఁడును, వృత్రునిగట్టిగాఁ గొట్టినవాఁడును, అగు

నింద్రుని మానవులైనమీకు గొప్పధనమిచ్చుటకై స్తుతులతోఁ బ్రీతునింజేసి యిచ్చుచున్నాను. (అనిస్తుతికర్త వాక్యము.)

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩
౨౦౯. అరం త ఇన్ద్ర శ్రవసే గమేవ శూరత్వావతః। అరగ్ం శక్ర
౧ ౨
పరేమణి॥

మేముఁ దవగునింద్రా! నీకీర్తి నివినుటకు సంపూర్తిగాఁ బ్రవర్తింతుము. ఓశక్తివంతుఁడా! నీసమానుఁడగు నితరదేవత మహత్వమును, కీర్తినిగూర్చి సంపూర్తిగావినుటకుఁ బ్రవర్తింతుము (అనఁగా బాగుగాస్తుతింతుమని తా॥)

విశ్వామిత్రఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౨౧౦. ధానావన్తం కరమ్భిణ మపూపవన్త ముక్థినం। ఇన్ద్రం ప్రాతర్జుషస్వనః॥

(యజమానుని వాక్యము) ఓయింద్రా! పేలాలుగలది, కరమ్భముతోఁ గూడినది (కరంభ=పెరుగుతోఁ గలిపిన సత్తుపిండిముద్ద) పురోడాశము (=ఒకవిధమయిన అట్టు)తోఁ గూడినది, స్తోత్రములతోఁ గూడినది యగు నీ మాసోమమును బ్రాతస్సవన కర్మయందు అనుభవింపుము.

గోషూక్తి, అశ్వసూక్తి ఋషులు-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౨౧౧. అపాం ఫేనేన నముచేః శిర ఇన్ద్రోదవర్తయః। విశ్వాయదజయస్పృధః॥

ఓ యింద్రుఁడా! నీవు నీటినురుగు (నీటిమీఁద దేలిన నురుగు వజ్రముగాఁ జేసి) తో నముచియను రాక్షసుని శిరస్సును ఛేదించితివి. ఎపుడు అసుర సేనల నన్నిఁటిని జయించితివో (అపుడు అని తా॥) (నముచి యను రాక్షసునితోఁ బలు

సార్లు యుద్ధముచేసి, వీఁగిపోయినవానిచేఁ బట్టుపడెనట! అపుడు వాఁడు ఇంద్రునిం జూచి "ఆయుధముతోఁ జంపను. రాత్రియందును బగటియందును జంపను" అని యంటివా నిన్ను వదలెదననెనఁట! అందుకుఒప్పుకొని యింద్రుఁడు ఆయుధము కానినురుగుతో సంధ్యాకాలమందుఁ జంపెనఁట! సంధ్య రాత్రియుంగాదు పగలునుగాదు కనుక.)

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్ర దేవత.

౩౧ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧౨
౨౧౨. ఇమేత ఇంద్రసోమాః సుతాసో యేచ సోత్వాః। తేషాంమత్స్వ ప్రభూవసో॥

ఓ యింద్రా! నీకొఱకు ఈయెనుటను సోమములు అభిషవింపఁబడి యుంచఁబడెను. ఇంక మఱికొన్ని యభిషవింపఁబడును. విశేషధనవంతుఁడా! ఆ యభిషవించినసోమములతో నీవుమదింపుము.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౨౧౩. తుభ్యగ్ం సుతాసః సోమాః స్తీర్ణంబర్హి ర్విభావసో। స్తోతృభ్య ఇన్ద్రమృడయ॥

దీపించు ధనముకలయింద్రా! నీకొఱకు అభిషవించిన సోమములు కలవు. దర్భలు పఱువఁబడినవి. కనుకనింద్రా! దర్భలమీఁదఁగూర్చొని, సోమముత్రావి, స్తుతికర్తలమగు మమ్ముసుఖింపఁజేయుము.

ద్వితీయధ్యాయమున దశమఖండముపూర్ణము.

—:♦:—

## ౨ అధ్యాయము.

### ౧౧ ఖండము.

శునశ్శేపఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౧౪. ఆవ ఇన్ద్రిం కృవిం యథా వాజయన్తః శతక్రతుం। మంహిష్ఠం సిఞ్చ ఇన్దుభిః॥

అన్నమునుగోరుచున్న మేము (శునశ్శేప వంశ్యులని తా॥) ఓఋత్విగ్యజమానులారా! నూఱుకర్మలు చేయువాఁడును, మహాత్ముఁడును, అగుమీసంబంధియగు నింద్రుని సోమములతో నూతిని లేకగోతిని బూరించునట్లు పూరించుచున్నాము-

శ్రుతకక్షఋషి-గాయత్రిఛంద-ఇంద్రదేవత.

౨౧౫. అతశ్చిదింద్ర న ఉపా యాహి శతవాజయా। ఇషా సహస్ర వాజయా॥

ఓయింద్రా! యీద్యులోకమునుండియే అనేకములయిన అన్నములతోను, అన్నరసములతోను, గూడినవాఁడవగుచు మాకెదురుగారమ్ము.

త్రిశోకఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౧౬. ఆబున్దం వృత్రహా దదే జాతః పృచ్ఛాద్వి మాతరం। క ఉగ్రాః కే హ శృణ్విరే॥

ఇంద్రుఁడు పుట్టగానే ధనస్సునుదీసికొని "ప్రసిద్ధమయిన లేకయధికమైన బలముగలవార లెవ్వరెవ్వరని" తల్లినడిగెను,

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3౧౨ 3 ౧౨ 3 ౧ ౨ ౧౨ 3 ౨ 3౧౨
౨౧౭. వృషదుక్థగ్ం హవామహే స్రుప్రకరస్న ముూతయే। సాధఃకృణ్వన్తమవసే॥

లోకరక్షణముకొఱకు బాహువులుచాపినట్టి, పరిపాలించుటకు సాధనమయిన ధనమును గూడఁబెట్టుచున్నట్టి, గొప్ప స్తుతిమంత్రములు గలట్టి, యింద్రుని ఆహ్వానించుచున్నాము. (=పిలుచుచున్నామని తా॥)

గోతమఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

3 ౨ 3౧౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3౨
౨౧౮. ఋజునీతీ నోవరుణో మిత్రో నయతి విద్వాన్। అర్యమాదేవైః
3 ౧ ౨
స్సజోషాః॥

(పగటినిగలిగించు) మిత్రుఁడును, (రాత్రింగలిగించు) వరుణుఁడును, (ఉత్తమస్థానము) నెఱింగినవారయి మమ్ము తిన్ననయినమార్గముద్వారా యిష్టఫలమును జెందించుచున్నారు. ఇతరులయిన దేవతలతోఁగలసి అర్యముఁడును, (రాత్రింబవళ్లను విభజించువాఁడు) ఇష్టమునుగూర్చునుగాక.

బ్రహ్మాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత

3 ౨3 ౨ 3౨ 3 ౨ 3౨3 ౧౨ ౨3 ౨ 3 ౧ ౨
౨౧౯. దూరాదిహేవయుత్సతోZ రుణప్సురశిశ్వితత్। విభానుం విశ్వథాతనత్॥

దూరముగా (అంతరిక్షమునకువెనుకను) నుండియే దగ్గఱనున్నట్లు కనంబడుచున్న, ప్రకాశించుచున్న, యుషోదేవత తెల్లవాఱినదై యెప్పుడుండెనో, యపుడు కాంతి నంతటను వెదఁజల్లెను. (కనుక నశ్వినులారా! ఆశ్వినక్రతువును వినుటకు మీరురండు అనివాక్యమధ్యాహారము చేయుమనిభాష్యం)

విశ్వామిత్ర లేక జమదగ్నిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౨౦. ఆనో మిత్రా వరుణా ఘృతైర్గవ్యూతి ముక్షతమ్। మధ్వా రజాగ్ంసి సుక్రతూ॥

మంచికర్మలొనరించు మిత్రావరుణులారా! మాగోవులునివసించుస్థానమును క్షీరములతో సర్వత్రతడుపుదురుగాక. (అనఁగాఁబాడిమొదవుల నిండుఅని తా॥) (పరలోకమండలి) చోట్లను మధురమైన పాలతోఁదడుపుఁడు.

ప్రస్కణ్వఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౨౧. ఉపత్యే సూనవో గిరః కాష్ఠా యజ్ఞేష్వత్నత। వాశ్రా అభిజ్ఞు యాతవే॥

వాక్కులనుబుట్టించునట్టి యామరుత్తులు (=వాయువులు) యజ్ఞములందు ఉదకములను బుట్టించిరి. ఆ యుదకములను ద్రాగుటకు ధ్వనించుగోవులను మోకాళ్ల కభిముఖములగునట్లు (అనఁగా నీరుద్రావుటకు మోరవంచినట్లని తా॥) తోలిరి.

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౨౨. ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదం। సమూఢ మస్య పాగ్ంసురే॥

(త్రివిక్రమావతారముధరించిన) విష్ణువు ఈకనఁబడుచున్న సర్వ ప్రపంచమును, మూఁడువిధములఁ బాదముంచి నడచెను. ధూళితోఁగూడిన యీవిష్ణుపాదమందు దృఢమైన సర్వజగత్తును చక్కగా నిమిడిపోయెను (అంతర్భూతమయ్యెనని తాత్పర్యము.)

ద్వితీయాధ్యాయమున నేకాదశఖండము పూర్ణము.

—*—

## ౨ అధ్యాయము.

### ౧౨ ఖండము.

మేధాతిథిఋషి-గాయత్రి-ఇంద్ర॥

౧౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧౩ ౨
౨౨౩. అతీహిమన్యుషా విణగ్ం సుషువాగ్ం సముపేర య॥ అస్యరాతౌ
౩ ౧ ౨
సుతం పిబ॥

ఓ యింద్రా! కోపముతో సోమము నభిషవింపనివాని నతిక్రమించిపొమ్ము. శాన్తముగా సోమము నభిషవించువానిని జక్కగా (అభిషింపుమని) ప్రేరించుము. ఈ యజమానుని యజ్ఞమందు ఇచ్చినసోమమును ద్రావుము.

వామదేవఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౨ర౩ ౧౨
౨౨౪. కదు ప్రచేతసే మహే వచో దేవాయ శస్యతే। తదిదస్య వర్ధనం॥

గొప్పవాఁడు, అధికజ్ఞానముకలవాఁడు, నగు నింద్ర దేవుని కొఱకు స్వల్ప మయిన మా స్తుతివాక్కు ప్రశస్తమగునట్లు ఇంద్రదేవుఁడనుగ్రహించుఁగాక. అదే యీ యజమానుని ప్రవృత్తికి సాధనము.

మేధాతిథిప్రియమేధులుఋషులు-గాయత్రీఛంద-ఇంద్ర దేవత.

౩౨ ౩౨ ౩౧ ౨ ౩ ౧ ౨౩౧ ౨ర ౧ ౨ ౩ ౨ ౩౧ ౨
౨౨౫. ఉక్థంచన శస్యమానం నాగోరయిరా చికేత। న గాయత్రం గీయమానం॥

స్తుతింపనివానికి శత్రువగు నింద్రుఁడు, (హోతా) పఠించుచున్న స్తుతివాక్కునుగూఁడ జక్కగా నెఱుంగుచున్నాఁడు. (ప్రస్తోత మొదలగువారు) పఠించుచున్న గాయత్ర సామమంత్రమును దెలిసికొనుచున్నాఁడు. (కనుక మేమును స్తుతింతుమనితా॥)

విశ్వామిత్రఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౨౨౬. ఇంద్ర ఉక్థేభిర్మందిష్ఠోవాజానాంచ వాజపతిః। హరివా న్సుతానాగ్ంసఖా।

అన్నములలో శ్రేష్ఠమయిన యన్నమునకుఁ బతియు, హరియను గుఱ్ఱములు కలవాఁడు, నగు నింద్రుఁడు (హోత పఠించిన) ఉక్థలనెడు మంత్రములచేత మిక్కిలి తృప్తినొందినవాఁడయి, అభిషవింపఁబడిన సోమములకు మిత్రునివలెఁ బ్రీతి కలవాఁడుఅగుఁగాక.

మేధాతిథి ప్రియమేధులు ఋషులు-గాయత్రి-యింద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ 3
౨౨౭. ఆయూహ్యుపనః సుతం వాజేభిర్మా హృణీయథాః। మహాగ్ం ఇవ
౧ ౨
యువ జానిః॥

ఓ యింద్రా! మాయభిషవించిన సోమమును సమీపించుము. ఇతరుల హవిస్సులనెడు నన్నములచేత ప్రియభార్యకల మహాత్ముఁడితర స్త్రీలచేతనాకర్షింపబడనట్లు, ఆకర్షింపఁబడకుందువుగాక.

కుత్సనంశ్యదుర్మిత్రఋషి-గాయత్రీఛం-యింద్రదేవత.

3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౨
౨౨౮ కదావసో స్తోత్రిగ్ంత హర్యత ఆ అవశ్మశా రుధద్వాః। దీర్ఘగ్ం
3 ౨ 3 ౧ ౨
సుతం వాతాప్యాయ॥

నివాసముగలిగించు నింద్రా! మాస్తోత్రమునుగోరుచున్ననిన్ను నెపుడుఅడ్డుకొని (చిన్నకాల్వయుదకమును వారింపనట్లు,) విస్తారమయిన సోమమునుగూర్చియుదకమునిచ్చుటకు నెవరువారించును? (నీరుకావలసినవారు చిన్నసీటికై చిన్నకాల్వను గట్టి పొలమునకు నీరుపెట్టుకొనునట్లు, సోమమును గూర్చి నీటినిమ్మని మేము నిరోధించుకాలమెపుడు వచ్చుననిభా॥)

మేధాతిథిఋషి-గాయత్రీ-యింద్రదేవత.

౧ ౨ ౩ ౧౨౩ ౨౩ ౧౨౩ ౧ ౨ర ౨౩౨
౨౨౯. బ్రాహ్మణాదింద్ర రాధసః పిబా సోమమృతూగ్ంరను। తవేదగ్ం
౩౧ ౨ర
సఖ్యమస్తృతం ॥

ఓ యింద్రా! బ్రాహ్మణాఛంసియను ఋత్విజునిసొత్తైన పాత్రమునుండిసోమమును, ఋతువులననుసరించి త్రావుము. ఏమంటే ఋతువులతో నీకుసఖ్యము అవిచ్ఛిన్నమైనదికదా!

మేధాతిథిఋషి-గాయత్రీఛంద-ఇంద్ర దేవత.

౩౧ ౨౩ ౧౨ ౩ ౧౨ ౧ ౨
౨౩౦. వయం ఘా తే అపిస్మసి స్తోతార ఇన్ద్రగిర్వణః। త్వన్నో జిన్వసోమపాః॥

స్తుతివాక్కులకు వశమగు నింద్రా! నీయొక్కస్తుతికర్తలము మేముకదాఅగుచున్నాము. సోమపానముచేయు నింద్రా! నీవుమమ్ముప్రీతినొందించుము.

విశ్వామిత్ర, గాధి, భీపావ, ఉవల, వీరిలో నొకఁడు ఋషి
గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౧ ౨౩౧ ౨ర ౩ ౨ ౩౧౨ ౧ ౨
౨౩౧. ఏంద్రదృక్షు కాసు చిన్నృమ్ణం తనూషు ధేహినః। సత్రాజిదుగ్ర
౧ ౨
పౌగ్ంస్యం॥

ఓ యింద్రుఁడా! కలిసియున్న మాయవయవసులు కొన్నింటిలో బలమునంతటను నిలుపుము. ఓయధికబలుఁడా! యింద్రా! (ద్వాదశాహాము మొదలయిన) యాగములచేత వశమయినవాఁడవగుచుఁ బురుషులకు హితమగు ఫలమునిమ్ము.

శ్రుతకక్షఋషి-గాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨౩౨. ఏవాహ్యాసి వీరయురేవా శూర ఉత స్థిరః। ఏవా తే రాధ్యం మనః॥

ఇంద్రా! నీవు వీరులైన శత్రువులను జంపుటకుఁ గోరుచునే యుందువు కదా! కనుకనే నీవు శూరుఁడవు. నీమనస్సు స్తుతులతో నారాధింపఁ దగినదే.

ద్వితీయాధ్యాయమున ద్వాదశ ఖండము సమాప్తము.

అధ్యాయము పూర్ణము.

## ౩ అధ్యాయము.

### ౧ ఖండము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౩ ౧ ౨ ౩౧౨ ౧ ౨ ౩ ౧ ౨ర
౨౩౩. అభిత్వా శూరనో నుమోzదుగ్ధా ఇవ ధేనవః। ఈశానమస్య జగతః
౩ ౨౩ ౧ ౨ ౩౧౨
స్వర్దృశమీశానమింద్ర తస్థుషః॥

శూరుండవగునింద్రా! నడచునట్టి ప్రాణులకును, నడవనట్టి వస్తువులకును, ఈశ్వరుండవును, సర్వము నెఱింగినవాఁడవు, అగు నిన్ను బాలతో నిండిన ఆవులు వలె (సోమముతో నిండిన పాత్రలుకల) మేము మాటి మాటికి స్తుతించుచున్నాము.

భరద్వాజఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩
౨౩౪. త్వామిద్ధిహవామహే సాతౌ వాజస్య కారవః। త్వాంవృత్రేష్వింద్ర
౧ ౨ ౩ ౨౩ ౨ఉ ౩౧౨
సత్పతిం నరస్త్వాం కాష్ఠాస్వర్వతః॥

స్తుతికర్తలమైనమేము అన్నమునిమిత్తమై ఓ యింద్రా! నిన్నే స్తుతులతోఁ బిలుచుచున్నాము. సత్పురుషులఁ బాలించునట్టినిన్ను, ఇతరులయిన నాయకులు (మనుష్యులు) శత్రువులావరించునపుడు పిలుచుచున్నారు. మఱియు గుఱ్ఱములు ఆక్రమించినిల్చిన యుద్ధములందును నిన్నే పిలుచుచున్నారు.

వాలఖిల్యులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨౩ ౨ ౩ ౧ ౨
౨౩౫. అభిప్రవః సురాధ సమింద్రమర్చ యథావిదే। యోజరితృభ్యో మఘవా
౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
పురువసుః సహస్రేణేవ శిక్షతి॥

విశేషధనముకలవాఁడగు నింద్రుఁడు స్తుతికర్తలకు (మాకు) వేలకొలఁది ధనముతోఁ దృప్తి నొందించును. ఆ యింద్రుఁడు మాకెట్లు తెలియ బడుచున్నాఁడో యట్లే మీరును మంచిధనముతోఁ గూడిన యింద్రుని అభిముఖముగాఁబూజింపుఁడు.

నోధఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩౧ ౨ర
౨౩౬. తంవోదస్మ మృతీషహం వసోర్మందాన మంధసః। అభివత్సంన స్వసరే
౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨
షు ధేనవ ఇంద్రంగీర్భిర్నవామహే॥

ఓ ఋత్విగ్యజమానులారా! చూడఁదగియున్నవాఁడు, శత్రువులనోడించువాఁడు, వసుపాత్రలోనున్న (సోమరూప) అన్నముతో మదించినవాఁడును, (ఆపాత్రపేరు వసుపాత్ర) మీరు సేవించుచున్న యా యింద్రుని స్తుతి వాక్కులతో స్తుతించుచున్నాము.

కలి ప్రగాథఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౨
౨౩౭. తరోభిర్వో విదద్వసు మింద్ర సబాంధ ఊతయే। బృహద్గాయన్తః సుతసోమే
౩ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩౧ ౨
అధ్వరేహువే భరం నకారిణం॥

ఋత్విజులారా! మీరు వేగవంతములగు నశ్వములతోఁగూడినట్టి, ధనమును లభింపఁజేయునట్టి యింద్రుని; రక్షణకొఱకు బాధగలవారలు బృహత్తను పేరుగల సామమంత్రమును గానముచేయుచు సోమము నభిషవించిన యాగమందు సేవించుఁడు. నేనును ఆ యింద్రుని, పుత్రులు మొదలగువారు పోషకుని బిలుచునట్లు పిలుతును.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౩౮. తరణిరిత్సిషాసతి వాజం పురన్ధ్యాయుజా। ఆవ ఇన్ద్రం పురుహూతం నమే
గిరానేమింతష్టేవ సుద్రువం॥

త్వరగలపురుషుఁడు గొప్పదగు బుద్ధిసాహాయ్యముతో అన్నమును సేవించును. పలువురచేతఁ బిలువఁబడిన యింద్రుని స్తుతితో నో యజమానులారా ! మీ నిమిత్తము కట్టతోఁ జేసిన రథచక్రము యొక్క అంచును వడ్రంగి వంచునట్లు స్వాధీనము చేసికొనుచున్నాను.

మేధాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౩౯. పిబాసుతస్య రసినో మత్స్వా న ఇన్ద్ర గోమతః। ఆపినో బోధి సధమాద్యే వృధేऽ3స్మాఀ అవన్తు తేధియః॥

ఓ యింద్రా! రసముగలట్టి, క్షీరాదులతోఁగలసినట్టి, యభిషవించిన మాసోమమును బానముచేసి మదించుము. యజ్ఞమందు నీవు బన్ధువుఁడవగుచు మావృద్ధిని గూర్చి ఆలోచించుము. నీబుద్ధులు మమ్ము రక్షించుఁగాక.

భార్గవఋషి-బృహతీ-ఇంద్రదేవత.

౨౪౦. త్వాగ్ంహ్యాహి చేరవే విదాభగం వసుత్తయే। ఉద్వావృషస్వ మఘవన్
గవిష్టయ ఉదిన్ద్రాశ్వ మిష్టయే॥

ఓ యింద్రా ! నీవుకదా (దాతవు!) కనుక రమ్ము. క్రమమయిన ఆచారవంతుఁడనగు నాకొఱకు ధనమును మేము దానముచేయుటకు నిమ్ము. గోవులను

గోరుచున్న నాకు గోవులనిమ్ము. ఇంద్రా! అశ్వముఁగోరెడువానికి (నాకు) అశ్వమునిమ్ము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౮౧. సహివ శ్చరమం చ న వశిష్ఠః పరిమగ్ంసతే। అస్మాకమద్య మరుతః సు
తే సచా విశ్వే పిబన్తు కామినః॥

ఓ మరుత్తులారా! వశిష్ఠఋషి మీమధ్య చిన్నవానినింగూడ విడిచి స్తుతి చేయఁడు. (అందఱిని స్తుతించునని తా॥) ఈదినమునందు మా సోమ మభిషవించి యుండఁగా మరుత్తులందఱుఁగలిసి సోమమునుగోరుచు సోమము ను ద్రావుదురుగాక.

ప్రగాథకాణ్వఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౮౨. మాచిదన్యద్విశగ్ంసత సఖాయో మారిషణ్యత। ఇన్ద్రమిత్స్తోతా వృష
ణగ్ం సచాసుతే ముహురుక్థాచ శగ్ంసత॥

ఓ మిత్రులారా! (స్తుతికర్తలారా!) ఇంద్రస్తుతికంటె వేఱగు స్తుతి నుచ్చరింపకుఁడు. హింసించువారు కాకుఁడు. (ఇతరస్తుతిచేసి నష్టపోకుఁడని తా॥) సోమమభిషవింపఁగానే కోర్కెలనువర్షించు నింద్రునే ఋత్విజులారా! మీరు మాటిమాటికి స్తుతింపుఁడు.

తృతీయాధ్యాయ ప్రథమఖండము సమాప్తము.

## ౩ అధ్యాయము.

### ౨ ఖండము.

(అంగిరస గోత్రుఁడు) పురుజన్మఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౩౧ ౨ర ౩ ౨౩ ౧౨ ౩ ౧౨ ౨ ౩ ౨ ౩ ౨౩ ౧ ౨ ౩
౨౮౩. నకిష్టం కర్మణా నశద్యశ్చకార సదావృధం। ఇంద్రం నయజ్ఞైర్విశ్వగూర్త
౧౨ ౩౧౨ ౩ ౧ ౨ర
ఋభ్వసమధృష్టం ధృష్ణుమోజసా॥

సర్వదావృద్ధినొందుచున్న, అందఱిచేత స్తుతింపఁబడుచున్న, మహాత్ముఁడైన, బలముచేత నితరులకులొంగని, శత్రువులఁదిరస్కరించు నింద్రుని యేయజమానుఁడు (యాగములతో) ననుకూలునిగాఁజేయునో, వాని నెవ్వఁడును జెఱుపలేడు.

మేధాతిథి-మేధ్యాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౨
౨౮౪ యఋతే చిదభిశ్రిషః పురాజత్రుభ్య ఆతృదః। సన్ధాతా సన్ధిం
౩౧ ౨ ౩ ౨ ౩ ౧ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨
మఘవా పురూవసు నిష్కర్తా విహ్రుతం పునః॥

(యుద్ధములో) తల తెగినతోడనే (బంక - లేక టంకము మొదలగు) అదుకువస్తువులు లేకుండగనే కంఠనాళములనుండి నెత్తురు వెలువడుటకుముందే (తలనుమరల) సంధించును. (అనియింద్రమహాత్మ్య వర్ణనము) విశేషధనవంతుఁడైన యింద్రుఁడు తెగినవస్తువును దిరిగిసంధించును.

ఋషిఛందస్సులు, దేవతపూర్వవత్తు.

౧ ౨ ౩ ౧ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩
౨౮౫ ఆత్వా సహస్రమా శతం యుక్తా రథే హిరణ్యయే। బ్రహ్మయుజో
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
హరయ ఇంద్ర కేశినో వహన్తు సోమ పీతయే॥

ఓ యింద్రా! నిన్ను వేయిగుఱ్ఱములు (మాయాగమువద్దకు) తెచ్చుఁగాక. అల్లునూఱుగుఱ్ఱాలు తెచ్చుఁగాక. బంగారురథమందు గట్టఁబడినవై యింద్రుని చేతఁదోలంబడుచు మెడమీఁదజూలుకలిగి సోమపానార్థమునిన్ను ఆయశ్వములు తీసికొని వచ్చుగాక.

విశ్వామిత్రఋషి-బృహతీఛందః-ఇంద్రదేవత.

౨౪౬ ఆమందై్రరింద్ర హరిభిర్యాహి మయూరరోమభిః। మాత్వా కేచిన్ని
యేముకిన్న పాశినోఽతిధన్వేవతాగ్ం ఇహి॥

ఓ యింద్రా! మదింపఁజేయునవి, నెమలిరంగు రోమములుగలవి, యగుగుఱ్ఱములతోఁగూడి నీవు (యజ్ఞమునకు) రమ్ము. ఏజనులుంగూడ త్రాళ్లు పట్టుకొన్న వేటగాండ్రు పక్షులను నిరోధించునట్లు, నిన్ను నిరోధింపలేకుంద్రుగాక. బాటసార్లు ఎడారిని శీఘ్రముదాటివచ్చునట్లు (అడ్డినవారినిదాటి) శీఘ్రము మాయజ్ఞమునకు రమ్ము.

గోతమఋషి-బృహతీఛందః-ఇంద్రదేవత.

౨౪౭. త్వమఙ్గప్రశగ్ంసిషో దేవశ్శవిష్ఠమర్త్యం। న త్వదన్యో మఘవన్నస్తి
మర్డితేంద్ర బ్రవీమి తే వచః॥

ఓయీ! యింద్రా! ప్రకాశించునట్టి నీవు నిన్నుస్తుతించు మనుష్యుని మెచ్చుకొనుము. ఓ ధనవంతుఁడవగు నింద్రా! నీకంటె నితరుఁ డెవ్వఁడును సుఖింపఁజేయువాఁడు లేడు. కనుక నీకొఱకే స్తుతివాక్యములు పలుకుచున్నాను.

నృమేధ పురుమేధులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౪౮. త్వమింద్ర యశా అస్యృజీషీ శవసస్పతిః। త్వంవృత్రాణి హగ్ంస్య
ప్రతీన్యేక ఇత్పుర్వను త్తనుశ్చర్షణీ ధృతిః॥

ఓ యింద్రా! బలమును బాలించునట్టి, సోమము పిండగా మిగిలిన పిప్పి యందుఁ బ్రీతిగలట్టి, నీవు కీర్తివంతుఁడవగుదువు. యజమానులైన మనుష్యులను రక్షించువాడవై జయింపరాని పలువుర శత్రువులను ఇతర సహాయ్యము కొరకే యెవరును బ్రేరింపకే (అనఁగా నీయంత నీవే) చంపుచున్నావు. (అందుచేతఁ గీర్తిమంతుఁడవని తా ॥)

మేధ్యాతిథి (ఇది మొదలు మూఁడిటికి) ఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౪౯. ఇంద్రమిద్దేవతాతయ ఇంద్రం ప్రయత్యధ్వరే। ఇంద్రగ్ం సమీకే వనినో
హవామహ ఇంద్రం ధనస్య సాతయే॥

యజ్ఞము ప్రారంభించునపు డింద్రునేపిలుతుము. యజ్ఞము జరుగుచున్నపు డింద్రునేపిలుతుము. సేవకులమయిన మేము యజ్ఞముసంపూర్ణమగు కాలమందుఁబిలుతుము, ధనలాభమునకింద్రునే పిలుతుము.

ఋష్యాదులు పూర్వవతు.

౨౫౦. ఇమాఉత్వా పురూవసో గిరోవర్ధన్తు యామమ। పావక వర్ణాః
శుచయో విపశ్చితోఽభిస్తోమైరనూషత॥

బహుధనముకల యింద్రా! మాయీవాక్కులు నిన్ను వృద్ధినొందించుఁగాక.

అగ్నివర్ణముగలవారు శుద్ధులు విద్వాంసులునగునట్టి ఉద్గాతలు స్తోత్రములతో నిన్ను స్తుతించుచున్నారు,

ఋష్యాదులు పూర్వవతు.

౨౫౧. ఉదు త్యే మధుమత్తమా గిరః స్తోమాస ఈరతే। సత్రాజితో ధనసా అక్షితోతయో వాజయన్తో రథా ఇవ॥

ప్రసిద్ధమైన అతి మధురమైన (గానము లేని) స్తుతివాక్కులును (గానముతోఁ గూడిన) స్తుతివాక్కులును, శత్రువులనుజయించునట్టి, ధనములనుసంపాదించునట్టి, నశింపని రక్షణములుకలట్టి, అన్నముఁగోరుచున్నట్టి, రథములు బయలు దేరునట్లు బయలుదేరుచున్నవి.

కణ్వగోత్ర దేవాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౫౨. యథా గౌరో అపాకృతం తృష్యన్నేత్యవేరిణం। ఆపిత్వేనః ప్రపిత్వే తూయమా గహి కణ్వేషు సుసచాపిబ॥

గౌరమృగము (అడవి యావుపేరు) దప్పిగొన్నదై నీటితోనిండిన చెఱువును ఎట్లు శీఘ్రముగా సమీపించునో యట్లు, బంధుత్వముగల్గినపుడు ఓయింద్రా! నీవు మమ్ము శీఘ్రము సమీపించుము. ఉన్నసోమమునంతటిని పానము చేయుము.

తృతీయాధ్యాయ ద్వితీయఖండము సమాప్తము.

—*।*—

3 వ ధ్యాయము.

3 ఖండము.

—:o:—

భర్గఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

3 ౨ ౧౨ 3 ౨ 3 ౧౨ 3౧౨ ౨3౧ ౨ర 3౧౨
౨౫3. శగ్ధ్యూ 3 షుశచీ పత ఇంద్ర విశ్వాభిరూతిభిః। భగంన హిత్వా యశసం
3౨3౧౨ 3 ౧౨
వసువిదమను శూర చరామసి॥

శచీపతివగునింద్రా ! (శచీ=కర్మ) ఇష్టమునిమ్ము. సకలరక్షణములతోను ఓ శూరుడా ! కీర్తివంతుడవు, ధనములబింపజేయువాడవునగునిన్ను, భాగ్యమునుసేవించునట్లు సేవించుచున్నాము.

కశ్యపగోత్ర రేభఋషి-బృహతి-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧3 ౧౨3ర ౨ర3 ౧౨ 3 ౨ 3౧౨
౨౫౪. యా ఇంద్ర భుజ ఆభరః స్వర్వాం అసురేభ్యః। స్తోతార మిన్మఘవ
3 ౨3 ౨ 3౧౨
న్నస్య వర్ధయ యేచ త్వే వృక్తబర్హిషః॥

ఓ యింద్రా! స్వర్గముగల నీవు అనుభవింపదగిన ధనములేవిగలవో వాటిని అసురుల జయించి తెచ్చితివి. (ఉబ్బరగా వచ్చినవని తా॥) ధనవంతుడవైన యింద్రా! యీ తెచ్చిన ధనము నిచ్చుటచేత స్తుతికర్తనే వృద్ధినొందించుము. ఇతర యాగకర్త లెవరు నీకై దర్భలు పరుచుకొని యుండిరో వారినిగూడ ధనముతో వృద్ధిబొందింపుము.

జమదగ్నిఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౨3 ౨ 3   ౨ 3 ౧   ౨3క ౨ర   3 ౨   ౧౨3 ౨3
౨౫౫. ప్రమిత్రాయ ప్రార్యమ్ణే సచథ్య మృతావసో। వరూథ్యే3వరుణే ఛన్ద్యం
౧ ౨ 3 ౧   ౨ర
వచః స్తోత్రగ్ం రాజసుగాయతా॥

యజ్ఞము ధనముగాఁ గలవాఁడా! మిత్రునికొఱకు సేవ్యమైన యజ్ఞగృహమందుఁ బుట్టిన, లేక యభిప్రాయమున కనుగుణమయిన, స్తోత్రమును బాగుగాఁ బఠింపుము. అర్యమునికొఱకును, యజ్ఞగృహమందున్న వరుణునికొఱకును, స్తోత్రము పఠింపుము. ప్రకాశించుచున్న మిత్రాదిదేవతల నిమిత్తము స్తోత్రము పఠింపుము.

మేధాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

3౧ ౨   3 ౧౨ 3   ౨ 3 ౧ ౨   3 ౧ ౨   3   ౧౨ 3 ౨ 3
౨౫౬. అభిత్వా పూర్వపీతయ ఇంద్రిస్తోమేభి రాయవః। సమీచీనాస ఋభవః
౧౨   3 ౧ ౨   3 ౧
సమస్వరన్ రుద్రా గృణన్తపూర్వ్యం॥

ఓ యింద్రా! (స్తుతికర్తలగు) మనుష్యులు స్తోత్రములచేత నందఱికంటె ముందుగా సోమపానముచేయుటకై నిన్ను స్తుతించుచున్నారు. కలిసియున్న ఋభువులు (ముగ్గురు దేవతలు, ఋభు, వాజ, విభత్ అనువారలు) నిన్నే చక్కగా స్తుతించుచున్నారు రుద్రపుత్రులైన మరుత్తులు పురాతనుఁడవైన నిన్ను స్తుతించిరి. (వృత్రివధ కాలమందు "భగవంతుడా! కొట్టుము. వీరుడా! చంపుము. త్రోసివేయుము" వెనుక నిల్చి ప్రోత్సహించిరని తాత్పర్యము.)

నృమేధ-పురుషమేధులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨3 ౧ ౨   3 ౧   ౨ర 3   ౧౨   3 ౧   ౨
౨౫౭. ప్రవ ఇంద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత। వృత్రగ్ం హనతి
3 ౨   3 ౧౨ 3 ౧ ౨   3౧౨
వృత్రహా శతక్రతుర్వజ్రేణ శతపర్వణా॥

ఓ మరుత్తులారా! గొప్పవాఁడయిన మీ యింద్రునికొఱకు సామస్తోత్రమును బఠింపుఁడు. పాపమును నశింపఁజేయు లేక మేఘమును జీల్చిన యింద్రుఁడు నూఱంచుల వజ్రాయుధముతో వృత్రుని గొట్టునుగాక.

నృమేధ-పురుమేధులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౫౮. బృహదింద్రాయ గాయత మరుతో వృత్రహన్తమం। యేన జ్యోతిర జనయన్నృతావృధో దేవం దేవాయ జాగృవి॥

ఓ మరుత్తులారా! (మరుత్=మితభాషి) పాపమును బాగుగాఁ బోగొట్టునట్టి బృహత్సామమనెడు స్తుతిమంత్రమును ఇంద్రునికొఱకు (మా యజ్ఞమున) గానము చేయుఁడు. సత్యమును లేక యజ్ఞమును వృద్ధిచేయు నంగిరసులందఱు ఇంద్రదేవుని కొఱకుఁ బ్రకాశించునట్టి, అందఱిలో మేల్కొనియుండునట్టి, సూర్యతేజస్సును ఏ సామమంత్రముతోఁ బుట్టించిరో (ఆ సామమంత్రము గానము చేయుఁడు.)

వశిష్ఠ ఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౫౯. ఇంద్రక్రతుం న ఆ భర పితా పుత్రేభ్యో యథా। శిక్షాణో అస్మిన్ పురుహూత యామని జీవాజ్యోతి రశీమహి॥

ఓ యింద్రా! మా కొఱకుఁ బ్రజ్ఞానమును గలిగింపుము. పుత్రులకుఁ దండ్రి యెటుల ధనమిచ్చునో యట్లు మాకు ధనము నిమ్ము. పలువురచేతఁ బిలువంబడువాఁడా! యింద్రా! యాగమందు జీవు (లమయిన మేము) సూర్యతేజస్సును (ప్రతిదినమందును) బొందుచున్నాము.

రేభఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౬౦. మాన ఇంద్ర పరావృణ గ్భవానః సధమాద్యే। త్వంన ఊతీ త్వమిన్న
ఆప్యం మాన ఇంద్ర పరావృణక్॥

ఓ యింద్రా! మమ్ములను విడువకుము. నీవు కలిసి మదింపఁజేయునట్టి మా యాగమందు సోమపానమునకు రమ్ము. ఓ యింద్రా! మమ్ములను నీవే రక్షణము నందుంచుము. నీవే బంధువుఁడవు కనుక నింద్రా! మమ్ము విడువకుము.

మేధాతిథి ఋషి-బృహతీఛం॥ఇంద్ర॥

౨౬౧. వయం ఘత్వా సుతావన్త ఆపో నవృక్త బర్హిషః। పవిత్రస్య
ప్రస్రవణేషు వృత్రహన్ పరిస్తోతార ఆసతే॥

ఓ యింద్రా! సోమమును నీకై యభిషవించి మేముగదా! ఉదకములు పల్లమును జేరునట్లు నిన్ను జేరుచున్నాము. పవిత్రమయిన సోమములు కారుచున్నపుడు దర్భలను పరుచుకొన్నవారై స్తుతికర్తలు సేవించుచున్నారు.

భరద్వాజఋషి-బృహతీఛం॥ఇంద్ర॥

౨౬౨. యదింద్ర నాహుషీష్వా ఓజో నృమ్ణంచ కృష్టిషు। యద్వా
పఞ్చక్షితీనాం ద్యుమ్నమా భర సత్రా విశ్వాని పౌంస్యా॥

ఓ యింద్రా! మానవులగు ప్రజలందు ఏ తేజస్సు బలమును గలవో, అది

కాక అయిదుజాతులయిన ప్రజలయొక్క ప్రకాశించు నన్నమును సర్వమునుదెచ్చి యిమ్ము. గొప్పవయిన పౌరషము లన్నిటిని మాకు నిమ్ము.

ఇట్లు మూడవ యధ్యాయమున మూడవ ఖండము సమాప్తము.

---

## ౩ అధ్యాయము.

## ४ ఖండము.

మేధాతిథిఋషి-బృహతీ॥ఇంద్రిదేవత.

౨౬3. సత్యమిత్థా వృషేదసి వృషజూతి నోఽవితా। వృషా హ్యుగ్ర శృణ్విషే పరావతి వృషో అర్వావతి శ్రుతః ॥

అధికబలముకల యింద్రా! నీవు సత్యముగా నీ విధముగాఁ గోర్కెలవర్షించు వాఁడవేయగుచున్నావు. సోమ మభిషవించినవారిచేతఁ బిలువఁబడినవాఁడవై మమ్ము రక్షించినవాఁడవగుచున్నావు. దూరమునుండికాని, దగ్గరనుండికాని, కోర్కెల వర్షించువాఁడవని వినఁబడుచున్నావు.

రేభఋషి-బృహతీఛం-ఇంద్రిదేవత.

౨౬४. యచ్ఛక్రాసి పరావతి యదర్వావతి వృత్రహన్। అతస్త్వా గీర్భి ద్యుఁగ దింద్రి కేశిభి స్సుతావాగ్ం ఆవివాసతి॥

ఓ యింద్రా! యెపుడు దూరమందున్నావో, ఓ వృత్రహన్తా! సమీప మం దున్నావో, అక్కడనుండి యో యింద్రా! ద్యులోకముంగూర్చి పోవుచున్న, మెడ

మీఁదజూలుకల గుఱ్ఱములవంటి స్తుతివాక్కులతో నిను సోమ మభిషవించిన యజమానుఁడు (తనయాగముంగూర్చి) రప్పించుకొనును, సేవించును అని కాని.

వత్సఋషి-బృహతీఛం-ఇంద్రదేవత.

౩౧ ౨ ౩౧ ౨ర౩ ౧౨ ౩ ౨ ౩౧ ౨ర ౨
౨౬౫. అభి వో వీరమన్ధసో మదేషు గాయగిరా మహా విచేతసం। ఇం
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨౩ ౨ ౩ ౧ ౨
ద్రంనామ శ్రుత్యగ్ం శాకినం వచో యథా॥

ఓ ఋత్విజులారా! మీరు మీ మేలునకై సోమమదములు కలప్పుడు శత్రులం దూలించువాఁడు, శత్రువుల వంచువాఁడు, విశేషప్రజ్ఞకలవాఁడు, సర్వత్ర వినం దగినవాఁడు, శక్తిమంతుఁడు నగు నింద్రుని గొప్ప స్తుతివాక్కులతో మీ పలుకుల కనుగుణమగునట్లుగా గానముచేయుఁడు.

శంయుఋషి-బృహతీఛం-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౩౧౨ ౩౧
౨౬౬. ఇంద్ర త్రిధాతు శరణంత్రి వరూథగ్ం స్వస్తయే। ఛర్దిర్యచ్ఛ మఘ
౨ ౩ ౧ ౨ ౩౧౨ ౩ ౧ ౨
వద్భ్యశ్చ మహ్యంచ యావయా దిద్యుమేభ్యః॥

ఓ యింద్రా! మూఁడు వరుసలుగా నున్నట్టి మూఁడు (బాధలను) దొలఁగించునట్టి (వర్ష, వాయు, ఎండలు) గృహమును క్షేమముకొఱకు యాగములు చేయుచున్న (యజమానులకు) నాకును (అనఁగా భరద్వాజునకు) ఇమ్ము. వీరి మీఁదికి శత్రువు నాయుధము రాకుండ వారింపుము.

నృమేధఋషి-బృహతి-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౨ర ౧ ౨ ౩ ౧
౨౬౭. శ్రాయన్త ఇవ సూర్యం విశ్వే దింద్రస్య భక్షత। వసూని జాతో
౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
జనిమా న్యోజసా ప్రతిభాగం న దీధిమః॥

ఓ మావారలారా! కిరణములు సూర్యుని ఆశ్రయించునట్లు ఇంద్రుని ధనములను మీరు సేవింపుఁడు. తండ్రి సొత్తునువలెను, ఆ ధనములను మేము ధరింతుముగాక. ఏ ధనములను బుట్టినతోడనే బలముతో గలిగించునో (ఆ ధనముల ధరింతుముగాక.

పురుహన్మాఋషి-బృహతీ-ఇంద్రదేవత.

౨౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౩౧ ౨ర
౨౬౮. నకీ మదేవ ఆప తదిషం దీర్ఘాయో మర్త్యః। ఏతగ్వా చిద్యఏతశో
౩ ౧ ౨౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
యుయోజత ఇంద్రోహరీ యుయోజతే।

నిత్యుఁడవయిన యింద్రా! యింద్రుని సేవింపని మనుష్యుఁ డన్నము నంతయుఁ బొందఁడు. ఏ మర్త్యుఁ డింద్రుని రాకకుఁ దెల్లని యశ్వములను బూన్చునో, (అనగా నింద్రునిస్తుతించునో) యే యింద్రుఁడు (యాగమునకుఁబోవ) చిత్రవర్ణములగు నశ్వములనుబూన్చుకొనునో, అట్టి యింద్రుని స్తుతింపనివాఁడన్నమును బొందలేడు.

నృమేధ-పురుమేధులు ఋషులు-ఛందోదేవతలు పూర్వవతు.

౨౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩
౨౬౯. ఆనో విశ్వాసు హవ్యమింద్రగ్ం సమత్సు భూషత। ఉప బ్రహ్మాణి
౧ ౨ ౩ ౧ ౨
సవనాని వృత్రహన్ పరమజ్యా ఋచీషం॥

ఓ స్తుతికర్తలారా! సకలయుద్ధములందును (ఆత్మరక్షకై సహాయునిగా దేవతలందఱిచే) పిలువందగిన యింద్రునుద్దేశించి మాయజ్ఞమందు స్తోత్రములును, హవిస్సులును అలంకరింపుఁడు. పాపమునశింపఁజేయువాఁడా! గట్టిశత్రువులనణఁచువాఁడా! స్తుతులతోనభిముఖుఁడగువాఁడా! యింద్రా! (ప్రాతర్మాధ్యందినసాయం) సవనములమూఁటిని స్తోత్రములను అలంకరింపుము.

వసిష్ఠఋషి-బృహతీఛం-ఇంద్రదేవత.

౨౭౦. తవే దిందా్రవమం వసుత్వం పుష్యసి మధ్యమం। సత్రా విశ్వస్య
పరమస్య రాజసి నకిష్ట్వా గోషు వృణ్వతే॥

ఓ యింద్రా! అధమమయిన (తగరము సత్తుమొదలయిన) ధనమునునీదేను. మధ్యమమయిన (వెండి-బంగారు మొ॥) ధనము నీదేను. ఉత్తమమయిన (రత్నము మొ॥) ధనమునకునునీవేయధికారివి. అదిసత్యమేను. గోవులనిమిత్తము నిన్ను నెవఁడును వారింపఁడు.

మేధాతిథి-మేధ్యాతిథి-ఋషులు-బృహతీఛం-ఇంద్రదేవత.

౨౭౧. క్వే యథ క్వేదసి పురుత్రా చిద్ధి తే మనః। అలర్షి యుధ్మ ఖజ
కృత్పురన్దర ప్రగాయత్రా అగాసిషుః॥

ఓ యింద్రా! యెప్పటికి బోయితివి? యిపుడెచ్చటనున్నావు? పలుచోట్ల నీమనస్సు సంచరించును. యుద్ధమునందు నేర్పుకలవాఁడా! యుద్ధకర్తా! శత్రుపురముల భేదించువాఁడా! యింద్రా! రమ్ము. గానమందు నేర్పుగల మా స్తుతికర్తలు స్తుతించుచున్నారు.

కలిఋషి-బృహతీ-ఇంద్రదేవత.

౨౭౨. వయమేన మిదా హ్యోzపీపేమ వజ్రిణం। తస్మా ఉ అద్య
సవనే సుతం భరానూనం భూషత శ్రుతే॥

మేము (యజమానులము) వజ్రముగల యింద్రుని, యిపుడు నిన్నను (అనే) యీదినములలో సోమముతోఁదృప్తి పఱచితిమి. కనుకనే యీసవనమందు (=యా

గముఁలోనొకభాగము) అభిషవించిన సోమమునుదెమ్ము. ఓ యధ్వర్యూ! యిపుడు వినంగానే యలంకరింపుము.

తృతీయాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

———:o:———

3 అధ్యాయము.

౫ ఖండము.

పురుహన్మాఋషి -బృహతీఛందస్సు-ఇంద్రదేవత.

౧ ౨ర 3 ౧ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧
౨౭౩. యోరాజా చర్షణీనాం యాతా రథేభి రధ్రిగుః। విశ్వాసాం తరుతా
౨ర 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨
పృతనానాం జ్యేష్ఠం యోవృత్రహా గృణే॥

ఏ యింద్రుఁడు మనుష్యులయొక్క స్వామియై రథములతో నడచువాఁడో, యితరు లడ్డలేని గమనము కలవాఁడయి సమస్తసేనలయొక్క (భయమును) నివారించు వాఁడో, యేయింద్రుఁడు మహా గుణవంతుఁడో, యెవఁడు వృత్రునిఁ జంపెనో, ఆ యింద్రుని స్తుతించుచున్నాను.

భర్గఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ ౨ ౨ ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౨ఉ
౨౭౪. యతఇంద్ర భయామహే తతోనో అభయం కృధి। మఘవన్ ఛగ్ధి
3౧ ౨ 3 ౨ 3 ౨ఉ 3 ౧ ౨ర
తవతన్న ఊతయే విద్విషో విమృధో జహి॥

ఓ యింద్రా! ఏ హింసాకారునివల్ల మేము భయపడుచున్నామో, వాని వల్ల మాకు భయము లేకుండజేయుము. ఓ యింద్రా! సమర్థుడవు. మాకభయము కలుగుటకు నీ రక్షణముకొఱకు శత్రువులం జంపుము.

ఇరిమిఠఋషి-బృహతీ-ఇంద్ర దేవత.

```
      ౧ ౨        ౩ ౧          ౨ర        ౩ ౧ ౨           ౩ ౨
౨౭౫. వాస్తోష్పతే ధ్రువా స్థూణాగ్ం సత్రగ్ం సోమ్యానాం। ద్రప్సః
     ౩ ౨  ౩ ౧   ౨ర ౩   ౨ ౩   ౧ ౨ ౩     ౧ ౨
     పురాం భేత్తా శశ్వతీనా మిన్ద్రో మునీనాగ్ం సఖా॥
```

ఓ గృహపతీ! ఇంటి స్తంభము స్థిరమయిన దగుగాక. సోమమును సంపాదించుమాకు శరీరరక్షకమయిన బలముకలుగుగాక. మఱియు ద్రవించు సోమముగలట్టి, అనేక శత్రు పురముల ఛేదించునట్టి, యింద్రుడు మునులమగు మాకు స్నేహితుడగుగాక.

జమదగ్నిఋషి-బృహా-ఇంద్రదేవత.

```
      ౨ ౩ ౧    ౨    ౩   ౧ ౩     ౨ ౧   ౨    ౩ ౧ ౨   ౩౧
౨౭౬. బణ్మహాగ్ం అసి సూర్య బడాదిత్య మహాగ్ం అసి। మహాస్తే సతో
     ౨ ౩ ౧   ౨    ౩ ౧   ౨    ౩౧    ౨
     మహిమా పనిష్టమ మహ్నా దేవ మహాగ్ంఅసి॥
```

(ఈమంత్రము సూర్యునింజూచుచు జపించితే అబద్ధమాడిన పాపమునశించును అనిశౌనకవాక్యము.) ఓ సూర్యుడా! నీవు (తేజస్సుతో) మహానుభావుడవు. సత్యము. ఓ ఆదిత్యుడా! (బలముతో) గొప్పవాడవు. సత్యము. మహాత్ముడవయిననీయొక్క మహిమస్తుతింపబడుచున్నది. ఓ దేవా! (సూర్య) మహత్తుచేత నీవు అధికుడవయియున్నావు.

దేవాతిథిఋషి-బృహతీ-ఇంద్రదేవత.

౨౭౭. అశ్వీరథీ సురూప ఇద్గోమాగ్ం యదింద్రతే సఖా। శ్వాత్రభాజా వయసా సచతే సదాచంద్రైర్యాతి సభాముప॥

ఓ యింద్రా! నీయొక్కస్నేహితుఁడు అశ్వములనేకములు గలవాఁడు, అనేక రథములుకలవాఁడు, మంచిరూపముకలవాఁడు, గోవులుకలవాఁడు నగును. శీఘ్రముగాఁబొందఁదగిన ధనమునుబొందును. ఇట్టిధనముతోఁగూడిన యన్నముతో నెల్లపుడునుగూడియుండును. కనుకసంతోషముకలిగించు స్తోత్రముతోఁగూడిసభను బొందును.

పురుహన్మాఋషి-బృహతి-ఇంద్రదేవత.

౨౭౮. యద్ద్యావ ఇంద్రతే శతగ్ం శతం భూమీరుతస్యుః। నత్వావజ్రిన్త్సహస్రగ్ం సూర్యా అను నజాత మష్టరోదసీ॥

ఓ యింద్రా! నీయొక్కకొలతకు నూఱుద్యులోకము లుండిననుజాలవు. భూలోకములునూఱున్నను నీశరీరము వ్యాపించుటకుఁజాలవు. వజ్రధారీ! లెక్కలేని సూర్యులున్నను నిన్నుప్రకాశింపఁజేయలేరు. ఇదివఱకుఁబుట్టిన యేవస్తువునుజాలదు. భూమ్యాకాశములు రెండును సమర్థములుకావు. (అన్నిఁటికంటె నీవధికుఁడవని తా॥)

దేవాతిథిఋషి-బృహతీ-ఇంద్రదేవత.

౨౭౯. యదింద్ర ప్రాగపా గుదగ్న్యగ్వా హూయసే నృభిః। సిమాపురూ నృషూతో అస్యా నవేऽసి ప్రశర్ధ తుర్వశే॥

ఇంద్రా! తూర్పుననున్న వారిచేతనుగాని, పడమరనున్న వారిచేతనుగాని, ఉత్తరముననున్న వారిచేతనుగాని, క్రిందనున్న వారిచేతంగాని, బిలువంబడుచున్నను ఓ శ్రేష్ఠుండా! అనువులనెడు రాజుకొమరుని విషయమున నెక్కువగా నతని మనుష్యులచేతఁ బ్రేరింపఁబడితివి. ఓ సమర్థుఁడా! తుర్వశరాజువిషయము నరులచేఁ బ్రేరింపఁబడుచున్నావు.

వశిష్ఠఋషి-బృహతీ-ఇంద్రః॥

౨౮౦. కస్తమింద్ర త్వా వసవా మర్త్యో దధర్షతి। శ్రద్ధాహి తే మఘవన్
పార్యే దివి వాజీ వాజగ్ం సిషాసతి॥

వ్యాపకుఁడవైన యింద్రా! ప్రసిద్ధుఁడవైననిన్ను నేమనుష్యుఁడెదిరింపఁగలఁడు? ఓ యింద్రా! యెవఁడునీకొఱకు శ్రద్ధతో హవిస్సులధరించువాఁడగుచున్నాఁడో, అంతరిక్షమందు సుత్యాదినమందు వాఁడు హవిస్సును ఇవ్వఁదలఁచును. (సుత్యాదినము=యజ్ఞదినములలో నొకదినము పేరు.)

భరద్వాజఋషి-బృహతీఛం-ఇంద్రదేవత.

౨౮౧. ఇంద్రాగ్నీ అపాదియం పూర్వాగా త్పద్వతీ భ్యః। హిత్వా శిరో
జిహ్వయా రారపచ్చరత్ త్రిగ్ం శత్పదాన్య క్రమీత్॥

ఓ యింద్రాగ్నులారా! పాదములులేని యీయుష పాదములుకల ప్రజలు నిద్రలేవకముందు వచ్చుచున్నది. (ప్రాణుల) శిరస్సును విడిచి, తానుశిరస్సులేనిదయ్యుఁ బ్రాణుల జిహ్వతో ధ్వనించుచున్నదై ముప్పదిముహూర్తములు చరించుచు నుషనడచెను. (ఇదియీషనియుషస్తుతి)

వాలఖిల్యులుఋషులు-బృహతి-ఇంద్ర దేవత.

౨ ౩ ౧౨ ౩ ౧౨ ౩౧ ౨ ౩ ౧౨ ౧౨ ౩౧౨
౨౮౨. ఇంద్ర నేదీయ ఏహీహి మిత మేధాభి రూతిభిః। ఆశన్త మశన్త
౩౧ ౨ ౩౧ ౩ ౧ ౨
మాభి రభి ష్టిభిరా స్వాపే స్వాపిభిః॥

ఓ యింద్రా! అతిసమీపమందున్న మాయజ్ఞస్థానమునకు కొలఁదిబుద్ధిగల రక్షణములతోను, ఇష్టవరములతోఁడను, అత్యంతసుఖము నిచ్చువాఁడా! రమ్ము. మాబంధువుఁడా! బంధువులయిన యిష్టములతో రమ్ము. (మాకోర్కెల నిచ్చుటకు రమ్మని తా॥)

తృతీయాధ్యాయమందు నైదవఖండము సంపూర్ణము.

---:o:---

3 అధ్యాయము.

౬ ఖండము.

నృమేధఋషి.-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౨ ౩౧ ౨ ౩౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౮ ౩
౨౮౩. ఇత ఊతీ వో అజిరంప్ర హే తార మప్రహితం। ఆశుజేతారగ్ం
౧ ౨ ౩౧౨౧ ౧ ౨ ౩ ౧ ౨
హేతారగ్ం రథీతమ మతూర్తం తుగ్రియావృధం॥

ఓ మావారలారా! మీరుముదిమిలేనివాఁడు, శత్రువులఁబాఱఁదోలువాఁడు, నెవ్వరికిలొంగనివాఁడు, వేగవంతుఁడు, జయశీలుఁడు, గమనించు స్వభావము కల వాఁడు, (అనఁగానొకనిదగ్గఱనిలిచి యుండనివాఁడని తా॥) రథికశ్రేష్ఠుఁడు, హింసిం

పఁబడనివాఁడు, ఉదకమును వృద్ధినొందించువాఁడు, నగునింద్రుని రక్షణను గోరి యభిముఖునిగాఁ జేయుఁడు. (స్తుతింపుఁడని తా॥)

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౨౮౪. మోషుత్వా వాఘతశ్చ నారే అస్మన్ని రీరమన్। ఆరాత్తాద్వా సధ
మాదం న ఆగహీహ వాసన్నుపశ్రుధి॥

ఓ యింద్రా! నిన్ను యజమానులుకూడ మాకుదూరముగా విహరింపనివ్వకుందురుగాక. కనుక నీవు మాయాగమునకు సమీపమునఁ జక్కఁగా రమ్ము. ఇక్కడం గూడనున్న వాఁడవగుచు మాస్తుతి వినుము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౨౮౫, సునోత సోమపావ్నే సోమ మింద్రాయ వజ్రిణే। పచతా పక్తీరవ
సేకృణుధ్వ మిత్పృణన్నిత్పృణతే మయః

ఓ నాగారలారా! వజ్రముకలవాఁడు, సోమపానము చేయుఁవాఁడు, నగునింద్రునికొఱకు సోమమును నభిషవించుఁడు. ఇంద్రుని దృప్తిపఱచుటకు వండవలసిన వస్తువులను వంటచేయుఁడు. ఇంద్రుఁడు సుఖమును యజమానునకుఁ గలిగించుచునే హవిస్సులను స్వీకరించునుగదా!

శంయుఋషి-బృహతీ-ఛంద-ఇంద్రదేవత.

౨౮౬. యస్సత్రాహా విచర్షణి రిన్ద్రం తగ్ం హూమహే వయం। సహస్ర
మన్యో తువినృమ్ణ సత్పతే భవా సమత్సునో వృధే॥

ఏ యింద్రుఁడు గొప్ప శత్రువులను జంపినవాఁడు, సర్వమును బాగుగాఁ జూచువాఁడునయి యున్నాఁడో అట్టివానిని బిలుచుచున్నాము. వేయి విధముల (శత్రువులను జంపు) కోపము గలవాఁడా! బహు ధనవంతుఁడా! సత్పురుషులఁ బాలించువాఁడా! యింద్రా! యుద్ధములందు మావృద్ధిని గలిగింపుము.

పురుచ్ఛేపఋషి-బృహతిఛంద-అశ్విద్వయ దేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨ర
౨౮౭. శచీభిర్నశ్శచీవసూ దివా నక్తం దిశస్యత్। మావాగ్ం రాతిరూప
౩ ౨ ౩ ౨ఉ ౩౨ ౩ ౨ ౩ ౨
దసత్కదాచనాస్మద్రాతిః కదాచ న॥

కర్మలు ధనముగాఁ గలవారగు నశ్వినులారా! మీరు మా కర్మలతో రాత్రింబవళ్ళు వరములిందు. మీ దానము ఎల్లపుడును క్షీణింపకుండుఁగాక. మా దానముకూడ (అనఁగ హవిస్సులను దేవతల కిచ్చుటని తా॥) ఎల్లపుడును క్షీణింపకుండుఁగాక.

వామదేవఋషి-బృహతిఛంద-ఇంద్రదేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ర ౩ ౧౨
౨౮౮ యదాకదాచ మీఢుషే స్తోతా జరేత మర్త్యః। ఆదిద్వందేత వరుణం
౩ ౨ ౩ ౨౩ ౨౩ ౧ ౨
విపా గిరాధర్తారం వివ్రతానాం॥

ఏ కాలమందు హవిస్సు లిచ్చు యజమానుని యాగముకొఱకు స్తుతికర్త (ఉద్గాతయని తా॥) స్తుతించునో, ఆ వెంటనే పాపమును వారించునట్టి, వివిధ కర్మలను ధరించునట్టి, వరుణదేవుని విశేషముగా రక్షించునట్టి స్తుతితో స్తుతించును.

మేధ్యాతిథిఋషి-బృహతిఛంద-ఇంద్ర దేవత.

౩ ౧ ౨ర౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ర ౩
౨౮౯. పాహిగా అంధ సో మద ఇంద్రాయ మేధ్యాతిథే। యః సంమిశ్లో
౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
హర్యోర్యో హిరణ్యయ ఇంద్రోవజ్రీ హిరణ్యయః॥

ఓ యింద్రా! యజ్ఞార్హుఁడగు నతిధీ! త్రావిన సోమముయొక్క మదము కలిగినపుడు నీవు మాప్రజలను రక్షింపుము. ఏ యింద్రుఁడు రెండు గుఱ్ఱములను దన రథమందుఁ గూర్చినవాఁడగుచున్నాఁడో, యే యింద్రుఁడు వజ్రము ధరించెనో, యెవని రథము బంగారుతోఁ జేయఁబడెనో (ఆ యింద్రుఁడని పూర్వాన్వయము.)

భర్గఋషి-బృహతిఛంద-ఇంద్ర దేవత.

౩౧ ౨ ౩౧.౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౨ర ౩ ౧ ౩
౨౯౦. ఉభయగ్ంం శ్రుణవచ్చ న ఇంద్రో అర్వాగిదం సచః। సత్రాచ్యా
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧౨
మఘవా త సోమపీతయే ధియాశవిష్ఠ ఆగమత్॥

స్తోత్రశస్త్రరూపమైన యీ రెండు విధములగు వాక్కును మా కభిముఖముగా నింద్రుఁడు వినుఁగాక. (స్తోత్రము=పాఠరూపము. శస్త్రము=గానరూపము) మా యాగమును గౌరవించు బుద్ధితోఁ గూడినవాఁడగుచు నింద్రుఁడు మహాబలవంతుఁడై సోమపానముకొఱకు వచ్చుంగాక.

మేధాతిథి మేధ్యాతిథులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩ ౨౩ ౧ ౨ ౩ ౧౨ ౩౧ ౨ ౨ ౩౧ ౨ ౩
౨౯౧. మహేచ న త్వాద్రివః పరాశుల్కాయ దీయసే। న సహస్రాయ
౧ ౨ర ౩ ౨౩ ౧ ౨
నాయుతాయ వజ్రివో న శతాయ శతామఘ॥

వజ్రముకల యింద్రా! గొప్ప విలువకొఱకు నేను నిన్ను విక్రయింపలేదు. వజ్రహస్తుఁడవయి బహు ధనములుగల యింద్రా! వేలకొలది ధనములకుఁ గాని, పదివేల ధనమునకుఁగాని, బహుధనములకుఁగాని నిన్ను నేను అమ్మలేదు. (అనఁగా నంతంత ధనమిచ్చినను నిన్ను విడువను. అనేక హవిస్సులతో నిన్ను సేవింతును అని తాత్పర్యము.)

మేధ్యాతిథి మేధాతిథి ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౯౨. వస్యాగ్ం ఇంద్రాసి మే పితురుత భ్రాతురభుఞ్జతః। మాతాచ మే ఛదయథః సమా వసో వసుత్వనాయ రాధసే।

ఇంద్రా! నీవు మా తండ్రికంటెనుంగూడ ధనవంతుడవగుదువు మఱియు బాలింపనట్టి నా యన్న తమ్మునికంటెను ధనాధికుఁడవగుచున్నావు. నివాసాధారుఁడవగు నింద్రా! నాతల్లియు, నీవును సమానులయి యన్నమునకు ధనమునకు నన్నాదరించుచున్నారు.

తృతీయాధ్యాయ షష్ఠ ఖండము పూర్ణము,

—:०:—

౪ అధ్యాయము.

౭ ఖండము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౯౩. ఇమ ఇంద్రాయ సున్విరే సోమాసో దధ్యాశిరః। తాగ్ం ఆమదాయ వజ్రహస్త పీతయే హరిభ్యాం యాహ్యోక ఆ॥

ఓ వజ్రహస్తుఁడా! పెఱుగుతోఁ గలిసిన యివిగో సోమరసములు. ఇంద్రుఁడవగు నీ కొఱకు నభిషవింపఁబడియున్నవి. ఆ సోమరసములను మదమునకై పానముఁజేయ యాగ గృహమునకు రెండు గుఱ్ఱములతో రమ్ము.

వామదేవఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత,

౨౯౪. ఇమ ఇంద్ర మదాయ తే సోమాశ్చికిత్ర ఉక్థినః। సుధాంపపాన ఉప
నోగిర శ్శృణు రాస్వ స్తోత్రాయ గిర్వణః

ఓ యింద్రా! నీ మదముకొఱకు స్తోత్రములతోఁగూడిన యీ సోమరసములు కనంబడుచున్నవి. మదకరమైన సోమమును జక్కఁగాఁ ద్రావుచు, మా స్తుతివాక్కులను వినుము. స్తుతులలో వశమగు నింద్రా! స్తుతికర్తనగు నాకొఱకు వరముల నిమ్ము.

మేధ్యాతిథి, మేధాతిథులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౯౫. ఆత్వా ౩ ద్య సర్వదుఘాం హువే గాయత్రవేపసం। ఇంద్రధేనుగ్ం
సుదుఘా మన్యా మిషమురుధారామరం కృతం।

(పాడిమొదవుగాను, వర్షరూపముగాను, వర్ణించుచు నింద్రుని స్తుతించు చున్నాఁడు.) సర్వమును బిదుకునట్టి, మెచ్చఁదగిన వేగము కలట్టి, సుఖముగాఁ బిదుకుకొనఁదగినట్టి, గోరూపమయిన యింద్రుని స్తుతించుచున్నాను. కాన బహుధారలు గలట్టి, కోరఁదగినట్టి, వర్షరూపమయిన యింకొక (వర్ష) రూపమును ధరించునట్టి, సమృద్ధిచేయునట్టి యింద్రుని స్తుతించుచున్నాను.

నోధఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨౯౬. నత్వా బృహన్తో అద్రయో వరన్త ఇంద్ర వీడవః। యచ్ఛిక్షసిస్తు
వతే మావతే వసున కిష్టదా మినాతితే।

ఓ యింద్రా! గొప్పబలవంతములు కనుకనే, దృఢములుగా నున్నను బర్వత

ములు నిన్ను వారింపఁజాలవు. స్తుతికర్తనైన నావంటివానికొఱకు ధనము నిచ్చు చున్నావు. నీ యొక్క ఆ ధనము ఎదురించి చెఱుపలేరు.

మేధాతిథిఋషి-బృహతిఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧
౨౯౭. కఈం వేద సుతే సచా పిబన్తం కద్వయో దధే। అయంయః
౨గ 3 ౨ర 3 ౨ 3 ౧ ౨
పురో విభినత్త్యోజసా మాందాన శ్శిప్ర్యంధసః॥

సోమమభిషవింపఁగా ఋత్విజులతోఁగూడ సోమమును ద్రావుచున్నయింద్రుని యెవఁడెఱుఁగును? ఏ యన్నమును ధరించుచున్నాఁడో? ఏ యింద్రుఁడు పెద్ద దవుడలు కలవాఁడు, సోమముతో మదించువాఁడునై, బలముతో శత్రువుల కోటలను భేదించుచున్నాఁడు.

వామదేవఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౨ ౧
౨౯౮. యదింద్ర శాసో అవ్రతం చ్యావయా సదసస్పరి। అస్మాకగం శుం
౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
మఘవన్ పురుస్పృహం వసవ్యే అధిబర్హయ।

ఓ యింద్రా! యేకారణమువల్ల యజ్ఞవిరోధులను శిక్షించువాఁడవు నీవయితివో, యాకారణమువల్ల మా యాగగృహమునందుంతట నున్న యాగవిరోధిని దూరము తొలఁగించుము ధనవంతుఁడవగు నింద్రా! పలువురు కోరందగిన సోమమును నివాసయోగ్యమైన స్థానమందు అధికముగా వృద్ధినొందించుము. (దీనిం బట్టి యింటి యావరణములలోఁగూడ సోమలతలను బెంచుచుండిరి పూర్వులనవచ్చునని నా యూహ.)

వామదేవఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర3
౨౯౯. త్వష్టానోదైవ్యం వచః పర్జన్యో బ్రహ్మణస్పతిః। పుత్రైర్భ్రాతృభి
౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
రదితి ర్నుపాతునోదుష్టరం త్రామణం వచః॥

(రూపాభిమానియైన) త్వష్టయను దేవత మా వాక్కును రక్షించుఁగాక. (మంత్రాభిమాన దేవతయగు) బ్రహ్మణస్పతియనెడు దేవతమావాక్కును రక్షించుఁగాక. (దేవమాతయగు అదితిదేవి తన పుత్రులతోను సోదరులతోను గూడినదై కర్మ విరోధులు చెఱుప శక్యముగానిది, రక్షింప సర్వమయినది, యగు మా వాక్కును రక్షించుఁగాక.

వాలఖిల్యులుఋషులు.-బృహతీఛంద-ఇంద్రిదేవత.

౩౦౦. కదాచ నస్తరీరసి నేంద్ర సశ్చసి దాశుషే। ఉపోపే న్ను మఘవన్
భూయ ఇ న్నుతేదానం దేవస్య పృచ్యతే॥

ఓ యింద్రా! నీవు ఒకప్పుడును హింసించువాఁడవుకావు. వట్టిపోయిన యావు వంటివాఁడవుకావు. (పాలుత్రాగు దూడ దానికి లేనందున నింటికది రాదు. అట్లు నీవు యింటికి రాకపోవని తా॥) మఱేమన, యాగకర్తను జేరుదువు. ఓ యింద్రా! నీ యొక్క విస్తారమయిన ధనము మాకుఁ జెందుచున్నది.

మేధాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౦౧. యుంక్ష్వాహి వృత్రహన్తమ హరీ ఇంద్ర పరావతః। అర్వాచీనో మఘ
వంత సోమపీతయ ఉగ్ర ఋష్వేభిరాగహి॥

గట్టిగా వృత్రసిం జంపిన యింద్రా! రథమందు నీ గుఱ్ఱములను రెంటిని బూన్పుము. ఓ యింద్రా! యతి బలవంతుఁడవగు నీవు సోమపానము కొఱకై యభిముఖులైన మరుత్తులతోఁగూడ ద్యులోకమునుండి రమ్ము.

నృమేధఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౦౨. త్వామిదా హ్యో నరో౽పీప్యన్ వజ్రిన్ భూర్ణయః। స ఇంద్ర స్తోమవాహస ఇహ శ్రుధ్యుపస్వ సరమాగహి॥

ఓ వజ్రాయుధధారీ! హవిస్సులభరించునట్టి యేయజమానులు నిన్నీ నాఁడును, నిన్నటిదినమునను, సోమముత్రావించిరి? ఇంద్రా! స్తుతులఁబఠించుచున్న మా స్తోత్రమును యాగమందువినుము. గృహమునుగూర్చిరమ్ము.

తృతీయాధ్యాయ సప్తమ ఖండముసమాప్తము.

౩ అధ్యాయము.

౮ ఖండము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౦౩. ప్రత్యు అద ర్శ్యా యత్యూ౩ చ్ఛన్తీ దుహితాదివః। అపోమహీవృణుతే చక్షుషాత మోజ్యోతిష్కృణోతి సూనరీ॥

వచ్చుచున్నదై చీఁకటినిదొలఁగించుచున్నది. ద్యులోకమునకుఁ గూతురైన యుష యందఱకునుగనంబడెను అదిగొప్పది. తనదర్శనము చేతనే యధికమైన చీఁకటినిఁ దొలగించుచున్నది. ఇట్టిదై నరులను నడిపించుచున్నదై వెలుఁగుగలిగించుచున్నది.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౩౦౪. ఇమా ఉవాం దివిష్టయ ఉస్రాహవన్తే అశ్వినా। అయంవామహ్వేऽవసే
౩ ౧ ౨ ౩ ౧ ౨ర
శచీవసూ విశం విశగ్ం హిగచ్ఛథః॥

స్వర్గముంగోరిన యీ ప్రజలు (అనఁగా ఋత్విజులు) కూడ నశ్వినులారా! నివాసాధార భూతులయిన మిమ్ముఁ బిలుచుచున్నారు. ఓ కర్మధనులారా! నేను (వశిష్ఠుఁడను) మిమ్ము రక్షణకై పిలుచుచున్నాను. ఏమంటే.-మీరు ప్రతినరునివద్దకును బోవుదురు కనుక.

అశ్వినులు (వివస్వత్పుత్రులు) ఋషులు బృహతీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
౩౦౫. కుష్ఠః కో వామశ్వినా తపానో దేవామర్త్యః। ఘ్నతా వామశ్మయా క్షప
౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨
మాణోగ్ం శునేత్థము ఆద్వన్యథా॥

ఓ యశ్వినీదేవతలారా! భూమిమీఁదనున్న యేమనుష్యుఁడు (స్తుతికర్త) ప్రకాశింపఁజేయఁగలఁడు? (ఎవఁడును మీగుణములు ప్రకటింపఁజాలఁడని తా॥) మీకై సోమము నభిషవింపుశిలలతోఁ జనకఁగొట్టి పిండఁబడుచున్న సోమముతో క్షీణించుచున్న యజమానుఁడిట్లే (అనఁగా, ఇష్టములైనయన్నరసములు భక్షించురాజు మొదలగు ధనికుఁడెట్లు (వృద్ధినొందెనో) అట్లు వృద్ధినొందును.

ప్రస్కణ్వఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౧ ౨
౩౦౬. అయం వాం మధుమత్తమ స్సుతః సోమో దివిష్టిషు। తమశ్వినాపిబతం
౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
తిరో అహ్న్యం ధత్తగ్ం రత్నాని దాశుషే॥

ఓ యశ్వనీదేవతలారా! మీా యాగములందు ఇదిగో యీా సోమము అత్యంత మధురమయినది అభిషవింపఁబడినది. నిన్న నభిషవించిన యా సోమమును బానము చేయుఁడు. యాగకర్తకు నిష్టఫలములను ఇందు.

మేధాతిథి-మేధ్యాతిథులు ఋషులు-బృహతీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧
౩౦౭. ఆత్వాసోమస్య గల్దయా సదా యాచన్నహంజ్యా। భూణిం మృగం
౨ర ౩ ౧ ౨ర ౩ ౧ ౨
నస వనేషు చక్రుధం క ఈశానం నయాచిషత్॥

ఓ యింద్రా! నిన్నుగుఱించి యాగములందు సోమమును గార్చుటతోను, జయశీలమగు స్తవముతోడను, గూడుకొని యున్న నేను సర్వకాలములందును సింహామువంటి ప్రభువగు నిన్ను యాచించుచు బ్రతిమాలుచున్నాను. ప్రభువును యాచింపనివాఁడు లోకమున నెవఁడుండును? (అందఱును యాచింతురు. ప్రభువు లద్దానికిఁ గోపింపరు అని తా॥)

దేవాతిథిఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౨ఉ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౩౧౮. అధ్వరో ద్రావయా త్వగ్ం సోమ మింద్రః పిపాసతి! ఉపోనూనం యు
౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
యుజే వృషణా హరీ ఆచజగామవృత్రహా॥

ఓ అధ్వర్యుఁడా! (యాగమునడిపించు ముఖ్యఋత్విజుని పేరు.) నీవు సోమము నభిషవించుము (=కార్చుము). ఏమంటే-ఇంద్రుఁడు త్రావఁదలంచియున్నాఁడు. వర్షమును గురియించు గుఱ్ఱముల రెంటిని రథమందు సారథిసమీాపించి పూన్చినాఁడు. వృత్రునింజంపిన యింద్రుఁడును వచ్చినాఁడు. (కనుక కార్చుమని యన్వయము)

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత

౩౦౯. అభీషతస్తదా భరేంద్ర జ్యాయః కనీయసః। పురూవసు హిఽమ
ఘవన్ బభూవిథ భరే భరేచ హవ్యః॥

పెద్దవాఁడవగు నింద్రా! చిన్నవాఁడనగు నాకు నా ధనమును దెచ్చి యిమ్ము. ఓ ధనవంతుఁడా! పలువురు ప్రార్థించువాఁడవునీవు. ప్రతి యుద్ధమందును బిలువందగినవాఁడవు నయి యున్నావు.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౧౦. యదింద్ర యావత స్త్వమేతావ దహమీశీయ। స్తోతార మిద్దధిషే
రదావసో న పాప త్వాయరగ్ంసిషం॥

ఓ యింద్రా! యెంతధనమునకు నీవీశ్వరుఁడవో యంతధనమునకును నేనధికారి నగుచున్నాను. ధనదాతవగునింద్రా! మాస్తుతికర్తనుధనముతోఁబోషింతును, చెడఁగొట్టుటకు నివ్వను. (అనఁగా దుర్వ్యయము చేయువానికివ్వనని తా॥)

నృమేధఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత

౩౧౧. త్వమింద్ర ప్రతూర్తిష్వభి విశ్వా అసి స్పృధః। అశస్తిహా జనితా
వృత్రతూరసి త్వంతుర్య తరుష్యతః॥

ఓ యింద్రా! నీవు యుద్ధములందు శత్రుసేనలనన్నిఁటిని దిరస్కరించుచున్నావు. శత్రుహంతవగునింద్రా! హఠాత్తుగావచ్చిన యాపదలను దొలగించువాఁడవు. అసురుల కాపదలనుగలిగించు వాఁడవగుచున్నావు. హింసకులనుహింసింతువు.

నోధఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత,

౧ ౨౮౩౧ ౨౮ ౩౧ ౨౮ ౩౧౨ ౧౨ ౩ ౧౨ ౩
౩౧౨. ప్రియోరి రిషు ఓజ సా దివ స్సదోభ్యస్సరి। నత్వా వివ్యాచ రజ ఇంద్ర
౧౨౩ ౨౩ ౧ ౨
పార్థివ మతి విశ్వం వవక్షి॥

ఓ యింద్రా! యేనీవుద్యులోకస్థానములకంటెను అధికముగా వ్యాపించినావు. మఱియునింద్రా! భూమియందలిప్రజలును నిన్ను శరీరములతో బలముతోమించ లేరు. కనుకనోయీ! ప్రపంచమునంతటిని వహింపసమర్థుఁడవగుచున్నావు. లేకవ హించుచున్నావు

తృతీయాధ్యాయమున నష్టమఖండము పూర్ణము.

౩ అధ్యాయము.

౯. ఖండము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧౨ ౩౧ ౨౮ ౩ ౨ ౩క ౨౮౩ ౧ ౨ ౩౧ ౨
౩౧౩. అసావి దేవం గో ఋజీక మంధో న్యస్మిన్నింద్రో జనుషే। ముపోచ
౧౨ ౩ ౧ ౨౮ ౩ ౨ ౩ ౧ ౩ ౧౨
బోధామసి త్వా హర్యశ్వ యజ్ఞైర్బోధా న స్తోమ మంధసోమదేషు॥

ప్రకాశించుచుగోక్షీరముతోఁగలిసిన సోమరూపాన్నము అభిషవింపఁబడినది (అభిషవము=పంచిరసముపిండుట) ఈ యింద్రుఁడు ఈ యభిషవించిన సోమమునం దుఁగూడియుండును. ఓ యింద్రా! నిన్ను హవిస్సులతో మేల్కొల్పుచున్నాము. సోమముయొక్క మదములుగలిగినపుడు నీవుమాస్తవములనువినుము.

వశిష్ఠఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౩౧౪. యోనిష్ట ఇంద్ర సదనే అకారి తమా నృభిః పురుహూత ప్రయాహి
అసో యథా నోZవితా వృధశ్చిద్దదో వసూని మమదశ్చ సోమైః॥

ఓ యింద్రా! నీకునివాసస్థానమునిర్మింపఁబడెను. పలువురచేత స్తుతింపఁబడిన వాఁడా! నాయకులైనమరుత్తులతోఁగూడ ఆస్థానమునకురమ్ము. మాకెల్లనురక్షకుఁడవయియున్నావు. మావృద్ధికొఱకు (వరముల) నిమ్ము. మాసోమములతో మదించుము.

గాతుఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౩౧౫. అదర్దరుత్సమ సృజో వి ఖాని త్వమర్ణవా న్బద్బధానాగం అరమ్ణాః।
మహాన్త మిందర్ పర్వతం వి యద్వః సృజ ద్ధారా అవ యద్దానవాన్
హన్॥

ఓ యింద్రా! నీవుస్రవించుచున్న మేఘమునుబ్రద్దలుసేసితివి తర్వాత మేఘమందున్న యుదకములువెడలుమార్గములను సృజించితివి. బాధింపఁబడుచున్న మేఘములను (నీరు) కారించుచున్నావు. ఇంద్రా! యేనీవుగొప్పమేఘమును చెఱచితివో, ఉదకమునిచ్చు మేఘములను (దానవ=దనువుపుత్రులు-మేఘములని తా॥) ఎప్పుడు కొట్టితివో అపుడుదకముల కార్చితివి.

(వేనపుత్ర) పృథుఋషి బృహతీఛంద-ఇంద్రదేవత.

౩౧౬. సుష్వాణాస ఇంద్ర స్తుమసి త్వా ససవ్యాన్స శ్చితువినృమ్ణ వాజం।
ఆ నో భర సువితం యస్యకోనా తనా త్మనా సహ్యామ త్వోతాః॥

ఓ యింద్రా! సోమమునభిషవించుచున్న మేము నిన్ను స్తుతించుచున్నాము. బహుధనముగలవాఁడా! హవిస్సునిచ్చుచు నిన్ను స్తుతింతుము. నీచేత మేము రక్షింపఁబడినవారమై విస్తారమైనధనములను స్వాయముగానే పొందఁగలము. కనుక బాగుగాఁ బొందఁదగిన ధనమును మాకునిమ్ము.

సప్తగుఋషి-బృహతిఛంద-ఇంద్రదేవత.

౩ ౨ ౩ ౧౨ ౩ ౧౨ ౩౧ ౨ ౩ ౧ ౨
౩౧౭. జగృహ్మా తే దక్షిణమింద్ర హస్తం వసూయవో వసుపతే వసూనాం।
౩ ౨ఉ ౩ ౧౨ ౩౧౨ ౩౧౨ ౩౧ ౨ర
విద్మాహి త్వా గోపతిగ్ం శూరగోనా మస్మభ్యం చిత్రం వృషణగ్ం
౩౧ ౨
రయిందాః॥

ధనములకుస్వామివగు నింద్రా! నీకుడిచేయిని ధనముకోరుచున్న మేముపట్టుకొనుచున్నాము. ఓ శూరుఁడా! బహుగోవులకీశ్వరుఁడవని నిన్ను దెలియుచున్నాము. కనుకమాకు సంపాదింపఁదగినది, వర్షముకురియించునది, యగుధనమునుగలిగింపుము.

వశిష్ఠఋషి-బృహతిఛంద-ఇంద్రదేవత.

౨ ౩౧౨ ౩ ౧౨ ౩ ౧ ౨ర ౩౧౨౩ ౨౩ ౨
౩౧౮. ఇంద్రంనరో నేమధితా హవన్తే యత్పార్యా యునజతే ధియస్తాః।
౨౩ ౧౨ ౩ ౧౨౩ ౨౩ ౧ ౨ర ౩౧ ౨౩ ౧ ౨
శూరో నృషాతా శ్రవసశ్చ కామ ఽగోమతి వ్రజే భజా త్వంనః॥

యుద్ధమున మరణమునకు నిమిత్తములయిన పనులెపుడుగల్గునో యపుడు యుద్ధనాయకులు యుద్ధమందు నేయింద్రుని బిలుతురు. ఇంద్రా? ఆనీవుశూరుఁడవు. నరులతోఁగలిసి యుండువాఁడవు. అన్నముకోరినపుడు గోవులమందలోమమ్ము భాగముకలవారినిగాఁ జేయుము.

గౌరివీతిఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౩౧౯. వయస్సుపర్ణా ఉపసే దురింద్రం ప్రియమేధా ఋషయో నాధ
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౧ ౨ర ౩ ౨ ౨ ౩౧ ౨
మానాః। అపధ్వాన్త మూర్ణుహి పూర్ధి చక్షుర్ముముగ్ధ్యా౩స్మాన్నిధయేవ
౩ ౨
బద్ధాన్.

పరిసరించుచున్న సూర్యకిరణములు యజ్ఞమందుఁ బ్రీతికలవై చూచుచున్నవియుఁ, బ్రజ్ఞనుగోరుచున్నవియు నగుచు నింద్రునిజేరుచున్నవి. ఓ యింద్రా! చీకటిని బరిహరింపుము. దృష్టినిసంపూర్ణముచేయుము. తేజస్సునుగూడఁ బూరించుము. త్రాడుచేఁ గట్టఁబడినవారిని విడిపించునట్లుమము (చీకటినుండి) విడిపించుము.

భార్గవఋషి-బృహతీఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౩౨౦. నాకే సుపర్ణముప యత్పతన్తగ్ం హృదా వేనన్తో అభ్య చక్షత త్వా।
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
హిరణ్యపక్షం వరుణస్య దూతం యమస్య యోనౌ శకునంభురణ్యం॥

ఓ వేనుఁడా? (నిన్ను) మనసుతోస్తుతికర్తలు కోరుచున్నవారై యంతరిక్షమందు బాగుగానెగురువానినిగాను, బంగారు రెక్కలుగలవానింగాను, వరుణదేవుని దూతగాను, మెఱుపునకుంజోటైన యంతరిక్షమందుఁ బక్షిరూపమున నెగురువానింగాను, (వర్ష దానమువల్ల) ప్రపంచమునంతటినింబోషించువానింగాను, నిన్నుఁజూచుచున్నారు (వేనుఁడని యొకగంధర్వుఁడు-సుందరుఁడు.)

బృహస్పతి లేక నకులుఁడుఋషి-బృహతీ-ఛంద-వేన దేవత.

౧ ౨ ౩ ౧ ౨౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౩౨౧. బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్వి సీమత స్సురుచో వేన ఆవః।
౨౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
సబుధ్న్యా ఉపమా అస్య విష్ఠాః సతశ్చ యోని మసతశ్చ వివః॥

ఆవేనఁడు పూర్వకాలమందుఁబుట్టిన బ్రహ్మజాతిరూపమయిన శరీరము (అయి యున్నాఁడు.) కనుకనే-అందఱికిఁ గనంబడుచున్న కాంతికిరక్షకుఁడు. ఆతఁడు అంతరిక్షమందలి కాన్తులను విస్తరింపఁజేసెను. ఇపుడున్న ముందురాఁబోవునట్టి నివాసస్థానమును లేకఉత్పత్తి కారణమునుగలిగించెను.

సుహోత్రఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత

౧ ౨　　౩౧౨　　౩౧　౩౧ ౨　౩౧౨　౨ ౧ ౩
౩౨౨. అపూర్వ్యా పురుతమాన్ యస్మై మహే వీరాయ తవసే తురాయ।
౩ ౧ ౨　౩ ౨ ౩　౧ ౨　౩　౧ ౨　　౩　౧ ౨
విరప్శినే వజ్రిణే శన్తమాని వచాగ్ంసి యస్మై స్థవిరాయ తక్షుః॥

పూర్వులురచింపని యనేకసుఖకరములైన స్తుతివాక్యములను గొప్పవాఁడును, వీరుఁడును, బలవంతుఁడును,త్వరగలవాఁడు,విశేషముగస్తుతింపఁదగినవాఁడు, వజ్రము ధరించినవాఁడు,చాలకాలమునాటివాఁడునగు నింద్రునికొఱకు (స్తుతికర్తలు) రచించిరి.

ఇట్లు తృతీయాధ్యాయ నవమఖండముపూర్ణము.

———:o:———

౩ అధ్యాయము.

౧౦ ఖండము.

ద్యుతానఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧　　౨ ౩ ౧　　　　౩ ౨　　౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
౩౨౩. అవద్రప్సో అగ్ంశుమతీమతిష్ఠ దీయానః కృష్ణోదశభిస్సహస్రైః।
౨ ౩ ౨ఉ　౩ ౨ ౩　౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨　　౩ ౧ ౨　　౩ ౨
ఆవత్తమింద్రశ్శచ్యా ధమన్తముప స్నీహితిం నృమణా అపద్రాః॥

శీఘ్రముగా నడచుచుఁ బదివేల యసురులతోఁ గూడినవాఁడై కృష్ణుఁడను నసురుఁడు అంశుమతియనెడు నదిని (ఆవరించి) యుండెను. తన ప్రజ్ఞచేత (శచీ=శక్తి లేక ప్రజ్ఞ) (ఉదకమధ్యమున) ఊపిరిదీసికొనుచున్న లేక భయంకరముగా ధ్వనించుచున్న ఆకృష్ణాసురుని యింద్రుఁడు మరుత్తులతోఁ గూడి సమీపించెను. తర్వాత నరులందు బ్రేమగల్గిన యింద్రుఁడు ఆతనిని యతనిసహచారులను జంపెను.

ద్యుతానఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

3 ౨౮. వృత్రస్య త్వా శ్వసథాదీషమాణా విశ్వే దేవా అజహుర్యే సఖాయః
మరుద్భిరింద్ర సఖ్యం తే అస్త్వథేమా విశ్వాః పృతనా జయాసి॥

ఇంద్రా నీకు యుద్ధమందు మొదట సర్వదేవతలు సహాయులై వచ్చి వృత్రాసురుని ఉచ్ఛ్వాసనిశ్వాసలవల్ల భయపడి పరువెత్తిపారిపోవుచు నిన్ను (యుద్ధమందు) వదలిపెట్టిరి ఓ యింద్రా! మరుత్తులతో నీకు సఖ్యము కల్గుఁగాక. ఏమరుత్తులు నిన్ను వదిలిపెట్టకుండనుండిరో (అట్టి) ఈసర్వసేనలను తర్వాత నీవొక్కఁడవే జయించుచున్నావు. (జయించితివని తా॥)

బృహదుక్థఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

3 ౨౯. విధుం దద్రాణగ్ం సమనే బహూనాం యువానగ్ం సంతం పలితో
జగార। దేవస్య పశ్య కావ్యం మహిత్వాద్యా మమార స హ్యః
సమాన॥

(ఇంద్రుఁడు కాలస్వరూపుఁడని యిందుస్తుతింపఁబడె.) (సర్వమును) జేయువాఁడు, యుద్ధమందుఁ బలువురను బాఱఁదోలువాఁడు, పిన్నవయసువాఁడును, అగు పురుషుని ముసలితనము మ్రింగివేయుచున్నది. (ఇట్టికాలస్వరూపియైన) యింద్రుని.

యొక్క మహాకార్యమును (అనఁగాఁ బ్రాణులకు ముసలితనముఁగలిగించుట)(ఓ బృహదుక్థరుషీ¡) చూడుమా! ఎవఁడు ఈనాఁడుచనిపోయెనో వాఁడు రేపటిదినము బ్రతుకుచున్నాఁడు. (అనఁగాఁబునర్జన్మ నొందుచున్నాడని, ఆత్మనిత్యమని తా॥)

ద్యుతానఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత

3.౨౬. త్వగ్ం హత్యాన్స్ప్తభ్యో జాయమానోzశత్రుభ్యో అభవశ్శత్రురిన్ద్ర। గూఢే
ద్యావాపృథివీ అన్వవిన్దో విభుమద్భ్యో భువనేభ్యో రణంధాః॥

ఓ యింద్రా! నీవుపుట్టఁగానే (అదివరకెవరునుదమకు) శత్రువులు లేనియేడ్గురకు (కృష్ణ-వృత్ర-నముచి-శంబర-మొద॥) శత్రువవయితివి. (వీరందఱు కర్మవిఘ్నకారులు. వారినిజంపె నింద్రుఁడు) ఓ యింద్రుఁడా! మూఁతపడియున్న భూమ్యంతరిక్షములను (సూర్యరూపుఁడవై ప్రకాశింపఁజేసి) పొందితివి. విరివియయిన లోకములకుఁ సుఖమునుగలిగించితివి.

వామదేవఋషి-బృహతీఛంద-ఇంద్రదేవత.

3.౨౭. మేడింనత్వా వజ్రిణం భృష్టిమన్తం పురుధస్మానం వృషభగ్ం స్థిర
ప్స్నుం। కరోష్యర్య స్తరుషీర్దువస్యు రింద్రద్యుక్షం వృత్రహణంగృణీషే!

ఓ యింద్రా! పరిచర్యనుగోరుచున్న నీవు శత్రువులను క్షీణించువారింగాఁజేసితివి కనుకమాధ్యమిక వాక్కునువలె (వర్షముకురియించుధ్వని) మేఘమును జీల్చునట్టి, ద్యులోకమందున్నట్టి, బహూదకములధరించునట్టి, పలువురశత్రువులజంపునట్టి, వర్షముకురియించునట్టి, స్థిరరూపముగలట్టి, వజ్రముగలట్టి, భృష్టియను నాయుధముగలట్టి, నిన్నుస్తుతించుచున్నాను.

వశిష్ఠఋషి-విరాట్ఛంద-ఇంద్రదేవత.

3౨౮. ప్రవో మహే మహేవృధే భరధ్వం ప్రచేతసే ప్రసుమతిం కృణుధ్వం। విశః
పూర్వీః ప్రచర చర్షణిప్రాః॥

ఓ మావారలారా! మీరుగొప్పవృద్ధిని గలిగించు మహాత్ముఁడైన యింద్రునికొఱకు (సోమము) సిద్ధముచేయుఁడు. అధికజ్ఞానముగల యింద్రునకు స్తుతిని జేయుఁడు ఓ యింద్రుఁడా! ప్రజలకుసమృద్ధినిగలిగించు నీవు (హవిస్సులను) పూరించు ప్రజలవద్దకుఁ జేరుము.

విశ్వామిత్రఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3౨౯. శునగ్ం హువేమ మఘవాన మింద్ర మస్మిన్ భరే నృతమం వాజ
సాతౌ। శృణ్వన్త ముగ్ర మూతయే సమత్సు ఘ్నన్తం వృత్రాణి
సంజితం ధనాని॥

ఓ యింద్రా! అన్నలాభముకలయుద్ధమందు ఉప్పొంగినట్టి, ధనవంతుఁడగునట్టి నరులలోశ్రేష్ఠుఁడైన యింద్రుని నిన్ను మేము (కుశికులు) పిలుచుచున్నాము. (పిలుపులను) వినుచున్నట్టి, మహాబలుఁడగునట్టి, యుద్ధములందు శాత్రవులంజంపుచున్నట్టి, చక్కఁగాజయించునట్టి, నిన్నురక్షణముకొఱకు మేముపిలుచుచున్నాము.

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

33౦. ఉదుబ్రహ్మాణ్యైరత శ్రవస్యేంద్రగ్ం సమర్యే మహయా వశిష్ఠ। ఆయో
విశ్వాని శ్రవసా తతానో పశ్రోతా మ ఈవతో వచాగ్ంసి॥

అన్నమునుగోరి యింద్రునికొఱకు స్తుతులను హవిస్సులను (ఋషులు) ప్రేరించుచున్నారు. ఓ వశిష్ఠుఁడా! నీవుకూడ యజ్ఞమందు నింద్రుని బూజించుము. ఏ యింద్రుఁడు లోకములను అన్నముతో విస్తరించెనో, ఆయింద్రుఁడు సేవకుఁడనగు నాస్తుతి వాక్కులను వినుఁగాక.

గౌరవీతిఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత

33౧. చక్రం యదస్యాప్స్వా నిషత్తముతో తదస్మై మధ్వచ్ఛద్యాత్ ।
పృథివ్యా మతిషితం యదూధః పయోగోష్వ దధా ఓషధీషు॥

ఈ యింద్రునియొక్క చక్రము (=ఆయుధము) అంతరిక్షమునందు నంతటవ్యాపించెను. (మేఘముచీల్చుటకని తా॥) మఱియు నీ యింద్రునికొఱకు నుదకమును గూడవశపఱచును (ఆయుధముకర్త). భూమియందు విసువంబడిన యే యుదకము కలదో, ఆయుదకమును గోవులందును ఓషధులందును (=చెట్లుచేమ లోషధులనంబడును) నిల్పుచున్నాఁడు. (ఆనీరుత్రాగి గోవులుపాలను, ఓషధులుపంటను బ్రజల కిచ్చునని తా॥)

తృతీయాధ్యాయ దశమఖండము పూర్ణమయ్యె

3 అధ్యాయము.

౧౧ ఖండము.

(తార్క్ష్యపుత్ర) అరిష్టనేమిఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

33౨. త్యమూషు వాజినం దేవజూతగ్ంసహోవానం తరుతారగ్ం రథానాం
అరిష్టనేమిం పృతనాజ మాశుగ్ం స్వస్తయే తార్క్ష్య మిహాహువేమ॥

అత్రృక్షపుత్రుఁడయిన సుపర్ణుని (=గరుత్మంతుని) ఈకర్మయందు ఆహ్వానించుచున్నాము. (ఆతఁడెట్టివాఁడంటే) అన్నముకలవాఁడు - దేవతలచేత (సోమముఁదెచ్చుటకు) (బంపఁబడినవాఁడు, బలవంతుఁడు, రథములనుదాటువాఁడు, ఆయుధములకులొంగనివాఁడు, (నేమి=ఆయుధవిశేషము) సేనలంజయించువాఁడు, (నగుసుపర్ణుని సుఖముకొఱకుఁ బిలుచుచున్నాము )

భరద్వాజఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

333. త్రాతారమింద్ర మవితార మింద్రగ్ం హవే హవే సుహవగ్ం శూర మింద్రం హువేను శక్రం పురుహూత మింద్ర మిదగ్ం హవిర్మఘవా వేత్వింద్రః॥

శత్రువులనుండి రక్షించువాఁడు, కోర్కెలుతీర్చిరక్షించువాఁడు, ప్రతిపిలుపులోను సుఖముగాఁబిలువఁదగినవాఁడు, శౌర్యవంతుఁడు, సర్వకార్యసమర్థుఁడు, పలువురచేతఁ బిలువఁబడువాఁడు నగు నింద్రుని బిలుచుచున్నాము. ధనవంతుఁడయిన యింద్రుఁడు ఈ యెదుటనున్న సోమాదిహవిస్సును భక్షించుఁగాక.

వసుక్రలేక విమదఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

334. యజామహ ఇంద్రం వజ్రదక్షిణగ్ం హరీణాగ్ం రథ్యా౩విప్రవ్రతానాం। ప్రశ్మశ్రుభిర్దోధువ దూర్ధ్వధా భువద్విసేనాభిర్భయమానో విరాధసా।

వజ్రాయుధము కుడిచేతధరించినవాఁడు, పలువిధకర్మలనొనరించు గుఱ్ఱములనురథమునకుఁ బూన్చినవాఁడు, నగునింద్రుని మేముపిలుచుచున్నాము. ఆయింద్రుఁడు (సోమపానముచేసి) గడ్డమును మీసమును దుల్పుచున్నవాఁడై మీఁదికి లేచెను. తనసేనలతో (శత్రువుల) భయపెట్టుచునన్నమును స్తుతికర్తల కిచ్చుచున్నాఁడు.

వామదేవఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3 ౨౧ ౧౨ 3 ౨౧ ౧ ౨ 3 ౧౨ 3౧ ౨ 3౨
౩౩౫. సత్రాహణం దాధృషిం తుమ్ర మింద్రం మహామపారం వృషభగ్ం
3 ౧౨ ౨3 ౨ 3౧ ౨ర3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨
సువజ్రం। హన్తా యో వృత్రగ్ం సనితోత వాజం దాతా మఘాని
3 ౧ ౨ 3 ౧ ౨
మఘవా సురాధాః॥

అనేకశత్రువులఁజంపినవాఁడు, అందఱినిభయపెట్టువాఁడు, శత్రువులవెంటఁ దరుమువాఁడు, గొప్పవాఁడు, అపరిమితుఁడు, కోర్కెలవర్షించువాఁడు, మంచివజ్రాయుధముకలవాఁడు, నగు నింద్రుని మేముస్తుతించుచున్నాము ఏయింద్రుఁడు వృత్రునిఁజంపెనో, మఱియునన్నమునిచ్చునో, మంచిధనవంతుఁడో, ధనములనిచ్చునో, (అతనినిస్తుతింతుము.)

వామదేవఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3౧ ౨ 3 ౨3 ౨ 3 ౧౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౨
౩౩౬. యోనో వనుష్య న్నభిదాతి మర్త ఉగణావా మన్యమానస్తురోవా। క్షిధీ
3 ౧ ౨ర 3 ౧౨ 3 ౧౨ 3 ౧ ౨
యుధాః శవసా వా తమింద్రా భీష్యామ వృషమణస్త్వోతాః।

ఇంద్రా! యేమనుష్యుఁడు మమ్ముఁజంపఁదలఁచి మీఁదికివచ్చునో, యెవఁడు తన్నుదానే గొప్పవాఁడనని తలఁచినవాఁడై యుద్ధమునకెదిరించిన మాసేనలమీఁద నశింపఁజేయు నాయుధముతోను బలముతోను బడునో, అట్టివానిని నీచేరక్షితులమైనమేము సంహరింతుము.

వామదేవఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౨3 ౧ ౨ 3 3 3౧౨ 3 ౧౨ 3 ౧ ౨
౩౩౭. యంవృత్రేషు క్షితయ స్పర్ధమానా యంయుక్తేషు తురయన్తో హవన్తే।
౧ ౨ర 3 ౨ 3 ౨ర3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర
యగ్ం శూరసాతౌ యముపాముపజ్మన్యం విప్రాసోవాజయన్తే స ఇంద్రః॥

యుద్ధములందుఁబోరాడు మనుష్యులు ఏ యింద్రుని బిలుచుకొందురో, సన్నద్ధులై యుద్ధములందొకరినొకరు హింసించుకొనుచు యుద్ధజయార్థము జనులు ఏ యింద్రునిబిలుతురో, ఉదకముల లాభమునిమిత్తము వర్షముంగోరి యెవనిని ప్రార్థింతురో, మేధావులయిన యజమానులేయింద్రుని (హవిస్సులతో) బలవంతునిగాఁ జేయుచున్నారో, ఆయింద్రుఁడు (అనిపూర్వాన్వయము)

విశ్వామిత్రఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౩ ౨ర ౩౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౩౩౮. ఇంద్రాపర్వతా బృహతా రథేన వామీరిష ఆవహతగ్ం సువీరాః॥
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
వీతగ్ం హవ్యాన్యధ్వరేషు దేవా వర్ధేథాం గీర్భిరిడయామదన్తా॥

ఓ యింద్రపర్వతులారా! (పర్వతుఁడొకదేవత) గొప్పరథముతోవచ్చి మంచి కొమాళ్లతోఁగూడిన యన్నములను మాకొఱకుఁగొనిరండు. ఓ దేవులారా! మా యజ్ఞములందు హోమముచేయఁదగిన హవిస్సులను భక్షించుడు. మేమిచ్చు నాహారములతోను మేముచేసినస్తుతి వాక్కులతోను ఉప్పొంగివృద్ధినొందుఁడు.

రేణుఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర౩ ౨ ౩ ౧ ౨
౩౩౯. ఇంద్రాయ గిరో అనిశితసర్గా అపః ప్రైరయ త్సగరస్యబుధ్నాత్।
౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౨ ౩౨
యో అక్షేణేవ చక్రియౌ శచీభి ర్విష్వక్తస్తమ్భ పృథివీముతద్యాం॥

ఇంద్రునికొఱకు నధికముగానొనర్పంబడిన స్తుతివాక్కులతో, నంతరిక్షప్రదేశమునుండి ఉదకములను ఇంద్రుఁడుప్రేరించును. ఏ యింద్రుఁడు కర్మలతో భూమిని మఱియు ద్యులోకమును, ఇరుసుతోరథచక్రములురెండు నిలుపంబడినట్లు నిలిపెనో (ఆ యింద్రుఁడనిపూర్వాన్వయము.)

వామదేవఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౮౦. ఆత్వా సఖాయ స్సఖ్యా వవృత్యు స్తిరః పురూ చిదర్ణవాం జగమ్యాః
పితుర్నపాతమా దధీత వేధా అస్మిన్ క్షయే ప్రతరాం దీద్యానః॥

ఓ యింద్రా! స్నేహితులు (స్తుతికర్తలని తా॥) స్నేహము తో స్తుతులవల్ల నిన్నభిముఖునిం జేసికొనుచున్నారు. ఏమంటే-నీవువెనుకఁబెట్టి యన్తరిక్షమునకుం బోయితివిక మక. ఈయజ్ఞగృహమందుఁ బ్రకాశించునిందుౄఁడు యాగకార్యము నడిపించుచు తండ్రి (నైననాకు) పుత్రునిచ్చుంగాక.

గోతమఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౮౧. కో అద్యయుంక్తే ధురిగా ఋతస్య శిమీవతో భామినో దుర్హృణాయూన్। ఆసన్నేషామప్సు వాహో మయోభూన్య ఏషాం భృత్యా
మృణధత్సజీవాత్॥

ఈకర్మయందు వీర్యవంతములును, తేజోవంతములును, శత్రువులకులొంగనివియును, ఉదకములనుమోయునవియును, సుఖమును గలిగించునవియును, యాగమునకుఁ బోవునిం ద్రుని వడిగలగుఱ్ఱాల నెవఁడురథముయొక్క కాడియందు స్తోత్రముతోఁ బూన్పఁగలఁడు? ఏయజమానుఁడు ఇట్టి యింద్రాశ్వములయొక్క మోతను స్తుతించునో, ఆయజమానుఁడు జీవనవంతుఁడగును. (ఇచ్చటగుఱ్ఱాలనుచోట స్తుతివాక్కులర్థముచెప్పి వర్షముకురిపించుట మొదలగుకార్యములు వాఁటికే విశేషణములుగాఁ జేసికూడ రెండవయర్థమువ్రాసిరి)

ఇట్లు తృతీయాధ్యాయమున నేకాదశఖండము పూర్ణము.

---:o:---

## 3 అధ్యాయము.

### ౧౨ ఖండము.

మధుచ్ఛందఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ ౨ర 3 ౨ 3౧ ౨ 3౧ ౨ 3
3౪౨. గాయన్తి త్వా గాయత్రిణోऽర్చ న్త్యర్కమర్కిణః। బ్రహ్మాణస్త్వా శతక్రత
౨3 ౧ ౨
ఉద్వగ్ంశమివ యేమిరే।

బహుకర్మలుగల యింద్రా! నిన్ను ఉద్గాతలు (=సామవేద మంత్రపాఠకులు) గానము చేయుచున్నారు. ఋగ్వేదమంత్రపాఠకులు బూజించుచున్నారు బ్రహ్మ మొదలయిన ఋత్విజులు వెదురును బొడవుగా నిల్పినట్లు నిన్ను బొడవు చేయుచున్నారు. (పొగుడుచున్నారని తా॥)

మధుచ్ఛందఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౨ 3 ౧౨ 3 ౧ ౨3 ౧౨ 3౧౨ 3౧
3౪3. ఇంద్రం విశ్వా అవీవృధన్ త్సముద్రవ్యచ సంగిరః। రథీతమగ్ం రథీ
౨ ౧ ౨3 ౧౨ 3౧౨
నాం వాజనాగ్ం సత్పతింపతిం॥

మాస్తుతివాక్కులన్నియు సముద్రమంతవిశాలమయినట్టి, మహారథికుఁడయినట్టి, యన్నములకుస్వామియగునట్టి, సన్మార్గసంచారులను బాలించునట్టి, యింద్రుని ఉప్పొంగించినవి

గోతమఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3౧౨ ౨౧ ౨3 ౨ 3 ౧౨ 3 ౧౨ 3౧ ౨ ౨క ౨ర 3
3౪౪. ఇమమింద్ర సుతం పిబ జ్యేష్ఠ మమర్త్యం మదం। శుక్రస్య త్వాభ్యక్ష
౧ ౨ 3౨3 ౧ ౨
రన్ ధారా ఋతస్య సదనే॥

ప్రశస్తతమమును, మదకరమును, మరణము లేకుండఁజేయునది, (-కల్లు-నల్లమందు మొదలగుమత్తుపదార్ధములు అధికమైతే మనుష్యునిచంపుననియు సోమమెంతయెక్కువత్రాగినను జంపునది కాదనియుఁ (దాత్పర్యము) అగు నీయభిషవించిన యీ సోమమును ఇంద్రా! త్రాగుము. యజ్ఞగృహమందున్నదై దీపించుచున్న సోమము యొక్క ధారలు నీకభిముఖములై చరించుచున్నవి. (తమంతఁదామే నీవైపువచ్చుచున్నవని తా॥)

## అత్రిఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3౨ఉ 3 ౧ ౨ ౨ 3 ౧ ౨
3౮౫. యదింద్ర చిత్రమ ఇహ నాస్తిత్వాదాత మద్రివః। రాధస్తన్నో విదద్వసః
3 ౧ ౨
ఉభయాహస్త్యా భర॥

వజ్రధారీ! నానావిధకర్మలాచరించువాఁడా! లేక సంపాదింపఁదగువాఁడా! యింద్రా! యీ లోకమందేధనమయితే నాకులేదో ఆధనమును మాకు ధనమునుసంపాదించినవాఁడా! తెచ్చియిమ్ము.

## అంగిరోగోత్ర-తిరశ్చీఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౧ ౨ 3౧ ౨ 3౧౨ 3 ౧ ౨
3౮౬. శ్రుధీహవం తిరశ్చ్యా ఇంద్రయస్త్వా సపర్యతి। సువీర్యస్య గోమతో
3 ౧ ౨ 3 ౧ ౨
రాయస్పూర్ధి మహాꣳ అసి॥

ఓ యింద్రా! యెవఁడు నిన్ను బూజించుచున్నాఁడో, ఆ తిరశ్చీరఋషియొక్క (నాయొక్క) స్తోత్రమునువినుము. (విని) ఓ యింద్రా! మంచి వీర్యముగల్గి గోవులతోఁగూడిన ధనముయొక్క (దానముతో) మమ్మూఁబూరింపుము. నీవు (దేవతలందఱిలో) గొప్పవాఁడవు. (కనుక.)

గోతముఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౨ఉ
3౪౭. అసావిసోమ ఇంద్రతే శవిష్ఠ ధృష్ణవాగహి। ఆత్వా పృణక్త్వింద్రియగ్ం
3 ౨ 3 ౨ 3 ౧ ౨
రజ స్సూర్యో న రశ్మిభిః॥

ఓ యింద్రా! నీకొఱకుసోమము అభిషవింప (కార్చ) బడినది. అధికబలవంతుఁడా! శత్రువులఁబీడించువాఁడా! (యజ్ఞగృహమునకు) రమ్ము. (సోమపానమువల్ల) గలిగినసామర్థ్యము, కిరణములతో సూర్యుఁడంత రిక్షమునుబూరించునట్లు, నిన్ను బూరించుఁగాక.

కణ్వగోత్రుఁడగు నిపాతిథిఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3
3౪౮. ఏంద్ర యాహి హరిభిరుప కణ్వస్య సుష్టుతిం। దివో అముష్య శాసతో
౧ ౨ 3 ౧ ౨
దివం యయ దివావసో॥

ఓ యింద్రా! కణ్వఋషియొక్క యోగ్యమయినస్తవమును గూర్చి గుఱ్ఱములతో సమీపమునకురమ్ము. ఈ యింద్రుఁడు ద్యులోకమును శాసించుచుండఁగా నచటమేముసుఖముగ నుందుము. మెఱయుచున్నహవిస్సులుకల యింద్రా! స్వర్గమునకుం బొమ్ము.

తిరశ్చీఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3
3౪౯. ఆత్వాగిరో రథీ రివాస్థుగ సుతేషు గిర్వణః। అభిత్వా సమనూషత
౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨
గావో వత్సం న ధేనవః॥

స్తుతులకువశమగునో యింద్రా! సోమములభిషవింపంబడి యుండగా మా స్తోత్రవాక్కులు రథముమీఁదఁగూర్చున్న యోధుఁడుతాఁబోఁదలఁచిన చోటికిశీఘ్రము

పోవునట్లు నిన్ను చేరుచున్నవి. మఱియునో యింద్రా! మా వాక్కులు నిన్ను గూర్చి గోవులు దూడనుంగూర్చి ధ్వనించునట్లు ధ్వనించుచున్నవి.

విశ్వామిత్రఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౦. ఏతోన్వింద్రగ్ం స్తవామ శుద్ధగ్ం శుద్ధేనసామ్నా। శుద్ధైరుక్థైర్వా
వృధ్వాగ్ం సగ్ం శుద్ధైరాశీర్వాన్మమత్తు॥

(ఋషులు ఒకరితోనొకరు పలుకుచున్నారు.) శీఘ్రముగా దప్పకరండు. (వచ్చి) శుద్ధినిగలిగించు సామమంత్రముతో శుద్ధికారకములైన శస్త్ర మంత్రములతోను, ఇంద్రుని బాపరహితుని జేసి స్తుతింతము. (అట్లుచేసినందున) వృద్ధినొందిన ఆ యీ యింద్రుని శుద్ధినిగలిగించు స్తోత్రములతోఁ గూడినట్టి, పాలుమొదలగు వస్తువులంగలిసినట్టి, సోమము మదింపఁజేయుగాక. (అసురవధచే బ్రహ్మహత్య యింద్రునకురాగా నీసామముతో నిం. ద్రుని శుద్ధునింజేసిరట ఋషులు.)

శంయు-బార్హస్పత్యఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౧. ఓరయింవో రయింతమో యోద్యుమ్నే ద్యుమ్నవత్తమః। సోమః
సుతః స ఇంద్ర తేఽస్తి స్వధాపతే మదః

ద్వాదశఖండము సమాప్తము.

తృతీయాధ్యాయము సంపూర్ణము.

—:o:—

## ౪ అధ్యాయము.

### ౧ ఖండము.

భరద్వాజఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౨. ప్రత్యస్మై పిపీషతే విశ్వాని విదుషే భర। అరంగమాయ జగ్మయేऽ
పశ్చాదధ్వనే నరః॥

(ఓ యధ్వర్యుఁడా! =యజుర్వేదమంత్రపాఠకుఁడు) కర్మనాయకుఁడవయిన నీవు పానముచేయం దలఁచినవాఁడు, సమస్తము నెఱింగినవాఁడు, యాగములకుంబోవు వాఁడు, వెనుకనడువనివాఁడు, నగు నీయింద్రుని కొఱకు సోమమును సమర్పింపుము.

వామదేవ లేక శాకపూతఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౩. ఆనో వయో వయః శయం మహాన్తం గహ్వరేష్ఠాం మహాన్తం
పూర్వినేష్ఠాం। ఉగ్రంవచో అపావధీః॥

మిత్రమా! యింద్రా! యిట్టినీవుగొప్పదియు, పర్వతగుహాదులలో నుండునది యునగు సోమమనెడినన్నమును భక్షింపుము. (భక్షించి) పూర్వము సంసారమందు వర్తించుచున్న భయంకరమైన (అనఁగా నాకలిదప్పులతో బాధపడినపుడుగల్గిన) నా మాటనుబోఁగొట్టుము (అనఁగా దేవత్వమునిమ్మనితా॥)

ప్రియమేధఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౪. ఆత్వారథం యథోతయే సుమ్నాయ వర్తయామసి। తువికూర్మి మృతీషహ మింద్రగ్ం శవిష్ఠ సత్పతిం॥

ఓ యింద్రా! మాదక్షణకొఱకు, సుఖముకొఱకును, రథము త్రిప్పునట్లు నిన్ను (నాకభిముఖముగా) ద్రిప్పుచున్నాను. బలవంతుడవైన యింద్రా! బహు కర్మలాచరించునట్టి, హింసకులను దిరస్కరించునట్టి, సత్పురుషులఁ బాలించునట్టి, (నిన్ను ద్రిప్పుచున్నాను)

ప్రగాథఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౫. సపూర్వ్యో మహోనాం। వేన క్రతుభిరానజే యస్యద్వారా మనుః పితా దేవేషు ధియ ఆనజే॥

ఆయింద్రుఁడు ముఖ్యుఁడును, బూజ్యులైన యజమానుల యాగకర్మలచేత హవిస్సులం గోరినవాఁడును, అయివచ్చుచున్నాఁడు. ఏ యింద్రుని యుపాయములు, పనులును, ఈదేవతలమధ్యను బాలకుఁడైనమనువు ఇచ్చినవాఁడయ్యెనో (ఆయింద్రుఁడు.)

శ్యావాశ్వఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౫౬. యదీవహన్త్యాశవో భ్రాజమానా రథేష్వా। పిబన్తో మదిరం మధు తత్ర శ్రవాగ్ంసి కృణ్వతే॥

ఇంద్రా! యేయజ్ఞమునకురథములందు ప్రకాశించుచున్న మరుత్తులు శీఘ్ర గమనముగలవారై నిన్ను దెచ్చుచున్నారో, ఆయజ్ఞమందు మదముఁగలిగించునట్టి,

రుచించునట్టి, సోమమునుద్రావుచు (వర్షముద్వారా) అన్నములను (ప్రజలకు) గలిగించుచున్నారు.

శంయుఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౨ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౩
౩౪౭. త్యమువో అప్రహణం గృణీషే శవ సస్పతిం। ఇంద్రం విశ్వాసాహం
౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
నరగ్ంం శచిష్ఠం విశ్వవేదసం॥

(ఓ ఋత్విగ్యజమానులారా!) భక్తులననుగ్రహించువాఁడు, బలమునకధిపతి, సర్వశత్రులను సహించువాఁడు, నాయకుఁడు, యాగాదికర్మలందుండు వాఁడు, సర్వవిధధనములుగలవాఁడు, నగునాయింద్రుని స్తుతించుచున్నాను.

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౩ ౩ ౧ ౨ర ౩ ౧ ౩ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩
౩౪౮. దధిక్రావ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజినః। సురభినో ముఖాకరత్ప్రన
౧ ౨
ఆయూగ్ంషి తారిషత్॥

(అశ్వరూపుఁడైన యగ్ని=దధిక్రావ) జయశీలుఁడు, అశ్వరూపుఁడు, వేగముగలవాఁడు, నగుదధిక్రావదేవునియొక్క స్తుతినిజేయుచున్నాను. ఆదేవుఁడుమాయొక్క ముఖములను (అనఁగానింద్రియములను) సువాసన కలవానింగాఁ జేయుఁగాక. మాయాపులను వృద్ధినొందించుఁగాక.

మధుశ్ఛందఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౩ ౧ ౨ ర ౩ ౧ ౧ ౨ర ౨ ౩ ౧ ౨ ౩
౩౪౯. పురాంభిన్దు ర్యువా కవిరమితౌజా అజాయత। ఇంద్రో విశ్వస్య
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
కర్మణో ధర్తా వజ్రీపురుష్టుతః॥

ఈ యింద్రుఁడు (శత్రు) పురములభేదించువాఁడు, (ఎల్లపుడు) యౌవనవంతుఁడు, మేధావి, విశేషబలముకలవాఁడు, సమస్తకర్మలను ధరించువాఁడు, వజ్రమునుబట్టుకొన్నవాఁడు, పలువురచే స్తుతింపఁబడినవాఁడు నయ్యెను.

ఇట్లు చతుర్థాధ్యాయ ప్రథమఖండముపూర్ణము.

———:o:———

## ౪ అధ్యాయము.

### ౨ ఖండము.

ప్రియమేధఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ ౩ ౨౩ ౧౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩
౩౬౦. ప్రప్ర వస్త్రిష్టుభ మిషం వన్దద్వీరాయేందవే। ధియావో మేధసాతయే
౨ ౩ ౧ ౨
పురన్ధ్యా వివాసతి॥

ఓ అధ్వర్యుమొదలగు ఋత్విజులారా! మూఁడుస్తుతులతోఁగూడిన హవిస్సును వీరులనుస్తుతించునట్టి యింద్రునికొఱకు సంపాదింపుఁడు. ఆయింద్రుఁడు మిమ్ము యాగము నాచరించినందుకు గొప్పప్రజ్ఞఫలముసంపాదింపఁజేయును.

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩ ౧౨ ౩౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౩౬౧. కశ్యపస్య స్వర్విదో యావాహుః సయుజావితి। యయోర్విశ్వమపివ్రతం
౩౧ ౨౪ ౩౧ ౨
యజ్ఞంధీరా నిచాయ్య॥

సర్వజ్ఞుఁడైన (=కశ్యప) యింద్రునియొక్క యేరెండుగుఱ్ఱాలు కలవో, యే గుఱ్ఱములకు సర్వయాగములకుఁ గలిసియేపోవుట వ్రతమయియున్నదని స్వర్గస్థులైన

బుద్ధిమంతులు నిశ్చయించిచెప్పుచున్నారో, (అయింద్రుఁడని యింద్రస్తుతి.)

ప్రియమేధఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3౬౨. అర్చత ప్రార్చత నరః ప్రియమేధాసో అర్చత। అర్చన్తు పుత్రకా ఉత పురమిద్ధృష్ణ్వర్చత।

కర్మలునడిపించునట్టి ఋత్విజులారా! మీరుయింద్రునిబూజింపుఁడు. బాగుగాఁబూజింపుఁడు. ప్రియమేధర్షిగోత్రమందు బుట్టినవారలారా! మీరును బూజింపుఁడు. పుత్రులారా? మీరును బూజింపుఁడు. మఱియుస్తుతికర్తల కోర్కెలను బూరించునట్టి, శత్రులభయపెట్టునట్టి, యింద్రునిబూజింపుఁడు.

మధుచ్ఛందఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3౬3. ఉక్థమింద్రాయ శగ్ంస్యం వర్ధనం పురునిః షిధే। శక్రో యథా సుతేషు ణో రారణత్సఖ్యేషు చ॥

పలువుర (శత్రుల) వారించునట్టి యింద్రునికొఱకు వృద్ధికిసాధనమైన స్తోత్రముపఠింపఁదగియున్నది. ఇంద్రుఁడు మాపుత్రులందు సఖులందు నేవిధముగాధ్వనించుచుండునో అట్లు (స్తోత్రం పఁదగియున్నది. అనఁగా మాపుత్రులు మిత్రులు మంచివారని యింద్రుఁడు మెచ్చుకొనునట్లు స్తుతింపవలెనని తా॥)

ప్రియమేధర్షి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

3౬౪. విశ్వానరస్య వస్పతిమనానతస్య శవసః। ఏవైశ్చ చర్షణీనామూతీ హువే రథానాం॥

సకలశత్రువులకు మీఁదఁబడినవారికి లొంగనిబలమున కధిపతియగు నింద్రు నింగూర్చి యోమరుత్తులారా! మీ ప్రజలయొక్క గమనములతోడను, మీరథము ల గమనములతోడను, రక్షణమునకుఁ బిలుచుచున్నాను.

భరద్వాజఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత.

౩౬౫. సఘాఽయస్తే దివో నరో ధియామర్తస్య శమతః। ఊతీస బృహతో దివో ద్విషో అꣳహో నతరతి॥

శాంతప్రవర్తనగల మనుష్యులలో మెఱుగుచున్న నీకర్మచేతను ఏ మానవుఁడు స్తుతించువాఁడగుచున్నాఁడో, వాఁడునరుఁడగును. (తక్కినవాఁడు మనుష్యుఁడే కాఁడని తా॥) వాఁడుగొప్పగా దీపించునీరక్షణచేతఁ బాపము నతిక్రమించునట్లు శత్రువులనతిక్రమించును.

అత్రిఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత.

౩౬౬. విభోష్ట ఇంద్ర రాధసో విభ్వీ రాతిశ్శతక్రతో। అథానో విశ్వచర్షణే ద్యుమ్నꣳ సుదత్రమꣳహయ॥

బహుకార్యములొనరించు నింద్రా! నీయొక్క విశేష ధనదానముగొప్పది. కనుక సర్వమును జూచునట్టివాఁడా! శుభమయిన దానముకలవాఁడా! యింద్రా! మాకుధనమునిమ్ము.

ప్రస్కణ్వఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత

౩౬౭. వయశ్చిత్తే పతత్రిణో ద్విపాచ్చతుష్పాదర్జుని। ఉషః ప్రారన్నృతూꣳరను దివో అన్తేభ్యస్పరి॥

తెల్లనికాన్తిగల యుషోదేవతా! నీరాకననుసరించి ద్విపాద చతుష్పాదజంతువులును, ఱెక్కలుగల పక్షులును ఆకాశాన్తములకును మీదను గమనించుచున్నవి.

ఆ ప్త్యస్త్రితఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౬౭. అమీయేదేవా స్థన మధ్య ఆరోధనే దివః। కద్వః ఋతం కదమృతం క్వాప్రత్నా వ ఆహుతిః॥

ఓ దేవతలారా! యే మీరు దీపించుసూర్యుని వెలుఁగువిషయమై యంతరిక్షమధ్యమందునున్నారో, ఆ మీ స్తోత్రవిషయమగు సత్యమేదేశమందుఁ గలదు? అసత్యమేస్థానమందున్నది? (ఎవరును తెలియలేరని తా॥) (అమృతం=అనృతం-మస్థానమునన-న.) పురాతనమైన మీఆహుతియెట్టిది? (ఆహుతి=దానమని యిచటియర్థము.)

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౩౬౮. ఋచగ్ం సామయజామహే యాభ్యాం కర్మాణి కృణ్వతే। వితే స దసి రాజతో యజ్ఞం దేవేషు వక్షతః॥

ఏ రెంటితో (ఋక్సామములతో) జేయుకర్మలు చేయుచున్నారో, ఆసామమును, ఆఋక్కును, మేము పూజించుచున్నాము. ఆరెండునుఋత్విజుల సభయందుఁ బ్రకాశించుచున్నవి. ఆ ఋక్సామములు దేవతలకు యాగమునందఁజేయుచున్నవి.

ఇట్లు చతుర్థాధ్యాయ ద్వితీయఖండము సంపూర్ణము.

## ౪ అధ్యాయము.

### 3 ఖండము.

—:o:—

రేభఋషి-జగతీఛంద-ఇంద్రదేవత.

3 ౨ ౦. విశ్వాః పృతనా అభిభూతరం నరస్సజూ స్తతక్షురిన్ద్రం జజనుశ్చ రాజసే। క్రత్వే వరే స్థేమన్యాముురీముతోగ్రమోజిష్ఠం తరసం తరస్వినం॥

సమస్త సేనలును నాయికలయి యొకదానితో నొకటికలిసి (శత్రువులం) దిరస్కరించు నింద్రుని దీక్షునిగాఁ జేసినవి. స్తుతికర్తలు తాము విరాజిల్లుటకుఁగాను (సూర్యరూపుఁడయిన) యింద్రునింబుట్టించిరి. (వారియజ్ఞమున నింద్రుఁడావిర్భవించెనని తా॥)

సువేద-శైలూషి ఋషి-జగతీఛంద-ఇంద్రదేవత.

3 ౨ ౧. శ్రత్తే దధామి ప్రథమాయ మన్యవేzహన్యద్దస్యుం నర్యం వివేరపః। ఉ భే యత్వా రోదసీ ధావతామను భ్యసాత్తే శుష్మాత్ పృథివీ చిదద్రివః॥

వజ్రాయుధధారీ! యింద్రా! నీముఖ్యమగు కోపముకొఱకు శ్రద్ధవహించుచున్నాను. ఏకోపముతో నసురుని నరులహితముకొఱకుఁ జంపితివో, (ఆకోపమనిపూర్వాన్వయము). మేఘముచేతనావరింపఁబడిన యుదకములను (ఈలోకమునకు) రాఁ జేసితివి. ఎపుడు భూమ్యాకాశములురెండును నిన్ను అనుసరించినవో యపుడు విశాలమైన యంతరిక్షముగూడ నీబలమువల్లభయపడును.

వామదేవఋషి-జగతీఛంద-ఇంద్రదేవత,

3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨౪ ౨ ౧ ౨
3౭౨. సమేత విశ్వా ఓజసా పతిం దివో య ఏక ఇద భూరతిథి ర్జనానాం।
౨ 3 ౧ ౨౪ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨౪ 3 ౨ 3 ౨
సపూర్వ్యో నూతన మాజిగీషం తంవర్తనీ రను వావృతం ఏక ఇత్॥

ఓ సమస్తప్రజలారా! బలముచేత స్వర్గమునకు స్వామియైన ఇంద్రునిగూర్చి స్తుతించుడు. హోమములాచరించుడు, ఇంద్రుఁడొక్కఁడే యాగకర్తలకు నతిథివలెఁ బూజనీయుఁడగుచున్నాఁడు. పూర్వకాలమునాటి యీ యింద్రుఁడు తనశత్రువులనోజయింపఁదలఁచిన నూతనమైన స్తుతికర్తనుగూర్చి యొక్కఁడే మార్గములను నడిపించును.

సవ్యఆఙ్గిరసఋషి-జగతీఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ ౨ 3 ౧ ౨
3౭3. ఇమేతే ఇంద్రతే వయం పుష్టుత యేత్వారభ్య చరామసి ప్రభూ
౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
వసో। న హిత్వదన్యో గిర్వణో గిరస్సఘత్ క్షోణీరివ ప్రతితద్ధర్యనో వచః॥

అధికధనముగలవాఁడా! పలువురచేతస్తుతింపఁబడువాఁడా! యే మేము నిన్ను ఆధారముగాఁ జేసికొని (యాగమందు) ప్రవర్తించుచున్నామో ఆ మేము నీవారము. స్తుతులకువశమగువాఁడా! నీకంటె నితరుఁడు ఒక్కఁడును స్తుతులను బొందఁజాలఁడు. కనుక నీవు మాయొక్కస్తుతివాక్కును భూమితనభూతములను గోరునట్లు కోరుము!

విశ్వామిత్రఋషి-జగతీఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ 3 ౧ ౨ 3 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3క ౨౪
3౭౪. చర్షణీధృతం మఘవాన ముక్థ్యా3మింద్రంగిరో బృహతీరభ్యనూషత।
3 ౧ ౨ 3౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
వావృధానం పురుహూతగ్ం సువృక్తిభి రమర్త్య జరమాణం దివేదివే॥

మాస్తుతిరూపమయినవాక్కులతో మనుజులనుబోషించువాఁడును, ధనవంతుఁడును, స్తుతింపఁదగినవాఁడును, ప్రతిక్షణము బలాదులతో వృద్ధినొందువాఁడును, బహుమందిచే స్తుతింపఁబడినవాఁడు, మరణధర్మము లేనివాఁడు, మంచివాక్కులతోఁ బ్రతిదినమును స్తుతింపఁబడుచున్నవాఁడును, అగు నింద్రుని అందఱును స్తుతింపుఁడు.

కృష్ణ ఆంగీరసఋషి-జగతీఛ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3౧ 3 3౧ ౨
3౪౫. అచ్ఛావ ఇంద్ర మతయః స్వర్యువాః సధ్రీచీర్విశ్వా ఉశతీ రనూషత।
౧౨ 3 ౧౨3 ౨ 3 ౨ 3 ౨ 3 ౨ 3 ౨ 3౧ ౨
పరిష్వజన్త జనయో యథాపతిం మర్యం న శున్ధ్యుం మఘవా న
3 ౧ ౨
మూతయే॥

స్వర్గముతోఁగలసియున్నట్టి, వ్యాపించినట్టి, కోర్కెలుగల స్తుతులు ఈశ్వరుఁడైన యింద్రుని అభిముఖముగాస్తుతించుచున్నవి. భార్యలుమర్త్యుఁడగు భర్తను గాఁగిలించునట్లు శుద్ధుఁడును ధనవంతుఁడునగు నింద్రునిరక్షణము కొఱకుఁ గాగిలించుచున్నవి.

సవ్యఋషి-జగతీఛ్ఛంద-ఇంద్రదేవత.

౧౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨
3౪౬. అభి త్యం మేషం పురుహూత మృగ్మియ మింద్రం గీర్భిర్మదతా వసవో
3 ౨ ౨ 3 ౨ 3 ౨ 3౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర
అర్ణవం। యస్యద్యావో న విచరన్తి మానుషం భుజేమగ్ం హిష్ఠ
3౧ ౨ర
మభి విప్రమర్చత॥

ఆ మేషరూపుఁడైనట్టి, (మేష=గొఱ్ఱె) పలువురచేతఁ బిలువంబడునట్టి, స్తుతిమంత్రములతోఁగొనంబడినట్టి, ధనములకు నివాసమయినట్టి, యింద్రుని ఓస్తుతికర్తలారా! స్తుతులతోనభిముఖునిగాఁ జేసికొనుఁడు. ఏ యింద్రుని కార్యములు మానవ

జాతికి హితములై సూర్యకిరణములవలెను భోగము కొఱకుఁ బ్రవర్తించుచున్నవో ఆ మేధావియగు నింద్రుని బూజింపుఁడు (ఇంద్రుఁడు పూర్వకాలమున మేధాతిథి యాగము చేయుచుండఁగా గొఱ్ఱెరూపముధరించివచ్చి యతని సోమమును ద్రావినాఁడుగనుక ఋషియాతనిని గొఱ్ఱెయనిపిలిచెనని కథ. కాని మేష=పోరాడువాఁడు అని యర్థముకూడఁ గలదని భాష్యమందీపక్షాంతరము వ్రాసినందున యుద్ధవీరుఁడని యర్థము సమంజసమగును.)

సవ్యఋషి-జగతీచ్ఛంద-ఇంద్రదేవత.

౩౭౭. త్యగ్ం సుమేషం మహయా స్వర్విదగ్ం శతంయస్య సుభువస్సాకమీరతే।
అత్యం న వాజగ్ం హవనస్యదగ్ం రథమేంద్రం వవృత్యామవసే
సువృక్తిభిః॥

శత్రువులతోఁ బోరాడుచున్న సూర్యునియెఱింగిన ఆయింద్రుని యోయధ్వర్యుఁడా! బాగుగాఁబూజింపుము. నూఱుపర్యాయములు ఆహ్వానమునుగూర్చి వేగముగావచ్చి వెళ్లుచున్న యింద్రరథమును స్వారిచేయుగుఱ్ఱమునువలె గౌరవింపుము. (మన్ననతోవాడుకొనుమని తా॥)

భరద్వాజఋషి-జగతీచ్ఛంద-ఇంద్రదేవత.

౩౭౮. ఘృతవతీ భువనానామభిశ్రియోర్వీ పృథ్వీ మధుదుఘే సుపేశసా॥
ద్యావాపృథివీ వరుణస్య ధర్మణా విష్కభితే అజరే భూరిరేతసా॥

భూమ్యంతరిక్షములు ఉదకవంతములగుఁగాక. భూతముల కాశ్రయములగుఁగాక. విశాలములై విస్తరించునవి ఉదకమును స్రవింపఁజేయునవియు, మంచిరూపము

కలవియు, వరుణుని (=సర్వనియామకుఁడు) ధారణచేత వేఱ్ఱేఱ ధరింపఁబడినవియు, నిత్యములును, అనేకకార్యములుకలవియు, నగుంగాక.

మేధాతిథిఋషి-మహాపంక్తిఛంద-ఇంద్రదేవత.

3౭౯. ఉభేయదింద్ర రోదసీ ఆపప్రాథోషా ఇవ। మహాన్తంత్వామహీనాగ్ం
సమ్రాజం చర్షణీనాం। దేవీ జనిత్ర్య జీజన ద్భద్రా జనిత్ర్య జీజనత్॥

ఓ యింద్రా! ద్యులోక భూలోకములరెంటిని నీవేకారణముచేత (నీతేజస్సుతో) ఉషస్సుపూరించినట్లు పూరించితివో, ఆకారణముచేతనే గొప్పవారికింగూడ నాయకుఁడవును, మనుష్యులకుఁగూడ నీశ్వరుఁడవునయిన, నిన్నుతల్లియయిన యదితిదేవికనెను. ఎందువల్లనీమె యిట్టిపుత్రునింగన్నదో, యందువల్లనామె స్తుతింపఁదగినదయ్యెను. మంచితల్లియయ్యెను.

ఋషి వ్రాయఁబడలేదు. కాని మేధాతిథిఋషియే-జగతీచ్ఛంద-ఇంద్రదేవత.

3౮౦. ప్రమన్దినే పితుమదర్చతా వచో యః కృష్ణగర్భా నిరహన్నృజిశ్వనా
అవస్యవో వృషణం వజ్రదక్షిణం మరుత్వన్తగ్ం సఖ్యాయ హువే
మహి॥

(ఇదిగర్భస్రావిణీ ఉపనిషత్తు) ఓ ఋత్విజులారా! స్తుత్యర్హుఁడయిన యింద్రుని కొఱకు హవిస్సులనెడునన్నముతోఁ గూడినస్తుతివాక్కును బాగుగాఁనుచ్చరింపుఁడు. ఏ యింద్రుఁడు ఋజిశ్వియను రాజర్షియగు సఖునితోఁగూడినవాఁడై కృష్ణుఁడనెడు నసురునిగర్భవతులైన భార్యలనుజంపెను. (ఇచటంగూడకృష్ణ అనఁగామేఘము-దానిగర్భస్థజలము. అనియర్థమురావచ్చును.) రక్షణమునుగోరిన మీరు వర్షమునుగురి

యిచ్చునట్టి, వజ్రాయుధముకుడి చేతిలోఁగలట్టి, యింద్రుని స్నేహముకొఱకుఁబిలుచుచున్నారు.

చతుర్థాధ్యాయమున తృతీయఖండము సమాప్తము.

౪ అధ్యాయము.

౪ ఖండము.

(పదునాఱువఱకు కకుప్ఛందము. తరువాత పదియేడు ఉష్ణిహాఛందములు. పదునెన్మిదవది విరాట్ఛందము.)

నారదఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౩౮౧. ఇంద్రసుతేషు సోమేషు క్రతుం పునీష ఉక్థ్యం। విదే వృధస్య దక్షస్య మహాగ్ం హిషః॥

ఓ యింద్రా! సోమములభిషవింపఁబడినవై యుండఁగా (వాఁటింద్రావి) యాగకర్తను స్తుతికర్తను బవిత్రులఁజేయుచున్నావు. గొప్పదైనట్టి, వృద్ధికలిగించునట్టి, బలముయొక్క లాభముకొఱకు నాయింద్రుఁడు గొప్పవాఁడు గదా! (బలమిచ్చుటలో తగినవాఁడని తా॥)

గోషూక్తి-అశ్వసూక్తిఋషులు-ఇంద్రదేవత.

౩౮౨. తము అభిప్రగాయత పురుహూతం పురుష్టుతం। ఇంద్రం గీర్భిస్తవిషమా వివాసత॥

పలువురచేఁబిలువఁబడినవాఁడు, పలువురచేస్తుతింపఁబడినవాఁడు, నగునాయిం
ద్రుని గూర్చిబాగుగ గానముచేయుఁ (డోస్తుతికర్తలారా!) గొప్పవాఁడయిన యిం
ద్రుని వాక్కులతోసేవింపుఁడు.

గోషూక్తి-అశ్వసూక్తిఋషులు-ఇంద్రదేవత.

౨౩ ౧౨ ౩ ౧౨ ౩ ౧౨౩౨ ౩ ౧
౩౮౩. తంతే మదం గృణీమసి వృషణం పృక్షుసాసహిం। ఉలోక కృత్ను
౨ ౩౧౨
మద్రివో హారిశ్రియం॥

ఓ వజ్రధారీ! సోమపానమువల్ల నీకుఁగలిగినమదమును ప్రశంసించుచున్నాము. (ఆమదము) లోకములనిలుపునది, హరియనుగుఱ్ఱములాధారముగాఁగలది. యుద్ధములందోర్పుగలిగించునది, వర్షముకురియించునది, అయియున్నది.

పర్వతఋషి-ఇంద్రదేవత.

౧ ౨ర ౩ ౧౨౩ ౧ ౨ ౩౨ ౩౨ ౧ ౨ ౩౨౩
౩౮౪. యత్సోమ మింద్ర విష్ణవి యద్వాఘత్రిత ఆప్త్యే। యద్వా మరుత్సు
౧ ౨౩ ౧ ౨ర
మందసే సమిందుభిః॥

ఓ యింద్రా! విష్ణుసోమపానమునకురాఁగా ఇతరులయాగమందావిష్ణువుతోఁగలిసి నీవుసోమముద్రాగుచున్నావు సరే! మరుత్తులతోఁగలిసి సోమపానముచేసి మదించుచున్నావు. సరే! ఆప్తపుత్రుఁడైన త్రితర్షియాగమందు సోమముద్రాగుచున్నావు. సరే! మా యాగమందుఁగూడ శ్రేష్ఠమయిన సోమములు త్రావి హర్షమొందుము.

విశ్వమన వైయశ్వఋషి-ఇంద్రదేవత.

౨౩౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౨ఉ ౩౧ ౨ర
౩౮౫. ఏదుమధోర్మదింతరగ్ం సించాధ్వర్యో అన్ధసః। ఏవా హి వీర స్తవతే
౩ ౧ ౨
సదావృధః॥

ఓ అధ్వర్యుఁడా! (ఋత్విజులలోనొకనిసంజ్ఞ) మదముగలిగించుసోమరూపాన్నముయొక్క మిగుల మదముగలిగించురసము నే యింద్రునికొఱకు సమర్పించుము వీరుఁడును, సర్వదావృద్ధినొందువాఁడు, నగునింద్రుఁడు స్తుతింపఁబడుచున్నాఁడుగదా। (కనుకనతనికేసోమమిమ్మని తా॥)

ఋషిచ్ఛందములు పూర్వోక్తములు-ఇంద్ర దేవత.

౩౫౬. ఏంగు మింద్రాయ సించత పిబాతి సోమ్యం మధు। ప్రరాధాగ్ంసి చోదయతే మహిత్వనా॥

ఓ ఋత్విజులారా! సోమమును యింద్రునికొఱకు (క్షీరాదివస్తువులతోఁ గూర్చి) సిద్ధపఱపుఁడు. సమర్పింపుఁడు. మదకరమగు నా సోమము నతఁడు ద్రావుఁగాక. (త్రావి) ఆయింద్రుఁడుమహిమచేత నన్నములను స్తుతికర్తలకిచ్చును.

ఋషిచ్ఛందములు పూర్వవతు-ఇంద్రదేవత.

౩౫౭. ఏతో న్వింద్రగ్ం స్తవామ సఖాయ స్తోమ్యం నరం। కృష్టీర్యో విశ్వా అభ్యస్త్యేక ఇత్॥

ఓ మిత్రులారా! శీఘ్రముగారండు. నాయకుఁడగుచు స్తోత్రార్హుఁడైన యా యింద్రునిస్తుతింతము. ఏ యింద్రుఁడు ఒకఁడే (అసహాయుఁడైయుని తా॥) శత్రుసేనల నెదిరసకరించును. (కనుక నాతనిస్తుతింతమని తా॥)

నృమేధఋషి-ఇంద్రదేవత.

౩౫౮ ఇంద్రాయ సామగాయత విప్రాయ బృహతే బృహత్। బ్రహ్మకృతే విపశ్చితే పనస్యవే॥

ఓయుద్గాతలారా! మేధావియు, గొప్పవాఁడును, అన్నముఁగలిగించువాఁడు, విద్వాంసుఁడు, స్తుతినిగోరువాఁడుననగు నింద్రునికొఱకు బృహత్తనుపేరుగల సామము బఠింపుఁడు.

గోతమఋషి-ఇంద్రదేవత.

౩౮౯. య ఏక ఇద్విదయతే వసు మర్త్తాయ దాశుషే। ఈశానో అప్రతిష్కృత
ఇంద్రో అఙ్గ॥

ఏ యింద్రుఁడు ఒక్కఁడే హావిస్సులిచ్చునట్టి మనుష్యునికొఱకు ధనమును విశేషముగానిచ్చును. ఇతరులెదిరింప శక్యముకానియింద్రుఁడు శీఘ్రము సర్వజగత్తున కీశ్వరుఁడగుచున్నాఁడు.

విశ్వమనాఋషి-ఇంద్రదేవత.

౩౯౦. సఖాయ ఆ శిషామహే బ్రహ్మేంద్రాయ వజ్రిణే। స్తుష ఊషు వో
నృతమాయ ధృష్ణవే।

మిత్రులగుఋత్విజులారా! వజ్రహస్తుఁడగు నింద్రునికై స్తోత్రమును మనము పలుకుచున్నాము. మీయందఱికొఱకును, అందఱునరులకు నాయకుఁడును, శత్రువుల నణంచువాఁడును, అగునాయింద్రునకు నేనేస్తుతినిజేతును.

చతుర్థాధ్యాయమునఁ జతుర్థఖండము పూర్ణము.

—:O:—

## ౮ అధ్యాయము.

### ౫ ఖండము.

ప్రగాథఋషి-ఉష్ణిక్ఛందము-ఇంద్రదేవత.

౩ ౧ ౨ర ౩౧౨ ౩ ౨ ౩౧౨ ౧ ౨ర ౩ ౧ ౨ర
౩౯౧. గృణేతదింద్ర తేశవ ఉపమాం దేవతాతయే। యద్ధగ్ంసి వృత్రమోజసా శచీపతే॥

ఓ యింద్రా! నీయొక్క-ఆబలమును యజమానుని సమీపమందు స్తుతించుచున్నాను. ఏమంటే-ఓ శచీపతీ! బలముతో నీవు వృత్రునింజంపితివి-కనుక.

భరద్వాజఋషి-ఉష్ణిక్ఛందము-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ర ౨౩ ౧ ౨ ౩౧౨ ౩ ౧ ౨ర
౩౯౨. యస్యత్యచ్ఛంబరం మదే దివోదాసాయ రన్ధయన్। అయగ్ంస సోమ
౩౧ ౨ర
ఇంద్రతే సుతః పిబ॥

ఇంద్రా యేసోమముయొక్క- మదముకలిగియుండఁగా శమ్బరాసురుని దివోదాసునికొఱకుఁజంపినవాఁడవు. అది ప్రసిద్ధము. ఇంద్రా! ఆ యీసోమము నీకొఱకునభిషవింపఁబడినది. కనుకదానింద్రాఘుము.

నృమేధఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౧౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩౧ ౨ ౩ ౧
౩౯౩. ఏన్ద్రనో గధిప్రియ సత్రాజిత గోహ్య। గిరిర్న విశ్వతః పృథుః
౨ర౩౨
పతిర్దివః॥

(అందఱకు) ప్రియమగువాఁడా! చాలమంది శత్రువులజయించువాఁడా!

యెవరునుదిరస్కరింప శక్యముకానివాఁడా! పర్వతమువలె నన్నిఁటికంటె గొప్పవాఁడవు, స్వర్గమునకుఁబతివి యగునీవు ఇంద్రా! మావద్దకురమ్ము.

పర్వతఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧౨ ౩ ౩౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩
౩౯౪. య ఇంద్ర సోమపాతమో మదః శవిష్ఠ చేతతి। యేనా హంసి
౨ ౨౩ ౧ ౨
న్యా౩త్రిణం తమీమహే॥

ఓ యింద్రా! యే నీవుబాగుగాసోమపానము చేయువాఁడవు, బలవంతుఁడవు నగుదువో, ఆ నీ సోమపానమదము బాగుగా (చేయవలసినపనులను) ఎఱుంగును. ఏమదముతో హింసకులనుజంపుచున్నావో, ఆమదముతోఁగూడిననిన్ను యాచించుచున్నాము.

ఇరిమిఠిఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ర ౩ ౨ఉ ౧ ౨ ౩ ౧౨ ౩౧ ౨ ౧౨
౩౯౫. తుచేతునాయ నోతత్సుద్రాఘీయ ఆయుజీవసే। ఆదిత్యాసః సుమహాసః
౩ ౧ ౨
కృణ్ణోతన॥

మంచితేజస్సుకలయో యాదిత్యులారా? మాపుత్రునికొఱకుఁ బౌత్రునికొఱకుజీవనాధారమగు దీర్ఘాయువునుజక్కఁగాఁ జేయుము.

విశ్వమనాఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ర ౩ ౧౨ ౩౧౨ ౧ ౨ ౩ ౧
౩౯౬. వేత్థా హినిఋతీనాం వజ్రహస్త పరివృజం। అహః రహః శున్ధ్యుః
౨ ౩ ౧ ౨
ప రి ప దామివ॥

వజ్రముచేతిలోఁగలవాఁడా! ఉపద్రవముకలిగించు రాక్షసులఁజంపుపని ప్రతిదినమునందును సూర్యుఁడు పక్షులుస్వస్థానమునకు రాకపోకలు చేయుట నెఱింగినట్లు నీవేయెఱుంగుదువు (ఉదయమునస్వస్థానమువిడుచుట సాయంకాలము స్వస్థానము నకువచ్చుట) లేక శున్ధ్యు=కర్మశుద్ధైన బ్రాహ్మణుడు సూర్యోదయముకాఁగానే తన కర్మనెఱింగినట్లని యింకొకర్థము వ్రాసిరి.

ఇరిమిఠిఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ర౩ ౨౩౨ ౩ ౧౨ ౩౨ ౧౨ ౩ ౧
౩౯౭. అపామీవా మపస్రిధమప సేధత దుర్మతిం। ఆదిత్యాసో యుయో
౨ ౩ ౧ ౩
తనానో అగ్ం హసః॥

ఓ యాదిత్యులారా! రోగమును శమింపఁజేయుఁడు. బాధకుఁడగు శత్రుని దొలఁగించుఁడు. మాకుదుఃఖమునుదలఁచినవానిని దూరముత్రోసివేయుఁడు. మమ్ము బాపములనుండి వేఱుచేయుఁడు.

వసిష్ఠఋషి-విరాట్ఛంద-ఇంద్ర దేవత.

౨౩ ౧ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౩౯౮. పిబాసోమ మింద్ర మందతు త్వాయంతే సుషావ హర్యశ్వాద్రిః
౩ ౨ ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨
సోతుర్బాహుభ్యాగ్ం సుయతో నార్వా॥

ఓ యింద్రా! సోమమునుద్రావుము. ఆసోమమునినుమదింపఁజేయుఁగాక. హరి యను రెండుగుఱ్ఱాలుకలవాఁడా! కళ్ళెములతో నశ్వముపట్టుకొనంబడిన విధమున, ఋత్విజుని బాహువులతోఁ బట్టుకొనఁబడిన శిల యీ సోమమును అభిషవించెను. (పిండెననియర్థము.)

చతుర్థాధ్యాయమునఁ బంచమఖండము సమాప్తము.

---:o:---

## ౪ అధ్యాయము.

### ౬ ఖండము.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౩౯౯. అభ్రాతృవ్యో అనాత్వ మనాపిరింద్ర జనుషా సనాదసి। యుధేదా పిత్వ మిచ్ఛసే॥

ఓ యింద్రా! నీవుజన్మతోనే శత్రువులు లేనివాఁడవు. నియమించువాఁడును లేనివాఁడవు. (అనఁగానీవేనియంతవు.) బంధువులు లేనివాఁడవు. (సర్వసముఁడవని తా॥) చాలకాలమునుండి యిట్టివాఁడవు. బంధుత్వమును యుద్ధముకొఱకుఁగోరుచున్నావు. (స్తుతికర్తలుయుద్ధసాహాయ్యము కోరినపుడు వారిసఖ్యముచేతువని తా॥)

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౪౦౦. యోన ఇద మిదం పురాప్రతస్య ఆనినాయత ముపస్తువే। సఖాయ ఇంద్ర మూతయే।

సఖులగు ఋత్విగ్యజమానులారా! యే యింద్రుఁడు పూర్వము యాకసంబడుచున్న శ్రేష్ఠధనమును మనకొఱకుఁ దెచ్చియిచ్చెనో, ఆయింద్రుని నేమీకు ధనలాభముకొఱకును, రక్షణముకొఱకును, నేను (సౌభరిఋషి) స్తుతించుచున్నాను.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౪౦౧. ఆగన్తా మారిషణ్యత ప్రస్థావానో మాపస్థాత సమన్యవః దృఢాచిద్య మయిష్ణవః॥

గమనశీలురయిన మరుత్తులారా! మావద్దకురండు. (రాకుండుటచే) మమ్ము బాధింపకుండు. సమాన తేజస్సుకలవారలారా! దృఢమయిన (పర్వతాది) వస్తువులు గూడ మీస్వాధీనమునఁ ద్రిప్పుకొనువారలారా! మమ్మువిడిచి యితరత్రానుండకుండు.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రిదేవత.

౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౮౦౨. ఆయాహ్యాయ మిందవేzశ్వపతే గోపత ఉర్వరాపతే। సోమగ్ం సోమ పతేపిబ॥

ఓ యశ్వస్వామీ! గోపతీ! సస్యముతోఁడనుండు భూమికీశ్వరుఁడా! యింద్రా! దీపించునీకొఱకు నీసోమము అభిషవింపఁబడెను. కనుకరమ్ము. ఓ సోమపతీ! ఇంద్రా! సోమమునుద్రావుము.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౮౦౩. త్వయాహ స్విద్యుజా వయంప్రతి శ్వసన్తం వృషభ బ్రువీమహి।
౩ ౧ ౨ర ౩ ౧ ౨
సగ్ంస్థే జనస్య గోమతః॥

వర్షముకురియించునట్టి యింద్రా! గోవులుమొదలయినవి కలయుద్ధమందు (కోపముతో) బుసకొట్టుచున్నశత్రువును సహాయుఁడవుగానున్న నీచేతనేకదా! యెదిరించి పలుకఁగలుగుచున్నాము.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩క ౨ర ౩౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౮౦౪. గావశ్చిద్ధా సమన్యవ స్సజాత్యేన మరుతః సబన్ధవః। రిహతే కకుభో
౩ ౨
మిథః॥

సమాన తేజస్సుకల యోమరుత్తులారా! (మీతల్లులయిన) గోవులు కూడ సమానబంధువులుకలవై (తూర్పుమొదలగు) దిక్కులకుంబోయి ఒకదానినొకటి నాకుచుండునుగదా!

నృమేధఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౪౦౫. త్వం న ఇంద్రా భరఓజో నృమ్ణగ్ం శతక్రతో విచర్షణే। ఆవీరం పృతనాసహం॥

బహుకర్మలాచరించునింద్రా! సమస్తమునుజూచుచున్నవాఁడా! నీవుమాకు బలమునుధనమును దెచ్చియిమ్ము. వీరుఁడవు సేనలను ఓడించువాఁడవు నగునిన్ను బిలుచుచున్నాము.

నృమేధర్షి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౪౦౬. అధాహీంద్ర గిర్వణ ఉపత్వా కామఈమహే సస్సృగ్మహే। ఉదేవగ్మన్త ఉదభిః॥

స్తుతులకులొంగునట్టివాఁడా! యిప్పుడునిన్ను గోరికనిమిత్తము యాచించుచున్నాము. నీటితోనడుచువారలు దోసిలిపట్టి నీటితో (దగ్గఱవారిపైని విలాసార్థము) చల్లునట్లు నీమీఁదస్తుతులను జల్లుచున్నాము. (స్తుతించుచున్నామని తా॥)

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౪౦౭. సీదన్తస్తే వయో యథా గోశ్రీతే మధౌ మదిరే వివక్షణే। అభిత్వామింద్ర నోనుమః॥

ఓ యింద్రా! పాలు పెరుగులతోఁ గలిసినట్టి, మదముఁ గలిగించునట్టి, స్వర్గమునుఁ బొందింపఁదగినట్టి, నీయొక్క సోమమువద్ద పక్షులుమూగినట్లు మేముచేరి నిన్ను స్తుతించుచున్నాము.

సౌభరిఋషి-కకుప్ఛంద-ఇంద్రదేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౪౦౫. వయముత్వామ పూర్వ్యస్థూరం న కచ్చిద్భరన్తోऽవస్యవః। వజ్రిం
౩ ౧ ౨
చిత్రగ్ం హవామహే॥

వజ్రముధరించువాఁడా! క్రొత్తగాఁ గనఁబడువాఁడా! (ప్రతియాగమునకు అపుడేవచ్చుటచేతఁ గ్రొత్తగాఁగనుపించునని తా॥) నిన్ను (సోమాది హవిస్సులతో) బోషించుచున్న మేము అనేకరూపములుగానున్న నిన్నేరక్షణము గోరినవారమై (ధాన్యాదుల నింట్లోపోయుమనుష్యుఁడు) బలమైనవానినొకని (సహాయార్థము) పిలుచునట్లు నిన్నుంబిలుచుచున్నాము.

ఇట్లుచతుర్థాధ్యాయమున షష్ఠఖండము పూర్ణము.

—:౦:—

## ౪ అధ్యాయము.

### ౭ ఖండము.

గౌతమఋషి-ఇది మొదలు ౧౭ పంక్తిచ్ఛందము-"నతం" అను ౧౫ వది బృహతీచ్ఛంద.

౩ ౧ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౧ ౨ర ౩ ౧
౪౦౬. స్వాదోరిత్థా విషూవతో మధ్వః పిబన్తిగౌర్యః యా ఇంద్రేణ సయా
౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
వరీ వృష్ణామదన్తి శోభథా వస్వీరనుస్వరాజ్యం॥

రసవంత్ము అన్నియాగములందిల్లే వ్యాపించినసోమరసమును గౌరవర్ణముగల (=గోధుమరంగు) గోవులు త్రాగుచున్నవి. ఏ గోవులింద్రునితోఁగలిసి నడచుచు మదించుచు వర్షించుచున్నవో, అవిశోభించుచున్నవి. నివాసాధారములయిన యీగోవులు ఇంద్రునిరాజ్యమును దమరాజ్యమని గర్వించుచున్నవి.

గౌతమఋషి-పఙ్క్తిచ్ఛంద-ఇంద్రదేవత.

3 ౨ర 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ ౧౨ 3 ౧
౪౧౦. ఇత్థాహిసోమ ఇన్మదో బ్రహ్మా చకార వర్ధనం। శవిష్ఠ వజ్రిన్నో
౨ 3 ౧ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
జసా పృథివ్యా నిఃశశా అహిమర్చన్ననుస్వరాజ్యం॥

మహాబలవంతుఁడా! వజ్రాయుధధారీ! యింద్రా! యీవిధముగానే సోమమును నీవుతీసికొనంగా స్తుతికర్త నిన్నుపొగడించు స్తోత్రమును జేయుచున్నాఁడు. కనుకనీవుబలముతో భూమివద్దనుండివచ్చిన వృత్రుని నిశ్శేషముగా భూమిలోనికింబంపితివి. (చంపితివనితా॥) నీస్వరాజ్యమును (స్థాపించుకొంటివి.)

ఋషిచ్ఛందస్సులు పూర్వవతు-ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౧౨ 3 ౧ ౨ర ౨ర 3 ౨ 3
౪౧౧. ఇంద్రో మదాయ వావృధే శవసే వృత్రహా నృభిః। తమిన్మహత్స్వా
౨ 3౧ ౨ర 3 ౧ ౨ర3 ౧ ౨
జిష్వూతిమర్భే హవామహే సవాజేషు ప్రనోऽవిషత్॥

మేఘమును జీల్చునట్టి యింద్రుఁడు మదముకొఱకు, బలముకొఱకును, ఋత్విజులచేత వృద్ధిపొందింపఁబడెను. (స్తుతులతోననితా॥) ఆయింద్రునేగొప్ప యుద్ధములందు మాకురక్షకునింగాఁ బిలుచుచున్నాము. చిన్నయుద్ధములందును బిలుచుచున్నాము. (పిలువంబడిన) యింద్రుఁడు యుద్ధములలో మమ్ము రక్షించుఁగాక.

ఋషీ, ఛందములు పూర్వవతు-ఇంద్రదేవత.

౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౧౨. ఇంద్రతుభ్య మిదద్రివోऽనుత్తం వజ్రిన్ వీర్యం। యద్ధత్యం మాయినం
౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ర౩౨౩ ౧ ౨ ౩ ౧ ౨
మృగం తవ త్యన్మాయయా వధీరర్చన్ననుస్వరాజ్యం॥

(అద్రి=మేఘము) మేఘవాహనుఁడా! వజ్రాయుధధారీ! నీవీరకృత్యమే శత్రువులు తిరస్కరింపశక్యముకానిది. ఏ వీర్యముచేత మాయతో మృగరూపమునొందిన యా వృత్రుని నీవును మాయతోనేచంపితివి. కనుక నీయే వీర్యముకలదో అదిప్రసిద్ధమగునట్లు నీస్వరాజ్యమును బోషించితివి

ఋషిచ్ఛందములు పూర్వవతు-ఇంద్ర దేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౨ఉ
౪౧౩. ప్రేహ్యభీహి ధృష్ణుహి న తే వజ్రో నియగ్ం సతే। ఇంద్రనృమ్ణగ్ం
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨
హి తే శవో హనో వృత్రంజయా అపోऽర్చన్ననుస్వరాజ్యం॥

ఇంద్రా! గట్టిగానడువుము. ఎదిరింపుము (శత్రువులనని తా॥) తిరస్కరింపుము. నీవజ్రములొంగిపోదు. నీబలముపురుషులను లొంగఁదీయును. కనుక మేఘమునుగొట్టుము. ఉదకములనుజయించుము. (అనఁగాసంపాదించుమని తా॥) నీస్వరాజ్యమునుస్థాపించుకొమ్ము.

ఋషి,ఛందములు పూర్వవతు-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩
౪౧౪. యదుదీరత ఆజయో ధృష్ణవే ధీయతేధనం। యుఙ్క్ష్వామదచ్యుతా హరీ
౨ఉ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨
కగ్ం హనః కం వసౌ దధోऽస్మాగ్ం ఇంద్ర వసౌదధః॥

(కథ—రహూగణునిపుత్రుఁడు గోతముఁడు కురుసృంజయ దేశముల రాజుల కుఁబురోహితుఁడు. ఆరాజులకుశత్రువులతో యుద్ధముకల్గినపుడు ఇంద్రునిస్తుతించి

వారికిజయముకలిగించెనట!) ఎపుడుయుద్ధములుప్రారంభించెనో, యపుడుశత్రువులను అణఁచివేయునట్టి (వారి) ధనములనుబడుచుకొనునట్టి, యింద్రా! ఆయుద్ధములందు శత్రువులమదమును గలిగించు నీహరియను రెండుగుఱ్ఱములను రథమందుఁబూన్పుము. నిన్ను సేవింపనివాని నెవనినైనఁజంపుదువు. సేవించినవానికెవనికైన ధనము నిత్తువు. కనుక నింద్రా! మారాజులకు ధనమునిమ్ము.

ఋషిచ్ఛందములు పూర్వవతు-ఇంద్రదేవత.

౪౧౫. అక్షన్నమీ మదన్త హ్యవ ప్రియా అధూషత। అస్తోషత స్వభానవో విప్రా నవిష్ఠయా మతీ యోజా న్విన్ద్ర తే హరీ॥

ఓ యింద్రా! (నీవిచ్చినయన్నములను) యజమానులు భక్షించిరి. తృప్తిని బొందిరి. ప్రియములైనతమశరీరములు గదలించిరి. (రుచియెక్కువగుటచే శరీరము పులకరించెననితా॥) కాన్తిమంతులు మేధావులైనఋత్విజులును మిగులఁగ్రొత్తది యగు స్తుతితో నిన్నుస్తుతించిరి. కనుకనింద్రా! హరియనుపేర్ల గుఱ్ఱములను శీఘ్రము రథమునకుంబూన్పుము.

ఋష్యాదులు పూర్వవతు.

౪౧౬. ఉపో షు శృణుహీ గిరో మఘవాన్మాతథా ఇవ। కదా నః సూనృతావతః కర ఇదర్థయాస ఇద్యోజా న్విన్ద్ర తే హరీ॥

ధనవంతుఁడవగునింద్రా! మాస్తుతులసమీపించివినుము. నీవుపూర్వమెట్లు (మమ్ము ననుగ్రహించితివో) అట్లే (ఉండుము) మారకుము. మమ్ము సత్యమయిన స్తుతివాక్కులు కలవారింగానెపుడుచేతువు? (స్తుతివాక్కులను) నీవునుగోరుచుంటివి కదా! మఱియునో యింద్రా! నీగుఱ్ఱాలను శీఘ్రముగారథమందుఁగూర్పుము.

త్రితఋషి-పఙ్క్తిచ్ఛందమే-విశ్వేదేవదేవత.

౪౧౭. చంద్రమా అప్స్వ౩న్తరా సుపర్ణో ధావతే దివి। న వో హిరణ్యనేమయః పదం విన్దన్తి విద్యుతో విత్తం మే అస్య రోదసీ॥

అంతరిక్షముననున్న, యుదకమయమైన, మండలంబుమధ్యను వర్తించుచున్న, సుపర్ణనామముకల సూర్యకిరణములతోఁగూడిన చంద్రుఁడు ద్యులోకమునందు శీఘ్రముగా (ఒకేవిధముగా) గమనించుచున్నాఁడు. ఆచంద్రుని వెలుఁగుచున్న బంగారురంగుగల యంచులుమీ (పాదా) గ్రమునుబొందఁజాలవు (నా యింద్రియములు నూతిలోనున్నందున మిమ్ముఁజూడశక్యముకాలేదు. నన్నుబయటికి దీయుఁడని తా॥ త్రితఋషిని పగవారు నూతిలోఁద్రోసిరట! అపుడతఁడీస్తుతి పఠించెనట!) ఓ భూమ్యాకాశములారా! యీ నా స్తుతిని యెఱుంగుఁడు.

అవస్యుఋషి-పఙ్క్తిచ్ఛంద-అశ్వినులు దేవత.

౪౧౮. ప్రతిప్రియతమగ్ం రథం వృషణం వసువాహనం। స్తోతా వామశ్వినా వృషిః స్తోమేభిర్భూషతి ప్రతి మాధ్వీ మమ శ్రుతగ్ం హవం॥

ఓ యశ్వినులారా! వర్షము గురియించునట్టి, మీకుఁజాల ప్రియమగునట్టి, ధనములను మోసితెచ్చునట్టి, రథమునుస్తుతికర్తయగుఋషి (వచ్చుటకుగా) స్తుతిమంత్రములతో స్తుతించుచున్నాఁడు. కనుక మధువిద్య నెఱింగినవారలారా! (మధువిద్య=ఒకమంత్రము. దీని సింద్రుఁడు దధీచునకుఁజెప్పె. అతఁడశ్వినులకుఁజెప్పె. చచ్చిన వారినది బ్రతికించుటకుపయోగించును.) నాయీహ్వానమును వినుఁడు.

చతుర్థాధ్యాయమున సప్తమఖండము సమాప్తము.

## ౪ అధ్యాయము.

### ౯ ఖండము.

వసుశ్రుతఋషి-పంక్తిచ్ఛంద-అగ్నిదేవత.

౪౧౯. ఆతే అగ్న ఇధీమహి ద్యుమన్తం దేవాజరం। యద్ధస్యాతే పనీయసీ
సమిద్దీదయతి ద్యవీషఀ స్తోతృభ్య ఆభర॥

ఓ యగ్నీ! దేవా! దీపించుచున్నది, జీర్ణింపనిది, యగునీమూర్తిని సర్వవిధ ములఁబ్రజ్వలింపఁజేయుచున్నాము. నీసంబంధమైనస్తుతింపఁదగినకాన్తిద్యులోకమందు వెలుఁగుచున్నది. స్తుతికర్తలమగుమాకు నన్నమును దెచ్చిపెట్టుము.

విమదఋషి-పంక్తిచ్ఛంద-అగ్నిదేవత.

౪౨౦. ఆగ్నిం న స్వవృక్తిభిర్హోతారం త్వా వృణీమహే। శిరం పావక శోచిషం
వి వో మదే యజ్ఞేషు స్తీర్ణబర్హిషం వివక్షసే॥

ఓ యగ్నీ! నీవాఁడగువిమదఋషి వద్దనిపుడు ఈస్తుతిబయలుదేరినది. స్వయముగాఁ దప్పులులేకుండఁజేయఁబడిన స్తుతులతో హోమమునుజరిపించునట్టి, యజ్ఞములందుఁజుట్టునుం బరువఁబడిన దర్భలుకలట్టి, పవిత్రతనుగలిగించు కాన్తిగలట్టి, సర్వత్రా వ్యాపించియున్నట్టి, యగ్ని నిన్ను అభిముఖముగా సేవించుచున్నాము. నీవు మహాత్ముఁడవు.

సత్యశ్రవఋషి-పంక్తిచ్ఛంద-ఉషోదేవత.

౪౨౧. మహేనో అద్య బోధయోషో రాయే దివిత్మతీ। యథాచిన్నో అబో
ధయః సత్యశ్రవసి వాయ్యే సుజాతే అశ్వసూనృతే॥

ఈ యాగ దినమునందు నోయుషోదేవీ! కాన్తిగలదానవై నీవునుమ్ము గొప్ప ధనము సంపాదించుకొనుటకు పూర్వకాలమున మేల్కొల్పునట్లు మేల్కొల్పుము. మంచిజన్మకలదానా! సత్యవాక్కుగలదానా! వాయుపుత్త్రుఁడయిన సత్యశ్రవఋషి యందనుగ్రహింపుము.

విమదర్షి-పంక్తిచ్ఛంద-సోమదేవత.

౮౨౨. భద్రంనో అపివాతయ మనో దక్షముతక్రతుం। అధాతే సఖ్యే అన్ధసో
విహోమదే రణాగావో న యవసే వివక్షసే॥

ఓ సోమమా! నీవుమామనస్సును మంచియుద్దేశ్యముకలదానింగాఁజేయుము. సమర్థమయ్యెను గార్యమును గళ్యాణకరముగా నొనర్పుము. తర్వాతస్తుతికర్తలు నీసఖ్యమందు గోవులురమ్యమైన గడ్డియందుఁబ్రీతిచెందునట్లు ప్రీతింజెందుదురుగాక.

గోతమఋషి-పంక్తిచ్ఛంద-ఇంద్రదేవత.

౮౨౩. క్రత్వాసహోగ్ం అనుష్వధం భీమం ఆవావృతేశవః। శ్రియఋష్వ ఉపాక
యోర్నిశి ప్రీహరివాం దధే హస్తయోర్వజ్రమాయసం॥

ప్రజ్ఞచేతమహానుభావుఁడును, భయంకరుఁడును, అగు నింద్రుఁడు సోమము ద్రావినతర్వాత స్వకీయబలము తనకభిముఖముగాఁద్రిప్పెను. అనంతరముచూడఁద గినవాఁడును, మంచి దవుడలుకలవాఁడును, హరియనుగుఱ్ఱాలుకలవాఁడును, అగు నింద్రుఁడు సమీపమందున్న తనబాహువులందు ఇనుముతోఁజేసిన వజ్రాయుధమును సంపదకొఱకుధరించెను.

గోతమఋషి-పంక్తిచ్ఛంద-ఇంద్రదేవత.

౨౩ ౧ ౨ర౩ ౨౩౧౨ ౩ ౧ ౨ ౧ ౨ర
౪౨౪. సఘాతం వృషణగ్ం రథమధి తిష్ఠాతి గోవిదం। యః పాత్రగ్ం
౩ ౨ ౩౧ ౨ ౩ ౧౨ ౩ ౧ ౩క ౨ర ౩ ౨ ౨
హారి యోజనం పూర్ణమింద్ర చికేతతి యోజా న్వింద్ర తే హారీ॥

ఆయింద్రుఁడు వర్షముగురియించునట్టి, గోవులనులభింపఁజేయునట్టి, (పణులు అపహరించినగోవులను వెదకి యీరథమందుఁ గూర్చొనియె తెచ్చెనట! కథ) రథము నెక్కినాఁడుగదా! ఏరథముహరియను గుఱ్ఱాలను బూన్చినదియు-లేక మంచివస్తువులతోఁగూడినసోమముతోనిండిన పాత్రనుజ్ఞాపకము చేయుచున్నదియో (అట్టిరథమని పూర్వాన్వయము) ఇంద్రా! అట్టిరథమందు నీగుఱ్ఱాలనురెంటిని బూన్చుము. (పణి యనురాక్షసునివారలు-పణి=వర్తకుఁడు)

వసుశ్రుతఋషి-పంక్తిచ్ఛంద-అగ్నిదేవత.

౨ ౧ ౨ర౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ర ౩౧౨ ౨ ౩ ౧ ౨
౪౨౫. అగ్నింతం మన్యే యోవసురస్తం యంయన్తిధేనవః। అస్తమర్వంత
౩౨ఉ ౩ ౧ ౨ ౩ ౨౩ ౧౨ ౩ ౨ ౩ ౧౨
ఆశవోస్తం నిత్యాసో వాజిన ఇషగ్ం స్తోతృభ్య ఆభర॥

ఏయగ్ని కాపురమునకు ఆధారమయినవాఁడో, గృహమువలెనాధారభూతుఁడయిన యేయగ్నిని గోవులు (ప్రీతిచేయుటకు) సమీపించుచున్నవో, యేయగ్నిని వడిగానడచుగుఱ్ఱములుచేరుచున్నవో, హవిస్సులెల్లపుడు సంపాదించుకొన్నయాగకర్తలేయగ్నిని సేవించుచున్నారో, ఆయగ్నినిస్తుతింతును. స్తుతికర్తలకగ్నీ! యన్నమునిమ్ము.

అంహోముగ్వామదేవ్యఋషి-పంక్తిచ్ఛంద-విశ్వేదేవదేవత.

౨ఉ ౩ ౧ ౨౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౧ ౧ ౨ ౩ ౨
౪౨౬. నతమగ్ంహో నదురితం దేవాసో అష్టమర్త్యం। సజోషసోయమర్యమా
౩ ౧ ౨ర౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨
మిత్రో నయతి వరుణో అతిద్విషః॥

ఓ దేవతలారా! యెవనిని అర్యమదేవుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు కలిసిమెలసినవారగుచు శత్రువులనుండి దాటించినదువుసురో, ఆనరుని పాపఫలముచేరనేరదు దారిద్ర్యమును జేరదు.

ఇట్లు చతుర్థాధ్యాయమున సప్తమఖండము పూర్ణము.

—◆●◆—

౪ అధ్యాయము.

౮ ఖండము.

౧ మొదలు ౬ వరకు ఋణత్రసదిసహితులు ఋషులు
ద్విపదచ్ఛందము—పవమానదేవత.

౨౩౨౩౧ ౨ ౩ ౨౩ ౧ ౩౧ ౨౪
౪౨౭. పరిప్రధన్వేంద్రాయ సోమ స్వాదుర్మిత్రాయ పూష్ణే భగాయ॥

ఓ సోమమా! మధురమైనరుచిగలనీవు ఇంద్రునికొఱకు, మిత్రదేవునికొఱకు, పూషదేవునికొఱకు, భగదేవునికొఱకును (పాత్రలందు) ప్రసరించుము.

ఋషిపూర్వవతు—అనుష్టుప్ఛంద పిపీలికామధ్య—త్రిపద—పవమానదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౨౮. పర్యూషు ప్రధన్వ వాజసాతయే పరివృత్రాణి సక్షణిః। ద్విషస్తరధ్యా
౩ ౧ ౨
ఋణయా న ఈరసే।

ఓ సోమమా! అన్నము (మాకు) నిచ్చుటకు అంతటను ప్రవర్తించుము. సహించుస్వభావముగలనీవు శత్రువులంజూర్చినదువుము. (వారిపైఁబడుమని తా॥) మాఋణములను దీర్చునట్టినీవు శత్రువులనుఅతిక్రమించుటకుఁ బరుగిడుచున్నావు.

ఋషి, ఛందస్సులు పూర్వోక్తములు-ద్విపద-పవమానదేవత

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౧ ౧ ౨ర
౪౨౯. పవస్వసోమ మహాన్త్సముద్రః పితా దేవానాం విశ్వాభిధామ॥

ఓ సోమమా! మహత్వముకలదానవు. రసములనుట్టించుదానవు. (అందఱను) పాలించుదానవు. దేవతలశరీరములఁగూర్చి ప్రస్రవించుము. (ఉట్టించు=చెలమఊరు నట్లుఊరించుట.)

ఋషి, ఛందో దేవతలు పూర్వోక్తములు.

౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర
౪౩౦. పవస్వ సోమ మహే దక్షాయాశ్వో నక్తో వాజీధనాయ॥

ఓ సోమమా! అశ్వమువలెను (వసతీ-వరీ-అనిఋత్విజులు వ్యవహారముచేయు చున్న) ఉదకములతోఁదడిసినదానవై వేగముగలిగి గొప్పధనమునకును బలమునకును స్రవించుము (=కారుము.)

ఋషిచ్ఛందోదేవతులు పూర్వవతు.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
౪౩౧. ఇందుః పవిష్ట చారుర్మదాయా పాముపస్థే కవిర్భగాయ॥

కళ్యాణరూపముగల్గి ప్రజ్ఞకలిగినసోమము ఉదకములకుఁజోటైన యంతరిక్షము నందు, లేక పవిత్రమునందు (=వడపోతవస్త్రము) మదమునుగలిగించుటకై, అనుభ వింపఁదగిన ధనమునకై స్రవించుచున్నది (=కారుచున్నది )

ఋషి, దేవతలు పూర్వవతు-అనుష్టుప్ఛంద-త్రిపద.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౪౩౨. అను హిత్వా సుతగ్ం సోమ మదామసి మహేసమర్య రాజ్యే।

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
వాజాగ్ం అభిపవమాన ప్రగాహసే॥

ఓ సోమా! అభిషవింప (=పిండ) బడిననిన్ను వరుసగా స్తుతించుచున్నాము. వడకట్టఁబడుచున్న సోమమా! ఆ నీవు మనుష్యసహితమైన నీరాజ్యమును బరిపాలించుటకై శత్రుసైన్యముల మీఁదికురుకుచున్నావు.

వసిష్ఠఋషి-ద్విపదాచ్ఛంద-మరుత్తులు దేవతలు.

౧౩క ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౩౩. క ఈం వ్యక్తా నర స్సనీడా రుద్రస్య మర్యా అథా స్వశ్వాః।

కాన్తిగలట్టినాయకులును, సమానస్థానముగలవారును, రుద్రునియొక్క (కొమారులును) మానవులకు హితమొనర్చువారును, మంచిగుఱ్ఱములు కలవారును, అగు నిట్టివా రెవరు! (అని ఆశ్చర్యము. అంతధికకాన్తిగలవారని తా॥)

వామదేవఋషి-పంక్తిచ్ఛంద-అగ్నిదేవత.

౨ ౩ ౨౩ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౨౩౧ ౨ ౩ ౧ ౨
౪౩౪. అగ్నే తమద్యాశ్వం నస్తోమైః క్రతుం నభద్రగ్ం హృదిస్పృశం।
౩ ౧ ౨ ౩ ౧ ౨
ఋధ్యామా త ఓహైః॥

ఓ యగ్నీ! యీదినమందు మేము (ఋత్విజులు మొదలగు) స్తోత్రసమూహములచేత మోయుచున్న యశ్వమువంటివాఁడవు. (హవిస్సులను దేవతకుఁగొనిపోవువనితా॥) యాగకర్తవలె నుపకారము చేయువాఁడవును, కళ్యాణకరుఁడవును, మిగుల మనోహరుఁడవు, నగునిన్ను వృద్ధినొందించుచున్నాము.

పూర్వోక్తఋషి-పంక్తిచ్ఛంద-వాజిదేవత.

౩౧౨౩ ౧ ౨ర ౩ ౧౨ ౩౧౨ ౩౨ ౩ ౨ ౩౧
౪౩౫. ఆవిర్మర్యా ఆవాజం వాజినో అగ్మందేవస్య సవితుస్సవం। స్వర్గాగ్ం
౨
అశ్వంతో జయత॥

మనుష్యులకు మేలుచేయుచుఁ బ్రకాశించునట్టి వాజిదేవతలు (=వాజులనివారి పేరు) సూర్యునికై వడకట్టఁబోవు సోమమును సమీపించిరి. కనుక నోయజమానులారా! స్వర్గమునుజయింపుఁడు. అశ్వములనుజయింపుడు. (తాత్పర్యమేమోబ్రాయ లేదు బుద్ధిమంతులూహించుకొనుఁడు.)

ధిష్ణ్యులుఋషులు-ద్విపదా-ఛంద-సోమదేవత

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ర ౩ ౧ ౨ ౬ ౨
౪౩౬. పవస్వసోమ ద్యుమ్నీ సుధారోమహాగ్ం అవీనామను పూర్వ్యః॥

ఓ సోమమా! అన్నముకలట్టి, మంచిధారలుకలట్టి, పురాతనమయినట్టి, గొప్పదగునట్టి నీవు గొఱ్ఱెరోమములలో నుండికారుము. (గొఱ్ఱెరోమములతో నిర్మించిన వస్త్రమునందు అదివఱకుదంచిపిండిన సోమరసమును వడకట్టుదురు.)

చతుర్థాధ్యాయమున నవమఖండము పూర్ణము.

—*—

౪ అధ్యాయము.

౧౦ ఖండము.

ధిష్ణ్యఋషియే వెనుక చెప్పినందున ఇచట మరొకఋషిని చెప్పనందున

౧-౨ కి ధిష్ణ్యఋషి-ద్విపాదచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౪౩౭. విశ్వతోదావ న్విశ్వతో న ఆ భర యంత్వా శవిష్ఠమీమహే॥

అన్నివిధముల ఖండించువాఁడా! లేకయన్నివిధముల దానముకలవాఁడా! యింద్రా! నీవన్నియిష్టములను మాకుఁగూర్చుము. బలవంతుఁడవగునిన్ను గోర్కెలను యాచించుచున్నాము.

ధిష్ణ్యఋషి - ద్విపదాచ్ఛంద ఇంద్ర దేవత.

౪౩౮. ఏష బ్రహ్మాయ ఋత్వియ ఇంద్రోనామ శ్రుతో గృణే।

(వసన్తాది) ఋతువులందుఁబుట్టిన యేయింద్రుఁడు ప్రసిద్ధుఁడో యతఁడు బ్రహ్మలనఁగా (స్తుతికర్తకు) కోర్కెల వృద్ధినొందించువాఁడు. అట్టివానిని స్తుతియింతును.

త్రసదస్యుఋషి-ద్విపదీచ్ఛంద-ఇంద్రదేవత.

౪౩౯. బ్రహ్మాణ ఇంద్రం మహయన్తో అర్కైరవర్ధయన్నహయే హన్తవాఉ॥

వృత్రాసురుని ఁజంపుటకు పూజనీయమైన స్తోత్రములతోఁ బూజించుచు బ్రాహ్మణులు ఇంద్రునివృద్ధిపొందించిరి.

ఋషిపూర్వవతు-ద్విపద-ఇంద్రదేవత.

౪౪౦. అనవస్తే రథమశ్వాయ తక్షు స్త్వష్టా వజ్రం పురుహూతద్యుమన్తం॥

ఇంద్రా! మనుష్యులయినఋభువులు (దేవతలలోనివారు ముగ్గురువీరు) నీ యాశ్వముకొఱకు రథమునునిర్మించిరి. ఓ పురుహూతుఁడా! (=పలువురచేతఁబిలువంబడువాఁడు) విశ్వకర్మ నీవజ్రాయుధమును వాడియగునదిగాఁజేసెను.

ఋషిచ్ఛందములు పూర్వోక్తములు-ఇంద్రదేవత.

౪౪౧. శంపదం మఘవగ్ం రయీషిణో నకామ మవ్రతో హినోతి
నస్పృశద్రయిం॥

హవీరూపధనమునిచ్చునట్టివారు, సుఖస్థానమును బొందుదురు. యాగములు చేయనివాఁడు సుఖముంబొందఁడు. ఇచ్ఛాసమర్థుఁడునుగాడు.

ఋషిచ్ఛందములు పూర్వవతు-విశ్వేదేవదేవత.

౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౪౪౨. సదాగావ శ్శుచయో విశ్వధాయసః సదాదేవా అరేపసః॥

స్తుతి కర్తలు సేవతో నింద్రుని సమీపించుచున్నారు. వారు నిర్మలులు. ఎల్లపుడు ప్రపంచమును ధరింతురు. దానాది గుణములు కలవారై పాపరహితులగుచున్నారు

సంపాతఋషి-ద్విపద-ఉషో దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర
౪౪౩. ఆయాహివనసా సహగావ స్సచన్త వర్తని యదూధభిః॥

ఓ యుషస్సా! (=సూర్యోదయమునకు ముందు నాల్గుగడియల కాల ముషస్సు) మనోహర తేజస్సుతో రమ్ము. గోవులు (ఉషస్సునకు వాహనములు) రథమును ఈడ్చుచున్నవి. ఏగోవులుపొదుగులతో బలసియున్నవి (యో ఆగోవులని తా॥)

ఋషి చ్ఛందములు పూర్వవతు-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨
౪౪౪. ఉపప్రక్షే మధు మతిక్షియన్తః పుష్యేమరయిం ధీమహేత ఇంద్ర॥

ఇంద్రుఁడా! నీవు మధురమైన మట్టికట్టతోఁ జేసిన(చమస)నీపాత్ర (రాజు యాగకర్తయగునపుడా పాత్రనుపయోగము) సమీపమందు మేముచేరి మంచి యాహారమునుబోషించుకొందుము నిన్ను ధ్యానింతుము.

ఋషిచ్ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ఉ ౩ ౧ ౨ర
౪౪౫. అర్చన్త్యర్కం మరుతస్స్వర్కా ఆస్తోభతిశ్రుతోయువా స ఇంద్రః॥

మంచి స్తోత్రములు గల మరుత్తులు పూజనీయుఁడగునింద్రుని (స్తుతులతోను, హవిస్సులతోను) బూజించుచున్నారు. అతఁడునిత్యయౌవనుఁడనిప్రసిద్ధుఁడు. ఆయింద్రుఁడు శత్రువుల నెదిరించి చంపును.

ఋష్యాదికము పూర్వవతు.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3
౪౪౬. ప్రవ ఇంద్రాయ వృత్రహన్తమాయ విప్రాయగాథం గాయత యంజుజోషతే॥
౧ ౨

ఓ మేధావంతులారా! బాగుగా శత్రువులంజంపునట్టి యా యింద్రుని కై యా స్తోత్రమును గట్టిగాఁబఠింపుఁడు. ఓ ఉద్గాతలారా! (సామవేద గానము చేయువారు) ఆ యింద్రుఁడే స్తోత్రమును సేవించునో (దానినని పూర్వాన్వయము)

చతుర్థాధ్యాయమున దశమఖండము సమాప్తము.

౪ అధ్యాయము.

౧౧ ఖండము.

ఋషిచ్ఛందములు పూర్వవతు-అగ్ని దేవత.

౧ ౨ 3 ౧ ౨ ర 3 ౨ఉ 3 ౧ ౨
౪౪౭. అచేత్యగ్నిశ్చికితిర్హవ్యవాడ్ న సుమద్రథః॥

హవిస్సులు వహించువాఁడు, అధికప్రజ్ఞ కలవాఁడు, హవిస్సులతోఁ గూడినవాఁడు అగ్నియనియందఱు నెఱుంగుదురు. (న=ఇపుడు.)

బంధుఋషి-ద్విపాచ్ఛంద-అగ్ని దేవత.

౨౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర
౪౪౮. అగ్నేత్వంనో అంతమ ఉతత్రాతా శివోభువా వరూథ్యః॥

ఓ యగ్నీ! సేవింపఁదగిన నీవుమాసమీపమున నున్న వాఁడవుకమ్ము. మఱియు రక్షకుఁడవు సుఖకరుఁడవునుగమ్ము.

ఋషిచ్ఛందములు-పూర్వవతు-అగ్ని దేవత.

౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౪౪౯. భగో న చిత్రో అగ్నిర్మహోనాం దధాతి రత్నం॥

గొప్ప వారలలో సూర్యునివలెఁ బూజనీయుఁడైన యగ్ని (యాగకర్తలకు) రమణీయధనమునుఇచ్చును.

ఋషిచ్ఛందములుపూర్వవతు-ఇంద్ర దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౩ ౨
విశ్వస్యప్రస్తోభ పురోవాసన్యది వేహానూనం॥

సర్వశత్రువులకు హింసకుండై మఱియునీయాగమందు ముందునుండినవాఁడగుచు నిశ్చయముగా (ఋత్విజులచే) బాగుగాస్తుతింపఁబడుచున్నాఁడు. (ఇంద్రుఁడని సందర్భమున నెఱుంగునది.)

సంవర్తఋషిఛందము పూర్వవతు-ఉషోదేవత.

౩ ౨ఉ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౪౫౦. ఉషాఅపస్వసుష్టమ స్సంవర్తయతి వర్తనిగ్ం సుజాతతా॥

ఈ యుష చెల్లెలగు (రాత్రియొక్క) చీకటిని (దనతేజస్సుతో) వారించుచున్నది. తనముంచి ప్రకాశమును రథమునఁగూర్చుచున్నది.

(భౌవన) ఆప్త్యఋషి-ద్విపదాచ్ఛంద-విశ్వేదేవదేవత.

౪౫౧ ఇమానుకంభువనాసీషధేమేన్ద్రశ్చ విశ్వేచదేవాః॥

ఈకనంబడుచున్న లోకములను శీఘ్రముగావశపఱచుకొందుము. సర్వభూతములును మాకుసుఖమును సాధించుఁగాక. ఇంద్రుఁడును, సర్వదేవతలును (ప్రీతులయి యీవిషయమును సాధింతురుగాక.)

కవషఐలుషఋషి-ద్విపాదచ్ఛంద-ఇంద్రదేవత.

౪౫౨. విస్రుతయో యథా పథా ఇన్ద్ర త్వద్యన్తురాతయః॥

ఓ యింద్రా! నీవద్దనుండిదానములు చిన్నదారులన్నియు రాజమార్గమునుండి వివిధముగాసాగునట్లు సాగునుగాక.

భరద్వాజఋషి-ద్విపాదచ్ఛంద-ఇంద్రదేవత.

౪౫౩. అయావాజం దేవహితగ్ం సనేమ మదేమ శతహిమాః సువీరాః॥

ఈస్తుతితో నింద్రుఁడిచ్చిన యన్నమును మేము అనుభవింతుముగాక. మంచి పుత్రపౌత్రులంగలసి నూఱేండ్లుసంతసింతుముగాక.

ఆత్రేయర్షి-ద్విపదాచ్ఛంద-విశ్వేదేవదేవత.

౪౫౪. ఊర్జామిత్రోవరుణః పిన్వతేడాః పీవరీమిషం కృణుహీ న ఇంద్ర॥

ఓ యింద్రా! మిత్రవరుణులు,నీవు, మీరందఱు బలముతోఁగూడినవారగుచు మాకన్నములను ఇండు. వృద్ధినొందిన యీయన్నమునుమాకు నింద్రా! యిమ్ము.

వసిష్ఠఋషి-ఏకపదగాయత్రీఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨
౪౫౫. ఇంద్రో విశ్వస్య రాజతి॥

(ఏకారణమువల్ల) ఇంద్రుఁడు ప్రపంచమునకు నీశ్వరుఁడో (అందువల్ల నింద్రుని స్తుతించుఁడని పూర్వమునకన్వయము)

చతుర్థాధ్యాయమున పదునొకండవఖండము సంపూర్ణము.

---

## ౫. అధ్యాయము.

### ౧౨ ఖండము.

గృత్సమదఋషి-అష్టిచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ర ౩ ౨ ౩ ౧ ౨ ర ౩ ౧
౪౫౬. త్రికద్రుకేషు మహిషోయవాశిరం తు విశుష్మ స్తృమ్పత్సోమ మపిబద్వి
౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
ష్ణునా సుతంయథావశం। సఈంమమాద మహికర్మ కర్తవే మహా
౩ ౨ ౨ ర ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ర ౩ ౧ ౨ ర
మురుగ్ం సైనగ్ం సశ్చద్దేవో దేవగ్ం సత్య ఇంద్ర స్సత్య మింద్రం॥

పూజ్యుఁడు, బహుబలుఁడు అగునింద్రుఁడు త్రికద్రుకములనెడు (జ్యోతిర్గౌరాయు అని యాగదినములలో దినములకుఁ బేరు) దినములలో నభిషవించిన సోమమును సక్తుపిండికలిపినదానిని విష్ణువుతోఁగూడ దనయిష్టానుసారము పూర్వమువలెనే త్రావెను. ఆ (త్రావిన) సోమము గొప్పవాఁడు, విస్తరించియున్నవాఁడు, నగునీయింద్రుని వృత్రవధాదికర్మ చేయుటకు మదింపఁజేసెను. సత్యమయి, స్రవించుచున్న, దీపించుచున్న, ఆసోమము సోమమును గోరుచున్న సత్యమయిన యింద్రునిం జెందుఁగాక.

గౌరాంగిరసఋషి-జగతీచ్ఛంద-సూర్యదేవత.

౩౧ ౩౨ ౩౧ ౨ ౩౧ ౨౩ ౨ ౩౨ఉ ౩౧౨ ౩ ౨ ౩
౪౫౭. అయగ్ం సహస్రమానవో దృశః కవీనాం మతిర్జ్యోతిర్విధర్మ॥ బ్రధ్నస్స

౧ ౨ ౩౨౩ ౧ ౨ ౩ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
మీచీ రుషస స్సమైరయదరే పసః సచేతస స్స్వసరే మన్యుమన్త

౩౧
శ్చితాగోః॥

వేయిమంది మనుష్యులుకల (అనఁగా వేయికిరణములు పరివారముగాఁగల వాఁడని తా॥) వాఁడు, గూడఁదగినవాఁడు, మేధావంతులు ధ్యానింపఁదగినవాఁడు, తేజస్స్వరూపుఁడు, నగుసీసూర్యుఁడు శుద్ధములును, చీఁకటి, పాపము లేనివియు, సమానచిత్తములు కలవియునగు నీయుషస్సులను బ్రసరింపఁజేయుచున్నాఁడు (ఉష స్సు సూర్యునికంటె వేఱైనయొకదేవతగాఁ జెప్పుదురు. వేదమున) తరువాతఁబగటి యందు దేజశ్శాలురయిన చంద్రాదులు సూర్యునియొక్క తేజస్సుచేత తేజోహీను లగుచున్నారు.

పురుచ్ఛేదఋషి-అత్యష్టిఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩౨౩ ౧ ౨ర ౩౧ ౨ ౩ ౧ ౨౩౨౩
౪౫౮. ఇంద్ర యాహ్యుపనః పరావతో నాయమచ్ఛా విదథానీవ సత్పతిరస్తా

౧౨౩ ౧౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩
రాజేవ సత్పతిః। హవామహేత్వా ప్రయస్వన్త స్సుతే ష్వా పుత్రాసో

౨ ౩౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
న పితరం వాజసాతయే మగ్ం హిష్ఠం వాజసాతయే॥

ఓ యింద్రా! దూరమునుండి యాసోమమువచ్చినట్లు నీవునుమావద్దకురమ్ము. ఈదేవయజనస్థానమునకు, సత్పురుషులగు ఋత్విజులను బాలించుయజమానునివలెను రమ్ము. గృహమునకురాజువచ్చినట్లును, రమ్ము. హవిసులను బట్టుకొన్నయాగకర్తల మగుమేము నిన్నుసోమరసములు అభిషవింపఁగానే కొడుకులు తండ్రినిబిలుచునట్లు అన్నలాభమునకుఁ బిలుచుచున్నాము.

రేభఋషి-అత్యష్టిచ్ఛంద-ఇంద్రదేవత.

౪౫౯. తమింద్రంజోహవీమి మఘవాన ముగ్రగ్ం సత్రాదధాన మప్రతిష్కుతగ్ం
శ్రవాగ్ంసి భూరి। మగ్ం హిష్ఠో గీర్భిరాచ యజ్ఞియో వవర్త
రాయే నో విశ్వా సుపథా కృణోతు వజ్రీ।

గొప్పధనవంతుఁడు, అధికబలముగలవాఁడు, యథార్థముగా అధికబలములను
కూర్చుకొన్నవాఁడు తిరస్కరింపశక్యముగానివాఁడు, నగునాయింద్రుని మాటిమా
టికినేను (యాగకర్త) బిలుచుచున్నాను. మిగులదాతయగునట్టి, యజ్ఞార్హుఁడయినట్టి,
యింద్రుఁడు మాస్తుతులతో యాగాభిముఖుఁడైయున్నాఁడు. వజ్రాయుధముకల
యింద్రుఁడుధనమునకై అన్నిమంచిమార్గములను జేయుఁగాక.

పురుచ్ఛేపఋషి-అతిశక్వరీచ్ఛంద-విశ్వేదేవదేవత.

౪౬౦. అస్తు శ్రౌషట్పురో అగ్నిం ధియాదధ ఆను త్యచ్ఛర్ధోదివ్యం వృణీమహ
ఇంద్రవాయూ వృణీమహే యద్ధక్రాణా వివస్వతే నాభాసన్దాయ
నవ్యసే। అధప్రనూన ముపయన్తి ధీతయో దేవాగ్ం అచ్ఛా నధీతయః॥

నేను ఎదుట (ఉత్తరవేదియందు) అగ్నిని కర్మతోధరించుచున్నాను. (నిలిపి
నానని తా॥) అట్టిబలమును ద్యులోకమునుండి నాకభిముఖముగా రాఁగోరుచున్నాను.
సూర్యునకు హవిస్సునుధరించియున్న క్రొత్తయజమానునకు యాగగృహమందుఁ
జక్కగా మూఁటఁగట్టె ధనములను ఏ యింద్రవాయువులిత్తురో వారిద్దఱిని బిలుచుచు
న్నాము. కనుక ఈస్తుతియొక్కవినికిఁగలుగుగాక. తర్వాతమాకర్మలు తప్పక మిమ్ముఁ
జెందును. దేవతలకభిముఖముగాఁ బొందుటకునువలె మాకర్మలు వారిసమీపమును
జేరుచున్నవి.

ఏవయామరుత్తృుషి-అతిజగతీచ్ఛంద-మరుద్దేవత.

౫౬౧. ప్రవోమహే మతయోయన్తు విష్ణవే మరుత్వతే గిరిజా ఏవయామరుత్
ప్రశర్ధాయ ప్రయజ్యవే సుఖాదయే తవసే భన్దదిష్టయే ధునివ్రతాయ
శవసే॥

ఏవయామరుత్తు అనెడుఋషి యొక్క వాక్కు నుండిపుట్టిన స్తుతులుమరుత్తులతోఁగూడినట్టి మహాత్ముఁడవైననీకును విష్ణువునకుఁజెందునుగాక మఱియుఎక్కువగా యాగము లాచరించుటకును, సుందరమగు నాభరణములకుఁగాను, బలవంతులైనట్టి, స్తుతిరూపయాగముగలట్టి మేఘములనుగదలించునట్టి, యెల్లపుడుగమనించునట్టి, మరుత్తులసమూహముగలట్టి, యింద్రుని (స్తుతులు) చేరుంగాక.

అనానతఃపురుచ్ఛేదఋషి-అత్యష్టిచ్ఛంద-పావమానదేవత.

౫౬౨. అయారుచా హరిణ్యా పునానో విశ్వాద్వేషాగంసి తరతిసయుగ్వభి
సూరో న సయుగ్వభిః॥ ధారాపృష్ఠస్యరోచతే పునానో అరుషోహరిః
విశ్వాయద్రూపా పరియాస్యృక్వభిః సప్తాస్యేభిర్ఋక్వభిః॥

వడకట్టంబడుచున్నసోమము పచ్చనిరంగుగల్గి ప్రకాశించుచున్న యీ ధారతో సకలశాత్రవులను సూర్యుఁడు తనతోఁగలిసిన కిరణములతో చీఁకట్లను నశింపఁజేయునట్లు నశింపఁజేయుచున్నది. ప్రపంచమునకాధారమైన సోమధారకారుచుఁబ్రకాశించుచున్నది. వడకట్టఁబడుచు పచ్చనిదై సోమముప్రకాశించుచున్నది. ఏ సోమము రసమునుబీల్చుకొను నోర్లుకలట్టి, స్తుతులనుబొందుచున్నట్టి, తేజస్సులతోసర్వరూపములను (రూప=శరీరముగల సర్వవస్తువులనితా॥) వ్యాపించుచున్నది.

నకులఋషి-అష్టిచ్ఛందము-సవితృదేవత.

3౨ఉ 3౧ ౨3౧ ౨ 3క ౨ర 3౧౨3 ౧౨ 3౧౨
౪౬౩. అభి త్యం దేవగ్ం సవితారమోణ్యోః కవిక్రతు మర్చామి సత్యసవగ్ం
3 ౨3౨3 ౨ 3 ౨ 3౨ఉ 3 ౨3౧ ౨ర 3 ౧౨ 3
రత్నధామభి ప్రియం మతిం। ఊర్ధ్వాయస్యామతిర్భా అదిద్యుత త్సవీమని
౧౨ 3౧౨ 3౧౨
హిరణ్యపాణిరమిమీత సుక్రతుః కృపా స్వః॥

ప్రజ్ఞావంతుఁడు, రమణీయధనదాత, అతిప్రీతి కలవాఁడు, స్తుతింపఁ దగినవాఁడుఅయిన సూర్యదేవుని వాక్కుల వ్యాపారముతో (స్తుతులతోనని తా॥) పూజించుచున్నాను. ఏసూర్యుని కాంతి మీఁదుగా ప్రసరించినదై ద్యులోక భూలోకములను దీపించుచున్నదో, ఏసూర్యుఁడుదయింపఁగా నన్నిఁటి కాంతి మిగుల ప్రకాశించునో, అట్టిశుభకర్మలాచరించునట్టి, బంగారు చేతులందుఁగలట్టి సవితృఁ దేవుఁడు ( సూర్యుఁడు ) కృపతో స్వర్గము నిమిత్తము ఈసోమము నింతమాత్రము కొలిచెను.( మితవాన్ అని అర్థము వ్రాసిరి, )

పురుచ్ఛేపఋషి-అత్యష్టి-అగ్నిదేవత.

3౧ ౨ర 3౧౨3 ౧౨3౧ ౨ర 3౧
౪౬౪. అగ్నిగ్ం హోతారం మన్యేదాస్వన్తం వసోస్సూనుగ్ం సహసోజాత
౨ 3 ౨3 ౨3౧౨ ౨ 3౧౨ 3౨ 3౨3౧౨
వేదసం విప్రం న జాతవేదసం॥ య ఊర్ధ్వయా స్వధ్వరో దేవో దేవాచ్యా
3 ౨ 3 ౨3౧౨ 3౧౨3౧ ౨ 3౧౨ 3౧౨
కృపా॥ ఘృతస్యవిభ్రాష్టిమనుశుక్రశోచిష ఆజుహ్వానస్య సర్పిషః॥

యజ్ఞములందు మొదట నియామకుఁడు లేక దేవతలను యాగములకుఁ బిలుచువాఁడును, అగ్నియని తలంతును. మఱియు ఉత్తమదాతయు, ప్రశస్తమైన (యందటి) బలమునకుఁ బుత్రుఁడును, (అందఱుకలిసి బలముతో నరణులను రాపాడించి యగ్నినిదీయుదురు. గానబలమగ్నికి జన్మకారణమని తా॥) ప్రజ్ఞావంతుఁడును, మేధావియగుబ్రాహ్మణునివలె బూజనీయుఁడును, అగునిన్నగ్నీ! స్తుతించుచున్నాను. ఏ

యగ్ని దేవుఁడు మంచియాగములు కలవాఁడును, దేవతలందు ఉన్నతమైనదయతోఁ నుండువాఁడు, (వారికిహవిస్సులిచ్చి పోషించుననితా॥) దీపించు తేజస్సు కలవాఁడు, కఱఁగుచున్న నేతిని గాల్చుచు స్వీకరించువాఁడు (నగునగ్నిని స్తుతించుచున్నాను.)

గృత్సమదఋషి-అతిశక్వరీచ్ఛంద-ఇంద్రదేవత.

౧౬౫. తవత్యన్నర్యం నృపోऽప ఇంద్ర ప్రథమం పూర్వ్యం దివిప్రవాచ్యం కృతం। యో దేవస్య శవసా ప్రారిణా అసురిణన్నపః భువో విశ్వమభ్య దేవమోజసా విదేదూర్జగ్ం శతక్రతుర్విదేదిషం॥

ఓ యింద్రా! నరులకు మేలు చేయునట్టి, మొదటిది, పూర్వకాలము నఁబుట్టినది, యగునీవు చేసిన యాకర్మ స్వర్గమందు దేవతలచేత గొనియాడఁబడుచున్నది. (అదేదం టేను) జయశీలుఁడయినయసురుని ప్రాణమునుహింసించుచు నీవుఉదకములను (వాఁ డదివఱకునరికట్టిన వాటిని) భూమిపై వర్షముగాఁగారించుట యనునది (కొనియాడఁబ డినది) అట్టియింద్రుఁడు సర్వత్రవ్యాపించిన చీఁకటిస్వరూపుఁడయిన యసురుని దన బలముతోఁదిరస్కరించుఁగాక. (చీఁకటినే అసురుఁడనితా॥) ఇంద్రుఁడుబలమును గలి గించుఁగాక. (హవిస్సులరూపమైన) అన్నమును గలిగించుఁగాక.

చతుర్థాధ్యాయ ద్వాదశఖండముతో ఐంద్రిపర్వము సమాప్తము.

## ప వ మా న కాం డ ము .

### ౫ అధ్యాయము.

### ౧. ఖండము.

ఈ యధ్యాయమున సోమస్తుతి చెప్పఁబడును.

౧ మొ॥ ౪౪ వరకు గాయత్రీచ్ఛందము-అధ్యాయమంతయు సోమదేవత.

అమహీయుఋషి.

౪౬౬. ఉచ్చాతే జాతమన్ధసో దివి సద్భూమ్యాదదే। ఉగ్రగ్ంశర్మ మహిశ్రవః॥

నీసంబంధమైన రసముయొక్క జన్మ ఉచ్ఛస్థానమునఁగల్గెను. ద్యులోకమం దున్న అధికమయినసుఖమును గొప్పయన్నమును భూమిస్వీకరించినది. (తీసికొన్నది అనఁగాభూమిమీఁద నున్నవారనితా॥)

మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-సోమ దేవత.

౪౬౭. స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా ఇంద్రాయ పాతవే సుతః॥

ఓ సోమమా! యింద్రుఁడు పానముచేయుటకై యభిషవిం (=పిండిన) పఁబడిన దానవగుచు మిక్కిలిరుచిగలిగి మదమును అధికముగాఁగలిగించు ధారతోఁ గారుము.

భృగుర్వారుణిఋషి.

౪౬౮. వృషాపవస్వధారయా మరుత్వతే చ మత్సరః విశ్వాదధాన ఓజసా॥

ఓ సోమమా! నీవువర్షముకురియించు దానవగుచు ధారతో మరుత్తులతోఁ గూడినయింద్రునికై (ద్రోణకలశములోనికి) నీతేజస్సుతో సకలధనములు (స్తుతికర్తల) కిచ్చుచు మదముకలిగింపఁగారుము.

అమహీయుఋషి.

౨ ౩ ౨ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౪౬౯. యస్తేమదో వరేణ్యస్తేనా పవస్వాన్ధసా। దేవావీరఘశగ్ంసహా॥

ఓ సోమమా! దేవతలంగోరునట్టి, రాక్షసులంజంపునట్టి, అందఱుగోరఁదగినట్టి మదముగలిగించు నేరసముగలదో యాదరింపఁదగిన యారసముతోఁగారుమా!

త్రితఋషి.

౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౪౭౦. తిస్రోవాచ ఉదీరతే గావో మిమన్తిధేనవః। హరి రేతి కనిక్రదత్॥

మూఁడువిధములయిన (ఋగ్యజుస్సామ) వాక్కులను (ఋత్విజులు) బిగ్గఱగా గానముచేయుచున్నారు. ధేనువులు ఆశిరముతో (సోమములోకలుపునట్టి పాలుపెఱుగులకుఁబేరు.) ధ్వనించుచున్నవి. (అనఁగాపాలుతీసుకొమ్మని యఱచుచున్నవి.) పచ్చనికాన్తిగల సోమరసముధ్వనించుచు (కలశమున) పడుచున్నది.

కశ్యపఋషి.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౭౧ ఇంద్రాయేందో మరుత్వతే పవస్వ మధుమత్తమః। అర్కస్యయోని
౩ ౧ ౨
మాసదం॥

ఓ సోమమా! మిగులమాధుర్యముకలిగి నీవుపూజనీయమయిన యాగస్థానమునుజేరుటకు మరుత్తులతోఁగూడిన యింద్రునినిమిత్తము కారుము.

జమదగ్నిఋషి.

౨ ౧ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౭౨. అసావ్యగ్ం శుర్మదాయాప్సు దక్షోగిరిష్ఠాః। శ్యేనో న యోనిమాసదత్

పర్వతమందుఁబుట్టిన సోమము (లతయనితా॥) మదముకొఱకు (బిండఁబడినది. ఉదకములందు వృద్ధిపొందినది. డేగయెట్లు (అడవిలోఁదిరిగితిరిగి) స్వస్థానమును జేరునట్లు ఈసోమము స్వస్థానమును (ద్రోణకలశములో) జేరుచున్నది.

ధృఢచ్యుత (ఆగస్త్య) ఋషి.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౭౩. పవస్వ దక్షసాధనో దేవేభ్యః పీతయే హరే। మరుద్భ్యో వాయవేమదః।

పచ్చనిదానవయిన-లేక-పాపహారివైన ఓ సోమమా! బలమునకు సాధనమయి మదమును గలిగించునీవు ఇంద్రాదిదేవతల పానముకొఱకుఁగారుము. అట్లేమరుత్తుల (పానము) కొఱకు వాయువు (పానము) కొఱకునుగారుము.

అసిత దేవలులుఋషులు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౪౭౪ పరి స్వానో గిరిష్ఠాః పవిత్రే సోమో అక్షరత్। మదేషు సర్వధా అసి॥

ఈసోమము పర్వతమందుండినది. (తర్వాత) పిండంబడికార్చఁబడుచునే పవిత్రమందు (వడకట్టుటకు) కారుచున్నది. సోమమా! నీవుస్తుతించువారి కన్నివిధముల సాయపడుదువు.

పూర్వోక్తఋషి.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩క ౨ర ౩ ౨ ౩ ౧ ౨
౪౭౫, పరిప్రియా దివః కవిర్వయాగ్ంసి నప్త్యో హితః। స్వానైర్యాతి
౩ ౧ ౨
కవిక్రతుః॥

మేధావులైన లోపల ప్రజ్ఞకలసోమము అధిషవణఫలకములందు (రసముదంచి కార్చుటకుపయోగించు ఱాతిపలకలు) ఉంచఁబడెను. అదిద్యులోకమునకు ప్రియము లైన శిలలనుగూర్చి అధ్వర్యుఁడు మొదలగువారితో నడచుచున్నది.

పంచమాధ్యాయమున ప్రథమఖండము పూర్ణము.

—:o:—

## ౫ అధ్యాయము.

### ౨ ఖండము.

శ్యావాశ్వఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౭౬. ప్రసోమాసో మదచ్యుతః శ్రవసే నో మఘోనాం। సుతా విదథే అక్రముః॥

సోమములు మదము స్రవింపఁజేయుచు, అభిషవింపఁబడినవై యాగముచేయు చున్న మనయాగమందు నన్నమునకై ప్రవర్తించుచున్నవి.

త్రితఋషి.

౧ ౨ర ౩౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౪౭౭. ప్రసోమాసో విపశ్చితోऽపోనయన్త ఊర్మయః। వనాని మహిషా ఇవ॥

మేధావంతములగు సోమములు పాత్రములకు నీటికెరటములవలెఁ జేరుచు న్నవి. గొప్పమృగములు వనములనుజేరునట్లు చేరుచున్నవి. (ఒకఉపమానము తన చోటినుండి నడచుటకు రెండవది పవిత్రముమీఁదఁబడుటకును అనితా॥)

అమహీయుఋషి.

౧౨ ౩ ౧ ౨ ౩౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౪౭౮. పవస్వేందో వృషా సుతః కృధీనోయశసో జనే। విశ్వా అప ద్విషోజహి॥

ఓ సోమమా! అభిషవింపఁబడి తడుపుచు నీవు (ధారతో) కారుము. దేశము నందు మమ్ముఁగీర్తిమంతులనుగాఁ జేయుము. శత్రువులనందఱిని జంపుము.

భృగుఋషి.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౪౮౯. వృషాహ్యసి భానునా ద్యుమన్తం త్వాహవామహే। పవమాన
౩ ౧ ౨
స్వర్దృశం॥

ఓ సోమమా! (కోరినకోర్కెల) వర్షించుచున్నదానవు. కనుక వడకట్టఁబడు చున్న సోమమా! సర్వమునుజూచుచున్నట్టి, తేజస్సుతోఁబ్రకాశించుచున్నట్టి, నిన్ను యజ్ఞములలో ఆహ్వానించు (=పిలుచు)చున్నాము.

కశ్యపఋషి.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౪౯౦. ఇందుః పవిష్ట చేతనః ప్రియః కవీనాం మతిః। సృజదశ్వగ్ం రథీరివ॥

ప్రజ్ఞను గలిగించునది (దేవతలకు) ప్రియమైనది యగుసోమము స్తుతికర్తల స్తవములతోఁగారుచున్నది. రథికుఁడు అశ్వమును వదులునట్లు అనఁగాఁబరువెత్తించు నట్లు తనలోఁదరంగమును లేకప్రవాహమును వదలుచున్నది. (పుట్టించుచున్నది.)

కశ్యపఋషి.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౪౯౧. అసృక్షత ప్రవాజినో గవ్యా సోమా సోఅశ్వయా। శుక్రాసోవీర
౨ర
యాశవః॥

బలవంతములు, వేగవంతములు (అనఁగా వేగమును బలమును బుట్టించునవని తా॥) నగుసోమరసములు గోవులంగోరి యశ్వములంగోరి (ఋత్విజులచేత) గార్పం బడెను.

నిధ్రువి (కాశ్యప) ఋషి.

౧౨ ౩౧ ౨ ౩ ౧ ౨ర ౩౧౨ ౩ ౧ ౨ర ౩౧౨
౪౭౨. పవస్వ దేవ ఆయుషగిందర్గం గచ్ఛతు తేమదః। వాయుమారోహ ధర్మణా॥

ఓ సోమమా! ప్రకాశించుచున్న నీవు (ధారగా) కారుము. నీమదమువద్ల కుండ నింద్రుని జెందుఁగాక. నీవుధారకమైన రసముతో వాయువిూఁద ఁగూర్చుండుము.

అమహీయఋషి.

౧౨ ౩౨ ౩ ౧ ౨ర౩ ౨ ౧ ౨ ౨౨
౪౭౩. పవమానో అజీజన ద్దివశ్చిత్రం నతన్యతుం। జ్యోతిర్వైశ్వానరం
౩ ౨
బృహత్॥

సోమము గొప్పదయిన వైశ్వానరమను పేరుగల తేజస్సును ద్యులోకమునందు బుట్టిన చిత్రమయినపిడుగునువలెను బుట్టించెను.

కాశ్యపఋషి.

౧౨౩ ౨ ౩ ౧౨౩ ౧ ౨ ౩౧ ౨౩ ౨ ౧ ౨ ౩౧౨
౪౭౪. పరిస్వానాస ఇన్దవో మదాయ బర్హణాగిరా। మధో అర్షన్తిధారయా॥

అభిషవింపంబడుచున్నవి, దీపించునవి, గొప్పదగుస్తుతివాక్కుచేత మదముం గలిగించునవియగు సోమములు ధారతోఁగూడ దేవతలమదముకొఱకు (దశాపవిత్రమునుండి) కారుచున్నవి. (దశాపవిత్రము=వడపోతవస్త్రము.)

కాశ్యపఋషి.

౧౩౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర౩ ౨ ౩౧ ౨ర ౩ ౧ ౨
౪౭౫. పరిప్రాసిష్య దత్కవిః సిన్ధోరూర్మా వధిశ్రితః। కారుంబిభ్రత్పురుస్పృహం॥

మేధావియు, సముద్రకెరటము నందాశ్రయించినదియు, అనేకులచేతం గోరంబడిన స్తుతికర్తను బోషించునదియు నగు సోమము స్రవించుచున్నది. (కారుచున్నది)

పంచమాధ్యాయ ద్వితీయ ఖండము సమాప్తము.

## ౫ అధ్యాయము.

### ౩ ఖండము.

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౪౮౬. ఉపోషు జాతమప్తురం గోభిర్భఙ్గం పరిష్కృతం। ఇందుం దేవా అయాసిషుః॥

చక్కగాఁబుట్టి యుదకములను బ్రేరించునట్టి, శత్రువులను భంగపఱచునట్టి, ఆవుపాలతో నలంకరింపఁబడినట్టి, సోమమును ఇంద్రాదిదేవతలు పొందుచున్నారు.

పూర్వోక్తఋషి.

౪౮౭. పునానో అక్రమీదభి విశ్వా మృధో విచర్షణిః। శుమ్భన్తి విప్రం ధీతిభిః॥

(సర్వమును) జూచునట్టి సోమము శత్రువులనందఱిని (కాలితో) నణఁగఁద్రొక్కుచున్నది. ఆట్టిమేధావంతమయిన సోమమును శుద్ధులతో నలంకరించుచున్నారు.

జమదగ్నిఋషి.

౪౮౮. ఆ విశన్కలశగ్ం సుతో విశ్వా అర్షన్నభిశ్రియః। ఇందురిన్ద్రాయ ధీయతే॥

అభిషవింపఁబడిన సోమము (ద్రోణ) కలశమందుఁబ్రవేశించెను. (సోమము సంగ్రహించు కలశమునకు ద్రోణనామము) సంపదలనన్నిఁటిని అంతటనుండి పొందించుచు దీపించు సోమము ఇంద్రునికై (దశాపవిత్రమందు) ఉంచఁబడుచున్నది.

ప్రభూవసుఋషి.

౮౮౯. అసర్జిరథ్యో యథా పవిత్రేచ మ్వోః సుతః। కార్ష్మన్ వాజీ న్యక్రమీత్॥

రథమునకుఁ దగిన గుఱ్ఱము ఎట్లు విడువఁబడెనో యట్లు (అధిషవణఫలకముల మీఁద) అభిషవింపఁబడిన సోమము పవిత్రమందు విడువఁబడెను. (అనఁగా ఱాళ్లతోఁ దంచినతర్వాత వడపోత వస్త్రముమీఁదఁబోసినారని తా॥) వేగవంతమైనయట్టి సోమము యుద్ధమందు బాగుగాఁ బ్రవర్తిల్లుచున్నది.

మేధ్యాతిథిఋషి.

౮౯౦. ప్రయద్గావో న భూర్ణయ స్త్వేషా అయాసో అక్రముః। ఘ్నన్తః కృష్ణా మ పత్వచం॥

త్వరగలవి, దీపించునవి, గమనించునవి, నల్లని చర్మమును త్రోసివేయుచున్నవి. (రసముకారి తొక్క మిగిలిపోవుచున్నదని తా॥) యునగుసోమములు గోవులుదకములంగూర్చి (వచ్చిపడునట్లు) యజ్ఞమునకు వచ్చిపడుచున్నవి.

నిధ్రువిఋషి.

౮౯౧. అపఘ్నన్ పవసే మృధః క్రతువిత్సోమ మత్సరః। నుదస్వా దేవయుంజనం॥

ఓ సోమమా! మదముకలిగించునట్టి యే నీవు శత్రువులను జంపుచు మాకు యాగమును గలిగించుచు (గారుచున్నావో ఆ నీవు దేవతలనుగోరని నరుని ద్రోసివేయుము.

నిధ్రువిఋషి.

౪౯-౨. అయాపవస్వధారయా యయా సూర్యమరోచయః। హిన్వానో మానుషీ రపః॥

మనుష్యులకు మేలుచేయు నుదకములను బుట్టించుచు నీవు ఓ సోమమా! యే ధారతో సూర్యునిం బ్రకాశింపఁ జేసితో ఆధారతో కారుము.

అమహీయుఋషి.

౪౯-3. సపవస్వయ ఆవిథేన్ద్రం వృత్రాయ హన్తవే॥ వవ్రివాగ్ంసం మహీరపః॥

ఓ సోమమా! యే నీవు గొప్పవగునుదకములను అడ్డుపెట్టియున్న వృత్రునిం జంపుటకు నింద్రుని రక్షించితివో, యా నీవు ధారతోఁ గారుము. (అనఁగా వర్షము కురియకుండఁ జేసిన వృత్రుని నింద్రుఁడు సోమపానమదమెక్కి యే చంపెననితా॥)

అమహీయుఋషి.

౪౯-౪. అయావీతో పరిస్రవ యస్త ఇందో మదేష్వా। అవాహన్నవతీర్నవ॥

ఓ సోమమా! యీరసముతో (నింద్రుని) భక్షణముకొఱకుఁ గారుము. ఏరసము యుద్ధములందుఁ దొంబదితొమ్మిది శంబరుని కోటలను బడఁగొట్టెనో, (అనఁగా దీనిఁ ద్రావిమదించి యింద్రుఁడు కొట్టెననితా॥)

ఉక్థ్యఋషి.

౪౯-౫. పరిద్యుక్షగ్ం సనద్రయిం భరద్వాజంనో అన్ధసా। స్వానో అర్షపవిత్రఆ॥

దీపించునట్టి, యివ్వఁబడుచున్న ధనముగలట్టి, బలమును అన్నముతోఁగూడ సోమము మాకు నంతటనిచ్చుఁగాక. ఓ సోమమా! యభిషవింపంబడుచున్న నీవు పవిత్రమందు నభిముఖముగాఁగారుము.

ఇట్లు పంచమాధ్యాయ తృతీయ ఖండము పూర్ణము.

---

### ౫ అధ్యాయము.

### ౪ ఖండము.

మేధ్యాతిథిఋషి - గాయత్రీచ్ఛందము - సోమదేవత.

౪౯౬. అచిక్రదద్వృషా హరిర్మహాన్ మిత్రోనదర్శతః। సగ్ం సూర్యేణ దిద్యుతే।

(కోర్కెల) వర్షించునది, ఆకుపచ్చని రంగుగలది, పూజ్యమయినది, స్నేహితునివలెఁ జూడందగినదియగు నే సోమము ధ్వనించుచున్నదో (కలశములోఁగారుచున్న చప్పుడనితా॥) ఆ యీ సోమము సూర్యునితోఁగూడఁ బ్రకాశించుచున్నది.

భృగుఋషి.

౪౯౭. ఆతేదక్షం మయోభువం వహ్నిమద్యా వృణీమహే॥ పాన్తమా పురుస్పృహం॥

ఓ సోమమా! (యాగకర్తలమయిన) మేము నీసంబంధమైనది, సుఖమును గలిగించునది, ధనాదులను గలిగించునది, రక్షించునది, పలువురు కోరందగినదియు నగు బలమును ఈ యాగదినమందు మాకభిముఖముగాఁగోరుచున్నాము.

ఉచథ్యఋషి.

౪౯౮. అధ్వర్యో అద్రిభిః సుతగ్ం సోమం పవిత్ర ఆనయ॥ పునాహీన్ద్రాయ పాతవే॥

ఓ యధ్వర్యుఁడా! శిలలతోనభిషవింపఁబడిన సోమమును పవిత్రమందుఁజేర్చుము. ఇంద్రుని పానముకొఱకు పడకట్టుము.

అవత్సారఋషి.

౪౯౯. తరత్సమందీ ధావతి ధారా సుతస్యాన్ధసః। తరత్స మందీ ధావతి॥

దేవతలను మదింపఁజేయునట్టి యీసోమము స్తుతికర్తలను బాపములనుండి తొలగించుచుఁ గలశములోనికిఁ బోవుచున్నది. అభిషవించిన సోమధార పాపము నుండి తొలఁగించి ఊర్ధ్వలోకమును (స్తుతికర్తను) జేర్చును.

నిధ్రువిఋషి.

౫౦౦. ఆపవస్వ సహస్రిణగ్ం రయిగ్ం సోమసువీర్యం। అస్మే శ్రవాగ్ంసి ధారయ॥

ఓ సోమమా! నీవు అనేకములైన సామర్థ్యములతోఁగూడిన ధనమును అభిముఖముగాఁగార్చుము. మాయందు నన్నములఁగలిగించుము.

నిధ్రువిఋషి.

౫౦౧. అనుప్రత్నాస ఆయవః పదంనవీయో అక్రముః రుచేజనన్త సూర్యం॥

పురాతనములగు గుఱ్ఱములుకొన్ని నూతనమగుమార్గమును అనుసరించి పోవు చున్నవి. కాన్తికొఱకు సూర్యునింబుట్టించుచున్నవి. (అనఁగా సోమలతలు గుఱ్ఱాల వంటివని, దానిరసము సూర్యుని వంటిదని దానినాలతలు పుట్టించినవనితా॥)

భృగుఋషి.

౫౦౨ అర్షాసోమ ద్యుమత్తమోఽభి ద్రోణాని రోరువత్॥ సీదన్యోనౌ వనేష్వా॥

ఓ సోమమా! మిగులకాన్తిగల నీవు ద్రోణకలశముంగూర్చి మాటిమాటికి ధ్వనించుచు (అనేకమార్లు కలశములోఁ బోయుటవల్ల బహువచనము-కాని-కలశము ఒక్కటే) కోరఁదగిన యాగగృహమందుం డుటకురమ్ము.

కశ్యపఋషి.

౫౦౩. వృషా సోమ ద్యుమాఀ౨ం అసివృషా దేవ వృషవ్రతః॥ వృషాధర్మాణి దధ్రిషే॥

ఓ సోమమా! (కోర్కెల) వర్షించునట్టి నీవు కాన్తికలదాన వగుచున్నావు. ప్రకాశించుదానా! వర్షించునీవు వర్షమును గురియించుపనిలో నున్నావు. వర్షించు నీవు దేవమనుష్యులకు హితవయిన కర్మలను ధరించుచున్నావు. అనఁగా దేవకర్మలు మనుష్యకర్మలు సోమమునాధారము చేసికొని ప్రవర్తించుననితా॥)

కశ్యపఋషి.

౫౦౪. ఇషేపవస్వ ధారయా మృజ్యమానో మనీషిభిః। ఇన్దో రుచాభి గా ఇహి॥

ఓ సోమమా! ఋత్విజులచేత శోధింపఁబడిన నీవు మాయన్నమునకై ధారతోఁ గారుము. ప్రకాశించునన్నముతోఁ బశువులను బొందుము.

అసితఋషి.

౫౦౫. మన్ద్రయాసోమ ధారయా వృషాపవస్వ దేవయుః। అవ్యా వారేభి రస్మయుః॥

సోమమా! వర్షించునీవు దేవతలను గోరునట్టి మము గోరునట్టి దానవై గొఱ్ఱెవెంట్రుకల (వస్త్రము) ద్వారా మదముఁగలిగించు ధారతోఁ గారుము.

కవిఋషి.

౫౦౬. అయాసోమ సుకృత్యయా మహాన్త్సన్నభ్యవర్ధథాః। మన్దాన ఇద్వృషాయసే॥

సోమమా! యీచక్కని సంస్కారములతోఁ బూజనీయమవై దేవతలకొఱకు వృద్ధిపొందుము. హర్షించుచు వృషభమువలె వర్తించుచున్నావు. (అనఁగా వృషభమువలె ధ్వనించుచున్నావనితా॥)

జమదగ్నిఋషి.

౫౦౭. అయం విచర్షణి ర్హితః పవమాన స్సచేతతి। హిన్వాన ఆప్యంబృహత్॥

విశేషదర్శనము గలట్టి, (పాత్రమందు) ఉంచఁబడినట్టి, వడకట్టఁబడినట్టి యీ సోమము ఉదకములందుఁబుట్టిన గొప్పదయిన యన్నమును గలిగించుచు నందఱిచే నెఱుంగఁబడుచున్నది.

అయాస్యఋషి.

౫౦౮. పరిసఇందో మహేతున ఊర్మిం నబిభ్రదర్షసి। అభిదేవాగ్ం అయాస్యః॥

స్రవించుచున్నసోమమా! నీవుమాకు గొప్పధనమునకై బాగుగా స్రవించు చున్నావు. ఈ (యయాస్య) ఋషి నీతరంగమును ధరించుచు దేవతలను బూజింపఁద లంచుచున్నాఁడు.

అమహీయఋషి.

౫౦౯. అపఘ్నన్ పవతే మృధోఽప సోమో అరావ్ణః। గచ్ఛ న్నింద్రస్య నిష్కృతం॥

సోమము శత్రువులను జంపుచు, (ఇతరుల) ధనములను దీసికొను వారినిన్నీ చంపుచు, నింద్రుని స్థానమునకుఁ జేరుచు ధారగాఁ గారుచున్నది.

ఇట్లు పంచమాధ్యాయ చతుర్థఖండము పూర్ణము.

—:o:—

౬ అధ్యాయము.

౫ ఖండము.

భరద్వాజాదులేడ్గురుఋషులు-బృహతీచ్ఛంద-సోమదేవత.

౫౧౦. పునానస్సోమ ధారయాపో వసానో అర్షసి। ఆరత్నధా యోనిమృతస్య సీదస్యుత్సో దేవో హిరణ్యయః॥

ఓ సోమమా! శుద్ధిచేయుదానవై యుదకములతోఁగలసి ధారగాఁ బ్రసరించు చున్నావు. (కలశములోనికని తా॥) రమణీయధనము లిచ్చుదానవగు నీవు యజ్ఞస్థానము ను జేరుచున్నావు. ప్రకాశించుచు సోమము కారుచు (దేవతలకు) హితము రమణీయ మునగు చున్నది. (బంగారు కాన్తిగనిన బాగుండును)

ఋష్యాదులుపూర్వవతు.

౫౧౧. పరీతో షించతా సుతꣳ సోమో య ఉత్తమꣳ హవిః। దధన్వాꣳ యో నర్యో అప్స్వ౩న్తరా సుషావ సోమ మద్రిభిః॥

ఓ ఋత్విజులారా! అభిషవించిన సోమము నిచ్చటినుండి కొనిపోయి (వసతీవరీయను నుదకములలోఁ) గలుపుఁడు. ఏ సోమము ఉదకములందు లేక అంతరిక్షమందు నడచుచున్నదో ఆసోమమును అధ్వర్యుఁడు శిలలతోఁ బిండెను. (దానిని నీటిలోఁ గలుపుఁడని యన్వయము.)

అత్రిఋషి- ఛందో దేవతలుపూర్వవతు.

౫౧౨. ఆ సోమ స్వానో అద్రిభిస్తిరో వారాణ్యవ్యయా। జనో న పురి చమ్వోర్విశద్ధరిః సదో వనేషు దధ్రిరే॥

ఓ సోమమా! శిలలచేత నభిషవింపఁబడుచున్న నీవు గొఱ్ఱెబొచ్చు (తోఁ జేసిన దారములను) తిరస్కరించి (అనఁగా దాటి) మెదుగుగాఁగారుచున్నావు. ఆకుపచ్చని రంగుగల ఆసోమము అధిషవణ (=పిండుట) ఫలకములమీఁదనున్న కలశములోనికి మనుష్యుఁడు తనయింటికిఁ జేరునట్లు జేరుచున్నది. అట్టినీవు కఱ్ఱతోఁ జేసిన పాత్రలందు వాసము చేయుచున్నావు.

విశ్వామిత్రఋషి- ఛందో దేవతలుపూర్వవతు.

౫౧౩. ప్రసోమ దేవవీతయే సిన్ధుర్న పిప్యే అర్ణసా। అꣳశోః పయసా మదిరో న జాగృవిరచ్ఛాకోశం మధుశ్చుతం॥

ఓ సోమమా! నీవు దేవతల భక్షణముకొఱకు ఉదకముతోఁదృప్తినొందుచు

న్నావు. (నీటిలోఁగలియుచున్నదనితా॥) సముద్రము నీటితోఁదృప్తినందునట్లు (అనఁగానిండినట్లనితా॥) మదమునుగలిగించునట్టి, (అయినను) జాగ్రతనుగలిగించు స్వభావముగలట్టి, సోములతయొక్క రసముతోఁగారుచు ద్రోణకలశమున మధుర రసము నింపుచుఁజేరుచున్నావు.

ఋష్యాదులు పూర్వవతు.

౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ 3
౫౧౪. సోమ ఉష్వాణః సోతృభిరధిష్ణుభి రవీనాం॥ అశ్వయేవ హరితాయాతి
౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
ధారయా మంద్రయాయాతి ధారయా॥

పిండునట్టి పురుషులచేతఁ బిండఁబడుచున్న సోమను గొఱ్ఱెలయొక్క పొడవయిన వెంట్రుకలద్వారా బయలువెడలుచున్నది ఆడుగుఱ్ఱమువంటి ధారతోనడుచుచున్నది. మదముకలిగించుధారతో (ద్రోణ) కలశమునఁజేరుచున్నది

ఋష్యాదులు పూర్వవతు.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧
౫౧౫. తవాహగ్ంసోమరారణ సఖ్య ఇన్దో దివే దివే॥ పురూణి బభ్రోని
౨ 3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౨
చరన్తి మామవ పరిధీగ్ం రతితాగ్ం ఇహి॥

సోమమా! నీస్నేహమునందు నేను ప్రతిదినమును విహరించు చున్నాను. బూడిదరంగు సోమమా! అనేకరాక్షసులు నీసఖ్యముగలిగియున్న నను బాధించుచున్నారు ఆరాక్షస్సులను గూర్చి రమ్ము. (నశింపఁజేయుమనితా॥)

వశిష్ఠఋషి.

3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ 3 ౧ ౨
౫౧౬ మృజ్యమాన స్సుహస్త్యా సముద్రే వాచమిన్వసి। రయిం పిశంగం
3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3క ౨ర
బహులం పురుస్పృహం పవమానాభ్య షసి॥

మంచిశ్రేష్ఠకల (అనఁగా శ్రేష్ఠుజోడించి రసముపిండఁబడెననితా॥) సోమమా! వడకట్టఁబడిన నీవు అంతరిక్షమును లేక కలశమును ధ్వనినిజేయుచున్నావు. వడకట్టుచున్న సోమము బంగారు మొదలయిన విస్తారమైన అనేకులు కోరఁదగినట్టి ధనమును (స్తుతికర్తల) కిచ్చుచుఁగారుచున్నది.

విశ్వామిత్రఋషి.

౫౧౭. అభిసోమాస ఆయవః పవన్తే మద్యం మదం। సముద్రస్యాధి విష్టపే
మనీషిణో మత్సరాసో మదచ్యుతః॥

నడచుస్వభావముగల సోమములు మదముగలిగించు రసమును అంతరిక్షముననున్నత స్థలమునందుఁ గార్చుచున్నవి. లేక కలశోపరి స్థానమందుఁ గార్చుచున్నవి. (ఆసోమములు) మనస్సునకిష్టములు మదకరములునగుచు మదముకలిగించు రసమును కార్చుచున్నవి.

కాశ్యపఋషి.

౫౧౮. పునాన సోమ జాగృవిఖ్యా వీరైః పరిప్రియః త్వం విప్రో అభవోऽ
ఙ్గిరస్తమమధ్వా యజ్ఞం మిమిక్షణః॥

సోమమా! జాగ్రత్తతోనుండు స్వభావముకలదానవు, ప్రీతిం గలిగించుదానవునగునీవు వడకట్టఁబడుచు గొఱ్ఱెవెండ్రుకలద్వారా కారుచున్నావు. అంగిరస వంశ్యులలో శ్రేష్ఠమయినట్టి, మేధగలట్టి నీవు పితృదేవతల నడిపించుదాన వగుచున్నావు. ఆనీవు మాయజ్ఞమును మధురరసముతోఁ దడుపఁదలఁచుచున్నావు.

జమదగ్నిఋషి.

౫౧౯. ఇంద్రాయ పవతే మదగ సోమో మరుత్వతే సుతః సహస్రధారో
అత్యవ్యా మర్షతి తమీా మృజన్త్యాయవః॥

మదముగలిగించునట్టి, అభిషవించిన సోమము మరుత్తులతోఁగూడిన యింద్రుని కొఱకు స్రవించుచున్నది. తర్వాతనేక ధారలతోఁగూడిన సోమము గొఱ్ఱెబొచ్చుతోనిర్మించిన వస్త్రమునుదాటి కారుచున్నది.

వశిష్ఠఋషి.

౫౨౦. పవస్వ వాజసాతమోఽభి విశ్వాని వార్యా। త్వగం సముద్రః ప్రథమే
విధర్మం దేవేభ్యః సోమ మత్సరః॥

ఓ సోమమా! కోరఁదగినస్తోత్రముల నన్నింటినిగూర్చి అన్నమును గలిగించునట్టి నీవు కారుము సోమమా! దేవతలకు మదముగలిగించునది, చలువగలిగించునది, విశేషముగాఁ బోషించునదియునగు నీవు ముఖ్యము శ్రేష్ఠమునగు యజ్ఞమందు దేవతల కొఱకుఁగారుము.

వశిష్ఠఋషి.

౫౨౧. పవమానా అసృక్షత పవిత్రమతిధారయా। మరుత్వన్తో మత్సరా
ఇంద్రియా హయా మేధామభిప్రయాగంసిచ॥

వడపోయంబడుచున్న సోమములుతనధారతోఁబవిత్రమునుదాటి మరుత్తులతో ( వాయువులు )గలిసినవియు, మదమునుగలిగించునవియు, యిందునకు బ్రియము

లు నగుచుఁగారుచున్నవి. స్తుతినిఅన్నమును గలిగించునవై యాగమందు నడచుచున్నవి. ( రసము తీసి కలశములలోనికి ఋత్విజులు తీసికొని పోవుటే వాటి నడక. )

ఇట్లు పంచమాధ్యాయపంచమఖండము సమాప్తము

౬ అధ్యాయము.

౬ ఖండము.

ఉశనఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత.

౬ ౨౨. ప్రతుదృవ పరికోశం నిషీద నృభిః పునానో అభివాజమర్ష। అశ్వం న త్వా వాజినం మర్జయన్తోऽచ్ఛా బర్హీః రశనాభిర్నయన్తి॥

ఓసోమమా! శీఘ్రముగా నడువుము. ద్రోణకలశమందు నివసించుము. నాయకులచే వడపోయఁబడి, యన్నమును (యజమానునకు) ఁగలిగించుము. యుద్ధమునుగూర్చి యశ్వమును (చేతితో )తుడుచునట్లు నిన్ను తుడుచుచున్నారు ఆసోమమును శోధించుచు యాగమునకు తాళ్ళ వలెఁబొడవులైనవేళ్ళతో (అధ్వర్యుఁడుమొదలగువారు) పట్టుకొని పోవుచున్నారు.

వృషగణుఁడు (వాసిత) ఋషి-ఛం-దే-పూర్వవతు

౬ ౨౩. ప్రకావ్య ముశనే వ బ్రువాణో దేవో దేవానాం జనిమావివక్తి।మహివ్రతః శుచిబన్ధుః పావకః పదావరాహో అభ్యేతి రేభన్॥

ఉశనఋషివలె స్తోత్రమును బఠించుచున్న స్తుతికర్త (ఈవృషగణుఁడు) ఇం

దారిద్రుల జన్మములను బాగుగఁబలుకుచున్నాఁడు. అనేక కర్మలుగలవాఁడై, దీపించు తేజస్సుగలిగినవాఁడై, పాపముల శోధించుచు శ్రేష్ఠమయిన (అభిషవ) దినములకల సోమము ధ్వనించుచుఁ బాత్రములందుఁ జేరుచున్నది.

పరాశరఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౫ ౨౮. త్రిస్రోవాచ ఈరయతి ప్రవహ్నిఋతస్య ధీతిం బ్రహ్మణో మనీషాం।
గావోయన్తి గోపతిం పృచ్ఛమానాః సోమం యన్తి మతయోవావశానాః॥

యాగకర్త (ఋగ్యజుస్సామములని) మూఁడు విధముల వాక్కులను ప్రేరించుచున్నాఁడు. యాగమును ధరించునట్టి శ్రేష్ఠమయిన సోమము యొక్క మనోహరమైన కళ్యాణ వాక్కును బ్రేరించుచున్నాఁడు. గోవు పతియగు వృషభమును జేరునట్లు ప్రశ్నించుచుఁ గోరుచున్న స్తవములు సోమమును సమీపించుచున్నవి.

వశిష్ఠఋషి-ఛందోదేవతలు-పూర్వవతు.

౫ ౨౫. అస్యప్రేషా హేమనా పూయమానో దేవోదేవేభిః సమపృక్తరసం।
సుతః పవిత్రం పర్యేతి రేభన్మితేవసద్మ పశుమన్తిహోతా॥

ఈ సోమమును ప్రేరించునట్టి, బంగారముచేతఁ బిండఁబడినది, (అనఁగా బంగారము చేతిలోనుంచుకొని సోమలతను బిండఁగాను) ప్రకాశించుచున్నది, యాగు సోమలత రసమును దేవతలకు నిచ్చుచున్నది. అభిషవించిన సోమము ధ్వనించుచుఁ బవిత్రమునందు, (బొచ్చుతోఁ నిర్మించిన వస్త్రమున) దేవతల నాహ్వానించు ఋత్విజుఁడు పశువును గట్టియున్న యాగశాలలందుఁ బ్రవేశించునట్లు ప్రవేశించుచున్నది.

ప్రతర్దనఋషి-ఛందోదేవతలు-పూర్వవతు.

౫౨౬. సోమఃపవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః॥ జనితాగ్నే
ర్జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోత విష్ణోః।

బుద్ధులను లేక స్తుతులను బుట్టించినది, ద్యులోకమును బుట్టించినది, భూమిని బుట్టించినది, సూర్యుని బుట్టించినది, యింద్రుని బుట్టించినది, అగ్నిని బుట్టించినది, మఱియు విష్ణుని బుట్టించినది, యగు సోమము పాత్రలందుఁ గారుచున్నది. (సోమపానమువల్లనే సూర్యాదులకుఁ దమతమ సామర్థ్యములు కలిగినవని తా॥)

వశిష్ఠఋషి-ఛందోదేవతలు సమానములు.

౫౨౭. అభి త్రిపృష్ఠం వృషణం వయోధామం గోషిణమవావశ న్తవాణీః వనా
వసానో వరుణో న సిన్ధుర్వ రత్నధాదయతే వార్యాణి॥

మూడుస్థానములు గలది (ద్రోణ కలశము మొదలగు పాత్రలనికాని లేక ప్రాతస్సవన, మాధ్యందిన సవన, సాయంసవనములను మూఁడు యాగములనికాని తా॥) వర్షము కురియించునది, అన్నము కలిగించునది, ధ్వనించుచున్నది, యగు సోమమును స్తుతి రూపములయినవాక్కులు స్తుతించుచున్నవి. ఉదకములను గప్పుకొను వరుణినివలె, ఉదకములను వ్యాపింపఁ జేయునది, రత్నముల నిచ్చునది యగు సోమము (స్తుతికర్తలకు) ధనముల నిచ్చుచున్నది.

పరాశరఋషి-ఛందోదేవతలు పూర్వసమానములు.

౫౨౮. అక్రాన్త్సముద్రః ప్రథమే విధర్మం జనయ న్ప్రజాభువనస్య గోపాః
వృషా పవిత్రే అధిసానా అవ్యే బృహత్సోమోవావృధే స్వానో అద్రిః॥

ఉదకములను స్రవింపఁ జేయునది, (యజ్ఞము) రక్షించునది, యగు సోమము విస్తృతమై ఉదకముల ధరించు సంతరిక్షమందున్నది, బ్రజలను బుట్టించునది యై సమస్తము నతిక్రమించుచున్నది వర్షము కురియించునది అభిషవింపఁ బడుచున్నది, యగు సోమము. బొచ్చుతో నిర్మించిన పవిత్రమం దున్నతస్థానమున గొప్పదగు సోమము వడపోయఁ బడినదగుచు వృద్ధినొందుచున్నది.

పరిస్కన్వఋషి-ఛందో దేవతలు-పూర్వవతు.

౫౨౯. కనిక్రన్తి హరిరా సృజ్యమానస్సీద న్వనస్య జఠరే పునానః।
నృభిర్యతః కృణతే నిర్ణిజంగామతో మతిం జనయత స్వధాభిః॥

అంతటను విడువంబడుచున్న ఆకుపసరు రంగుగల సోమము అప్పటప్పటికి ధ్వనించుచున్నది. వడకట్టబడుచున్నదై ద్రోణ కలశముయొక్క గర్భమందున్నదగుచు ధ్వనించుచున్నది. ఋత్విజులచేతఁ బిండబడిన సోమము ఆవుపాలను గలియుచు శుద్ధమయిన తన రూపమును గనఁబఱచుచున్నది. కనుక ఈ సోమము కొఱకు స్తుతులతో హవిస్సులతోఁ గూడఁ జేసిరి.

ఉశనఋషి-ఛందో దేవతలు పూర్వవతు.

౫౩౦, ఏష శ్యతే మధుమాగ్ం ఇంద్ర సోమో వృషావృష్ణః పరిపవిత్రే అక్షాః
సహస్రదాః శతదా భూరిదావా శశ్వత్తమం బర్హిరా వాజ్యస్థాత్॥

ఓ యింద్రా! వర్షము గురియించు నీ యొక్క యీ సోమరసము మధురము, వర్షము కురియించునది, పవిత్రమందుఁ జారుచున్నది. వేలకొలఁది (ధనము) నిచ్చునది, అంతకంటె నూర్లకొలఁది (ధనము) నిచ్చునది, అంతకంటె నధికమిచ్చునదియు, బలవంతమును అగు సోమము ఎల్లపుడు నుండునట్టి యాగమును ఆశ్రయించి యున్నది.

ప్రతర్దనఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧౨ ౩౧౨ ౩ ౨ ౩ ౧ ౨ర౩ ౨౩౨ ౨ ౨౨
౫౩౧. పవస్వసోమ మధుమాగ్ం ఋతావాపో వసానో అధిసానౌ అవ్యే।
౨౩ ౧ ౨ ౩ ౧౨ ౩౧౨ ౩౧ ౨ ౩ ౧ ౨
అవద్రోణాని ఘృతవన్తి రోహమదిన్తమో మత్సర ఇన్ద్రపానః॥

ఓ సోమమా! మధురమైన నీవు ఉదకములను(వసతీ-వరీ-ఏకధనా-అని యాజ్ఞిక పరిభాష కలవాటిని) కప్పుకొనుచు (అనఁగా నుదకములలోఁగలిసి యని తా॥) ఉన్నతమైన గొఱ్ఱె బొచ్చుతో నిర్మించిన పవిత్రమందు (వస్త్రమందు) కారుము. తరువాతమదముఁగలిగించునట్టి సోమము ఉదకము గలద్రోణకలశములందు దిగుచున్నది.

ఇట్లు పంచమాధ్యాయ షష్ఠఖండము సమాప్తము.

—♦●♦—

## ౬ అధ్యాయము.

### ౧ ఖండము.

ప్రతర్దనఋషి-ఛందోదేవతలు పూర్వాఖండవతు

౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧౨ ౩౧ ౨ ౩ ౧ ౩౧౨
౫౩౨. ప్రసేనానీః శూరో అగ్రే రథానాం గవ్యన్నేతి హర్షతే అస్యసేనా।
౩౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర౩ ౨ఉ ౩ ౧ ౨ ౩౧
భద్రాన్ కృణ్వన్నిందర్హవాంత్సఖిభ్య ఆసోమో వస్త్రారభసాని దత్తే॥

సేనలను ముందుండి నడిపించునది, శత్రువుల బాధించునది యగు సోమము (యాగకర్తలను) పశువులను గోరుచు రథములకుముందు యుద్ధమునకుఁ బ్రయాణము చేయుచున్నది. ఈసోమముయొక్క సేనయు హర్షించుచున్నది. సోమము మిత్రులయిన యజమానులు చేయు నింద్రుని యాహ్వానములను మంగళకరము లగునట్లు

చేయుచు "సింద్రుఁడు సోమమును బానముచేసి గోర్కెల నిచ్చుచున్నాఁడు" అని ఇంద్రుని శీఘ్రాగమన నిమిత్తములును తన యాచ్ఛాదకములునైన క్షీరాదులనుస్వీకరించుచున్నది (ఆచ్ఛాదకము=కప్పునట్టిది. వస్త్రాదులు ఆచ్ఛాదించునట్లు పాలు సోమము నాచ్ఛాదించినవనితా॥)

పరాశరఋషి-ఛందోదేవతలు పూర్వవత్తు.

౫౩౩. పరితేధారా మధుమతీరసృగ్రన్ వారం యత్పూతో అత్యేష్యవ్యం।
పవమాన పవసే ధామ గోనాం జనయన్సూర్యమపిన్వో అర్కైః॥

నీసంబంధమైన మధురమైన ధారలు కార్చఁబడుచున్నవి. ఎపుడు ఉదకములతోఁగలిసి నీవు గొఱ్ఱెబొచ్చుతో నల్లిన పవిత్రమును దాటివచ్చుచున్నావో అపుడు శోధింపఁబడిన సోమమా! గోవులపాలకు కూర్చి కారుచున్నావు తర్వాతఁ బుట్టుచున్న నీవు పూజ్యములైన తేజస్సులతో సూర్యునిం బూరించుచున్నావు.

ఇంద్రప్రమతి (వాశిష్ఠుఁడు) ఋషి-ఛం-దే-పూర్వసమములు.

౫౩౪. ప్రగాయతాభ్యర్చామ దేవాన్త్సోమగ్ం హినోత మహతే ధనాయ।
స్వాదుః పవతామతి వారమవ్యమా సీదతు కలశం దేవ ఇందుః॥

ఓ స్తుతికర్తలారా! సోమమును స్తుతింపుఁడు. మేము దేవతలను బూజింతుము లేక స్తుతింతుము గొప్పధనమునకై సోమము నభిషవింపఁజూడుడు. మధుర సోమము గొఱ్ఱెబొచ్చు పవిత్రమును దాటికారుచున్నది. ప్రకాశించుచున్న సోమము ద్రోణ కలశమున కభిముఖముగా నుండునుగాక.

వశిష్ఠఋషి ఛందోదేవతలు సమములు.

౮౩౫. ప్రహిన్వానో జనితా రోదస్యో రథోన వాజగ్ం సనిషన్నయాసీత్
ఇంద్రంగచ్ఛన్నాయుధా సగ్ంశి శానో విశ్వా వసుహస్తయోరా
దధానః॥

అధ్వర్యులచేఁ బ్రేరింపఁబడినది, ద్యులోకభూలోకముల నిర్మించునది (హవిస్సులతో ద్యులోకమును, వర్షము చేత భూలోకమును బోషించినదనితా॥) యగు సోమము అన్నము నీఁగలదై ఇంద్రుని కొఱకు రథమువలెఁ బోవుచున్నది ఆయుధములను వాడిపెట్టుచు సర్వధనములను హస్తములందుఁబట్టుకొనుచు నడచుచున్నది.

మృడీకఋషి (వాసిష్ఠుఁడు)

౮౩౬. తక్షద్యదీ మనసో వేనతో వాగ్జ్యేష్ఠస్య ధర్మం ద్యుక్షోరనీకే। ఆదీ
మాయన్ వరమా వావశానా జుష్టం పతిం కలశేగావ ఇందుం॥

కోరికగల స్తుతికర్తయొక్క స్తుతివాక్కు ఈసోమమును సర్వాధారమయిన యజ్ఞమందలిఁ బ్రశస్తమై దీపించుచున్న సవనముఖమునందు నెపుడు సంస్కరించునో, ఆవెంటనే కోరఁదగినది, దేవతలమదమునకు సరిపడినది, సకలమునకుఁ బాలకమును, గలశమందున్నదియునగు నీసోమమునుగోరుచున్నవై గోవులు (తమ పాలతోఁగలుపఁ) గోరిచేరుచున్నవి

నోధఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౮౩౭. సాకముక్షో మర్జయన్త స్వసారో దశ ధీరస్య ధీతయో ధనుత్రీః।
హరిః పర్యద్రవజ్జాః సూర్యస్య ద్రోణం ననక్షే అత్యో న వాజీ॥

కలిసిప్రవర్తించు చేతుల వ్రేళ్లు పదియు సోమమును శోధించుచున్నవి. (బాగు చేయుచున్నవనితా॥) ఆపదిప్రేళ్లు సమర్థమయిన, దేవతలు కోరఁదగిన సోమమును ప్రేరించుచున్నవి. పిమ్మట ఆకుపచ్చరంగుగల సోమము సూర్యునిభార్యలయిన దిక్కులకుఁబరువెత్తెను. పరుగెత్తునట్టి గుఱ్ఱమువలెనున్న సోమము ద్రోణకలశమును జెందుచున్నది.

కణ్వుఁడు (ఘౌర) ఋషి-ఛందోదేవతలు పూర్వసమములు

౨౩౧ ౨ ౩ ౧౨౩ ౨౩ ౧ ౨ ౩౨ ౩ ౨ ౩౧ ౨ర ౩ ౧
౫౩౭. అధియ దస్మి న్వాజినీవ శుభఃస్పర్ధ న్తేధియ సూ్నరేనవిశః। అపో
౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౩౧ ౨ర౩౧౨ ౩ ౧౨
వృణానః పవతే కవీయాన్ వ్రజం న పశువర్ధనాయ మన్మ॥

ఎపుడీసోమమందు గుఱ్ఱమందువలె అలంకారాదికముగలదో, ఎపుడీసోమమందు సూర్యునందువలె కిరణములుదయించుచున్నవో, యపుడు వ్రేళ్లు తమలోఁదాము పోటీపడి శోధించుచున్నవి. తర్వాత నీసోమముదకములను గలియుచు స్తుతికర్తలను గోరుచున్నదై రక్షింపఁదగిన పశువులమందను గోపాలుఁడు పశువృద్ధికొఱకుఁ జేరునట్లు పాత్రలలోనికి దేవతలఁ బ్రీతిజెందించుటకుఁ గారుచున్నది.

మన్యు (వాసిష్ఠ) ఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨౩ ౨ ౩ ౨౩ ౨౩ ౧ ౨
౫౩౮. ఇందుర్వాజీ పవతే గోన్యోఘా ఇన్ద్రే సోమః సహ ఇన్వన్మదాయ।
౨ ౩ ౨ ౩ ౧.౨ ౩ ౧ ౨ర ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨
హన్తిరక్షో బాధతే పర్యరాతిం వరివస్కృణ్వ న్వృజనస్య రాజా॥

కారుచున్నది, బలముకలది, స్రవించు ముఖభాగముకలది, యింద్రునందు బలముకలిగించు రసమునుగార్చుచున్నదియగు సోమము అతనిమదముకొఱకు స్రవించుచున్నది. రాక్షసులను సంహరించుచున్నది. శత్రువులను బాధించుచున్నది. ఆసోమము ధనమునుగలిగించుచు స్తుతికర్తల బలమున కధిపతియయినది.

కుత్సఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౧ ౨ ౩౧　౨౩　౧　౨ర　౩౧ ౨ ౩ ౧౨౩౧౨
౫౮౦. అయాపవా పవస్వైనా వసూని మాంశ్చత్వఇందో సరసిప్రధన్వ।
౩ ౨ ౩ ౨ ౩　౨ ౩౨ ౩ ౧　౨౩౧ ౨　౩ ౧ ౨౩　౧౨
బ్రధ్నశ్చిద్యస్య వాతోన జూతిం పురుమేధా శ్చిత్తకవే నరంధాత్॥

ఓ సోమమా! యీకారుచున్న ధారతోఁగూడ నీధనములను గార్చుము. నీవు కోరుచున్నవారిఁబోషించు నుదకమందుస్రవించుము (ఉదకకలశమందనితా॥) తర్వాత నే సోమమునకు సర్వాధారుఁడైన సూర్యుఁడు వాయువువంటి ప్రేరకమయినవేగమును గలిగించుచున్నాఁడు. బహువిధ ప్రజ్ఞావంతుఁడయిన యింద్రుఁడును వచ్చెను. లేక పొందెను.

పరాశరఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౩ ౧　౨ర　౩ ౧ ౨　౩　౧　౨ర　౩౨
౫౮౧. మహత్తత్సోమో మహిషశ్చకా రాపాం యద్గర్భోzవృణీ తదేవాన్।
౧౨౩ ౨ ౩　౧ ౨　౩ ౧ ౨ర ౩　౨ ౩　౨ ౩ ౧ ౨
అదధాదిందే పవమాన ఓజోzజనయత్ సూర్యే జ్యోతిరిందుః॥

మహాత్మమైన లేకపూజ్యమయిన సోమము గొప్పదగు నాపనిని నెఱవేర్చెను. (ఏదంటే) ఉదకములకు గర్భమయియున్న ఆసోమము (అనఁగా వర్షమునుగురియించు నదని తా॥) దేవతలను బొందెనన్నదియు వడకట్టఁబడిన యీసోమము ఇంద్రునందు బలమును బుట్టించెనన్నదియు సూర్యునందుఁ దేజస్సు గలిగించెనన్నదియును.

కశ్యపఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౧౨౩　౨ ౩　౨ ౩　౨౩　౨౨ ౩　౩ ౧ ౨　౩ ౧ ౨౩ ౨
౫౮౨. అసర్జి వక్వా రథ్యే యథా జేధియా మనోతా ప్రథమామనీషా।
౨౩　౧ ౨ ౩　౨౩౨ ౧　౧౩　౩ ౨ ౩　౨౩　౧౨౩౧　౨
దశ స్వసారో అధిసానౌ అవ్యే మృజన్తి వహ్నిగ్ం సదనేష్వచ్ఛ॥

ధ్వనించుచున్నది వడకట్టినదియగు సోమము యజ్ఞమందుఁ గర్మతోఁగూడ యుద్ధమందు రథార్హమైన యశ్వమువలెను పాత్రములందు విడువఁబడియెను. ఆ సోమము (దేవతల) మనస్సులకుం బ్రియము. మొట్టమొదఁటిస్తుతికలది. పది (చేతి) వేళ్లు యాగగృహములందుఁ బాత్రల కభిముఖముగా వహించు సోమమును గొఱ్ఱె బొచ్చుతో నిర్మించిన పవిత్ర (=వస్త్రము) మందు మీఁదనుబోయుచున్నవి. లేక వంచుచున్నవి

పరిస్కణ్వఋషి.-ఛ్ఛందోదేవతలు పూర్వసమములు.

౫౭౩. అపామివే దూర్మయ స్తర్తురాణాః ప్రమనీషా ఈరతే సోమమచ్ఛ।
నమస్యన్తీ రుపచయన్తి సం చాచ విశన్త్యు శతీరుశన్తమ్॥

ఉదకముల తరంగములంత త్వరగా దేవతలస్తుతింపఁ ద్వరపడుచున్న ఋత్విజులు మనోహరములగు స్తుతులను సోమమునుగూర్చి పఠించుచున్నారు. సోమమును గూర్చుచు దానింజేరుచున్నవి. (స్తుతులనిక్త) కోరికగల స్తుతులు కోరికగలసోమమును బ్రవేశించుచున్నవి.

ఇట్లు పంచమాధ్యాయ సప్తమఖండము సమాప్తము.

———:o:———

## ౬ అధ్యాయము.

### ౧ ఖండము.

ఈ ఖండములో మొదటిది యేడవది బృహతీచ్ఛందము తక్కినవి అనుష్టుప్ఛందములు

శ్యావశ్వఋషి-బృహతీచ్ఛందము-సోమదేవత.

౫౭౪. పురోజితీవో అన్ధస స్సుతాయ మాదయిత్నవే। అపశ్వానగ్ం శ్నథిష్టన సఖాయో దీర్ఘజిహ్వ్యం॥

ఓ మిత్రులయిన స్తుతికర్తలారా! మీరు యజ్ఞమందుఁ బ్రవర్తించిన సోమముయొక్క అభిషవించినట్టి మదముకలిగించినట్టి, రసమునకై పొడవైన నాల్కగల కుక్కను (అనఁగా రాక్షసాదులనని తా॥) దూరముగాఁ దోలి వేయుఁడు. (కుక్కయని యిందుపయోగించుట నీచకర్మకారులనుటకు తా॥)

యయాతి-(నాహుష)ఋషి-అనుష్టుప్ఛంద-సోమదేవత.

౫౮౫. అయం పూషారయి ర్భగ స్సోమః పునానో అర్షతి। పతిర్విశ్వస్య భూమనో వ్యఖ్యద్రోదసీఉభే॥

పోషించునది, అనుభవింపఁదగినది, ధనముగలిగించునది, యగు నీసోమము పవిత్రమందు వడకట్టఁబడినదై (కలశాభిముఖముగా) పోవుచున్నది. (అనఁగా దీసికొనిపోవుచున్నారని తా) సకలభూతసమూహమునకుఁ బరిపాలకమగు సోమము ద్యులోకభూలోకములను దన తేజస్సుతోఁ బ్రకాశింపఁజేసెను.

పూర్వోక్తఋషి-ఛందోదేవతలు సమానములు.

౫౮౬. సుతాసో మధుమత్తమాః సోమా యింద్రాయ మన్దినః। పవిత్రవన్తో అక్షరం దేవాన్ గచ్ఛన్తు వోమదాః॥

చాలమధురమైనవి, మదముకలిగించునవి, అభిషవింపఁబడినవియునగు సోమములు పవిత్రమందు (=వడపోత వస్త్రమందు) న్నవై యింద్రునికొఱకుఁ బాత్రములందుఁ గారుచున్నవి ఓ సోమములారా! మీయొక్క మదముకలిగించు రసములు ఇంద్రాదిదేవతలను బొందుఁగాక.

మను(సాంవరణ)ఋషి-అనుష్టుప్ఛంద-సోమ దేవత.

౫౪౭. సోమాః పవన్త ఇన్దవోऽస్మభ్యం గాతువిత్తమాః। మిత్రాః స్వానా అరేపసః స్వాధ్యాః స్వర్విదః॥

బాగుగా మార్గము నెఱింగి ప్రకాశించుచున్న సోమములు (మార్గము నెఱుంగుటయనఁగా సోమముం ద్రావిన మదముండినను మనుష్యుఁడు తప్పిదారిని నడువడని సోమరసగుణము నిరూపింపఁబడెననితా॥) దేవతలకు మిత్రములై యభిషవింపఁబడుచుఁ బాపము లేనివయి మంచిధ్యానముగల్గి సర్వముఁ దెలిసినవై మనకు మదముఁగలిగింపఁగారుచున్నవి.

అంబరీష-ఋజిశ్వాన-ఋషులు-ఛందో దేవతలు పూర్వవతు.

౫౪౮. అభీనో వాజసాతమగ్ం రయిమర్ష శతస్పృహం। ఇందో సహస్రభర్ణసం తువిద్యుమ్నం విభాసహం॥

ప్రకాశించుచున్న సోమమా! నీవు విశేషబలము కలిగించునట్టి, పలువురు కోరందగినట్టి, అనేకవిధములఁబోషించునట్టి, బహ్వన్నముగలిగించునట్టి, గొప్పకాంతిని దిరస్కరించునట్టి, (అనఁగా తానధిక కాన్తిమంతమనితా॥) ధనమును బుత్రుని మాకుంగలిగింపుము.

ఋభపుత్రులు యిద్దఱు కాశ్యపులు ఋషులు-ఛందో దేవతలు పూర్వసమములు.

౫౪౯. అభీనవన్తే అద్రుహః ప్రియమిన్ద్రస్య కామ్యం। వత్సంన పూర్వ ఆయుని జాతగ్ం రిహన్తి మాతరః॥

తెల్లనయిన యావులు మొట్టమొదట పాలుచేపురాఁగానే దూడను నాకు నట్లు మేలుఁగలిగించు నుదకము లింద్రుని కిష్టమయిన కోరఁదగిన సోమమును గూడు చున్నవి. (ఆవు దూడనందుకొన్నట్లు సోమము నుదకములందుకొన్నవనితా॥)

ఋషి. పూర్వోక్తము-బృహతీఛందము-సోమదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧
౫౫౦. ఆహర్యతాయ ధృష్ణవే ధనుష్టన్వన్తి పౌꣳస్యం। శుక్రావి యన్త్య
౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
సురాయ నిర్ణిజే విపామగ్రే మహీయువః॥

అందఱిమనస్సులను ఆకర్షించునట్టి, శత్రువులందిరసహరించునట్టి, సోమము కొఱకుఁబౌరుషమును వ్యక్తపఱచునట్టి, ధనుస్సునందు నారిని (ఋత్విజులు) కూర్చు చున్నారు. (అనఁగా సోమమభిషవించి వడపోయునపుడు ధారకారుటకు వస్త్రము నాల్గుచివరలను వేఱ్వేఱసాగదీసి చాందిసీ విధమునఁగట్టుదురు. దానిపై పిండిన రసము నీటఁగలిపివడకట్టుదురు. అదేధనువుగా నారోపము) మేధావన్తుల యెదుట గౌరవమును గోరినవారు (అధ్వర్యులనితా॥) తెల్లనియావుపాలను బలముగలస్వరూ పముకొఱకుఁ గలుపుచున్నారు. (సోమములోననితా॥)

ఋజాశ్వాంబరీషులు ఋషులు—ఛ్ఛందోదేవతలు పూర్వవతు.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౨ఉ
౫౫౧. పరిత్యꣳహర్యతꣳహరిం బభ్రుం పునన్తివారేణ। యోదేవాన్
3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ర
విశ్వాꣳ ఇత్పరి మదేన సహగచ్ఛతి॥

అందముఁగోరఁదగినది, ఆకుపసరురంగుగలది, బూడిదరంగుగలది యగు నా సోమమును ఉన్నితోఁజేసిన పవిత్రమందు వడపోయుచున్నారు. ఏ సోమము దేవతల నందఱిని మదముగలిగించు రసముతోఁగలియుచున్నదో (ఆసోమము) నిశ్చయము.

ప్రజాపతిఋషి-అనుష్టుప్ఛందము-సోమదేవత.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౫౫౨. పరిసువ్వానాయూన్ద సో మర్తో నవష్టతద్వచః। అపశ్వాన మరాధగ్ం
౩ ౨ ౩ ౧ ౨ర
హాతామఖం నభృగవః॥

అభిషవింపఁబడుచున్న సోమముయొక్క ఆ ప్రసిద్ధమయిన మాటను ఏ మనుష్యుఁడు వినఁడో (అనఁగాఁగర్మవిఘ్నకారియగువాఁడు) స్తుతికారులారా! కర్మను మానినట్టి మఖుఁడనువానిని పూర్వము భృగువంశ్యులందఱు వెంటఁదరిమినట్లు కర్మ లేనివానిని కుక్కనువలె వెంటఁదరిమి దూరముతోలఁగించుఁడు

పంచమాధ్యాయమాష్టమ ఖండము సమాప్తము.

———:o:———

౬ అధ్యాయము.

౧ ఖండము.

పన్నెండు ఋక్కులును జగతీచ్ఛందములు-సోమదేవత.

కవిఋషి-జగతీచ్ఛంద-సోమదేవత.

౩ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨
౫౫౩. అభిప్రియాణి పవతే చనోహితో నామాని యహ్వో అధియేషువర్ధతే।
౧ ౨ ౩ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨
ఆసూర్యస్య బృహతో బృహన్నధి రథం విశ్వంచ మరుహద్వి
౩ ౨
చక్షణః॥

తినుటకు హితమయిన సోమము ప్రియమయిన యుదకములను అంతటను గార్చుచున్నది. అన్తరిక్షమందున్న యే యుదకములందు గొప్పదయిన సోమము అధి

కముగా వృద్ధినొందుచున్నదో (ఆయుదకములని పూర్వాన్వయము) ఆగొప్పసోమము మహాత్ముఁడైన సూర్యునియొక్క సర్వత్రతిరుగునట్టి రథముమీఁదను లోకమునంత టిని చూచునదై యెక్కుచున్నది.

కవిఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౫౮. అచో దసోనో ధన్వన్త్విందవః ప్రస్వానాసో బృహద్దేవేషు హరయః
విచిదశ్నానా ఇషయో అరాతయో౽ర్యోనః సన్తు సనిషన్తు
నోధియః॥

ఇతరుల ప్రేరణములేని (అనఁగా స్వతంత్రమైనయనితా॥) సోమములు అనేక దేవతలుగల యాగములందు స్తుతింపఁబడుచు ఆకుపసరురంగుగలవై మమ్ముఁజెందుఁ గాక. మాశత్రువులు ధనదానాదులు లేనివారయి యన్నమును గోరినవారై యన్నము లేనివారగుదురుగాక. మాకర్మలు దేవతలనుం జెందుఁగాక.

కవిఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౫౫౯. ఏష ప్రకోశే మధుమాగ్ం అచిక్రద దింద్రస్య వజ్రో వపుషో వపుష్టమః। అభ్యృ౩తస్య సుదుఘా ఘృతశ్చుతో వాశ్రా అర్షన్తి పయసా చ ధేనవః॥

మధురరసముఁగల యీసోమము కలశమందుఁగారుచున్నది. ఇది ఇంద్రునకు వజ్రాయుధమువంటిది. ఇదియే బీజములను బాగుగా మొలపించునది. సత్యమయిన ఫలముగల యీసోమముయొక్క ధారలు ఉదకములను కార్చుచున్నవి. ఈధారలు పాడిమొదవులవంటివి.

ఋషిగణఋషిఛందోదేవతలు పూర్వసమములు.

౫౫౬. ప్రో అయాసీ దిన్దురిందస్య నిష్కృతగ్ం సఖా సఖ్యుర్నప్రమినాతి సఙ్గిరమ్। మర్య ఇవ యువతిభిః సమర్షతి సోమః కలశే శతయా మనా పథా॥

సోమము ఇంద్రునియొక్క (అనఁగా ద్రోణకలశముయొక్క యనితా॥) సంస్కరించిన యుదరమునందు బాగుగాఁ బ్రవేశించుచున్నది. స్నేహితునివంటిదగుచు స్నేహితుఁడయిన యింద్రునియొక్క ఉదరమును హింసింపదు పురుషుఁడు స్త్రీలతోఁ గూడినట్లు ఈసోమము కలిసియున్న (వసతీ-వరీ-ఏకధన-) అనెడునుదకములతోఁ గూడుచున్నది. ఆసోమము నూఱు కన్నములుకల పవిత్రమార్గమునఁ గలశమందుఁ గారుచున్నది.

కవిఋషి ఛందోదేవతలు పూర్వవతు.

౫౫౭. ధర్తా దివః పవతే కృత్వ్యో రసో దక్షో దేవానా మనుమాద్యో నృభిః। హరిస్సృజానో అత్యో న సత్వభిర్వృథా పాజాగ్ంసి కృణుతే నదీష్వా॥

సర్వమును బోషించునట్టి సోమము అంతరిక్షమునుండి (అనఁగా దశాపవిత్రము నుండి) కారుచున్నది ఆసోమము శోధింపఁదగినది, రసస్వరూపమయినది, దేవతలకు బలమునిచ్చునది, ఋత్విజులచేతఁ బూజింపఁదగినది, ఆకుపచ్చనిరంగు గలది, మా మొదలగువారిచే గుఱ్ఱమువలె విడువఁబడినదయి యనాయాసముగాఁ దనయన్నములను గలిగించుచున్నది (అశ్వపక్షమున) ఉదకములతోఁ దడిసి వేగములను చేయుచున్నది.

కవిఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౫౮. వృషా మతీనాం పవతే విచక్షణః సోమో అహ్నాం ప్రతిరీతోషసాం దివః। ప్రాణా సిన్ధూనాం కలశాగ్ం అచిక్రదదిన్ద్రస్య హార్ద్యా విశన్మనీషిభిః॥

ఈ సోమము స్తుతికర్తలకు (కోర్కెలను) వర్షముకురియించునది, సర్వమును జూచునది, ఉషస్సులను సూర్యుని వృద్ధిపొందించునది, యగుచుఁగారుచున్నది. స్రవించుచున్న యుదకములకుఁగర్తయగుసోమము ధారతోఁ గలశములందుఁబ్రవేశించుటకు ధ్వనించుచున్నది. ఇంద్రునిహృదయమందుఁ బ్రవేశించుచు స్తుతులతోఁగూడి స్రవించుచున్నది.

రేణుఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౫౫౯. త్రిరస్మై సప్త ధేనవో దుదుహిరే సత్యామాశిరం పరమే వ్యోమని। చత్వార్యన్యా భువనాని నిర్ణిజే చారూణి చక్రే యదృతైరవర్ధత॥

వడపోయఁబడుచున్నట్టి, గొప్పదగు యజ్ఞమందున్నట్టి, లేక అంతరిక్షమందున్నట్టి, యిరువదియొక్క పాడిమొదవులు యథార్థమయి పాలు మొదలగు ఆశిరమును (పాలు మొదలగు పదార్థము సోమములో కలుపుదానిపేరు) ఇచ్చుచున్నవి (౨౧ ఆవులంటే—౧౨ నెలలు + ౫ ఋతువులు + ౩లోకాలు + ౧ సూర్యుఁడు= ౨౧ మొత్తం ఇవన్నీకలిసి సోమమును నిర్మించుచున్నవనితా॥) మఱియు నీసోమము ఇతరములగు నాలుగు ఉదకములను (వసతీవరులు మూఁడు-ఏకధాన నాల్గవది) శుభమగువాటిని శుద్ధికొఱకుఁజేసెను. ఎపుడీసోమము యజ్ఞములతో వృద్ధిపొందెనో (అపుడు చేసెననితా॥)

వేనుఁడు (భార్గవ) ఋషి-తక్కినవి పూర్వవతు.

౫౬౦. ఇంద్రాయ సోమ సుషుతః పరిస్రవా పామీవా భవతు రక్షసా సహ। మా తే రసస్య మత్సత ద్వయావినో ద్రవిణస్వన్త ఇహ సన్త్వింద వః॥

ఓ సోమమా! నీవభిషవింపఁబడిన దానవై యింద్రునికొఱకుఁ గారుము. రోగము రాక్షసులతోఁగూడ దూరముగాఁ దొలఁగుఁగాక. నీరసము పానముచేసి మదింపకుము. సత్యము అనృతము రెండిటితోఁగలిసిన పాపులయిన రాక్షసులు నీరసమును బొందకుంద్రుగాక. సోమములారా! మీరసము లీయజ్ఞమందు మాకుధనములనిచ్చునవగుఁగాక.

భరద్వాజ-వసుఋషి-శేషము సమానము.

౫౬౧. అసావిసోమో అరుషో వృషా హరీ రాజేవదస్మో అభిగా అచిక్రదత్। పునానో వారమత్యేష్యవ్యయగం శ్యేనో నయోనిం ఘృతవన్త మాసదత్॥

ప్రకాశించునది, వర్షముకురియునది, ఆకుపచ్చనిది. రాజువలెఁజూడఁదగినది, యగుసోమము ఉదకములనుగూర్చి ధ్వనించుచున్నది (తనరసము నీటిలోఁబడునప్పుడు ధ్వనించెనని తా॥) తర్వాతవడపోయఁబడుచు గొఱ్ఱెబొచ్చుతోఁజేసిన వస్త్రమునుండి జారుచున్నావు. పిమ్మట డేగవలెను ఉదకవంతమైన తనస్థానమునఁజేరెను.

వత్సప్రీఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౫౬౨. ప్రదేవ మచ్ఛా మధుమన్త ఇన్దవోఽసిష్యదన్త గావ ఆ న ధేనవః। బర్హిషదో వచనావన్తః ఊధభిః పరిస్రుత ముస్రియా నిర్ణిజంధిరే॥

మదముగలిగించు రసముగల సోమమును ప్రకాశించుచున్న (సోమకలశస్థానరూపుఁడైన) యింద్రుని కెదురుగా గోవులు దూడకభిముఖములై పాలను గార్చునట్లు రసమునుగార్చుచున్నవి. హంభా ధ్వనిచేయు గోవులు తనుపొదుగులనుండి కారిన శుద్ధమైనపాలను గార్చునట్లు సోమరసమును ఇంద్రునికై యాగమందు ధరించుచున్నవి (కలశములనితా॥)

అత్రిఋషి-ఛందోదేవతలు పూర్వసములు.

౫౬౩. అఙ్క్తే వ్యఙ్క్తే సమఙ్క్తే క్రతుꣳ రిహన్తి మధ్వా భ్యఙ్క్తే।
సింధో రుచ్ఛ్వాసే పతయన్త ముక్షణꣳ హిరణ్యా పావాః పశుమ
ప్సుగృణతే॥

ఋత్విజులు సోమమును బయలఁదీయుచున్నారు ఆవుపాలతోఁగలుపుచున్నారు. చక్కగాఁగలుపుచున్నారు. (పునరుక్తిస్తుత్యర్థము) బలముకలిగించుదానిని (దేవతలు) భక్షించుచున్నారు. గోరసముతోఁగూర్చుచున్నారు. జలముగలయున్నత ప్రదేశమునఁబడుచుఁ దడుపుచున్నట్టి, బంగారముతోఁగలిసి ఓడ్చుచున్నట్టి, సమస్తమును జూచునట్టి, సోమమునుదకములందుఁ బట్టుచున్నారు.

పవిత్రఋషి-చ్ఛందోదేవతలు పూర్వవతు.

౫౬౪. పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే ప్రభు ర్గాత్రాణి పర్యేషి విశ్వతః। అతప్త తనూర్న తదామో అశ్నుతే ఋతాస ఇద్వహన్తస్స
న్తదాశత॥

ఓ మంత్రస్వామీ! సోమమా! నీపవిత్రమైన శరీరము సర్వత్రా వ్యాపించి యున్నది. ప్రభువవయిన నీవు (త్రాగినవాని) అవయవములను వ్యాపించుచున్నావు.

ఆపవిత్రము సర్వదిక్కుల (ఎండలో) దపించిన శరీరముకలిగి అపరిపక్వమై వ్యాపించదు. పరిపక్వమైనవే యాగమునిర్వహించును. ఆపవిత్రమునందు వ్యాపించును.

ఇట్లు పంచమాధ్యాయ నవమఖండము సమాప్తము.

---

౫ అధ్యాయము.

౧౦ ఖండము.

ఈ ఖండమునఁ బన్నెండు ఋక్కులకు ఉష్ణిక్ఛందము.

అగ్ని (చాక్షుష)ఋషి-ఉష్ణిక్ఛందము-సోమ దేవత.

౨ ౩ ౧ ౩ ౩ ౨ ౩౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩
౫౬౫. ఇంద్రమచ్ఛసుతా ఇమే వృషణం యన్తుహరయః। శుక్రేష్టే జాతాస
౧ ౨ ౩ ౧ ౨
ఇందవః స్వర్విదః ॥

శీఘ్రముగాఁబుట్టిన సోమములు సర్వజ్ఞములయి ఆకుపచ్చనిరంగుగల్గి యభిషవింపఁబడినవియునై యివిగో (కోర్కెల)వర్షించు నింద్రుని కభిముఖముగాఁ బోవుఁగాక.

చక్షు (మానవ) ఋషి-ఛందోదేవతలు పూర్వసమములు.

౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౨ ౩
౫౬౬. పరిధన్వాసోమ జాగృవిరిన్ద్రాయేందో పరిస్రవ। ద్యుమన్తగ్ం శుష్మ
౧ ౨ ౩౧ ౨
మాభర స్వర్విదం॥

ఓ సోమమా! జాగ్రత్స్వభావముకల నీవు కారుము. ఓ సోమమా! (పాత్రము

లందు) ఇంద్రునికొఱకు స్రవించుము. కాన్తిమంతమైన సర్వలాభమును గలిగించు నట్టి, శత్రువుల నణంచునట్టి బలమునుగలిగింపుము

పర్వత నారదులు ఋషులు-ఛందో దేవతలు పూర్వసమములు.

౫౬౭. సఖాయ ఆనిషీదత పునానాయ ప్రగాయత। శిశుంన యజ్ఞైః పరిభూషత శ్రియే॥

ఓ స్నేహితులైనస్తుతికర్తలారా! ఋత్విజులారా! బిగ్గఱగా గానముచేయుఁడు పిమ్మట అభిషవించిన సోమమును యాగార్హమైన హవిస్సులతో (అనఁగానందులో గలిపిన క్షీరాదులతోననితా॥) తలిదండ్రులు శిశువు నలంకారముతో నలంకరించు నట్లు అలంకరించుఁడు.

పర్వత నారదులు ఋషులు-ఛందోదేవతలు పూర్వసమములు.

౫౬౮. తంవస్సఖాయో మదాయ పునానమభిగాయత। శిశుం న హవ్యైః స్వదయన్త గూర్తిభిః॥

ఓ మిత్రులారా! (ఋత్విజులు) మీరు దేవతలకు మదముకొఱకు వడపోయఁబడుచున్న యా సోమమును స్తుతించుఁడు. దానిని యలంకారములతో శిశువునుంబలె హవిస్సులతోను స్తుతులతోను రుచిగలదానింగా నొనర్పుఁడు.

త్రితఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౬౯. ప్రాణాశిశుర్మహీనాగ్ం హిన్వన్నృతస్య దీధితిం। విశ్వాపరిప్రియా భువదధద్వితా॥

యజ్ఞమును చేయుచున్న ప్రూజ్యములయిన యుదకములకు శిశువువంటిదయిన సోమము యజ్ఞమును ప్రకాశింపఁజేయునట్టి తనరసమును ప్రేరించుచుఁ బ్రియమయిన సర్వహవిస్సులను గలియుచున్నది. రెండువిధములయియున్నది. (ద్యులోకమున-భూలోకమున)

మనుఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౫౭౦. పవస్వ దేవవీతయ ఇందో ధారాభిరోజసా। ఆకలశం మధుమాన్త్సోమ నః సదః॥

ఓ సోమమా! దేవతల భక్షణముకొఱకు బలముతో నీధారలతోఁ గారుము. సోమమా! మదముకలిగించు రసముగల నీవు మా (ద్రోణ) కలశమును బ్రవేశించి యుండుము.

అగ్నిఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨ర ౩
౫౭౧. సోమః పునాన ఊర్మిణావ్యం వారం విధావతి। అగ్రేవాచః పవమానః
౧ ౨
కనిక్రదత్॥

వడపోయంబడుచున్న సోమము తనధారతో గొఱ్ఱెబొచ్చుతోఁజేసిన వస్త్రమునందు వివిధముగాఁగారుచున్నపుడు స్తుతికినెదుట ధ్వనించుచుఁ బరువెత్తుచున్నది.

ద్వితఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
౫౭౨. ప్రపునానాయ వేధసే సోమాయ వచ ఉచ్యతే। భృతింనభరా
౩ ౧ ౨ ౩ ౧ ౨
మతిభిర్జుజోషతే॥

(ఋషితనతోఁదానను చున్నాఁడు) పవిత్రమందు వడకట్టఁబడుచున్నది, కర్మల నడిపించునది, యగుసోమమునకు స్తుతివచనము పఠింపఁబడు గాక. జీతగానికి జీతము నిచ్చునట్లు స్తుతులతోఁ బ్రీతిఁజెందు సోమమునకు స్తుతినిసంపాదించుము.

పర్వత నారదులు ఋషులు-ఛందో దేవతలు పూర్వసమములు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩
౫౭౩. గోమన్న ఇన్దో అశ్వవత్సుతః సుదక్ష ధనివ। శుచించ వర్ణమధి
౧ ౨
గోషుధారయ॥

మంచిబలముగలట్టి సోమమా! అభిషవింపఁబడిన నీవు మాకు గోవులతోఁ గూడిన ధనమునిమ్ము. తర్వాత నేను బవిత్రమైన దీపించుచున్న రసమును గోక్షీరాదులందుఁగూర్తును.

పర్వతనారదులు ఋషులు-ఛందో దేవతులు పూర్వవతు.

౩౧ ౨ ౩౧ ౨ ౩౧ ౨ర ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
౫౭౪. అస్మభ్యం త్వా వసువిదమభి వాణీరనూషత। గోభిష్టేవర్ణమభివాసయా
మసి॥

ఓ సోమమా! ధనదాతయగునిన్ను మాకుధనమునిచ్చుటకు మావాక్కులు స్తుతించుచున్నవి. మేము నీ రసమును గోక్షీరాదులతోఁ జక్కఁగాఁగలుపు చున్నాము

అగ్ని (చాక్షుష) ఋషి-ఛందో దేవతలు పూర్వవతు.

౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩ ౧ ౨
౫౭౫. పవతే హర్యతో హరిరతి హ్వరాగ్ంసి రగ్ంహ్యా। అభ్యర్ష స్తోతృభ్యో
౩ ౨ ౩ ౧ ౨
వీరవద్యశః॥

మనోహరము, ఆకుపచ్చని రంగుకలది, యగుసోమము మంచివేగముతో

వంకరగానున్న పవిత్రములనుదాటి స్రవించుచున్నది. ఓ సోమమా! నీవుస్తుతికర్తలకుఁ బుత్రులతోఁగూడిన కీర్తినిగలిగింపుము.

ద్విత ఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౨౩౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ర ౩ ౧ ౨
౬౮౭. పరికోశం మధుశ్చుతగ్ం సోమః పునానో అర్షతి। అభివాణీర్ఋషీ
౩ ౧౨
ణాగ్ం సప్తానూషత॥

వడకట్టుచున్న యీసోమము మధురరసముకార్చు ద్రోణకలశమునందుఁ దన రసమును బోయుచున్నది. ఆ యీ సోమమును ఏడు (ఛందస్సులుగల) వాక్కులు స్తుతించుచున్నవి.

ఇట్లు పంచమాధ్యాయమున దశమఖండము పూర్ణము.

## ౬ అధ్యాయము.

### ౧౧ ఖండము.

ఇందులో ౬వది గాయత్రి, తక్కినవి కకుప్ఛందములు-దేవత సోమము.

గౌరవీతిఋషి-కకుప్ఛందము-సోమదేవత.

౧౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౩ ౧౨ ౧౨ ౩
౬౮౮. పవస్వ మధుమత్తమ ఇంద్రాయ సోమక్రతు విత్తమోమదః। మహిద్యు
౧౨౩ ౩ ౧
క్షతమో మదః॥

ఓ సోమమా! మిగులమధురమైన నీవు ఇంద్రునికై మదము గలిగించుచుం గారుము. నీవు కర్మను అత్యంతము కలిగించుదానవు. పూజ్యమగుదానవు. దీపించుచు హర్షము గలిగించుదానవు.

ఊర్ధ్వసద్మఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౭౮. అభిద్యుమ్నం బృహద్యశ ఇషస్పతే దిదీహి దేవ దేవయుం। వికోశం మధ్యమం యువ॥

అన్నమునకు స్వామివై ప్రకాశించు సోమమా! దేవతలంగోరు నిన్ను మేమభిముఖముగా నుతింతుము. నీవుప్రకాశించుచున్న గొప్పదయిన యన్నమును మాకు నిమ్ము. అంతరిక్షమందున్న మేఘమును విడఁగొట్టుము. (వర్షము కురియించుమనితా॥)

ఋజిశ్వఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౭౯, ఆసోతాపరి షించతాశ్వం నస్తోమ మప్తురగ్ం రజస్తురం। వనప్రక్షముదప్రుతం॥

ఓ ఋత్విజులారా! సోమముచు అభిషవించుఁడు. నీటిలోనంతయుఁ గలుపుఁడు. స్తుతింపఁదగినట్టి, యంతరిక్షమందున్న యుదకములను ప్రేరించునట్టి, (అనఁగావర్షము కురియించునట్టి) తేజస్సుల వెదజల్లునట్టి, యుదకములతోఁగూడినట్టి, కఱ్ఱపాత్రలలో నిండియున్నట్టి సోమమును అభిషేకించుఁడు (అనఁగా హోమము చేయుఁడు)

కృతయశుఁడుఋషి-ఛందోదేవతలు పూర్వవతు.

౫౮౦. ఏతముత్యం మదచ్యుతగ్ం సహస్రధారం వృషభం దివోదుహం। విశ్వావసూని బిభ్రతం॥

(అభిషవశిలలు దూడలుగాను సోమలతలు గోవులుగా ఋత్విజులు పితుకు వారుగా వర్ణన) మదముగలిగించునది, బహుధారలుకలది, వర్షముకురియించునది, సకలధనములను భరించునది, లేక పోషించునది, ద్యులోకమును బూరించునది యగు సోమమును దేవతలంగోరుచున్న ఋత్విజులు పిదుకుచున్నారు. (అనఁగాఁబిం డుచున్నారనితా॥)

ఋణవఋషి-గాయత్రీచ్ఛందము-సోమదేవత.

౧౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨ర ౨ ౩
గీ ౧. వసుర్వోయో వసూనాం యోరాయోమానేతాయ ఇడానాం। సోమో
౧ ౨ ౩౨
యః సుక్షితీనాం॥

ఏ సోమమభిషవింపఁబడెనో, యే సోమము ధనములందెచ్చునో, యేది గోవు లందెచ్చునో, యే సోమము తగిన ప్రజలంగూర్చునో, (అది సిద్ధపఱుపఁబడెను.)

శక్తిఋషి-కకుప్ఛందము-సోమదేవత.

౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧
గీ ౨. త్వꣳహ్యా౩ఙ్గదైవ్య పవమాన జనిమాని ద్యుమత్తమః। అమృతత్వాయ
౩ ౧ ౨
ఘోషయన్॥

వడపోసిన సోమమా! మిగులకాన్తిగల నీవే దేవతల జన్మలను దెలియుదువు. వారింగూర్చి మరణములేకుండుటకు శీఘ్రము ఋత్విజులు ధ్వనించుచు శిలలువలెం బుట్టించిరి.

ఊరుఋషి-కకుప్ఛంద-సోమదేవత.

౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౧ ౨ ౩
గీ ౩. ఏషస్యధారయా సుతోऽవ్యా వారేభిః పవతే మదింతమః। క్రీడన్నూ
౨ ౩ ౧ ౨
ర్మిరపామివ॥

ఆయభిషవించినసోమము గొఱ్ఱెవెండ్రుకలతోఁ జేసిన పవిత్ర (=వస్త్రమందు) ధారతోఁ (గలశమందు) కారుచున్నది. సోమము మనమును బాగుగాఁ గలిగించునది యుదకముల కెరటమువలె నెగురుచు స్రవించుచున్నది.

ఋజిశ్వఋషి-కకుప్ఛంద-సోమదేవత.

౨ ౩ ౨ ౩ ౨౩౨ ౩౧ ౨ర౩ ౧ ౨ర ౩౧ ౨ ౩౨ ౩౧
౧౮౪. య ఉస్రియా అపియా అన్తరశ్మని నిర్గా అకృన్తదోజసా। అభివ్రజం।
౨ ౨ ౩౧ ౨ ౩౧ ౨ ౩౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧౨
తత్నిషేగవ్యమశ్వ్యం వర్మీఽవధృష్ణవారుజ॥ ఓం౩వర్మీఽవ ధృష్ణవారుజ

ఏ సోమము ప్రసరించుచు నంతరిక్షమందున్న ఉదకములను మేఘమధ్యమున నున్నవాటిని బలముతోఁగారించెనో అట్టినీవు (అసురులపహరించిన) గో సమూహ మును అశ్వసమూహమును సర్వత్ర వ్యాపింపఁజేయుచున్నావు.

పంచమాధ్యాయమున నేకాదశ ఖండము సమాప్తము.

అధ్యాయమును సంపూర్ణము. పవమాన కాండము సంపూర్ణము.

# ఆ ర ణ్య క కాం డ ము.

ఈ కాండము ఏఁబదియైదు ఋక్కులు. వేర్వేఱ ఋషిచ్ఛందోదైవతములు.

## ౬ అధ్యాయము.

### ౧ ఖండము.

భరద్వాజఋషి-బృహతీచ్ఛందము-ఇంద్రదేవత.

   ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ర ౨ర ౩
గా౫. ఇంద్రజ్యేష్ఠం న ఆభర ఓజిష్ఠం పుపురిశ్రవః। యద్దిధృక్షేమ వజ్రహస్త
   ౧ ౨ ౩ ౧ ౩ ౨ర
రోదసీ ఉభే సుశిప్రపప్రాః॥

ఓ యింద్రా! మిగులప్రశస్తమైన, మిగులబలకరమైన, పూర్ణముచేయునట్టి యాయన్నమును మాకుఁదెచ్చియిమ్ము. ఓ వజ్రహస్తుఁడా! మంచిదవుడలు కలవాఁడా! యింద్రా! యేయన్నమును ధరింపఁదలఁచితిమో యేయన్నము నీ ద్యులోక భూలోకములు రెండును బూరించుచున్నవో (దానినని పూర్వాన్వయము.)

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛందము-ఇంద్రదేవత.

   ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ర ౨ఉ ౩ర ౩ ౧ ౨ ౩ ౧ ౨
గా౬. ఇంద్రోరాజా జగతశ్చర్షణీ నామధి క్షమా విశ్వరూపం యదస్య।
   ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ర ౩ ౧ ౨ ౩ ౨
తతోదదాతి దాశుషే వసూనిచోదద్రాధ ఉపస్తుతం చిదర్వాక్॥

ఏ యింద్రుఁడు తిరుగుచున్న జంతువులకును మనుష్యులకును రాజయియున్నాఁడో, భూమియందు నేధనముకలదో దానికిని రాజయియున్నాఁడో, యజమానునకు ధనములిచ్చునో, ఆయింద్రుఁడు మాచేస్తుతింపఁబడిన ధనమును మాకభిముఖముగాఁ బ్రేరించునుగాక.

వామదేవఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్ర దేవత.

౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ర ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౫౮౭. యస్యేదమా రజోయుజస్తుజే జనేవనగ్ంస్వః। ఇంద్రస్యరన్త్యంబృహత్॥

మిగుల తేజస్సుగల ఏయింద్రునియొక్క యీయెదుటనున్న హవిస్సును స్వర్గమునందున్నవారికి నిచ్చు యజమానుని విషయమైన దానము రమణీయము, గొప్పదియు. (అగును)

శునశ్శేఫఋషి-చతుష్పదాగాయత్రీ-వరుణ దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ర ౨ర ౩ ౧ర ౨ర ౩ ౧ ౨ ౧ ౨
౫౮౮. ఉదుత్తమం వరుణపాశమస్మదవాధమం విమధ్యమగ్ం శ్రథాయ। అథా
౩ ౨ ౩ ౧ర ౨ర ౩ ౨ ౩ ౧ ౨
దిత్యవ్రతేవయం తవానాగసో అదితయేస్యామ॥

ఓ వరుణుఁడా! ఉత్తమమయిన (అనఁగా శిరస్సునకట్టిన) పాశమును మాకుఁ గట్టిన దానిని విప్పివేయుము అధమయిన (అనఁగాఁ బాదములందు కట్టిన) పాశము విప్పివేయుము. మధ్యమ పాశమును (నడుముననున్నది) కూడ విప్పివేయుము. తర్వాత ఓ ఆదిత్యుఁడా! (అనఁగా అదితిపుత్రుఁడగు వరుణాఅనితా॥) మేము (శునశ్శేఫఋషివారలు) నీయాగమందు విఘ్నము లేకుండుటకు అపరాధము లేనివారమగుదుముగాక.

గృత్సమదఋషి-చతుష్పాదగాయత్రీచ్ఛందము-సోమ దేవత.

౧ ౨ ౩ ౧ర ౩ ౧ ౨ ౩ ౧ర ౨ర ౩ ౧ ౨ ౧ ౨
౫౮౯. త్వయావయం పవమానేనసోమ భరేకృతం విచినుయామశశ్వత్। తన్నో
౩ ౧ర ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨
మిత్రోవరుణోమామహన్తా మదితిస్సిన్ధుః పృథివీ ఉతద్యౌః॥

ఓ సోమమా! వడకట్టఁబడిన నీ సహాయము చేత యుద్ధమందుఁ జేయవలసిన పనిని జాలగాఁ జేతుము. అందువల్ల మమ్ము మిత్రవరుణాదితిసింధుపృధువులు ద్యులోకమును గౌరవింతురుగాక.

వామదేవర్షి-ఏకపదాగాయత్రీచ్ఛంద-విశ్వేదేవదేవత.

3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౨
శ్లో ౦. ఇమం వృషణం కృణుతైకమిన్మాం॥

ఓ (మిత్రాది దేవతలారా!) మీరు దానమిచ్చుటలో (దీనితో సాటి) రెండవది లేని యీ సోమమును వర్షము కురిపించు దానిఁగాఁ జేయుఁడు.

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ర
శ్లో ౧. సనఇంద్రాయ యజ్యవే వరుణాయ మరుద్భ్యః। వరివో విత్పరిస్రవ॥

ఓ సోమమా! ఆ నీవు మాకు ధనము లభింపఁజేయుచు మా యింద్రునకు వరుణుని కొఱకు, మరుత్తుల కొఱకు స్రవించుము.

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

3 ౧ర ౨ర 3 ౨ఉ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨
శ్లో ౨. ఏనా విశ్వాన్యర్య ఆద్యుమ్నాని మానుషాణాం। సిషాసన్తో వనామహే॥

ఈ సోమముతో మనుష్యులకు నన్నముల నన్నిఁటిని బొందుచు సేవింపఁ దలఁచుచు మేము భజించుచున్నాము.

ఆత్మఋషి-త్రిష్టుప్ఛందము-అన్నదేవత.

3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
శ్లో 3, అహమస్మి ప్రథమజా ఋతస్య పూర్వం దేవేభ్యో అమృతస్యనామ।
౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧ 3 ౧ ౨
యోమాదదాతి సఇదేవమావ దహమన్నమన్న మదన్తమద్మి॥

(ఋషియే తనతోఁ దాను అనుకొనుచున్నాఁడు) దేవతలకంటెఁ బూర్వము నేను (అన్నదేవతయని తా॥) నాశరహితమై సత్యమైన (పరబ్రహ్మకు) మొదటఁ

బుట్టితినిగదా! యే పురుషుఁడు (అన్నరూపమగు) నన్ను (అతిథులు మొదలగు వారికి) నిచ్చునో వాఁడే యీ విధముగా (నందఱిని) రక్షించుచున్నాఁడు. (ఎవఁడు లోభముతో నెవరికిఁ బెట్టక తినుతో) ఆ తినినవానిని నేనే తినివేయుచున్నాను.

షష్ఠాధ్యాయ ప్రథమఖండము సమాప్తము.

---

## ౬ అధ్యాయము.

### ౨ ఖండము.

శ్రుతకక్షఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౫౮. త్వమే తదధారయః కృష్ణాసు రోహిణీషుచ। పరుష్ణీషు రుశత్పయః॥

ఇంద్రా! నల్లని గోవులందు, నెఱ్ఱని గోవులందు, నానావర్ణ గోవులందును ఈ తెల్లని పాలను ధరింపఁజేయుచున్నావు.

పవిత్రఋషి-జగతీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౫౯. అరుణుచ దుషసః పృశ్నిరగ్రియ ఉక్షా మిమేతి భువనేషు వాజయుః।
3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 3 ౨ 3
మాయావినో మమిరే అస్య మాయయా నృచక్షసః పితరో
౨ 3 ౧ ౨
గర్భమాదధుః॥

ఉషస్సు సంబంధమైన యాదిత్యుఁడు అనఁగా సోమము (ఆదిత్య స్వరూపమని తా!) ప్రకాశింపఁజేయుచున్నది. జలమును వర్షించునట్టి (పర్జన్యుఁడు) మిగుల

ధ్వనించుచున్నాఁడు. సకలభూతములకును అన్నముం గోరుచుఁ బ్రజ్ఞావంతులైన దేవతలు నిర్మించిరి. (జగత్తునొక్కఁడు సృజించెనని తా॥) ఆ సోమముయొక్క ప్రజ్ఞచేతను నరులను జూచుచున్న పాలకులైన దేవతలు (ఓషధులందు) గర్భమును ధరింపఁజేయుచున్నారు. (సూర్యరూప సోమస్తుతి కావచ్చును. సూర్యాధీన తేజస్సు కలవాఁడగుట చంద్రరూప సోమస్తుతి యిదియనికూడ వ్రాసిరి.)

మధుచ్ఛంద(వైశ్వామిత్ర)ఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౨౫ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩౧
౫-౬. ఇంద్ర ఇద్ధర్యోః సచా సంమిశ్ల ఆవచో యుజా। ఇంద్రో వజ్రీ
౨ ౩ ౧ ౨
హిరణ్యయః॥

ఇంద్రుఁడే హరియను పేరుగల గుఱ్ఱములతోఁగూడ నంతటఁదిరుగుచున్నాఁడు. ఆ రెండుగుఱ్ఱములును మాట మాత్రముతోఁ దామే రథమును బూన్చుకొనునవి. ఆయింద్రుఁడు వజ్రాయుధముధరించి బంగారు భూషణముతోఁ గూడినవాఁడు.

పూర్వోక్తఋషిచ్ఛందోదేవతలె.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౫౯-౭. ఇంద్ర వాజేషు నోఽవ సహస్రప్రధనేషు చ। ఉగ్ర ఉగ్రాభి
౩ ౧ ౨
రూతిభిః॥

ఇంద్రుఁడా! శత్రుభయంకరుఁడవయిన నీవు ఒకరికి లొంగని రక్షణములతో అనఁగాఁ నితరు లెదిరింపలేని యుపాయములతో మమ్ము రక్షించుము. వేలకొలఁది శత్రువుల యుద్ధములలోఁగూడ నట్లు రక్షింపుము.

ప్రథఋషి-త్రిష్టుప్ఛంద-విశ్వేదేవదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౩ ౧ ౨
౫౯-౮. ప్రథశ్చ యస్య సప్రథశ్చ నామానుష్టుభస్య హవిషో హవిర్యత్।
౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర ౩ ౧ ౩
ధాతుర్ద్యుతానా త్సవితుశ్చ విష్ణో రథంతర మాజభారా వశిష్ఠః॥

ఎవ్వని (వశిష్ఠుని) యొక్క (కొడుకు) ప్రథుఁడనువాఁడును, ఎవ్వని (భారద్వాజుని) కొడుకు సప్రథుఁడును (వీరిద్దరిలో నా తండ్రి) వశిష్ఠుఁడు అనుష్టుప్ఛంద స్సుతోఁగూడిన హవిస్సును దెచ్చెనో (ఘర్మమని యీ హవిస్సుపేరు) ఏ హవిస్సును రథంతరమను సామమును ధాతయను పేరిదేవునివల్లను, సవితృదేవునివల్లను విష్ణునివల్లను వశిష్ఠుఁడే తెచ్చెనో, ఆ హవిస్సు ఇది.

గృత్సమదఋషి-గాయత్రీచ్ఛంద-వాయుదేవత.

౫౯౯. నియుత్వా న్వాయ వాగహ్యాయగ్ం శుక్రో అయామి తే। గన్తాసి సున్వతో గృహం॥

ఓ వాయుదేవా! నియుత్తులను వాహనములు కలవాఁడవయి నీవురమ్ము. ఈ దీపించుచున్న సోమము నీ కొఱకుఁ బట్టుకొనఁబడియున్నది. ఎందుకంటే, సోమాభిషవము చేయుచున్న యజమానుని యొక్క గృహమునకు వెళ్ళుచున్నవాఁడవయితివి (కనుక).

నృమేధ-పురుమేధులు ఋషులు-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౬౦౦. యజ్జా యథా అపూర్వ్య మఘవన్ వృత్ర హత్యాయ। తత్పృథివీ మప్రథయస్త దస్తభ్నా ఉతో దివం॥

నీవే మొదటివాఁడవయిన యింద్రా! వృత్రునిం జంపుటకు నెప్పుడు నీవు పుట్టితివో (బయలుదేరితివో అని తా॥) అపుడే భూమిని దృఢమైనదానింగాఁ జేసితివి. మరియు ద్యులోకమును అన్తరిక్షముతో నిలిపితివి. (=దృఢపఱచితివి.)

షష్ఠాధ్యాయ ద్వితీయఖండము సంపూర్ణము.

—:o:—

## ౬ అధ్యాయము.

### ౩ ఖండము.

వామదేవఋషి-అనుష్టుప్ఛందము-ప్రజాపతి దేవత.

౨ ౩ ౧ ౩ ౨ ౩ ౧ ౨ర ౩౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧
౬౧౧. మయివర్చోఽ అథో యశోఽథో యజ్ఞస్య యత్పయః। పరమేష్ఠీ ప్రజా
౨ ౩ ౧ ౨ర
పతి ర్దివిద్యా మివదృగ్ంహతు॥

ప్రజాపతి (అనఁగా బ్రహ్మ-సృష్టికర్త) స్వర్గమందు ప్రకాశించుచున్న కాంతినివలెను నాయందు వర్చస్సును (అనఁగా బ్రహ్మతేజస్సును) వృద్ధిపొందించుఁ గాక. మఱియుఁ గీర్తిని ఉత్తమమయిన క్షీరహవిస్సును వృద్ధిపొందించుఁగాక.

గౌతమఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత.

౨౩ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ర ౨ర ౩ ౧౨ ౩
౬౧౨. సన్తే పయాగ్ంసి సముయన్తు వాజాః సంవృష్ణ్యాన్యభిమాతిషాహః। ఆ
౧ ౨ ౩ ౧ ౨ ౩౧ర ౨ర ౩ ౧ ౨
ప్యాయమానో అమృతాయ సోమ దివి శ్రవాగ్ం స్యుత్తమాని ధిష్వ॥

ఓ సోమమా! శత్రువులను జంపునట్టినిన్ను (మఱగించు) క్షీరములు పొందునుగాక. హవిస్సులుకూడ నిన్నుఁజెందుంగాక. వీర్యములు చెందుఁగాక. సోమమా! మరణము లేకుండుటకు వృద్ధినొందుచు స్వర్గమందు గొప్పవయిన అన్నములను ధరించుచున్నావు.

పూర్వోక్తఋష్యాదులే.

౨ ౩ ౧ర ౨ర ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ర
౬౧౩. త్వమి మాఓషధీః సోమవిశ్వాస్త్వ మపో అజనయస్త్వంగాః॥ త్వ
౨ర ౩ ౨ ౧ ౨౩ ౧ ౨ర ౩ ౧ర ౨ర
మాతనో రుర్వా౩న్తరిక్షం త్వఞ్జ్యోతిషా వి తమోవవర్థ॥

ఓసోమదేవా! నీవు భూమియందున్న సమస్తౌషధులను బుట్టించితివి. (వాటికి జీవనాధారమైన) ఉదకములను బుట్టించితివి. పశువుల నన్నిఁటిని బుట్టించితివి. గొప్పదయిన యంతరిక్షమును విశాలము చేసితివి. (ఆ యంతరిక్షమందున్న యంధకారమును గాంతిచేత వృద్ధి నొందించితివి.

మధుచ్ఛందఋషి - గాయత్రీచ్ఛంద - అగ్ని దేవత.

3౧౨ 3 ౧ ౨ 3 ౧౨ 3౨3 ౧ ౨ ౧ ౨
౬౦౮. అగ్నిమీడే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజం। హోతారగ్ం
3 ౧౨
రత్నధాతమం॥

(పురోహితుఁడు రాజున కెట్లు అభీష్టము నెరవేర్చునో అట్లు) యజ్ఞమునకుఁ బురోహితుఁడును (అభీష్టసిద్ధి నొసఁగునని తా॥) లేక యాగపూర్వభాగమందున్న వాఁడు, హోమసంపాదకుఁడును, యాగరూపమైన రత్నములు కూర్చువాఁడు నగు నగ్ని దేవుని నేను (హోత యను ఋత్విజుఁడు) స్తుతించుచున్నాను.

వామదేవఋషి — త్రిష్టుప్ఛందము - అగ్ని దేవత.

౧ ౨ 3 ౨ర 3 ౨ 3 ౨3 ౧ ౨ 3౧ర ౨ర
౬౦౯. తేమన్వత ప్రథమం నామగోనాం త్రిస్సప్త పరమం నామ జానన్
౧౨ 3 ౨3క ౨ర 3 ౨ 3 ౧ ౨ 3౧ర ౨ర3 ౧౨
తాజానతరభ్య నూషత శ్రా ఆ విర్భువన్నరుణీ ర్యశసా గావః॥

ఓ యగ్నీ! నీస్తుతి చేయుచున్న అంగిరసులు వాక్కుల సంబంధమైన స్తుతులను మొదటఁ దెలిసికొనిరి. తర్వాత నావాక్కు సంబంధమైన యిరవై యొక్క ఛందస్సులుగల స్తోత్రములను దెలిసికొనిరి. ఆ వాక్కుల నన్నిఁటిని దెలియుచున్న ప్రజలు తెలిసికొనిరి. తదనన్తరము సూర్య తేజస్సుతోఁగూడ నెఱ్ఱనిగోవులు బయలు దేరినవి. (సూర్యోదయ కాలమున మేతల కావులు పోవుచున్నవని తా॥)

గృత్సమదఋషి-త్రిష్టుప్ఛంద-అగ్నిదేవత.

౨౩ ౨ర ౨ర ౩౧ ౨౩ ౨౩ ౨ ౩క౨ర
౬౦౯. సమన్యా యన్త్యుప యన్త్యన్యాః సమానమూర్వం నద్యస్పృణన్తి।
౨ ౩౧౨ ౧౨ ౩౧ ౨౩౧ర ౨ర౩ ౧౨ ౩౧ ౨
తమూశుచిం శుచయో దీదివాగ్ం సమపాన్న పాతముపయన్త్యాపః॥

ఇతరములయిన వర్షోదకములు (భూమియందు) పడుచున్నవి. అదివరకక్కడ నున్న యుదకములు భూమిని జెందియున్నవి. ఆ యుదకము లన్నియుఁగూడ నదు లగుచు (సముద్రమధ్యమున నున్న) బడబానలమునకుఁ బ్రీతిఁ గలిగించుచున్నవి. శుచియైన ఆయపాన్నపాదగ్నిని (=బడబాగ్ని) శుచులయిన యుదకములు సమీ పించుచున్నవి.

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-రాత్రిదేవత.

౧ర ౨ర ౩ ౧ ౩ ౨౧ర ౨ర ౩ ౧౨ర ౧౨ ౩
౬౧౦. ఆప్రాగాద్భద్రాయువతి రహ్నః కేతూన్త్సమీర్త్సతి। అభూద్భ
౨ ౨౧౨౩ ౧౨ ౩ ౧౨ ౩౧౨
ద్రా నివేశినీ విశ్వస్య జగతోరాత్రీ॥

సుఖకరమయినది, చీఁకటిని గూర్చునదియు నగు రాత్రి వచ్చెను. చంద్రుని కిరణములను గలుపుచున్నది. సర్వజగత్తును నిద్రపుచ్చుచున్నది యగుచున్నది.

భరద్వాజ (బార్హస్పతి) ఋషి-జగతీచ్ఛంద-వైశ్వానరదేవత.

౩౨౩ ౧౨ ౩౨ ౩ ౨ర ౩ ౩౩ ౧౨ ౩ ౧ ౨౩
౬౧౧. ప్రక్షస్య వృష్ణో అరుషస్య నమహాః ప్రనో వచో విదథా జాత
౧ ౨ ౩ ౧౨ ౩౨ర ౨ర౩ ౨౩ ౧౨ ౩ ౧౨
వేదసే। వైశ్వానరాయ మతిర్నవ్యసే శుచిః సోమఇవ పవత చారు
౩ ౧ ౨
రగ్నయే॥

సర్వత్ర వ్యాపించి నట్టి, వర్షము కురియించు నట్టి, ప్రకాశించు నట్టి, బడబాగ్ని యొక్క గొప్పదగు తేజస్సును లేక బలమును శీఘ్రముగా స్తుతింతును. మావా

కుక్క యజ్ఞమందు అతనిని స్తుతించుచున్నది. అత్యంతనూతనమైన వైశ్వానరాగ్ని కొఱకు స్తుతికర్తల యొక్క నిర్మలమయిన వాక్కు స్వయముగానే దశాపవిత్రము నుండి సోమము పరిస్రవించినట్లు బయలుదేరుచున్నది.

భరద్వాజఋషి-త్రిష్టుప్ఛంద-విశ్వేదేవ దేవత.

౬౧౯. విశ్వేదేవా మమ శృణ్వన్తు యజ్ఞముభే రోదసీ అపాన్నపాచ్చమన్మ।
మా వో వచాగ్ంసి పరిచక్ష్యాణి వోచగ్ం సుమ్నేష్విద్వో అన్తమామ దేమ॥

సకలదేవతలు నా హవిస్సులను స్తుతులను వింటురు. (స్వీకరింతురు) గాక. అంతరిక్షమందున్న యగ్ని (వైద్యుతాగ్ని=మెఱుపు) యును, ద్యులోక భూలోకమును మా స్తుతి విందురుగాక. ఓ దేవతలారా! మీకుఁ బనికిరాని స్తుతుల నేనుచ్చరింపలేదు. కనుక మీ సమీపమందున్నవారమై సుఖముగానుండి మదింతుము (=ఆనందింతుము) గాక.

వామదేవఋషి-మహాపంక్తిచ్ఛంద-విశ్వేదేవదేవత.

౬౨౦. యశో మా ద్యావాపృథివీ యశో మేన్ద్రబృహస్పతీ। యశో భగస్య విన్దతు
యశో మా ప్రతిముచ్యతాం। యశస్వ్యా౩స్యాః సగ్ం సదోహం
ప్రవదితా స్యామ్॥

ద్యులోక భూలోకముల అన్నము నన్ను (స్తుతికర్తను) పొందునుగాక ఇంద్ర బృహస్పతుల యన్నమును జెందుఁగాక. భగుని (=ఆదిత్యుఁడు) యొక్క యన్నమును నన్ను జెందుఁగాక. మమ్మున్న వదలకుండుఁగాక. మావారల యన్నము కూడ వదలకుండుఁగాక. నేనుసర్వజనులకుఁ బ్రవక్త నగుదునుగాక. (ఉపదేశకుఁడనితా॥)

హిరణ్యస్తూపఋషి-త్రిష్టుప్ఛందము-ఇంద్రదేవత.

౬౧౧. ఇంద్రస్యనువీర్యాణి ప్రవోచం యానిచకార ప్రథమానివజ్రీ। అహ
న్నహిమన్వప స్తతర్ద ప్రవక్షణా అభినత్పర్వతానాం॥

వజ్రాయుధధారియగు నింద్రుఁడు ప్రసిద్ధములైన యే పరాక్రమములను జేసెనో వాటిని శీఘ్రముగా చెప్పుదును. (ఏవంటే) మేఘమునుజీల్చెను. తర్వాత నుదకములను గదలించెను. పర్వతముల మీఁదనున్న సెలయేఱులను స్రవించునట్లు బయలు దేరఁదీసెను (ఈ మూఁడు ప్రసిద్ధములు.)

విశ్వామిత్రఋషి-త్రిష్టుప్ఛందము-సర్వాత్మదేవత.

౬౧౨. అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతంమే చక్షురమృతం మఆసన్।
త్రిధాతురర్కో రజసో విమానోఽజస్రం జ్యోతిర్హవిరస్మిసర్వం॥

ఓ కౌశికసగోత్ర ఋషులారా! ఆయగ్నిని నేను. (అన్నమును భక్షించునట్టి యనితా॥) పుట్టుకతోనే పరమాత్మ తత్త్వము నెఱింగినవాఁడను. (=జాత-వేద-అను దానియర్థము) నాదృష్టి దీపించునది (అదేదంటే) అమృతము (=సర్వకర్మల ఫలము) నాముఖమునందు జగత్తును సృజించిన ప్రాణమున్నది. ఆప్రాణము మూఁడువిధములయ్యెను. (అందు నొకటి-వాయురూపము) ఆనేను అంతరిక్షమందు నున్నాను. (ద్యులోకమందు) నిత్యమైన ఆదిత్యరూపునిగా నున్నాను. (అనుభవించునట్టి భోక్త స్వరూపమిాచెప్పినదంతేయు-ఇకముందుఁ జెప్పునది భోగ్యము.) సకల హవిస్సులును నేనయి యున్నాను (హవిస్సు=అనుభవింపఁదగు వస్తువు. అదే భోగ్య మనఁబడును. ఇంకొకయర్థ మగ్నిపరముగాఁజెప్పఁబడె. అందు ముఖపదముల కర్థమిట్లు—జాతవేద= సర్వమెఱింగినవాఁడు-ఘృతం=నేయి. అమృతం=శాన్తి. త్రిధాతు=ప్రాణాపానవ్యాన రూపము. ఇత్యాదిగా-మొదటియర్థమున త్రిధాతు=సూర్య-వాయు-అగ్ని మూఁడు రూపములు. ఇదిభేదము.

ఋష్యాదులు పూర్వవతు.

౨ ౩ ౨౩ ౧ర ౨ర ౩౧ర ౨ర ౩ ౧ర ౨ర ౧ ౨
౬౧౩. ప్రత్యగ్నిర్వ్యుషో అగ్రం పదంవేఃపాతి యహ్వశ్చరణగ్ం సూర్యస్య
౨౩౧ ౨ ౩ ౧౨ ౩ ౨ర ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
పాతినాభా స ప్తశీర్షాణమగ్నిఃపాతి దేవానాముపమాదమృష్వః

అగ్ని సర్వత్రవ్యాపించిన భూమియొక్క ముఖ్యస్థానమును రక్షించుచున్నది. గొప్పదయిన యగ్ని అంతరిక్షమును రక్షించుచున్నది. అంతరిక్ష మధ్యమందున్న మరుత్తుల సమూహమును రక్షించుచున్నది. చూడఁదగిన యీ యగ్ని దేవతలను మదింపఁజేయు యజ్ఞమునురక్షించుచున్నది.

షష్ఠాధ్యాయ తృతీయఖండ సమాప్తము.

---

౬ అధ్యాయము.

౪ ఖండము.

వామదేవఋషి-పంక్తిచ్ఛందము-అగ్నిదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ర ౨ర ౩
౬౧౪. భ్రాజస్త్యగ్నే సమిధాన దీదివో జిహ్వాచరత్యంతరాసని। సత్వన్నోఅగ్నే
౧ ౨ ౩ ౨ ౩ ౧ర ౨ర ౩ ౧ ౨
పయసావసువిద్రయిం వచోదృశేzదాః॥

ఋత్విజులచేత ప్రజ్వలింపఁజేయఁబడిన యగ్నీ! ప్రకాశించుచున్న ముఖమందున్న నీజ్వాల (=నాలుక) హవిస్సులను భక్షించుచున్నది. ఓ యగ్నీ! ధనములభింపఁజేయువాఁడా! నీవు మా అన్నముతోఁగూడ రమణీయధనమును దర్శించుటకుఁ దేజస్సునిమ్ము.

వామదేవఋషి-పంక్తిచ్ఛంద-ఋతుదేవత.

౩ ౨ర ౨ర ౩౧ర ౨ర ౩౧ర ౨ర౩౧౨ ౩౧ర
౬౧౫. వసన్త ఇన్నురన్త్యో గ్రీష్మ ఇన్నురన్త్యః। వర్షాణ్యనుశరదో హేమన్త
౨ర౩ ౧ర ౨ర
శ్శిశిర ఇన్నురన్త్యః॥

వసన్త ఋతువే రమణీయము. గ్రీష్మ ఋతువే రమణీయము. వర్ష ఋతువే రమణీయము. వాటి ననుసరించి శరదృతువు రమణీయము. హేమన్త ఋతువే రమణీయము. శిశిర ఋతువే రమణీయము.

వామదేవఋషి-పఙ్క్తిచ్ఛంద-విరాడ్దేవత.

౩౧ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩౧ ౨ ౧ ౨ర ౩ ౧ ౨
౬౧౬. సహస్రశీర్షాః పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్॥ సభూమిగ్ం సర్వతో
౩ ౧ ౨ ౩ ౨
వృత్వా త్యతిష్ఠద్దశాంగులం॥

(సర్వప్రాణుల మొత్తమునకు విరాడ్రూపమని పేరు.) ఈ (విరాట్పురుషుఁడు) అనన్త శిరస్సులు కలవాఁడు, అనంత నేత్రములు కలవాఁడు, అనంత పాదములు కలవాఁడు. (అన్ని ప్రాణుల యవయవములే యతని యవయవములు) ఆపురుషుఁడు భూమి (అనఁగా బ్రహ్మాండ గోళమనితా॥) నంతటిని వ్యాపించి యాపైని మఱి పది యంగుళములు (పదియంగుళములన్నది సరియైనకొలకాదు. బ్రహ్మాండముపైనకూడ వ్యాపించినాఁడనితా॥) వ్యాపించెను.

ఋష్యాదికము పూర్వవతు.

౩౨ ౩౨౬ ౩౧౨ ౩౧ ౩ ౩ ౧ ౨ ౩౧౨ ౨ ౩౨ ౩క ౨ర
౬౧౭. త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవత్పునః। తథావిష్వఙ్వ్యక్రామ
౩ ౨౩ ౨
ద్రాశనాన శనేఅభి॥

త్రిపాత్పురుషుఁడు (అనఁగా సత్త్వరజస్తమ స్సంభవ సంసారము లేనివాఁడని తా॥) ఈ సంసారమునుండి బయటికివచ్చెను. అతనికి ఈ ప్రపంచమంతయు ఒక సూక్ష్మవస్తువు వంటిది. (అనఁగా రేణువునంతటిది-అన్నందున నతనిరూపము మహత్తనితా॥) అట్లే చేతనాచేతనములందు వివిధరూపమున వ్యాపించి యుండెను. (అశనా=ఆహారము తీసికొనునది-చేతనమనితా॥)

ఋష్యాదులు పూర్వవతు.

　　౧౨3　　౨ఉ　　3　　౨ 3 ౨ఉ　　3 ౧ ౨　　౧ ౨ 3
౬౧౮. పురుష ఏ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చభావ్యః। పాదోస్య
　　౧3 3 ౧ ౨ 3 ౧౨3 ౧ ౨ 3౨
　　సర్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥

ఈ ప్రవర్తించు జగత్తంతయుఁ బురుషుఁడే. ఇఁకరాఁబోవుజగత్తును గతించిన జగత్తునుంగూడఁ బురుషుఁడే. భూతభవిష్యద్వర్తమాన కాలములందలి జగత్తంతయును ఈ పురుషుని నాల్గవభాగము. మిగిలిన యీతని మూఁడంతల భాగమును నాశములేనిదయి ప్రకాశస్థానమందున్నది.

ఋష్యాదులు పూర్వవతు.

　　౧ ౨　　3 ౨ఉ　　3　　౧ ౨　　3　　౧౨　　3 ౧ ౨3౧
౬౧౯. తావానస్యమహిమా తతో జ్యాయాగ్ంశ్చ పురుషః। ఉతామృతత్వస్యే
　　౨౪3 ౧౪ ౨౪　　3౧ ౨
　　శానో యదన్నే నాతిరోహతి।

జగత్తంతటికిఁగల యాధారమెంతో అంతే యీతని మహత్తు (అంతే అన్నది వాస్తవ రూపముకాదు. అదేదంటే) దానికంటెను (మహిమకంటెననితా॥) పురుషుఁడు మిగులనధికుఁడు. మఱియు దేవత్వములకు నీశ్వరుఁడు. ఏమంటే (ప్రాణుల నుభవింపఁదగిన) యన్నమునిమిత్తము బయటికి వచ్చుచున్నాఁడు (అనఁగాఁగార్య ప్రపంచరూపముగా మాఱుచున్నాఁడనితా॥)

ఋషాద్యాదులు పూర్వవతు.

౬౨౦. తతోవిరాడజాయత విరాజో అధిపూరుషః। సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః॥

ఆవిరాట్పురుషునివల్ల బ్రహ్మాండ దేహము పుట్టెను. విరాడ్దేహ మాధారము చేసికొని పురుషుఁడు (ఇంకొకఁడు) పుట్టెను. (ఇతఁడు జీవుఁడనితా।) ఆ పుట్టినవాఁడతిశయించెను. తర్వాత భూమియు శరీరములును (సృజించెను.)

వామదేవఋషి-త్రిష్టుప్ఛంద-ద్యావాపృథ్వ్యౌ దేవతలు.

౬౨౧. మన్యేవాంద్యావా పృథివీ సుభోజసౌ యే అప్రథేథా మమిత మభియోజనం। ద్యావా పృథివీ భవతగ్ం స్యోనేతే నో ముఞ్చతమగ్ం హసః॥

ఓ ద్యావా పృథ్వ్యౌలారా! మీరు మంచిపాలకులని తలఁతును. అపరిమిత ధనాదికమును విస్తరింపఁజేయుఁడు. ఓ ద్యావా పృథ్వ్యౌలారా! మీరు మమ్ము పాపము నుండి విడిపించుడు.

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౬౨౨. హరీతఇంద్ర శ్మశ్రూణ్యుతోతే హరితౌ హరీ। తన్త్వాస్తువన్తి కవయః పురుషాసో వనర్గవః॥

ఓ యింద్రా! నీయొక్క మీసములు (సోమపానముచేత) ఆకుపసరు రంగు గలవి. మఱియు నీరెండు గుఱ్ఱములు ఆకుపచ్చనివి. మేధావులైన పురుషులు కోరఁదగిన గోవులుకలవారలు.

వామదేవఋషి-అనుష్టుప్ఛంద-ఆశాసనమందు వినియోగము.

౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3
౬౨౩. యద్వర్చో హిరణ్యస్య యద్వావర్చో గవాముత। సత్యస్య బ్రహ్మణో
౨ 3 ౧౨ 3 ౧ ౨
వర్చస్తేన మాసగ్ం సృజామసి॥

(హితరమణీయమయిన=) హిరణ్యముయొక్క (అనఁగా బంగారు కావచ్చును) యే తేజస్సుకలదో అదియును, మఱియు గోవులయొక్క (సూర్యకిరణములు కావచ్చును.) ఏ తేజస్సుకలదో యదియును, సత్యస్వరూపుఁడైన బ్రహ్మ యే తేజస్సు కలదో వాటితో మేము కూడుదుము గాక. (అని ఆశీర్వచనము తమకే)-ధనము తోను, గోవులతో విద్యతోను, గూడుదుముగాకని తాత్పర్యము.

వామదేవఋషి-త్రిష్టుప్ఛందము-ఆశానే వినియోగః-

వెనుకదానికి దీనికి దేవతలు వేరు-కేవలము స్తుతి.

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨3క ౨ 3 ౧ ౨ ౨ 3 ౧
౬౨౪. సహస్తన్న ఇంద్ర దద్ధ్యోజ ఈశే హ్యస్య మహతో విరప్శిన్ క్రతున్న
3౧ర ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
నృమ్ణగ్ం స్థవిరఞ్చవాజం వృత్రేషు శత్రూన్త్సహనాకృంధీనః॥

సత్యస్తుతిగల యింద్రా! నీయొక్క-బలము మాకునిమ్ము. ఏమంటే—నీవు ఈ గొప్పబలమునకు నధికారివి. (కనుక) ఇంద్రా! మాయజ్ఞమునువలెను ధనమును బలమును వృద్ధినొందిన దానింగాఁ జేయుము. మాశత్రువులును యుద్ధములయందు సహించునట్లు చేయుము.

వామదేవఋషి-త్రిష్టుప్ఛందము-గోదేవత.

3౧౨ 3౧౨ 3౨3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౬౨౫. సహర్షభా సహవత్సా ఉదేత విశ్వారూపాణి బిభ్రతీర్ద్వ్యూధ్నీః।
3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ర ౨ర 3 ౨ 3 ౧ ౨
ఉరుఃపృథురయంవో అస్తులోక ఇమా ఆపస్సుప్రపాణా ఇహస్త॥

వృషభములతోఁగూడినట్టి, దూడలతోఁగూడినట్టి గోవులారా! రెండుమార్లు పాలిచ్చునవగుచు సర్వరూపములు కలవారలై మీరు సమృద్ధులైరండు. ఎక్కువై విస్తారమైనదిగా నీలోకము మీకు నగునుగాక. ఈ యుదకములు ఈ లోకమందుఁ జక్కఁగాఁ బానయోగ్యములగుఁగాక. కనుకనిచట ననేకములై యుండుఁడు.

షష్ఠాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

---

## ౬ అధ్యాయము.

### ౫ ఖండము.

వైఖానసులుఋషులు-జగతీచ్ఛందము-పవమానాగ్ని దేవత.

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౬-౨౬. అగ్నఆయూఁషి పవస ఆసువోర్జ మిషంచనః। ఆరేబాధస్వదుచ్ఛునాం॥

పవమాన స్వరూపుఁడవగు నగ్నీ! మాయన్నములను గార్చుచున్నావు. మాకు అన్నరసమును బలమును అభిముఖముగాఁగార్చుము. రాక్షసులను మాకు దూరముగాఁజేయుము. (పవమానాగ్ని=వడకట్టిన సోమమనెడు నగ్నియని అర్థము.)

విభ్రాజ (సూర్యపుత్రి) ఋషి-త్రిష్టుప్ఛంద-సూర్య దేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౬-౨౭. విభ్రాడ్బృహత్పిబతు సోమ్యం మధ్వాయుర్దధద్యజ్ఞపతా వవిహ్రుతం।
౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ర ౨ర
వాతజూతోయో అభిరక్షతిత్మనా ప్రజాః పిపర్తి బహుధావిరాజతి॥

విశేషముగాఁబ్రకాశించుచున్న సూర్యుఁడు శ్రేష్ఠమయిన సోమమయమయిన మధువును యాగకర్తకు అకుటిలమయిన యన్నమునిచ్చుచుఁ ద్రావుంగాక. ఏ

సూర్యుఁడు వాయువుచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడగుచు స్వయముగానే జగత్తునంతయుం బాలించుచున్నాఁడో—(రాశిచక్రము వాయువుచేతనే త్రిప్పఁబడుచున్నది) ఆ సూర్యుఁడు ప్రజలను (వర్షముకురిపించి) పరిపాలించుచున్నాఁడు. మిగులఁబ్రకాశించుచున్నాఁడు.

కుత్సఋషి-త్రిష్టుప్ఛందము-సూర్యదేవత.

౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౨ ౩
౬౨౭. చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆప్రా
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ర ౨ ౩ ౧
ద్యావా పృథివీ అంతరిక్షగ్ం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥

కిరణములయొక్క తేజస్సు అనఁగా మండలము. ఆశ్చర్యకరమై ఉదయించెను (ఆ మండలము) మిత్రునియొక్క, వరుణునియొక్క, అగ్నియొక్క, (అనఁగా జగత్తంతటికిని అని తా॥) కన్ను అయి యున్నది (కన్నెట్లు సర్వవస్తువులం జూపెట్టునో యట్లు సకల వస్తువులను సూర్యుఁడు కనఁబఱచునని తా॥) ద్యులోక భూలోకములను అంతరిక్షమును (తనతేజస్సుతో) పూరించెను=నిండించెను. ఆ సూర్యుఁడు స్థిరచరమగు జగత్తునకు జీవాత్మయయి యున్నాఁడు.

సర్పరాజ్ఞీఋషి-గాయత్రీచ్ఛంద-సూర్యదేవత.

౧ర ౨ర ౩ ౩ ౧ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౬౨౮. ఆయఙ్గౌః పృశ్నిరక్రమీ దసదన్మాతరం పురః పితరంచ ప్రయన్త్స్వః॥

నడచు స్వభావముగలట్టి, వ్యాపించిన తేజస్సుగల యీ సూర్యుఁడు ఆక్రమించెను. పూర్వదిక్కునందు భూమినిబొందెను. ద్యులోకమునందు, అంతరిక్షమునందు శీఘ్రముగాఁ గమనించుచు మంచినడక గలవాఁడగుచున్నాఁడు.

పూర్వోక్తఋషి-గాయత్రీచ్ఛంద-సూర్యదేవత.

౩ ౧ ౨ ౩ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౨ర ౩ ౧ ౨ర
౬౩౦. అంతశ్చరతి రోచనాస్య ప్రాణాదపానతీ। వ్యఖ్యన్మహిషోదివం॥

ఈ సూర్యుని ప్రకాశించు కాన్తి శరీరములోపలఁ బ్రాణరూపముగా సంచరించుచు, ప్రాణమునుండి యపాయమును బొందుచున్నది. (ఊర్ధ్వముగాఁ బ్రసరించునది ప్రాణము అధోముఖముగా సంచరించునది అపానము అనఁబడును.) లేక ఉదయించుచున అస్తమించుచున్నది. (ప్రాణ=ఉదయము అపాన=అస్తమయము. అంతరా=ద్యులోక భూలోకముల మధ్యను అని యింకొకర్థముకూడ వ్రాసిరి.) ఇట్టి కాన్తికలవాఁడు కనుకనే మహాత్ముఁడగు సూర్యుఁడు అంతరిక్షమును బ్రకాశింపఁజేసెను.

పూర్వోక్తఋషిచ్ఛందోదేవతలే.

౬౩౧. త్రింశద్ధామ విరాజతి వాక్పతఙ్గాయ ధీయతే। ప్రతివస్తో రహద్యుభిః॥

దినముయొక్క అవయవములు ముప్పదియును (రెండుగడియలొక ముహూర్తము. పదియేను ముహూర్తములు పగలు రాత్రి పదియేను గలిసి ముప్పదిముహూర్తములని వివేకము.) సూర్యకాంతులచేత విశేషముగాఁ బ్రకాశించుచున్నవి. (అట్టి సమయమున) వేదవాక్కు సూర్యునికొఱకుఁ బ్రవర్తింపఁజేయఁబడుచున్నది. (అనఁగా మంత్రములతో సూర్యుని స్తుతించుచున్నారనితా॥)

వైఖానసులుఋషులు-గాయత్రీచ్ఛంద-సూర్యదేవత.

౬౩౨. అపత్యే తాయవో యథా నక్షత్రాయ న్త్యక్తుభిః। సూరాయ విశ్వచక్షసే॥

ఆ దొంగలవలె నక్షత్రములు (దేవతల గృహములు నక్షత్రాలందురు అని యొక తాత్పర్యము గమనము కలవని వ్యుత్పత్తి.) రాత్రులతోఁగూడి ప్రపంచమునంతనుంజూచు సూర్యుని (రాకంజూచి) తొలఁగిపోవు చున్నవి.

వైఖానసఋషి-గాయత్రీచ్ఛందః-సూర్యదేవత.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౬౩౩. అదృశ్రన్నస్య కేతవో విరశ్మయో జనాగ్ం అను। భ్రాజన్తో అగ్నయో యథా॥

ఈ సూర్యుని ప్రకాశముకలిగించు కిరణములు అన్నిఁటిని వరుసగాఁదెలియుచున్నవి. దీపించు నగ్నులవలెఁ బ్రకాశముకలిగించుచున్నవి.

పూర్వోక్త ఋష్యాదులే.

౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౬౩౪. తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య। విశ్వమాభాసి రోచనం॥

ఓ సూర్య! నీవు గమనశీలుఁడవు. లేక రోగులఁదరింపఁజేతువు. అందఱచేఁ జూడఁదగిన వాఁడవు. మఱియుఁ బ్రకాశము గలిగించువాఁడవు. కనుకఁ బ్రకాశించుచున్నయన్తరిక్షమును అంతను బ్రకాశింపఁజేయుచున్నావు. రెండవయర్థము పరమాత్మస్వరూపముగాఁ జెప్పుచు ప్రపంచస్థిత సర్వచరాచరములను బ్రకాశింపఁజేయు నంతర్యామియనియుఁ జెప్పిరి. )

ఋష్యాదులు పూర్వోక్తము.

౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧౪ ౨౪ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౨౪
౬౩౫. ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్। ప్రత్యఙ్ విశ్వగ్ం
౩ ౨
స్వర్దృశే॥

ఓ సూర్యుఁడా! నీవు మరుత్తులనెడు దేవతలకెదురుగా నుదయించుచున్నావు. (వారికభిముఖముగా నని తా॥) మనుష్యులకభిముఖముగాను ఉదయించుచున్నావు. అట్లే భూమికిని ద్యులోకమునకును అభిముఖముగాను అందఱుఁజూచుట కుదయించుచున్నావు.

పూర్వోక్త ఋష్యాదులే.

౬౩౬. యేనాపావక చక్షసా భురణ్యన్తం జనా అను। త్వం వరుణపశ్యసి॥

సర్వమును శుద్ధిచేయువాఁడా! కష్టముల నివారించువాఁడా! (=వరుణ) పోషించుచున్న యీ లోకమును ఏ ప్రకాశముతో వెలిగించుచున్నావో, ఆవెలుఁగుతో నుదయించుచుంటివి.

ఋష్యాదులు పూర్వోక్తము.

౬౩౭. ఉద్ద్యామేషి రజఃపృథ్వహా మిమానో అక్తుభిః। పశ్యన్జన్మాని సూర్య॥

ఓ సూర్య! నీవు విశాలమయిన భూలోకమును, ద్యులోకమును, అంతరిక్షమును గూర్చి యుదయించుచున్నావు. పగళ్లను రాత్రులతోఁగూడ నిర్మించుచుఁ బుట్టుచున్న జీవులను జూచుచు నుదయించుచున్నావు.

పూర్వోక్త ఋష్యాదులు.

౬౩౮. అయుక్త సప్త శున్ధ్యువః సూరో రథస్య నప్త్యః। తాభిర్యాతి
స్వయుక్తిభిః॥

సూర్యుఁడు (=ప్రేరించువాఁడు) శుద్ధిచేయునట్టి యాఁడగుఱ్ఱములను ఏడింటిని తన రథమందుఁబూన్చెను (అశ్వ=గమనించు-శున్ధ్యు=శుద్ధిచేయు. కిరణములనియే తా॥) ఆగుఱ్ఱములు రథమును బడకుండఁ బట్టుకొన్నవి. స్వయముగానే (ఒకరుచెప్ప నక్కఱలేకయే) రథమును బూన్చుకొనునవి. ఇట్టి గుఱ్ఱాలతో (యాగగృహమునకు) వచ్చుచున్నాఁడు.

ఋష్యాదులు పూర్వవతు.

3 ౧ ౨ 3 ౨ 3 3 ౨ ౧ ౨ 3 ౧ ౨
౬౩౯, సప్తత్వాహరితో రథేవహన్తి దేవసూర్య। శోచిష్కేశం విచక్షణా॥

ఓ సూర్యా! సర్వముం బ్రకాశింపఁజేయువాఁడా! ఏడుగుఱ్ఱాలు (రసమును గ్రహించునట్టి కిరణములనితా॥) రథమందు కాంతులే కేశములుగాగల నిన్ను మోయుచున్నవి.

ఆరవయధ్యాయమున పంచమఖండము పూర్ణము.

అధ్యాయమును సమాప్తము. ఆరణ్యక కాండమును సంపూర్ణము.

—:०:—

# సామవేదము — ఉత్తరార్చికము.

## ౧ అధ్యాయము.

## ౧ ఖండము.

ప్రథమ ప్రపాఠకమున - ప్రథమార్ధము. ఈ అధ్యాయమున ౧-౨-3 ఋక్కుల మొత్తము నకు "తృచ" అని పేరు. ఒకటవ తృచ, రెండవ తృచ, మూఁడవ తృచ— ఇత్యాదిగా వాడుక ఉత్తర గ్రంథమంతయు ౨౧ అధ్యాయము.

—:o:—

ఈ తృచకు (=సూక్తమునకు)ఋషి అసిత-లేక దేవల-గాయత్రీచ్ఛందము
పవమానసోమ దేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర
౬౪౦. ఉపాస్మైగాయతా నరః పవమానాయేందవే। అభిదేవాగ్ం ఇయక్షతే॥

యజ్ఞమును నిర్వహించిన ఋత్విక్కులారా! స్తోతలారా! యాగము చేయఁ దలఁచిన కారుచున్న యీ సోమముకొఱకు ఉపగానము చేయుఁడు.

3 ౨ 3 ౧ ౨ 3 ౧ 3 ౨ 3 ౧ ౨ 3 ౨
౬౪౧. అభితే మధునాపయోఽథర్వాణో అశిశ్రయుః దేవం దేవాయ దేవయు॥

ఓ సోమమా! ప్రకాశస్వభావముకలది, దేవతలంగోరినది యగు నీరసమును మధువు=తేనెతోను గోక్షీరముతోను ఆథర్వణికులైన ఋషులు కలిపి సంస్కరించిరి.

౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ర 3 ౧౨ర ౧ ౨ 3 ౧ ౨
౬౪౨. సనఃపవస్వ శం గవే శం జనాయ శమర్వతే। శగ్ంరాజన్నోషధీభ్యః

ప్రకాశించుచున్న సోమమా! ఆ నీవు మాగోవునకు సుఖముగా స్రవించుము, పుత్రాది పరివారముకొఱకును సుఖముగా స్రవించుము అశ్వముకొఱకు సుఖముగాఁగారుము. ఓషధుల (=సస్యములు) కొఱకు సుఖముగాను స్రవించుము.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-పవమానసోమదేవత.

౬౪౩. దవిద్యుతత్యా రుచాపరిష్టోభన్త్యా కృపా। సోమాశ్శుక్రా గవాశిరః॥

దూరముగాఁ బ్రకాశించు కాంతిగలట్టి, యంతటధ్వనించుచున్నట్టి, ధారతోఁగూడిన సోమములు ఆవుపాలతోఁగలియుచున్నవి

౬౪౪. హిన్వానో హేతృభిర్హిత ఆ వాజం వాజ్యక్రమీత్। సీదన్తో వనుషో యథా॥

బలవన్తమైన సోమము స్తుతికర్తలచేత ప్రేరింపఁబడి యిష్టముల నిచ్చునదగుచు యాగరూపమయిన యుద్ధమును యోధులు యుద్ధములందుఁ బ్రవేశించునట్లు, నాక్రమించునట్లు ఆక్రమించెను.

౬౪౫. ఋధక్ సోమస్వస్తయే సజ్జగ్మానో దివాకవే। పవస్వ సూర్యో దృశే॥

జరిగినదానిని తెలియునట్టి సోమమా! మంచివీర్యము కల్గిన నీవు వేర్వేఱఁబ్రవర్తించుచు సుఖమయిన దర్శనముకొఱకు నంతరిక్షమునుండి కారుము.

వైఖానసఋషి-గాయత్రీచ్ఛందము-పవమానసోమదేవత.

౬౪౬. పవమానస్య తే కవే వాజిన్త్సర్గా అసృక్షత। అర్వన్తో న శ్రవస్యవః॥

ఓ కవీ! అన్నముగల సోమమా! (దశాపవిత్రమునుండి) కారుచున్న నీయొక్క అన్నమును గోరుచున్న ధారలు అశ్వశాలనుండి గుఱ్ఱాలువచ్చునట్లు కారుచున్నవి.

౬౪౭. అచ్ఛాకోశం మధుశ్చుతమసృగ్రం వారే అవ్యయే। అవావశన్త ధీతయః॥

మధురరసముం గార్చుచున్న ద్రోణకలశమున కభిముఖముగా గొఱ్ఱెబొచ్చు వస్త్రమందుఁ గార్చఁబడుచున్నది. వ్రేళ్లు ఆ సోమమును మాటిమాటికిఁ బొడుచుటకుం గోరుచున్నవి.

౬౪౮. అచ్ఛా సముద్రమిందవోऽస్తం గావో నధేనవః। అగ్మన్నృతస్య యోనిమా॥

కారుచున్న సోమములు ద్రోణకలశమున కభిముఖముగా క్రొత్తగా నీనిన యావులింటికి వచ్చునట్లు వచ్చుచున్నవి. ఆ సోమములు యజ్ఞస్థానమునకు అభిముఖముగావచ్చుచున్నవి.

ఉత్తరార్చికమునఁ బ్రథమాధ్యాయమునఁ బ్రథమఖండము సమాప్తము.

———:o:———

౧ అధ్యాయము

౨ ఖండము.

పూర్వోక్త ఋష్యాదికము-అగ్ని దేవత.

౬౪౯. అగ్నఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే। నిహోతా సత్సి బర్హిషి॥

ఓ యగ్నీ! నీవు హవిస్సుల భక్షించుటకై మాచేతస్తుతింపఁబడుచు (దేవతలకు) హవిస్సులందించుటకును దేవతల నాహ్వానించు వాఁడవయి పరుపఁబడిన దర్భలందుఁ గూర్చుండుము.

౧ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౬౫౦. తంత్వాసమిద్భిరంగిరో ఘృతేన వర్ధయామసి। బృహచ్ఛోచా యవిష్ఠ్య॥

అంగిరస వంశమందుఁ బుట్టినవాఁడా! యగ్నీ ఆ నిన్ను సమిధల(=పుల్లల)తో నేతితో వృద్ధినొందించుచున్నాము. కనుక నో యౌవనవంతుఁడా! మిగులఁబ్రకాశించుము.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౬౫౧. సనః పృథుశ్రవాయ్య మచ్ఛా దేవవివాసతి। బృహదగ్నే సువీర్యం॥

ఓ యగ్ని దేవా! అట్టి నీవు విస్తారమయిన, ప్రశస్తమయిన, గొప్పదయిన, మంచివీర్యవంతమయిన ధనమును మాకెదురుగాఁ బొందించుము.

విశ్వామిత్రఋషి-గాయత్రీచ్ఛంద-మిత్రావరుణ దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౨ ర ౧ ౩ ౧ ౨
౬౫౨. ఆనో మిత్రా వరుణా ఘృతైర్గవ్యూతి ముక్షతం। మధ్వా రజాగ్ంసి సుక్రతూ॥

మంచికర్మ లొనరించునట్టి యోమిత్రావరుణులారా! మా గోమార్గమును అనఁగా మందను బాలుపుట్టించు నుదకములతో సంతటను దడుపుఁడు. (పాడికలుగునట్లు చేయుము.) మధురరసముతో లోకములను దడుపుఁడు. (వర్షించుఁడని తా॥)

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౧ ౨
౬౫౩. ఉరుశగ్ంసా నమో వృధా మహ్నా దక్షస్య రాజథః। ద్రాఘిష్ఠాభిః శుచివ్రతా॥

పరిశుద్ధకర్మములుగల మిత్రావరుణులారా! పలువురచే స్తుతింపఁబడిన హవిస్సులతో లేక నమస్కారములతో వృద్ధిపొందునట్టి, దీర్ఘస్తుతి లక్షణములు కలట్టి, మీరు ధనముయొక్క మహత్త్వమున కీశ్వరులు అయియున్నారు.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ర
౬౫౪. గృణానా జమదగ్నినా యోనా వృతస్య సీదతం। పాతగ్ంసోమ మృతావృధా॥

మిత్రావరుణులారా! జమదగ్ని మహర్షిచేతను స్తుతింపఁబడుచున్న మీరు దేవయజ్ఞస్థానమందుఁ గూర్చుండుడు. కర్మఫలమును వృద్ధిచేయునట్టి మీరు సోమమును (మేమభిషవించిన దానిని) త్రావుఁడు.

ఇరిమిఠిఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ ౨ఉ 3౧
౬౫౫. ఆ యాహి సుషుమాహి త ఇంద్ర సోమం పిబా ఇమం ఏదం బర్హి
౨ 3 ౧ ౨
స్సదో మమ॥

ఓ యింద్రా! నీవు రమ్ము నీకై మేము సోమమభిషవించితిమి గదా! ఆ యీ సోమమును పానము చేయుము. నీకొఱకుఁబరచిన యీ దర్భమీదఁగూర్చుండుము

౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3౧౨ ౨3౧ ౨
౬౫౬. ఆ త్వా బ్రహ్మ యుజా హరీ వహతా మింద్రకేశినా। ఉపబ్రహ్మా ణినశ్శృణు॥

ఓ యింద్రా! మంత్రముతోఁగూడినవియు, కేశములు=వెంట్రుకలు కలవియు, మోసుకొని పోవునవియు, హరియను నశ్వములు రెండును నిన్ను దోడ్తెచ్చునుగాక. నీవు మా యాగమునకు వచ్చి మా స్తుతిమంత్రములను వినుము.

3 ౧ ౨ 3 ౧ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౬౬౭. బ్రహ్మాణస్త్వా యుజావయుగ్ం సోమపామింద్ర సోమినః। సుతావన్తో హవామహే॥

బ్రాహ్మణులమయిన మేము యోగ్యమయిన స్తుతితోఁ సోమమును పానము చేయునట్టి నిన్ను బిలుచుచున్నాము.

విశ్వామిత్రఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నులు దేవతలు.

౧ ౨ 3 ౧౨ 3 ౨ 3౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౬౫౮. ఇంద్రాగ్నీ ఆగతగ్ం సుతం గీర్భిర్నభోవరేణ్యం। అస్యపాతం ధియేషితా॥

ఓ యింద్రాగ్నులారా! అభిషవించి సంస్కరింపఁబడిన శ్రేష్ఠమయిన యీ సోమమునద్దకు మాస్తుతివాక్యములతోఁ బిలువంబడిన వారగుచు స్వర్గమునుండి రండు. మాకర్మలచేఁ బ్రేరింపఁబడిన వారలయి మీరు ఈ సోమమును పానము సేయుఁడు.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౬౫౯. ఇంద్రాగ్నీ జరితుః సచా యజ్ఞో జిగాతి చేతనః। అయాపాత మిమగ్ం
౩ ౨
సుతం॥

ఇంద్రాగ్నులారా! స్తుతికర్తకు సహాయులరైన మిమ్ము యజ్ఞములు నడపుటకు సాధనమును ఇంద్రియములకుఁ జైతన్యము నిచ్చునదియునగు నీ సోమము చెందుచున్నది. మా యీ స్తుతివాక్యతోఁ బిలువంబడిన మీరు సంస్కరించిన యీ సోమమును ద్రావుఁడు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ర ౩ ౧ ౨
౬౬౦. ఇంద్రమగ్నిం కవిచ్ఛదా యజ్ఞస్య జూత్యా వృణే। తా సోమస్యేహ తృ
౩ ౧ ౨
మ్పతాం॥

యాగసాధనమైన సోమముచేతఁ బ్రేరింపఁబడిన నేను కవుల స్తోత్రములకు ఫలమునివ్వ సమీపించునట్టి యింద్రాగ్నులను మిమ్ము సేవింతును. ఈ మా యాగమునకు వచ్చిన మీరు సోమముతోఁ దృప్తులు కండు.

ఉత్తరార్చికమందుఁ బ్రథమాధ్యాయ ద్వితీయఖండము పూర్ణము.

## ౧ అధ్యాయము.

## ౩ ఖండము.

అమహీయు (ఆంగిరస) ఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౬౬౧. ఉచ్చా తే జాతమన్ధసో దివి సద్భూమ్యా దదే। ఉగ్రగ్ం శర్మ మహి శ్రవః॥

సోమమా! నీసంబంధమైన రసమునకు మీఁదిభాగమున జన్మ. ద్యులోకమందున్న నీయధిక సుఖము గొప్పది. అన్నము భూమిమీఁది వారిచేత స్వీకరింపఁబడుచున్నది.

౬౬౨. స న ఇన్ద్రాయ యజ్యవే వరుణాయ మరుద్భ్యః। వరివో విత్పరిస్రవ॥

ధనములభింపఁజేయు నో సోమమా! మేము పూజింపఁదగిన యింద్రుని కొఱకును, వరుణుని కొఱకును, మరుత్తుల కొఱకును ధారగాఁగారుము.

౬౬౩. ఏనా విశ్వాన్యర్య ఆ ద్యుమ్నాని మానుషాణాం। సిషాసన్తో వనామహే॥

మనుష్యుల యజ్ఞసాధనములైన ధనముల నో సోమమా! (నీయనుగ్రహము వల్ల) అభిముఖముగాఁ బొందుచున్న మేము సేవింపఁగోరి నిన్ను సేవించుచున్నాము.

కశ్యపఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౬౬౪. పునానః సోమ ధారయాపో వసానో అర్షసి। ఆ రత్నధా యోనిమృతస్య సీదస్యుత్సో దేవో హిరణ్యయః॥

సోమమా! వడపోయఁబడుచున్న నీవు ఉదకములను గప్పుకొనుచు (కలియుచునని తా॥) ధారగాఁబవిత్రమందుఁ గారుచున్నావు. పిమ్మట రమణీయ ధనముల నిచ్చునట్టి, ప్రకాశించునట్టి, చలువ గలట్టి, బంగారుతో నిండినట్టి నీవు యాగ స్థానమునందుఁ గూర్చొనుచున్నావు.

౩ ౧ ౨ర౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౨ ౩౨౩౧ ౨
౬౬౫. దుహాన ఊధర్దివ్యం మధుప్రియం ప్రత్నగ్ం సధస్థమాసదత్।
౩ ౧ ౨ ౩ ౨ ౨ ౩క ౨ర ౩౧౨ ౩ ౧ ౨ ౩ ౨
ఆపృచ్ఛ్యం ధరుణం వాజ్యర్షసి నృభిర్ధౌతో విచక్షణః॥

మదముకలిగించునది, ప్రియమయినది, ద్యులోకమునఁబుట్టినది, సోమలతయనెడు పొదుగు చేపుచున్న సోమము (అనఁగాఁబొదుగునుండి పాలుకారునట్లు లతనుండి రసముకారుచున్నదని తా॥) పురాతనమైయున్నట్టి యంతరిక్షస్థానము నందున్నది. పిమ్మట కర్మచేత నడుగంబడుచున్నట్టి, కర్మను ధరించియున్నట్టి, యజమానుని గూర్చి పోవుచున్నావు. అన్నవంతమగు నీవు ఓ సోమమా! ఋత్విజుల చేత శోధింపఁబడుచు సర్వదర్శివై అతని కన్నమీఁదలఁచి పోవుచున్నావు.

ఉశన (కావ్య) ఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత.

౧ ౨ర ౨౩౨ ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౨ ౨ర ౨ ౩ ౧ ౨
౬౬౬. ప్రతుద్రవ పరికోశం నిషీద నృభిఃపునానో అభివాజమర్ష। అశ్వంనత్వా
౩౧౨ ౩౧ ౩౧ ౨ ౩౧ ౨౩౧౨
వాజినం మర్జయన్తోఽచ్ఛాబర్హీ రశనాభిర్నయన్తి॥

ఓ సోమమా! శీఘ్రముగాఁబరువెత్తి (మా యాగమునకు) రమ్ము. (వచ్చి) ద్రోణకలశమందుండుము. ఋత్విజులచేత పిండి వడకట్టంబడిన దానవగుచు హవిస్సునుచేరుము. గుఱ్ఱమును దుడుచునట్లు నిన్ను మాటి మాటికి దుడుచుచున్న ఋత్విగ్యజమానులు మా యాగమునకు త్రేళ్లతోఁ (బట్టి) నిన్ను జేర్చుచున్నారు.

3 ౧ ౨ 3౧ ౨ర 3 ౨ 3 ౨ 3౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౬౬౭. స్వాయుధఃపవతే దేవ ఇందురశస్తిహా వృజనారక్షమాణః। పితా దేవానాం
3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3౧ ౨ 3 ౨
జనితా సుదక్షో విష్టంభో దివో ధరుణః పృథివ్యాః॥

మంచి యాయుధములు కలిగి ప్రకాశించు సోమము కారుచున్నది అదికష్టములనివారించునది. ఉపద్రవములను బరిహరించును. రక్షించునది, దేవతలనుబుట్టించుచుఁ బాలించునది, మంచి బలముగలది, ద్యులోకమును నిల్పునది, భూమిని బోషించునదియగుచుఁ గారుచున్నది.

౨3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ర 3 ౨ 3 ౧ ౨ ౧
౬౬౮. ఋషిర్విప్రః పుర ఏతా జనానామృభుర్ధీర ఉశనా కావ్యేన। సచిద్వివేద
3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ ౨ 3 ౨ 3 ౧ ౨
వేద నిహితం యదా సామపీచ్యాZ౩గుహ్యంనామ గోనాం॥

ఇంద్రియములకుఁ దెలియంబడని వాటింగూడఁ దెలిసికొనువాఁడు, మేధావంతుఁడు, మనుష్యులకు ముందునడచువాఁడు, మిగులఁ బ్రకాశించువాఁడు, బుద్ధిశాలియగు ఉశనర్షి యెవ్వఁడు కలఁడో అతఁడు స్తోత్రముచేత ఈ గోవుల సంబంధమయిన కనఁబడకుండ దాఁగియున్న, కాపాడఁదగిన, క్షీరమును ఎఱుంగును. (నామ= ఉదకము. మేఘములనెడు గోవులలోనున్న పాలవంటి నీరునుఅనితా॥)

ఉత్తరార్చికమునందుఁ బ్రథమాధ్యాయ తృతీయఖండము సంపూర్ణము.

౧ అధ్యాయము.

౪ ఖండము.

వశిష్ఠఋషి–బృహతీచ్ఛంద–ఇంద్రదేవత.

3౧ ౨ 3 ౧ ౨ 3౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ర
౬౬౯. అభిత్వా సూరనోనుమోZదుగ్ధా ఇవ ధేనవః। ఈశానమస్య జగతః
3 ౨ 3 ౧ ౨ 3౧ ౨
స్వర్దృశ మీశాన మింద్రతస్థుషః॥

పరాక్రమశాలివగు నిందా్ర! పాలు పితుకకుండనున్న యావులు అఱచు (దూడలను లాలించు) నట్లు చర స్థిరరూపజంతువుల కధికారివియు సర్వజ్ఞుఁడవు నగు నిన్ను మేము నుతించుచున్నాము

౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ర ౩
౬౭౦. నత్వావాగ్ం అన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే। అశ్వా
౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
యన్తో మఘవన్నింద్ర వాజినో గవ్యన్తస్త్వా హవామహే॥

ఓ యిందా్ర! ద్యులోకమందుఁ బుట్టిన నీతో సమానుఁ డితరుఁడెవఁడును బుట్టలేదు. భూమిమీఁదఁ బుట్టినవాఁడును లేడు. ఇంకమీఁదటఁ బుట్టుడుకూడను· అశ్వములం గోరుచు, నన్నముం గోరుచు, గోవులం గోరుచు, నున్న మేము ఓ యిందా్ర! నిన్ను ఆహ్వానించుచున్నాము. (=పిలుచుచున్నాము )

వామదేవఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨
౬౭౧. కయానశ్చిత్ర ఆభువ దూతీ సదావృధ స్సఖా। కయాశచిష్ఠయా
౩ ౨
వృతా।

ఎల్లప్పుడును వృద్ధినొందుచున్నట్టి, పూజనీయమయినట్టి, మిత్రుఁడయినట్టి, యిందు్రఁడు రక్షణము చేత మాకు అభిముఖుఁడగునుగాక. ప్రజ్ఞాసహితమైన యే కర్మచేత నభిముఖుఁడగునో?

౧ ౨ ౩౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩
౬౭౨. కస్త్వా సత్యో మదానాం మగ్ంహిష్ఠో మత్సదంధసః। దృఢా చిదారుజే
౧ ౨
వసు॥

పూజనీయము, సత్యమయినది, మదముగలిగించువాటిలో శ్రేష్ఠమయినది, యేది? (అని ప్రశ్న) (సోమరూపా)న్నముయొక్క రసము. (అని ఉత్తరము.) దృఢమయినదయినప్పటికి (శత్రువుల) ధనమును హరించుటకై నిన్ను మదింపఁజేయుఁగాక.

3౨ఉ 3౧ ౨ 3౨ ౨3 ౨ 3౧ ౨ 3 ౧ ౨
౬౭౩. అభీషూణస్సఖీనామవితా జరితౄణాం। శతంభవా స్యూతయే॥

ఓ యింద్రా! సఖులైన స్తుతికర్తలను రక్షించునట్టి నీవు పలుమార్లు రక్షణము కొఱకు బాగుగా సభిముఖుఁడవు కమ్ము.

నోధఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨3౧ ౨3౨3 ౧౨ 3 ౧ ౨ర 3౨3 ౧ ౨ర
౬౭౪. తంవోదస్మ మృతీషహం వసోర్మందాన మన్ధసః। అభివత్సం నస్వసరేషు
3౨3 ౧ ౨ 3౧౨
ధేనవ ఇంద్రం గీర్భిర్నవామహే॥

ఓ ఋత్విగ్యజమానులారా! చూడందగినవాఁడు, శత్రువుల నోడించువాఁడు, నివాసాధారమైన సోమపానముచేత మదించియున్నవాఁడు, మీ వాఁడును, (అనఁగా యాగసంబంధముచేత తమవాఁడనితా॥) అగు నింద్రుని స్తుతివాక్కులతో మేము దివసములందు, మందలందు గోవులు దూడ కెదురుగా నఱచునట్లు స్తుతించు చున్నాము.

3 ౨ 3 ౨ 3 ౧౨ 3౧ ౨ 3౧ ౨ర 3 ౧౨ 3 ౨
౬౭౫. ద్యుక్షగ్ం సుదానుం తవిషీభిరావృతం గిరింన పురుభోజసం। క్షుమం
3 ౧ ౨ 3౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర
తంవాజగ్ం శతినగ్ం సహస్రిణాం మక్షూగోమన్త మీమహే॥

కాంతిమంతుఁడు, లేక ద్యులోకవాసి, మంచిదాత, బలముతోఁగూడినవాఁడు, పలువురు యజమానులచేత భోజనము చేయింపఁబడువాఁడు, లేక పలువు రంబాలించువాఁడు నగు నింద్రుని (పుత్రాదిపరివారము) ధ్వనించునట్టి, పలువురు కలట్టి, లేక బహుధనములుగలట్టి, గోవులుకలట్టి యన్నమును శీఘ్రముగా (నిమ్మని) యాచించు చున్నాము.

కలిఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౬౭౬. తరోభిర్వో విదద్వసు మింద్రగ్ం సబాధ ఊతయే। బృహద్గాయన్త
స్సుత సోమే అధ్వరే హువేభరం నకారిణం॥

ఓ ఋత్విజులారా! మీరు వేగముతోఁ గూడినట్టి, ధనముపొందియున్నట్టి యింద్రుని బాధకలవారలై రక్షణముకొఱకు "బృహత్సామ" మును గానము చేయుచు సోమయాగమునందు స్తుతింపుఁడు. నేనును కుటుంబములోనివారు కుటుంబాధికారిని బిలుచునట్లు పిలుచుచున్నాను.

౬౭౭. నయందుధ్రా వరన్తే నస్థిరా మురో మదేషు శిప్రమన్ధసః। య ఆ
దృత్యా శశమానాయ సున్వతే దాతా జరిత్రఉక్థ్యం॥

మంచిదవుడలు కలవాఁడగు నింద్రుని బలవంతు (లయిన అసురులు) వారింపలేరు. దేవతలును వారింపలేరు. మర్త్యులుకూడ వారింపలేరు. ఏ యింద్రుఁడు సోమముయొక్క మదముకొఱకు ఆదరించి శాసించుచున్న అభిషవించుచున్న స్తుతికర్తకొఱకుఁ గొనియాడఁదగిన ధనమును ఇచ్చునో (ఆయింద్రుని యాహ్వానించుచున్నాను.)

ఉత్తరార్చికమునఁ బ్రథమాధ్యాయ చతుర్థఖండము పూర్ణము.

—*—

## ౧ అధ్యాయము.

### ౫ ఖండము.

విశ్వామిత్రపుత్ర-మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-సోమ దేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨
౬౭౮. స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వసోమ ధారయా। ఇంద్రాయ పాతవే
3 ౨
సుతః ॥

ఓ సోమమా! యింద్రుని పానమునకు నభిషవించిన నీవు మిగులమదము గలిగించునట్టి, మిక్కిలిరుచిగలట్టి, ధారతో స్రవించుమా!

3 ౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ ౧ ౨ 3 ౨ 3 ౧
౬౭౯. రక్షోహా విశ్వచర్షణి రభియోని మయోహతే। ద్రోణే సధస్థమా
౨
సదత్ ॥

రాక్షసులఁజంపునది, సర్వముంజూచునది, యగు సోమము బంగారు (చేతిలోఁబట్టుకొని) యభిషవించిన ద్రోణకలశముతోఁగూడిన అభిషవస్థానమునందున్నది.

3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౧ ౨
౬౮౦. వరివోధాతమో భువో మగ్ం హిష్ఠో వృత్రహన్తమః। పర్షి రాధో మ
౧ ౨
ఘోనాం॥

మిగుల ధనములనిచ్చు సోమమా! దాతలలో శ్రేష్ఠముగుదానవుకమ్ము. శత్రువులంగట్టిగాఁగొట్టుము. ధనవంతులైన శత్రువుల ధనమును దెచ్చిమాకునిమ్ము.

గౌరవీతిఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్ర దేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧
౬౮౧ పవస్వ మధుమత్తమ ఇంద్రాయ సోమ క్రతువిత్తమో మదః। మ
౨ 3 ౧ ౨ 3 ౧ ౨
హిద్యుక్షతమో మదః ॥

సోమమా! అతిమధురమైన నీవు ఇంద్రునికొఱకు మదకరమైన దానవగుచుఁ గారుము. నీవు మిగులఁ బ్రజ్ఞను గలిగించునట్టి, పూజ్యమగునట్టి, మిగుల కాంతిగలట్టి మదముగలిగించునట్టి దానవు.

౬౮౨. యస్య తే పీత్వా వృషభో వృషాయతేఽస్య పీత్వా స్వర్విదః। సను ప్ర
కేతో అభ్యక్రమీదిషోఽచ్ఛా వాజం నైతశః॥

కోర్కెల వర్షించు నింద్రుఁడు సోమమా! యే నిన్నుద్రావి వృషభమువంటి వాఁడగుచున్నాఁడు. (శత్రులనణఁచు శక్తిగలవాఁడనిభా॥) సర్వజ్ఞమగు నీపానము చేయఁగా మంచిప్రజ్ఞకల యింద్రుఁడు అశ్వము యుద్ధమునకు నడచునట్లు హవిస్సులనుగూర్చి నడచుచున్నాఁడు

అత్రిఋషి-ఉష్ణిక్ఛందము-ఇంద్రిదేవత.

౬౮౩. ఇన్ద్రమచ్ఛ సుతా ఇమే వృషణం యన్తు హరయః। శ్రుష్టే జాతాస
ఇన్దవః స్వర్విదః॥

శీఘ్రముగాఁబుట్టిన సోమములు పాత్రలందుఁ గారుచున్నవి. సర్వజ్ఞములు, ఆకుపసరురంగుగలవి, అభిషవింపఁబడినవి యగు నీ సోమములు వర్షించువాఁడగు నింద్రునకభిముఖముగాఁ బోవునుగాక.

౬౮౪. అయం భరాయ సానసి రిన్ద్రాయ పవతే సుతః। సోమో జైత్రస్య
చేతతి యథా విదే॥

యుద్ధమునకు సేవింపఁదగిన, యభిషవించిన, యీ సోమము ఇంద్రునికొఱకు

ప్రవించుచున్నది. పిమ్మట సోమము జయశీలుండయిన యింద్రుని లోకులచేత నెట్లు తెలియఁబడుచున్నాఁడో అట్లు తెలియుచున్నది.

౯౮౫. అస్యేదింద్రో మదేశ్వాగ్రాభం గృభ్ణాతి సానసిం। వజ్రంచవృషణం భరత్సమప్సు జిత్॥

ఈ సోమముయొక్క మదములు కలిగినపుడు అందఱు సేవింపఁదగినట్టి, గ్రహింపఁదగినట్టి, ధనుస్సు ఇంద్రుఁడు పట్టుకొనుచున్నాఁడు. ఉదకముకొఱకు వృత్రుని జయించిన యింద్రుఁడు వర్షములకురియించు వజ్రాయుధమును ధరించుచున్నాఁడు.

శ్యావాశ్వఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత

౯౮౬. పురోజితీవో అన్ధసః సుతాయ మాదయిత్నవే। అపశ్వానగం శ్రథిష్టన సఖాయో దీర్ఘజిహ్వ్యం॥

ఓ స్నేహితులగు స్తుతికర్తలారా! మీరు జయమును ముందుఁబెట్టుకొనునట్టి సోమముయొక్క యభిషవించినది, మదముకలిగించునది యగు రసము కొఱకుఁ బొడవయిన నాల్క చాచిన కుక్కను దూరముగాఁగొట్టివేయుఁడు. (కుక్కయనఁగా రాక్షసులని యర్థముకూడఁగలదు.)

౯౮౭. యోధారయా పావకయా పరిప్రస్యందతే సుతః। ఇందురశ్వో నకృత్వ్యః॥

అభిషవించినట్టి, పనినిసాగించునట్టి సోమము పాపములను శుద్ధిచేయుధారతో అశ్వము పరువెత్తునట్లు ప్రస్రవించుచున్నది.

౯౮౮. తం దురోష మభీనరః సోమం విశ్వాచ్యాధియా। యజ్ఞాయ సంత్వద్రయః

ఓ ఋత్విజులారా! ఛేదింపశక్యముగాని లేక దహింపశక్యముకాని సోమము నంతను లభింపఁజేయునట్టి, కామములను సఫలము చేయునట్టి, బుద్ధితో యజ్ఞము కొఱకు ఆదరముకలవారలు కింపుడు

కవిఋషి-జగతీచ్ఛంద-ఇంద్ర దేవత.

3౨ 3౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౨ 3
౬౮౯. అభి ప్రియాణి పవతే చనోహితో నామాని యహ్వో అధి యేషు
౧౨ ౧ ౨ర 3 ౨ 3 ౨ఉ 3 ౨ 3 ౧ ౨
వర్ధతే। ఆసూర్యస్య బృహతో బృహన్నధి రథం విష్వంచ మరుహ
3 ౨
ద్విచక్షణః॥

అన్నమున కుపయోగించునట్టి సోమము లోకములకుఁ బ్రియములైన యుదకముల కభిముఖముగాఁగారుచున్నది. (ఉదకములో సోమరసముకలుపుదురు) అంతరిక్షమందున్న యే యుదకములందు గొప్పదయిన యీ సోమము వృద్ధినొందుచున్నది. గొప్పదయిన సోమము ప్రభువయిన సూర్యునియొక్క సర్వత్ర గమనముంగూర్చి రథముమీఁద సర్వముఁ జూచుచున్నదై యెక్కుచున్నది.

3౧ ౨ 3౧ ౨3 ౧౨3 ౨ 3౧ ౨ర3 ౨ 3 ౧ ౨ర
౬౯౦. ఋతస్య జిహ్వా పవతే మధుప్రియం వక్తాపతిర్ధియో అస్యా అదాభ్యః।
౧౨ 3 ౨ 3 ౧ ౨3 ౨ ౧ ౨ 3 ౨3 ౧౨ 3౨ 3౨
దధాతి పుత్రః పిత్రోరపీచ్యాఽ౩ న్నామ తృతీయ మధిరోచనం దివః॥

సత్యమయినట్టి యజ్ఞముయొక్క నాల్క (అనఁగా ముఖ్యమయినదనితా॥) యగు సోమము ప్రియకరమైన, మదకరమయినరసమునుధ్వనించుచు, (గర్మను బాలించుచు శత్రువులకు లొంగనిదయి కార్చుచున్నది. యజమానుఁడు తల్లిదండ్రుల యొక్క అణఁగియున్న నామమును ధరించును. ద్యులోకమును ప్రకాశింపఁజేయు మూఁడవనామమును సోమము భిషవించునపుడు ధరించుచున్నాఁడు. (పుట్టినపుడు తండ్రి నక్షత్రనామము. వ్యావహారికనామము చేయును. సోమయాగకాలమందు సోమయాజియని మూఁడవనామము కల్గుననితా॥ )

౧౨ ౩ ౨ ౩౧౨ ౩౧౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩౧ ౨
౬౯౧. అవద్యుతానః కలశగ్ం అచిక్రదన్నృభిర్యమాణః కోశ ఆ హిరణ్యయే।
౩౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩౨౩ ౧౨
అభీఋతస్య. దోహనా అనూషతాధి త్రిపృష్ఠ ఉషసో విరాజసి॥

ఋత్విజులచేత బంగారుతోఁగూడిన అధిషవణ చర్మమందు (తోలుసంచి) (బంగారము చేతంబట్టుకొని సోమముపిండవలె) పోయంబడినసోమము ద్రోణకలశము లందు ధ్వనించుచున్నది. పిమ్మట సత్యస్వరూపమయిన యాగమును బిదుకునట్టి ఋత్విజులు (యజ్ఞముగోవు. దానిఫలములు క్షీరములు. పిదుకుట=సంపాదించుట యనితా॥) ఈ సోమమును స్తుతించుచున్నారు. మూఁడుసవనములు వీపులుగాఁగల ఓ సోమమా! అట్టినీవు ప్రభాతకాలమందుఁ బ్రకాశించుచున్నావు.

తృణపాణి-శంయుఋషి-బృహతీచ్ఛంద-అగ్ని దేవత.

౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౧ ౨౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౬౯౨. యజ్ఞా యజ్ఞావో అగ్నయేగిరాగిరాచ దక్షసే। ప్రప్రవయ మమృతం జాతవేదసం ప్రియం మిత్రన్నశగ్ంసిషం॥
౨ ౩ ౩ ౩ ౧ ౨ర

ఓస్తుతికర్తలారా! మీరు సర్వయాగములందు వృద్ధినొందిన యగ్నికొఱకు స్తుతిరూపమయిన ప్రతివాక్కుతోను స్తుతింపుఁడు. మేమును ప్రియమిత్రునివలె నగ్నిని స్తుతింతుము.

౩ ౧ ౨ర౩ ౨ ౩౧ ౨౫ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౬౯౩. ఊర్జో న పాతగ్ం సహినాయ మస్మయుర్దాశేమ మహవ్యదాతయే॥
౨౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩౧ ౨
భువద్వాజేష్వవితా భువద్వృధ ఉతత్రాతా తనూనాం॥

అన్నమునకు లేక బలమునకుఁబుత్రుఁడయిన యగ్నిని స్తుతించుచున్నాము. ఈయగ్ని మమ్ముఁగోరుచున్నాఁడు. మేమును (దేవతలకు) హవిస్సునిచ్చు నగ్ని కొఱకు హవిస్సులిచ్చుచున్నాము. ఆయగ్ని యుద్ధములందు రక్షించును. మమ్ము వృద్ధినొందించు వాఁడగుఁగాక. మఱియు మాపుత్రులను రక్షించువాఁడునగుంగాక

భరద్వాజఋషి-గాయత్రీచ్ఛంద-అగ్నిదేవత.

౨౩ ౧ ౨ర౩ ౧ ౨ ౩౧ ౨౩ ౧౨ ౩౧౨ ౩ ౧౨
౬౯౪. ఏహ్యూషు బ్రవాణితే౽గ్న ఇత్థేతరాగిరః। ఏభిర్వర్ధాస ఇందుభిః॥

ఓ యగ్నీ! రమ్ము. నీకొఱకుస్తుతివాక్కుల నీవిధము బాగుగాఁజెప్పెదనుగాక. (నీవువినుము) వచ్చి యీ సోమముతో వృద్ధిఁబొందుము.

౨ ౩క ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨౩ ౧ ౨
౬౯౫. యత్రక్వచ తేమనో దక్షందధస ఉత్తరం। తత్రాయోనిం కృణవసే॥

ఓ యగ్నీ! నీయొక్కమనస్సు ఏచోట నే యజమానునందు నుండునో యా యజమానుఁడు అతిశయమయిన బలకరమైన యన్నముచు ధరించును.

౧ ౨ర ౩ ౧ ౨౩ ౧ ౨ర ౨ ౩ ౧ ౨
౬౯౬. నహితే పూర్తమక్షిపద్భువన్నే మానాంపతే। అథాదువోవనవసే॥

ఓ యగ్నీ! నీయొక్క నిండుతేజస్సు కన్నులపాపమును దొలగించును. కొంత మందికి (అనఁగా యాగముచేసిన వారికే) పతియగువాఁడా! పవిత్రమగువాఁడా! ఆ కారణమువల్ల మా సేవను స్వీకరింపుము.

సౌభరిఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౩౨ ౩౧ ౨ ౩ ౨ర ౩ ౧౨ ౩౧ ౨ ౧ ౨ ౩౧
౬౯౭. వయముత్వామపూర్వ్యస్థూరం న కంచిద్భరన్తో౽వస్యవః। వజ్రించిత్రగ్ం హవామహే॥

క్రొత్తగాగనఁబడువాఁడా! (ఏసవనముకాసవనమందు వచ్చునుకనుక నెప్పటి కప్పుడే క్రొత్త) వజ్రముధరించినవాఁడా! యింద్రా! (హవిస్సులతోనిన్ను) బోషించుచున్న మేము వివిధరూపుఁడవైన నిన్నే రక్షణమునుగోరుచున్న వారమై గృహస్థులు గుణవంతుఁడయిన యతిథిని బిలిచి (గౌరవించు) నట్లు పిలుచుచు (గౌరవించు) చున్నాము.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౧
౬౯౮. ఉపత్వా కర్మన్నూతయే సనోయువోగ్రశ్చక్రామయో ధృషత్। త్వా
౨ర౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
మిద్ధ్యవితారం వవృమహే సఖాయ ఇంద్రసానసిం॥

ఓ యింద్రా! (అగ్నిహోత్రాది) కర్మలందు రక్షణముకొఱకు నిన్ను సమాశ్రయించుచున్నాము. ఏ యింద్రుఁడు శత్రువులఁదిరస్కరించువాఁడును, యౌవనవంతుఁడును, అతిబలశాలియు నగుచున్నాఁడో ఆయింద్రుఁడు మమ్మును జేరుంగాక. సఖులమయిన మేము బంధువుఁడవయిన నిన్నే సేవించుచున్నాముగదా!

నృమేధఋషి-కకుప్ఛందము-ఇంద్రదేవత.

౨౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౬౯౯. అధాహీంద్రా గిర్వణ ఉపత్వా కామ ఈమహేస స్సృగ్మహే। ఉదే
౩ ౧ ౨ ౩ ౧ ౨
వగ్మన్త ఉదభిః॥

వాక్కులకు వశమయిన యింద్రా! యిప్పుడుకదా నిన్ను కోరినయిష్టము (నిమ్మని) ప్రార్థించుచున్నాము. లేక స్తోత్రములతో నిన్ను నీటిలో విహరించువారు తనవద్దనున్నవారిమీఁద (దోసిళ్లతో) నీరుచల్లునట్టు ముంచుచున్నాము. (స్తోత్రములతో ముంచుటయనఁగా నధికముగా స్తుతించుటయనితా॥)

౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౭౦౦. వార్ణంత్వా యవ్యాభిర్వర్ధన్తి శూరబ్రహ్మాణి। వావృధ్వాగ్ం సంచి
౩ ౧ ౨
దద్రివో దివే దివే॥

వజ్రాయుధముకలవాఁడా! శూరుఁడా! ఉదకములుండుతావును (చెఱువు మొదలగువానిని) నదులతో నింపునట్లు స్తుతులతో వృద్ధినొందు నిన్ను బ్రతిదినము స్తుతికర్తలు వృద్ధి నొందించుచున్నారు.

3 ౨3౧ ౨ 3౨3 ౧ ౨ 3 ౧ ౨ర 3౧౨ 3 ౧ ౨
౭౦౧. యుంజన్తిహరీ ఇషిరస్య గాథయో రౌరథ ఉరుయుగే వచోయుజా॥
3 ౧ ౨ 3 ౧ ౨
ఇన్ద్రవాహా స్వర్విదా॥

గమనశీలుఁడైన యింద్రుని యొక్క (ఒకప్పుడైన నిలిచి యుండని వాఁడుగ మనశీలుఁడు) వాహనములై మాట మాత్రముననే రథమును (తమంత)పూన్చుకొను నట్టి, గొప్ప కాడిని వహించినట్టి, స్వర్గము నెఱింగినట్టి హరియను రెండు గుఱ్ఱాలను స్తోత్రముతో స్తుతికర్తలు పూన్చుచున్నారు.

ఉత్తరార్చికమందుఁ బ్రథమాధ్యాయమున పంచమఖండము పూర్ణము
అధ్యాయమును సమాప్తము.

—:o:—

## ౨ అధ్యాయము.

### ౧ ఖండము.

శ్రుతకక్షఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౭౦౨. పాన్తమావో అన్ధస ఇన్ద్రమభి ప్రగాయత। విశ్వాసాహగ్ం శతక్రతుం మగ్ంహిష్ఠం చర్షణీనాం॥

ఓ ఋత్విజులారా! సోమరూపమయిన మీ యన్నమును పానము చేయుచున్నవాఁడు, సమస్తశత్రువులను జయించువాఁడు, కనుకనే బహువిధ ప్రజ్ఞలు కలవాఁడు, మనుష్యులకు ధనమునిచ్చువాఁడు నగు నింద్రుని బిగ్గఱగా స్తుతింపుడు.

౭౦3. పురుహూతం పురుష్టుతం గాథాన్యా3గ్ం సనశ్రుతం ఇంద్రఇతి బ్రవీతన॥

ఋత్విగ్యజమానులారా! (యజ్ఞములందు) పలువురచేతఁ బిలువఁబడినవాఁడు, బహువిధముల స్తుతింపఁబడువాఁడు, గానము సేయందగినవాఁడు, చాలకాలము నుండి ప్రసిద్ధుఁడు నగు (దేవుని) ఇంద్రుఁడని మీరు పలుకుఁడు.

౭౦౪. ఇంద్ర ఇన్నో మహోనాం దాతా వాజానాం నృతుః। మహాగ్ం అభిజ్ఞ్వాయమత్॥

ఇంద్రుఁడే అంతటినాడించువాఁడు, ధనములతోఁగూడిన యన్నముల నిచ్చువాఁడు, గొప్పవాఁడు. ఆతఁడు మా యభిముఖుఁడై (ధనాదుల) నిచ్చుఁగాక.

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛంద-ఇంద్రదేవత. ౨వ తృచ.

౭౦౫. ప్రవ ఇంద్రాయ మాదనగ్ం హర్యశ్వాయ గాయత। సఖాయః సోమపావ్నే.

ఓ నేస్తులారా! (స్తుతికర్తలకు సంబోధన) మీరు హరియను గుఱ్ఱములు కలవాఁడు, సోమపానము చేయువాఁడు నగు నింద్రునకు మదముగలిగించు స్తోత్రమును బాగుగాగానము చేయుఁడు.

౨౦౬. శగ్ంసేదుక్థగ్ం సుదానవ ఉతద్యుక్షం యథానరః। చకృమా సత్యరాధసే॥

మఱియు నో స్తుతికర్తా! మంచిదాతయు, సత్యమయిన ధనము కలవాఁడు నగు నింద్రునికై యితర స్తుతికర్తలెట్లు దీప్తిమంతమగు స్తుతినిజేతురో యట్లు నీవును బఠించుము. మేమును స్తుతింతుము.

౨౦౭ త్వం న ఇంద్ర వాజయుస్త్వం గవ్యుశ్శతక్రతో। త్వగ్ం హిరణ్యయుర్వసో॥

ఓ యింద్రా! నీవు మా యన్నమును (అనఁగా హవిస్సును) కోరినవాఁడవు కమ్ము. బహువిధకర్మలాచరించు నో యింద్రా! నీవు మాకు గోవులను గోరువాఁడవుకమ్ము. నివాస హేతువగువాఁడా! బంగారును మాకుఁగోరువాఁడవు కమ్ము.

మేధాతిథిఋషి లేక ప్రియమేధుఁడు-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౩ తృచ

౨౦౮. వయముత్వా తదిదర్థా ఇంద్రత్వాయన్త స్సఖాయః। కణ్వా ఉక్థేభిర్జరన్తే॥

ఓ యింద్రా! నిన్నుంగోరిన స్నేహితులమగు మేము నీస్తుతియే ప్రయోజనముగాఁగల వారమయి నిన్ను స్తుతించుచున్నాము కణ్వగోత్రమందుఁబుట్టిన మావారలు స్తుతిమంత్రములతో నిన్ను స్తుతించుచున్నారు.

౨౦౯. నఘేమన్యదా పపన వజ్రిన్నపసో నవిష్టౌ। తవేదుస్తోమైశ్చికేత॥

వజ్రముకల యింద్రా! కర్మవంతుఁడవైన నీ క్రొత్తయాగమందు నున్న నేను ఇతర స్తోత్రమును బఠించను. నీయొక్క స్తోత్రమునే యెఱుంగుదును. (స్తుతింతునని తా॥)

౨౧౦. ఇచ్ఛన్తి దేవాః సున్వన్తం నస్వప్నాయ స్పృహయన్తి। యన్తిప్రమాద మతన్ద్రాః॥

సోమాభిషవము చేయుచున్న యజమానుని దేవతలు అందఱు రక్షింపఁగోరు చున్నారు. నిద్రనుగూడఁ గోరరు. (తదేక ధ్యానముతో నున్నారని తా।) కనుక సోమరితనము లేనివారయి దేవతలు మదముకలిగించు నీ సోమమును శీఘ్రముపొందు చున్నారు.

శ్రుతకక్షఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౪ తృచ.

౨౧౧. ఇంద్రాయ మద్వనేసుతం పరిష్టోభన్తు నోగిరః। అర్కమర్చన్తుకారవః॥

మదించుస్వభావముకల యింద్రుని కొఱకు నభిషవింపంబడిన సోమమును మాస్తుతివాక్కులు సర్వవిధముల స్తుతించుఁగాక. పిమ్మట స్తుతికర్తలు పూజార్హ మగు సోమమును బూజింత్రుగాక.

౨౧౨. యస్మిన్విశ్వా అధిశ్రియోరణన్తి సప్తసగ్ం సదః। ఇంద్రగ్ం సుతే హవామహే।

ఏ యింద్రునందు సర్వకాంతులు అధికముగా నున్నవో, ఏడ్వురు ఋత్విజులు నెవని విషయమున ధ్వనించుచున్నారో (స్తుతించుచున్నారని తా॥) అట్టి యింద్రుని సోమమభిషవింపఁగానే మేము (సోమపానమునకు) పిలుచుచున్నాము.

౭౧౩. త్రికద్రుకేషు చేతనం దేవాసో యజ్ఞమత్నత। తమిద్వర్ధన్తు నోగిరః॥

దేవతలు త్రికద్రుకములను పేరుగల (జ్యోతి-గో-ఆయు అని మూఁడు) దినములందు యజ్ఞము నాచరించిరి. ఆయజ్ఞమును మా స్తుతివాక్యములు వృద్ధినొందించుఁగాక.

ద్వితీయాధ్యాయమున ప్రథమఖండము సంపూర్ణము.

—*।*—

౨ అధ్యాయము,

౨ ఖండము.

ఇరిమిఠఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౧ తృచ.

౭౧౪. అయంత ఇంద్రసోమో నిపూతో అధిబర్హిషి। ఏహీమస్య ద్రవాపిబ॥

ఓ యింద్ర! నీ కొఱకు ఈ సోమము (వేదియందుఁబరచిన) దర్భలందు బాగుగ దశాపవిత్రమునుండి వడకట్టిన యిప్పటి యీ సోమమునుగూర్చి రమ్ము. (వచ్చి) త్రావుము.

౭౧౫. శాచిగో శాచిపూజనాయగం రణాయ తే సుతః॥ ఆఖణ్డల ప్రహూయసే॥

సమృద్ధములయిన గోవులు (గో=కిరణములనికూడ నర్థముకలదు.) ప్రసిద్ధమయిన స్తుతులుకలవాఁడా! నీ సంతోషముకొఱకు ఈ సోమము అభిషవింపఁబడెను. కనుక ఓ శత్రువుల సంహారించువాఁడా! యింద్రుఁడా! గొప్పస్తుతులచేతఁ బిలువఁబడుచున్నావు.

౭౧౬, యస్తేశృఙ్గవృషోణ పాత్ప్రణపాత్కుణ్డపాయ్యః। న్యస్మిన్ దధ్ర ఆమనః॥

(నపాత్=కొడుకు) శృంగవృషుని కొమారుఁడా! ఈ ఋషికి నింద్రుఁడు కొడుకై పుట్టినాఁడనికథ. ఇంకొకర్థముకూడఁగలదు. శృంగ=కిరణములు వృష=వర్షించు కిరణములద్వారా వర్షముకురియించువాఁడు. సూర్యుఁడు. సూర్యుని స్వస్థానమందు నిల్పిన యింద్రా! అని తా॥) ఇంద్రా! నిన్ను నిలువఁబెట్టినది, కుండపాయ్యా అను క్రతువు=యజ్ఞము. ఆయజ్ఞమందు కుండపాయ్యులనెడు ఋషులు మనస్సు నుంచిరి, (అనఁగా ఆయజ్ఞ మాచరించిరని తా॥)

కుసీదీఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౩ తృచ.

౭౧౭. ఆతూన ఇంద్రక్షుమన్తం చిత్రంగ్రాభగ్ం సంగృభాయ। మహాహస్తీ దక్షిణేన॥

ఓ యింద్రా! నీవు గొప్పచేతులుకలవాఁడవు. మాకొఱకుస్తుతింపఁదగిన, సంపాదింపఁదగిన, గ్రహింపఁదగిన, ధనమును కుడిచేతితో శీఘ్రముగా నభిముఖమగునట్లు చేయుము.

౭౧౮. విద్మాహిత్వా తువికూర్మిం తువిదేష్ణం తువీమఘం। తువిమాత్రమవోభిః॥

ఓ యింద్రా! నిన్ను నెఱుంగుదుముకదా! పలుపనులు నెఱవేర్చువాఁడవు, చాలగానివ్వఁదగినవాఁడవు, అధికధనము కలవాఁడవు, అనేకవిధరక్షణములు కలవాఁడవునని ఎఱుంగుదుము.

౭౧౯. నృభిర్ధౌత స్సుతో అశ్నైరవ్యావారైః పరిపూతః। అశ్వో న నిక్తో నదీషు॥

ఋత్విజులచేత శుభ్రపఱచఁబడినది, తర్వాత శిలలతోఁబిండఁబడినది, అటు తర్వాత గొఱ్ఱెవెండ్రుకల వస్త్రముపై వడకట్టఁబడినది, తర్వాత ధ్వనించుచున్న యుద

కములలో అశ్వమువలెఁ దడుపఁబడినది యగు నే సోమముకలదో (అట్టి సోమమని పూర్వబుఋక్కున కన్వయము.)

౭౨౦. తం తేయవం యథాగోభిః స్వాదుమకర్మశ్రీణన్తః ఇంద్రత్వాస్మింత్సధమాదే।

పూర్వము చెప్పఁబడిన సోమము నో యింద్రా! నీకొఱకు పిండితోఁ జేసిన పురోడాశమునువలెను గోక్షీరాదులతోఁ గాచి రసవంతముగా నొనరించితిమి. కనుక నో యింద్రా! నిన్నా సోమమును పానము చేయ నీయాగమందుఁ బిలుచుచున్నాము.

ఇట్లు ఉత్తరార్చికమున ద్వితీయాధ్యాయ ద్వితీయఖండము పూర్ణము.

——:o:——

## ౨ అధ్యాయము.

### ౩ ఖండము.

విశ్వామిత్రఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౧ తృచ

౭౨౧. ఇదగ్ం హ్యన్వోజసా సుతగ్ం రాధానాంపతే। పిబాత్వా౩స్య గిర్వణః॥

ఓ ధనపతీ! స్తుతులతో వశపఱచుకొనఁదగువాఁడా! యింద్రా! బలముతో జాగరూకుఁడవయి నీవు ఈ వరుసగా నభిషవించిన యీసోమమును శీఘ్రము పానము చేయుము.

౭౨౨. యస్తే అను స్వధామ సత్సుతే నియచ్ఛ తన్వం। సత్వామమత్తుసోమ్య॥

ఓ యింద్రా! నీకొఱకు నే సోమము అన్నముకూడఁబెట్టి శిలలతోఁ బిండఁబడినదియయ్యెను. ఆ సోమమభిషవించఁగానే స్వశరీరమును ప్రేరించుము. (రమ్మని తా॥) ఓ సోమార్హుఁడా! ఆ సోమము నిన్ను మదింపఁజేయుఁగాక.

౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౧ ౨ 3
౨౮౪. ప్రతే అశ్నోతు కుక్ష్యోః ప్రేంద్ర బ్రహ్మణాశిరః ప్రబాహూ శూర

౧ ౨
రాధసా॥

ఓ యింద్రుఁడా! ఆ సోమము కడుపురెండుప్రక్కలందు బాగుగ వ్యాపించుఁగాక. స్తుతులతోఁగూడిన యీ సోమము నీ శరీరమునందు వ్యాపించుఁగాక. శూరుఁడా! ధననిమిత్తము నీ బాహువులు పనిచేయుఁగాక.

౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨ 3 ౧ ౨
౮౨౪. ఆత్వేతా నిషీదతేంద్ర మభిప్రగాయత। సఖాయ స్తోమ వాహసః॥

ఓ సఖులారా! (ఋత్విజులు) శీఘ్రమీకర్మలోనికిరండు. కూర్చొనుఁడు. ఇంద్రుని స్తుతులను బఠించువారు మీరుకండు.

3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨
౮౨౫. పురూతమం పురూణామీశానం వార్యాణాం॥ఇంద్రగ్ం సోమే సచాసుతే।

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర
౮౨౬. సఘానో యోగ ఆభువత్సరాయే సపురన్ధ్యా॥ గమద్వాజేభిరాసనః॥

ఆ యింద్రుఁడే మా యోగము విషయమై (రక్షణ యని తా॥)అభిముఖుఁడగును గాక. అతఁడే ధనము కొఱకును అభిముఖుఁడగునుగాక. స్త్రీవిషయముగూడ అభిముఖుఁడగును గాక. అతండే యన్నములతో మమ్ముంగూర్చి వచ్చుంగాక.

శునశ్శేఫఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. 3 తృచ.

౧ ౨ 3 ౧ ౨3 ౧ ౨ ౧ ౨ 3
౮౨౭. యోగే యోగే తవస్తరం వాజే వాజే హవామహే। సఖాయ

౧ ౨ 3 ౧ ౨
ఇంద్రమూతయే॥

ఆయా కర్మప్రారంభములందు (కర్మవిఘాతకులతోఁ జేయు) ప్రతియుద్ధమం

దను మిక్కిలి బలవంతుఁడైన యింద్రుని రక్షణము కొఱకు సఖులవలె (బ్రియుల మయిన) మేము పిలుచుచున్నాము.

౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర ౨ 3 ౧ ౨
౨౨౮. ఉను ప్రత్న స్యౌకసో హువే తువిప్రతి నరం। యం తే పూర్వం
3 ౧ 3 ౨
పితా హువే॥

పురాతన స్థానమగు స్వర్గమునుండి యనేక యజమానుల వద్దకుఁ బోవునట్టి పురుషుఁడగు నింద్రుని వరుసగాఁ (గర్మలలో) నాహ్వానించుచున్నాము. ఏ నిన్ను పూర్వము మా తండ్రి (కర్మకాలమందు) పిలిచెనో (అట్టినిన్ను.)

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౨౨౯. ఆఘాగమద్యదిశ్రవత్సహస్రిణీ భిరూతిభిః। వాజేభిరుపనోహవం॥

మా యాహ్వానము నీ యింద్రుఁడు వినెనా యపుడే యనేక రక్షణములతో నన్నములతో సమీపమునకు అవశ్యము వచ్చును.

నారదఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత. ౮ తృచ.

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3ఉ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨
౨౩౦. ఇంద్రసుతేషు సోమేషు క్రతుం పునీష ఉక్థ్యం। విదే వృధస్య దక్షస్య
3 ౨
మహాగ్ం హిషః॥

సోమములభిషవింపఁబడఁగా నింద్రా! నీవు వాటింద్రావి యాగకర్తను, ఉక్థ్య యనుపేరుగల యాగమును బవిత్రముచేయుచున్నావు. (ఏలనంటే) వృద్ధినిబొందించు బలముయొక్క లాభమునకు. అట్టినీవు మహానుభావుఁడవుకదా!

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧
౨౩౧. సప్రథమే వ్యోమని దేవానాగ్ం సదనే వృధః। సుపార స్సుశ్ర
౨ 3 ౧ ౨ 3 ౨
వస్తమః సమప్సుజిత్॥

ఆ యింద్రుఁడు విశాలమయిన యంతరిక్షమనెడు దేవగృహమందు (అనఁగా స్వర్గమందు) ఉన్నవాఁడగుచు యాగకర్తలను వృద్ధినొందించును. ప్రారబ్ధకర్మ నుండి బాగుగ దాటించును. మంచియన్నముగలవారిలో శ్రేష్ఠుఁడు-ఉదకముల నావరించిన (వృత్రాదు) లను బాగుగా జయించువాఁడు (నగు నాయింద్రునాహ్వానించుచున్నాను అని ఉత్తరమున కన్వయము)

౭౩౨. తము హువే వాజసాతయ ఇంద్రం భరాయ శుష్మిణం। భవానః సుమ్నే అన్తమః సఖావృధే॥

బలవంతుఁడైన యా యింద్రుచే అన్నలాభముగల యుద్ధములలో (అనఁగా సస్యములను విరివిచేసికొను సందర్భమున ననితా॥) లేక యాగమువిషయమై పిలుచుచున్నాను. ఇంద్రా! నీవు ధనములేక సుఖము కావలసినప్పుడు మా దగ్గఱనున్న వాఁడవగుచు మా వృద్ధికొఱకు సఖుఁడవునుగమ్ము.

ఇట్లు ఉత్తరార్చికమున ద్వితీయాధ్యాయ తృతీయఖండము పరిసమాప్తము.

౨ అధ్యాయము.

౪ ఖండము.

వసిష్ఠఋషి-బృహతీచ్ఛంద-అగ్ని దేవత. ౧ ప్రగాథ.

౭౩౩. ఏనావో అగ్నిం నమసోర్జో నపాతమాహువే। ప్రియంచేతిష్ఠ మరతిగ్ం స్వధ్వరం విశ్వస్య దూత మమృతం॥

(రెండుమంత్రాలకు ప్రగాథయనిపేరు మూఁడిటికిత్రృచ) బలమునకుఁబుత్రుఁడు ప్రియుఁడు, బాగుగాఁదెలిసినవాఁడు, గమనస్వభావుఁడు, యాగమును జక్కగాసాగిం

చువాఁడు, సకలయాగకర్తలకును దూతయగువాఁడు, నిత్యుఁడు నగు నగ్నిని యీ స్తోత్రముతో ఓ ఋత్విగ్యజమానులారా! మీా కొఱకుఁబిలుచుచున్నాను.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౨
౨౩౪. సయోజతే అరుషా విశ్వభోజసా సదుద్రవత్స్వాహుతః॥ సుబ్రహ్మాయజ్ఞ
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨
స్సుశమీా వసూనాం దేవగ్ం రాధో జనానాం॥

ప్రకాశించుచున్నవియు, ప్రపంచము పరిపాలించుచున్నవియగు రెండు గుఱ్ఱములను (తనరథమందు) ఆయగ్ని బూన్చుంగాక. లేక తేజస్సుతోఁ గూర్చుంగాక. తర్వాత నాయగ్ని స్తుతికర్తలచేత బాగుగాఁబిలువంబడినవాఁడై మంచిస్తుతికలవాఁడగుచు, యాగమున కర్హుఁడగుచు, శుభకర్మగల్గి దేవతలను బిలుచుటకుఁబరుసెత్తుంగాక. పిమ్మట హవిస్సుల రూపమయిన ధన మగ్నిదేవునిం జెందుఁగాక.

వశిష్ఠఋషి-బృహతీచ్ఛంద-ఉషోదేవత. ౨ ప్రగాథ.

౧ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩
౨౩౫. ప్రత్యు అదర్శ్యా యత్యూ౩చ్ఛన్తీ దుహితాదివః। అపోమహీవృణుతే
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
చక్షుసా తమోజ్యోతిష్కృణోతి సూనరీ॥

వచ్చుచున్నది, చీఁకట్లను బోఁగొట్టుచున్నది, ద్యులోకమునకు లేక సూర్యునకుంగూతురును అగు నుష అందరిచేఁ జూడఁబడుచున్నది. గొప్పదయిన చీఁకటిని (తన) దర్శనముచేతనే నివారించుచున్నది. ప్రజలనుచక్కఁగా నడిపించుచు నుష వెలుఁగునిచ్చుచున్నది.

౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౧
౨౩౬. ఉదుస్రియాః సృజతే సూర్యః సచాఉద్యన్నక్షత్ర మర్చివత్। తవే
౨ర౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
దుషోవ్యుషి సూర్యస్యచ సంభక్తేన గమేమహి॥

సూర్యుఁడు కిరణముల నొక్కమారుగాఁబైకిఁ బ్రసరింపఁజేయు చున్నాఁడు. ఉదయించుచునే గ్రహనక్షత్రాది జ్యోతిస్సులను గాంతిగలవానినిగాఁ జేయుచున్నాఁడు

కనుక నోయుషా! నీయొక్కయు సూర్యునియొక్కయుఁ బ్రకాశముకలిగినపుడు మే మన్నముతోఁగూడి యుందుము.

వసిష్ఠ-బృహతీచ్ఛంద-అశ్వినులుదేవత. 3 ప్రగాథ.

3౧ ౨3 ౧౨ 3౧౨ 3౧ ౨3౧ ౨
౨౩౮. ఇమా ఉవాం దివిష్టయ ఉస్రాహవన్తే అశ్వినా। అయంవామహ్వేZవసే.
౧ 3 ౧౨ 3 ౧ ౨ర
శచీవసూ విశంవిశగ్ం హిగచ్ఛథః॥

ద్యులోకముంగోరుచున్న యీ ప్రజలు ఓ యశ్వినులారా! నివాసాధారము గలిగించుమిమ్ముఁ బిలుచుచున్నారు. కర్మధనులారా! యీ స్తుతికర్తయు రక్షణము కొఱకు మిమ్ముంబిలుచుచున్నాఁడు. మీరందఱు స్తుతికర్తలవద్దకును బోవుదురుగదా!

3 ౨ 3౧ ౨ 3౧౨ 3౧౨ 3 ౧౨ ౨ఉ
౨౩౯. యువంచిత్రం దదథుర్భోజనం న రాచోదేథాగ్ం సూనృతావతే॥ అర్వా
3 ౧౨ 3౧ ౨ 3 ౧౨ 3౧ ౨ర
గ్రథగ్ం సమనసాని యచ్ఛతం పిబతగ్ం సోమ్యం మధు॥

నాయకులరయిన యశ్వినులారా! కోరఁబడిగిన ధనమును మీరుధరించు చున్నారు. ఆధనము స్తుతికర్తకిండు. అందుకై సమానమనస్సుకలవారలగుచు మీరథ మును మా కభిముఖముగాఁద్రిప్పుఁడు. సోమముసంబంధమయిన మధురరసమును ద్రావుఁడు.

ఉత్తరార్చికమున ద్వితీయాధ్యాయ చతుర్థఖండము సంపూర్ణము.

:o:

## ౨ అధ్యాయము.

### ౫ ఖండము.

అవత్సారఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౧ తృచ.

3 ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨ ౧ ౨
౭౩౯. అస్య ప్రత్నామను ద్యుతగ్ం శుక్రం దుదుహ్రే అహ్రయః। పయ
3 ౧ ౨ర
స్సహస్రసామృషిం॥

ఈ సోమముయొక్క పురాతనమైనట్టి, ప్రకాశించు శరీరమును అనుసరించి దీపించుచున్న అపరిమితఫలదాతయగునట్టి, యింద్రియ గోచరములుకాని కర్మఫలములనెఱుంగునట్టి, రసమునుకవులు పితుకుచున్నారు.

3౧ ౨ర 3 ౨ 3౧ ౨ర 3 ౨ 3౨3
౨౮౦. అయగ్ం సూర్యఇవోప దృగయగ్ం సరాగ్ం సిధావతి। సప్తప్రవత్
౧ ౨ర
ఆదివం॥

ఈ సోమము సూర్యునివలె సర్వకర్మలను జూచునదియై యున్నది. (కర్మసాక్షియనితా॥) ఈ సోమము (ముప్పది) ఉక్థపాత్రలలోఁ బరువెత్తుచున్నది. (అనికొందఱు) ముప్పదిరాత్రింబవళ్లు పరువెత్తుచున్నది. (అనిమఱికొందఱు వ్యాఖ్యానించిరట!) (నిరుక్తవ్యాఖ్యానము అహోరాత్రము లోకపక్షమునకు ముప్పదని) మఱియునీసోమము ద్యులోకమునుద్దేశించి యేడునదులందుఁ బ్రవహించుచున్నది.

3౧ ౨ర 3 ౧ ౨ర3 ౧౨ ౧ ౨ 3౧ ౨ర
౨౮౧. అయంవిశ్వాని తిష్ఠతిపునానో భువనోపరి। సోమో దేవోన సూర్యః॥

పడకట్టఁబడిన యీ సోమము సమస్తలోకములమీఁదను సూర్య దేవుఁడుండునట్లున్నది.

శునశ్శేఫఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౨ తృచ.

౭౮౨. ఏషప్రత్నేన జన్మనా దేవో దేవేభ్యః సుతః। హరిః పవిత్రే అర్షతి॥

ఆకుపసరుది, ప్రకాశించునది, యగు నీ సోమము పురాతనమగు జన్మచేత దేవతలకొఱకు నభిషవింపఁబడి పవిత్రమందుఁగారుచున్నది.

౭౮౩. ఏషప్రత్నేన మన్మనా దేవో దేవేభ్యస్పరి॥ కవిర్విప్రేణవావృధే॥

పురాతనమైన స్తోత్రముతోఁగూడినది, ప్రకాశించునదియు నగు నీ సోమము దేవతలకొఱకు మేధావియగుచు మేధావియగు యాగకర్తచేత, ఋత్విజునిచేత వృద్ధి పొందుచున్నది.

౭౮౪. దుహానః ప్రత్నమిత్పయః పవిత్రే పరిషిచ్యతే॥ క్రందం దేవాగ్ం అజీజనః।

ఓ సోమమా! పురాతనమైనరసమును గార్చుచుఁబవిత్రమందు నీవు పోయఁబడుచున్నావు. నీవుధ్వనించుచు నింద్రాదిదేవతలను సమీపమునఁబుట్టించుచున్నావు. (తెచ్చుచున్నావనితా॥)

అసితుఁడు లేక దేవలుఁడుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౩ తృచ.

౭౮౫. ఉపశిక్షా పతస్థుషో భియసమాధేహి శత్రవే। పవమాన విదారయిం॥

ఓ సోమమా! మా యిష్టులను మా సమీపమున నుంచుము. మా శత్రువుకొఱకు భయమును కలిగించుము. ఆశత్రువుల ధనమును మాకు లభింపఁజేయుము,

౨ 3 ౨ 3౨3౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర ౧౨ 3 ౧
౭౮౬. ఉపోషు జాతమసురం గోభిర్భఙ్గం పరిష్కృతం। ఇన్దుందేవా
౨
అయాసిషుః॥

చక్కగాఁబుట్టినది, ఉదకములతోఁగూడినది, శత్రువుల నణఁచునది, గోక్షీరములతోఁగూడినది, యగు సోమమును ఇంద్రాదిదేవతలు సమీపించుచున్నారు.

౧ ౨ 3 ౧౨ 3 ౧౨ 3౨3 ౧ ౨ర
౭౮౭. ఉపాస్మై గాయతా నరః పవమానాయేన్దవే॥ అభిదేవాఀ ఇయక్షతే॥

ఓ నాయకులారా! యజ్ఞమునకు దేవతలను అభిముఖముగానే యజింపఁ (యాగముచేయుటకు) నిచ్ఛయించిన యజమానునికొఱకుఁ గారుచున్నది. ఈ యభిషవింపఁబడిన సోమముకొఱకు గానముసేయుఁడు.

ఉత్తరార్చికమందు ద్వితీయాధ్యాయ పంచమఖండము సంపూర్ణము.

౨ అధ్యాయము.

౬ ఖండము.

ఆప్త్య లేక త్రితఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౧ తృచ.

౧ ౨ర 3౨ 3 ౧౨ 3 ౧ ౨ ౧ ౨ 3౧ ౨
౭౮౮. ప్రసోమాసో విపశ్చితోఽపోనయన్త ఊర్మయః। వనాని మహిషా ఇవ॥

మేధావంతములగు గొప్పసోమములు అడవులందు మృగములు ప్రవేశించునట్లు (వసతీ-వరీ యను) ఉదకములందుఁ బ్రవేశించుచున్నవి.

౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨౧ ౩౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨
౭౭౯. అభిద్రోణాని బభ్రవః శుక్రా ఋతస్య ధారయా। వాజం గోమన్తమక్షరన్

బూడిదరంగుగల సోమములు ప్రకాశించునవై సత్యముయొక్క లేక యజ్ఞము యొక్క ధారవలెను ధారకట్టి గోవులతోఁగూడిన యన్నముంగోరి ద్రోణాదికలశములను జేరుచున్నది.

౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩
౭౮౦. సుతా ఇంద్రాయ వాయవే వరుణాయ మరుద్భ్యః। సోమా అర్షన్తు
౧ ౨
విష్ణవే॥

అభిషవించిన సోమములు ఇంద్రునికొఱకు, వరుణునికొఱకు, వాయువుకొఱకు, మరుద్గణముకొఱకును, విష్ణువుకొఱకును చేరునుగాక.

విశ్వామిత్రఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧
౭౮౧. ప్రసోమా దేవవీతయే సిన్ధుర్న పిప్యే అర్ణసా। అగ్ంశోః పయసా మదిరో
౨ర ౩౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
నజాగృవిరచ్ఛా కోశం మధుశ్చ్యుతం॥

ఓ సోమమా! నీవు దేవతలపానమునకై యుదకముతో సముద్రమువలె పూరింపఁబడుచున్నావు. అట్టినీవు మదముగలిగించుచు నిపుడు మేల్కొను స్వభావము కలదానవు, తీగయొక్క రసముతో మధురరసమును గార్చుదానవయి ద్రోణకలశమున కభిముఖముగాఁబోవుచున్నావు.

౧ ౨ ౩ ౧ ౨ర ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర
౭౮౨. ఆహర్యతో అర్జునో అత్కే అవ్యత ప్రియః సూనుర్నమర్జ్యః।
౧ ౨ ౩ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర
తమీగ్ంహిన్వన్త్యపసో యథా రథం నదీష్వా గభస్త్యోః॥

కోరఁదగినది, ప్రియమయినది, కొమారుని దుడుచునట్లు తుడువఁదగినది, తెల్లనిదియగు సోమము విచిత్రరూపము నావరించుచున్నది. ఆ దీనిని వేగవంతులైన

శూరులు రథమును యుద్ధములందుఁ బ్రేరించునట్లు చేతిప్రేళ్లు ఉదకములందు బాహువుల కభిముఖముగాఁ బ్రేరించుచున్నవి. (రెండుచేతుల ప్రేళ్లతో నొక్కి రసము పిండుచున్నారనితా॥)

శ్యావాశ్వఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౩ తృచ.

౭౪౩. ప్రసోమాసో మదచ్యుతః శ్రవసే నోమఘోనాం సుతావిదథే అక్రముః॥

సోమములు మదమును స్రవింపఁజేయునవి, యభిషవింపఁబడినవి యగుచు యాగమందు హవిస్సుల నందియున్న మా రక్షణముకొఱకు లేక కీర్తికొఱకు వేగముగా నడచుచున్నవి.

౭౪౪. ఆదీగ్ం హగ్ంసో యథాగణం విశ్వస్యావీవశన్మతిం। అత్యో న గోభి రజ్యతే॥

మఱియు నీ సోమము హంసతనమూకను (గతివిశేషముతో) ప్రవేశించునట్లు అందఱి మనస్సును ఆకర్షించెను. ఆ సోమము ఉదకములతో గుఱ్ఱమువలె గోక్షీరముతోఁ దడుపఁబడెను.

౭౪౫. ఆదీం త్రితస్య యోషణో హరిగ్ం హిన్వన్త్యద్రిభిః। ఇందుమింద్రాయ పీతయే॥

మఱియు ఆకుపచ్చనిరంగుగల యీ సోమమును త్రితఋషియొక్క ప్రేళ్లు శిలలతో నింద్రుని పానమునకుఁగాఁ బిండుచున్నవి.

అగ్నిఋషి-ఉష్ణిక్ఛంద-సోమదేవత. ౪ తృచ.

౭౪౬. అయాపవస్వ దేవయు రేభన్ పవిత్రం పర్యేషి విశ్వతః। మధోర్ధారా అసృక్షత.

ఓ సోమమా! దేవతలం గోరుచున్న నీవు ఈ ధారతోఁగారుము పిమ్మటధ్వనించుచుఁబవిత్రమందు నంతటను వ్యాపించుచున్నావు. తరువాత మదకరమయిన నీ యొక్క ధారలు విడువంబడుచున్నవి.

౭౫౭. పవతేహార్యతో హారిరతి హ్వారాగ్ంసి రగ్ంహ్యా అభ్యర్ష స్తోతృభ్యో వీరవద్యశః॥

మనోహరమైన, ఆకుపసరురంగుగల, సోమము మంచి వేగముతో వంకరగా నున్న పవిత్రములనుదాటి స్రవించుచున్నది. స్తుతికర్తలకు పుత్రులతోఁగూడిన యన్నమును ఇచ్చుచుఁగారుచున్నది.

౭౬౮. ప్రసున్వానా యాంధసోమర్తో నవష్టతద్వచః। అపశ్వానాన మరాథసగ్ం హాతామఖన్నభృగవః॥

అభిషవింపఁ (పిండ) బడుచున్న సోమముయొక్క యీ ధ్వనిని కర్మవిఘ్నకారి యగువాఁడు వినకుండుఁగాక. ఓ స్తుతికర్తలారా! కర్మరహితుఁడైన కుక్కవంటి వానిని పూర్వము భృగువులు మఖుఁడు అనువానిని వెంటఁదరిమినట్లు వెంటఁదరుముఁడు.

ఉత్తరార్చికమున ద్వితీయాధ్యాయ షష్ఠఖండము, అధ్యాయమును సంపూర్ణము.

---:o:---

## ౩ అధ్యాయము.

### ౧ ఖండము.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౧ తృచ.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౭౫౯. పవస్వవాచో అగ్రియః సోమచిత్రాభిరూతిభిః అభివిశ్వాని కావ్యా॥

ఓ సోమమా! ముఖ్యమైన నీవు పూజనీయములైన రక్షణములతోఁగూడ మా స్తుతులనుగూర్చి స్రవించుము. స్తుతిరూపమయిన సమస్తవాక్యములనుగూర్చి కారుమా.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౩
౭౬౦. త్వగ్ం సముద్రియా అపోऽగ్రియోవాచ ఈరయన్। పవస్వ విశ్వచర్షణే॥

సర్వముంజూచునట్టి సోమమా! ముఖ్యములయిన వాక్కులను నీవు ప్రేరించుచు నంతరిక్షమందలి యుదకములను ప్రేరించుము. (వర్షముకురియించుమని తా॥)

౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౨
౭౬౧. తుభ్యేమ భువనా కవే మహిమ్నే సోమతస్థిరే। తుభ్యం ధావన్తి
౩ ౧ ౨
ధేనవః॥

ఓ కవీ! (=కర్మనాక్రమించిన) సోమమా! నీమహిమకేలోకములన్నియు నిలిచియున్నవి. క్రొత్తగా నీనిన యావులు (దేవతలకు హవిస్సులనిచ్చి ప్రీతిఁజెందించునట్టివగుచు) నీ కొఱకుఁబరువిడుచున్నవి. (సోమములోఁ బాలుకలుపుటకై యని తా॥)

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౨ తృచ.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౭౬౨ పవస్వేందో వృషాసుతః కృధీనోయశసో జనే। విశ్వా అపద్విషోజహి॥

ఓ సోమమా! అభిషవింపబడి (కోర్కెల) వర్షముకురియించు నీవు ధారగాఁ గారుము. జనులందఱిలోఁ గీర్తివంతునిగాఁ జేయుము. శత్రువులనందఱిని జంపుము.

౭౬౩. యస్య తే సఖ్యే వయగ్ం సాసహ్యామ పృతన్యతః। తవేందో ద్యుమ్న ఉత్తమే॥

సోమమా! యీ యాగమందుఁ బ్రవర్తించుచున్న నీ స్నేహముండఁగా స్తుతికర్తలమగు మేము శ్రేష్ఠమయిన యన్నమందుఁ దృప్తికలవార మగుదుముగాక. యుద్ధముకోరుచున్న శత్రువులను ఓడింతుముగాక.

౭౬౪. యా తే భీమాన్యాయుధా తిగ్మాని సన్తి ధూర్వణే। రక్షా సమస్య నో నిదః॥

ఓ సోమమా! నీయొక్క (శత్రు) భయంకరములైన, తీక్ష్ణములైన యే యే యాయుధములు శత్రువధకొఱకుఁ గలవో ఆ యాయుధములతో శత్రువుల సర్వనిందలనుండి మమ్ము రక్షించుము.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౭౬౫. వృషా సోమ ద్యుమాగ్ం అసి వృషా దేవ వృషవ్రతః। వృషా ధర్మాణి దధ్రిషే॥

ఓ సోమమా! వర్షముకురియించు నీవు కాన్తిమంతమవగుచున్నావు. ప్రకాశించు సోమమా! వర్షముకురియించు నీవు వర్షముకురియించుటే వ్రతముగాఁగలదానవు. వర్షముకురియించు నీవు (దేవమానవులకు హితములగు) కర్మలను ధరించుచున్నావు.

౭౬౬. వృష్ణస్తే వృష్ణ్యగ్ం శవో వృషా వనం వృషా సుతః। సత్వం వృషన్వృషేదసి॥

(కోర్కెల) వర్షముకురియించు సోమమా! వర్షముకురియించు నీ యొక్క బలము వర్షముకురియించునది. నీ సేవకూడ వర్షముకురియించునది. అభిషవించిన నీ రసముకూడ వర్షముకురియించునది. అట్టి నీవు వర్షించుదానవే యగుచున్నావు.

౧ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ర౩ ౧౨ర ౧౨ ౩ ౧ ౨ర
౭౯౭. అశ్వోనచక్రిదో వృషా సఙ్గా ఇన్దో సమర్వతః। వినోరాయో దురోవృధి।

ఓ సోమమా! వర్షముకురియించు నీవు అశ్వమువలె ధ్వనించుచున్నావు. గోవులను గుఱ్ఱములను మాకునిచ్చుచున్నావు. మాధనమునకు సాధనములను వృద్ధి చేయుము.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత. ౩ తృచ.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౭౯౮. వృషాహ్యసి భానునా ద్యుమన్తం త్వాహవామహే। పవమాన
౩ ౧ ౨
స్వర్దృశం॥

ఓ సోమమా? నీవు (కోరిన ఫలములను) వర్షముకురియింతువుకదా! కనుక నో సోమమా! అందఱుంజూడఁదగిన తేజస్సుతో మిగుల దీపించుచున్న నిన్ను మేము యజ్ఞములందుఁ బిలుచుచున్నాము,

౨౩౧ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩౧౩
౭౯౯. యదద్భిః పరిషిచ్యసే మర్మృజ్యమాన ఆయుభిః। ద్రోణే సధస్థ మశ్నుషే॥

సోమమా! నీవు మనుష్యులచేత (=ఋత్విజులచేతనని తా॥) తుడువంబడుచున్న దానవై యుదకములతో నెపుడు తడుపఁబడుచున్నావో (నీటిలోఁగలుపఁబడు చున్నావని తా॥) యపుడు ద్రోణకలశమందుఁ బట్టుకొనంబడి కూడనున్న పాత్రలందు బ్రవేశించుచున్నావు.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౨౨౦ ఆపవస్వ సువీర్యం మన్దమానః స్వాయుధ। ఇహోష్విన్దవాగహి॥

మంచియాయుధములుకల సోమమా! (యజ్ఞములో పది యాయుధములు కలవు. స్ఫ్య=కత్తివంటిది. కపాల=పెంకు పురోడాశము మొదలగునవి వంటకు ఇత్యాదులు) నీవు ఉత్సాహము కలిగి లేక దేవతలను మదింపఁజేయుచు చక్కని పుత్ర పౌత్రులను మాకుఁగలిగించుము. పాత్రలందు రక్షింపఁదగిన ఈ మా యాగమందే చక్కగా వచ్చియుండుము.

అమహీయుఋషి-ఛందోదేవతలు పూర్వవతు. ౫ తృచ.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర
౨౨౧. పవమానస్య తేవయం పవిత్రమభ్యున్దతః। సఖిత్వమావృణీమహే॥

ఓ సోమమా! పవిత్రాభిముఖముగాఁబడి కారుచున్న నీ స్నేహమును మేము (స్తుతికర్తలు ఆంగిరసులు) ప్రార్థించుచున్నాము.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౧ ౨ ౧ ౨
౨౨౨. యే తే పవిత్రమూర్మయో౽భిక్షరన్తి ధారయా। తేభిర్నః సోమ మృడయ

ఓ సోమమా! యే నీ తరంగములు ధారగాఁబవిత్రమందుఁ గారుచున్నవో వాటితో మమ్ము సుఖింపఁజేయుము.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౨౨౩. సనపునాన ఆ భర రయిం వీరవతీ మిషం। ఈశానః సోమ విశ్వతః॥

సోమమా! సర్వజగత్తునకు నీశ్వరుఁడవై అభిషవించి వడకట్టిన నీవు మాకు ధనమును, పుత్రాదులతోఁగూడిన యన్నమును దెచ్చిపెట్టుము.

ఉత్తరార్చికమునఁ దృతీయాధ్యాయ ప్రథమఖండము సమాప్తము.

## 3 అధ్యాయము.

### ౨ ఖండము.

మేధాతిథిఋషి-గాయత్రీచ్ఛంద-అగ్నిదేవత. ౧ తృచ.

౭౭౪. అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసం। అస్య యజ్ఞస్య సుక్రతుం॥

దేవతలంబిలుచువాఁడగుచు (వారికి) దూతయగువాఁడు, సమస్తధనములతోఁ గూడినవాఁడు, ఈ జరుగుచున్న యజ్ఞమునకుఁ గారణమై సత్కర్మ నాచరించువాఁడునగు నగ్నిదేవుని సేవించుచున్నాము.

౭౭౫. అగ్నిమగ్నిగ్ంహవీమభిః సదా హవన్త విశ్పతిం। హవ్యవాహం. పురుప్రియం॥

ప్రజలకుఁబతియును, హవిస్సులను మోసుకొని పోవువాఁడును, పలువురకు ప్రియుఁడును, అగునగ్నులనన్నిటిని (అనఁగా-ఆహవనీయ-దక్షిణాగ్ని-గార్హపత్యము అనుపేర్లతోఁగర్మలనుబట్టి భేదముకలదు.) ఆహ్వాన సాధనములైన మంత్రములతో నెల్లపుడును ఆహ్వానించుచున్నారు. (కర్మలుచేయువారు-కర్త.)

౭౭౬. అగ్నే దేవాగ్ం ఇహావహ జజ్ఞానో వృక్తబర్హిషే। అసిహోతా న ఈడ్యః॥

ఓ యగ్నీ! (అరణులలోనుండి) పుట్టినవాఁడవై నీవు దర్భలు కోసితెచ్చిన యజమానునను గ్రహించుటకై యీ కర్మయందు దేవతలను దీసికొనిరమ్ము. మాకై దేవతలను దెచ్చు నీవు స్తుతింపఁదగియున్నావు.

మేధాతిథిఋషి-గాయత్రీచ్ఛంద-మిత్రావరుణదేవత. ౨ తృచ.

౩ ౨ ౩౧ ౩ ౩ ౧౨౩ ౧౨ ౨ ౩౨
౭౭౭. మిత్రంవయగ్ం హవామహే వరుణగ్ం సోమపీతయే। యా జాతా
౩౧౨
పూతదక్షసా॥

మేము (కర్మకర్తలము) సోమపానార్థము మిత్రుని, వరుణునిఁ బిలుచుచున్నాము. ఎవరు పవిత్రమైన బలముకలవారగుచు వచ్చిరో (ఆ మిత్రావరుణులననితా। )

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ర
౭౭౮. ఋతేనయా వృధా వృధా వృతస్య జ్యోతిషస్పతీ। తా మిత్రా వరుణా
హువే॥

ఏ మిత్రావరుణులు సత్యవాక్కు-చేత (యజమాన కర్మఫలమును) వృద్ధి చేయుచు సత్యమయిన ప్రకాశమునకు నధిపతులై యున్నారో (పన్నిద్దఱు సూర్యుల లోనివారే యీ మిత్రుఁడు వరుణుఁడును.) ఆమిత్రావరుణుల నాహ్వానించుచున్నాను.

౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౨ ౧౨ ౩ ౧ ౨
౭౭౯. వరుణః ప్రావితా భువన్మిత్రో విశ్వాభి రూతిభిః। కరతాం నస్సురాధసః॥

ఈ వరుణుఁడు మమ్ము రక్షించువాఁడగుఁగాక. మిత్రుఁడును సకలరక్షణములతో మమ్ము అధికధనవంతులనుగాఁ జేయు గాక.

విశ్వామిత్రఋషి లేక మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౨ ౩౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౭౮౦. ఇంద్రమిద్గాథినో బృహదింద్ర మర్కేభిరర్కిణః। ఇంద్రంవాణీ రనూషత॥

ఉద్గాతలు (=సామవేదపాఠకులు) ఇంద్రునే బృహత్సామలనుమంత్రములతో స్తుతించినవారయి అర్చించుటకు గారణమయిన మంత్రములు కలవారయి హోతలు

ఋగ్వేదములతోను స్తుతించిరి. మిగిలిన అధ్వర్యులు యజుర్వేదమంత్రములతో నింద్రుని స్తుతించిరి.

౨ 3 ౨ఉ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧
౭౮౧, ఇంద్ర ఇద్ధర్యోః సచా సమ్మిశ్ల ఆ వచోయుజా। ఇంద్రో వజ్రీ
౨ 3 ౧ ౨
హిరణ్యయః॥

ఇంద్రుఁడే హరియను పేర్లుగల గుఱ్ఱముల నొకేమాఱు అంతటను కూర్చువాఁడు. ఆగుఱ్ఱములు మాటతోనే పూన్చుకొనునవి. ఈ యింద్రుఁడు వజ్రముధరించినవాఁడు, బంగారు భూషణములు ధరించినవాఁడు.

౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ 3 ౧ ౨ 3 ౧ ౨
౭౮౨. ఇంద్ర వాజేషు నోऽవ సహస్రప్రధనేషుచ। ఉగ్ర ఉగ్రాభిరూతిభిః॥

ఓ యింద్రా! శత్రుభయంకరుఁడవగు నీవు ఇతరులకు లొంగని రక్షణములతో యుద్ధములందు మమ్ము రక్షించుము. వేలకొలఁది లాభముకల యుద్ధములందును రక్షించుము.

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౨ ౨ఉ 3 ౧ ౨
౭౮3. ఇంద్రో దీర్ఘాయ చక్షస ఆసూర్యగ్ం రోహయద్దివి। వి గోభిరద్రి మైరయత్॥

ఈ యింద్రుఁడు ఎల్లపుడు చూచుటకు ద్యులోకమందు సూర్యుని యెక్కించెను. (పూర్వము వృత్రుఁడు చీఁకటిచేత జగత్తునావరింపఁజేయగా నింద్రుఁడు సూర్యునినిల్పి వెలుఁగుఁగలిగించెనట!) ఆ సూర్యుఁడు తనకిరణములచేతను మేఘమును మిగులఁ బ్రేరించెను.

మైత్రావరుణుఁడు లేక వశిష్ఠుఁడుఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత. ౭ తృచ

౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨
౭౮౪. ఇంద్రే అగ్నానమో బృహత్సు వృక్తిమేరయా మహే॥ ధియాధేనా
3 ౧ ౨
అవస్యవః॥

రక్షణమును గోరుచున్న మేము ఇంద్రునియందు, నగ్నియందు, వృద్ధినొందించు హవిస్సును ప్రవర్తించిన స్తుతివాక్కులను ప్రేరించుచున్నాము. కర్మతోఁగూడిన స్తుతివాక్కులను బ్రేరించుచున్నాము.

౧ ౨౮ ౩ ౧ ౨ ౩౧ ౨౮ ౩౧౨ ౩౨౩
౭౮౫. తాహి శశ్వన్త ఈడత ఇత్థా విప్రాస ఊతయే। సబాధో
౧ ౨
వాజసాతయే॥

ఆ యింద్రాగ్నుల నేకదా మేధావంతులైన జనులు రక్షణముకొఱకు నీ విధముగా స్తుతించుచున్నారు. ఒకరినొకరు పీడించుకొనుచున్న జనులు అన్నలాభము కొఱకు నా యింద్రాగ్నుల స్తుతించుచున్నారు.

౧ ౨ ౩౧౨౩౨౩ ౧ ౨ ౩౧౨
౭౮౬. తావాం గీర్భిర్విపన్యవః ప్రయస్వన్తో హవామహే। మేధసాతా
౩౧ ౨
సనిష్యవః॥

స్తోత్రముఁగోరిన మేము హవిస్సులతోఁగూడిన వారమై ధనమును తమకుం గోరుచు యాగముల నాచరించుటకు మీ యిద్దఱిని ఓ యింద్రాగ్నులారా! స్తుతులతోఁ బిలుచుచున్నాము.

ఉత్తరార్చికమున తృతీయాధ్యాయ ద్వితీయఖండము సంపూర్ణము.

—:o:—

## ౩ అధ్యాయము

## ౩ ఖండము.

వారుణి లేక భృగుఋషి-గాయత్రీచ్ఛంద- సోమదేవత. ౧తృచ.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౭౮౭. వృషాపవస్వధారయా మరుత్వతేచ మత్సరః। విశ్వాదధాన ఓజసా॥

ఓ సోమమా! నీవు (స్తుతికర్తలకుఁగోర్కెలను) వర్షముకురియించుచు ధారతో ద్రోణకలశములోనికిఁ బ్రవహింపుము. వచ్చి మేమింద్రునకు నిన్ను ఇచ్చునపుడు మరుత్తులతోఁగూడిన యింద్రుని కొఱకు మదమునుగలిగించుదానవుకమ్ము. సమస్త ధనములను బలముచేత (స్తుతికర్తల) కిచ్చుచు (మదముగలిగించుము.)

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
౭౮౮. తంత్వా ధర్తారమోణ్యోః పవమానః స్వర్దృశం। హిన్వే వాజేషు
౩ ౧ ౨
వాజినఁ॥

వడకట్టినసోమమా! ద్యులోకభూలోకములను ధరించినట్టి, సర్వమునుజూచునట్టి, బలవంతమైనట్టి, ఆ నిన్ను యుద్ధములందుఁ బ్రేరించుచున్నాను. (యుద్ధములు జయించి యన్నము తెచ్చియిమ్మని తా॥)

౩ ౨ ౩ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧౧
౭౮౯. అయాచిత్తో విపానయా హరిః పవస్వధారయా! యుజంవాజేషు
చోదయ॥

ఓ సోమమా! యిటునటు (పనులలో) దిరుగుచున్నట్టి, చేతివ్రేళ్ల చేత నభిషవింపఁబడిన దానవు, ఆకుపసరురంగుగలదానవు నగు నీవుధారతో ద్రోణకలశమందుఁ బ్రవేశించుము. స్నేహితుఁడైన యింద్రుని యుద్ధములందుఁబ్రేరించుము.

ఉపమన్యుఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత. ౨ తృచ.

౨ 3 ౧ ౨ 3౧౨ 3౨ 3౧౨ 3౨ 3 ౨ ౧ ౨
౭౯౦. వృషాశోణో అభికనిక్రదద్గా నదయన్నేషి పృథివీ ముతద్యాం। ఇంద్ర
3 ౧ ౨ర 3 ౧ ౨ 3౧ ౨ 3 3 3 ౨
స్యేవ వగ్నురా శృణ్వ ఆజౌ ప్రచోదయన్నర్షసి వాచమేమాం॥

ఎఱ్ఱని వృషభము గోవులంగూర్చి ధ్వనించునట్లు స్తుతులనుగూర్చి ధ్వనించుచు నీవు ద్యులోకమును భూలోకమునుగూడ గమనించుచున్నావు. ఆధ్వని యుద్ధమందింద్రుని ధ్వనివలె వినంబడుచున్నది.

3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨ 3 ౨
౭౯౧. రసాయ్యః పయసా పిన్వమాన ఈరయన్నేషి మధుమంతమగ్ంశుం।
౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨
పవమాన సన్తనిమేషి కృణ్వన్నింద్రాయ సోమపరిషిచ్యమానః॥

ఓ సోమమా! రసవంతమైన నీటితోఁగూడి కారుచున్న నీవు లతను మధురమైన రసముగాఁజేయుచుఁ బ్రసరించుచున్నావు. ఓ సోమమా! ఉదకములతోఁగలుపఁబడిన నీవు పవిత్రమందువడకట్టంబడుచు ధారను బ్రవర్తింపఁజేయుచు నింద్రుని కొఱకుఁ బోవుచున్నావు.

3౧ ౨ 3౧ ౨ర 3 ౧ ౨ 3౧ ౨ 3 ౨ ౨3౨ 3
౭౯౨. ఏవాపవస్వ మదిరో మదాయోదగ్రాభస్య నమయన్వధస్నుం। పరివర్ణం
౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨
భరమాణో రుశన్తం గవ్యుర్నో అర్షంపరి సోమసిక్తః॥

సోమమా! మదము కలిగించు నీవు ఉదకమును బట్టుకొనియున్నది, వృత్రవధచేత నీరు గార్చుచున్నది యగు మేఘమును లొంగఁదీయుచు మదము కొఱకుఁ బాత్రలలోనికిఁ గారుము. ప్రకాశించుచున్న తెల్లని కాంతి నిభరించుచుఁ బవిత్రమందు శోధింపబడి మాకు గోవులంగోరుచుఁ బ్రవర్తించుము.

ఉత్తరార్చికమందుఁ దృతీయాధ్యాయ తృతీయఖండము సంపూర్ణము.

## 3 అధ్యాయము.

## ౪ ఖండము.

—*/*—

భరద్వాజఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౭౯3. త్వామిద్ధి హవామహే సాతౌ వాజస్య కారవః। త్వాం వృత్రేష్వింద్ర సత్పతిం నరస్త్వాం కాష్ఠాస్వర్వతః॥

స్తుతికర్తలమగు మేము అన్నము సంపాదించునిమిత్తము కలిగినపుడో యింద్రా! నిన్నే స్తుతులతో నాహ్వానింతుము (=పిలుతుము.) ఇంద్రా! సత్పురుషులం బరిపాలించునట్టి, శ్రేష్ఠుండవయినట్టి నిన్ను ఇతరమనుష్యులుకూడ శత్రువులు ముట్టడించునపుడు పిలుతురు. మఱియు గుఱ్ఱములతోటి యుద్ధములందు యోధులమయిన వారలము నిన్నే పిలుతుము.

౭౯౪. సత్వం నశ్చిత్ర వజ్రహస్త ధృష్ణుయా మహః స్తవానో అద్రివః గామశ్వగ్ం రథ్యమింద్ర సంకిరస త్రావాజం నజిగ్యుషే॥

చిత్రమయిన యింద్రా! వజ్రహస్తా! పిడుగుగలవాఁడా! శత్రువులను దిరస్కరించువాఁడా! మహాత్ముఁడవగు నీవు మాచే స్తుతింపఁబడుచు గోవును రథార్హమయిన అశ్వమును జక్కఁగానిమ్ము. జయించినవానికి భోగమునిమిత్తము విస్తారమయిన యశ్వమనిచ్చునట్లు మాకు నన్నమునిమ్ము.

పరిస్కణ్వఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ర 3 ౧ ౨3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ ౧ ౨3 ౧ ౨
౭౯౫. అభిప్రవ సురాధస మింద్ర మర్చయథా విదే। యోజరితృభ్యో
3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧౨
మఘవా పురూవసుః సహస్రేణేవ శిక్షతి॥

విస్తారధనముకలవాఁడు, ధనవంతుఁడు నగు నేయింద్రుఁడు స్తుతికర్తలమగు మాకు వేలకొలఁది ధనమునిచ్చునో ఆ యింద్రుఁడు మాచే దెలియఁబడునట్లు ఓ ఋత్విజులారా! మీరు మంచిధనముతోఁ గూడిన యింద్రునకభిముఖముగాస్తుతించుడు.

3 ౧౨ 3 ౧౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ 3౧౨3
౭౯౬. శతానీకేవ ప్రజిగాతి ధృష్ణుయాహన్తి వృత్రాణి దాశుషే॥ గిరేరివ
౧౨ర 3 ౧ ౨ 3 ౧ ౨
ప్రరసా అస్యపిన్విరే దత్రాణి పురుభోజసః॥

ఎదిరించునట్టి పురుషుఁడు వందలకొలఁది సేనలమీఁదికిఁబోయి జయించునట్లు ఇంద్రుఁడు కర్మవిఘ్నమాచరించువారిని యెదిరించి చంపును. విస్తారముగా ధనము గల యింద్రుఁడు తనవారికిచ్చిన ధనములు కొండమీదనుండి సెలయేర్లు ప్రవహించునట్లు సమృద్ధిగా వ్యాపించుచున్నవి.

వశిష్ఠఋషి లేక మిత్రావరుణఋషి-బృహతీచ్ఛంద-ఉషో దేవత.

౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨
౭౯౭ త్వామిదాహ్యో నరోऽపీప్యన్ వజ్రిన్ భూర్ణయః। సఇంద్రస్తోమ
3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
వాహస ఇహ శ్రుధ్యుపస్వ సరమాగహి॥

వజ్రముకల యింద్రా! యే నిన్ను హవిస్సులను బట్టుకొనియున్న కర్మనాయకులు (యజమానులనితా॥) ఈ నాఁడు, నిన్నను సోమము త్రావించిరో ఇంద్రా! అట్టి నీవు స్తోత్రములను నడుపుచున్న నా స్తోత్రమును ఈ యజ్ఞమందు వినుము గృహమునకురమ్ము.

౭౯౮. మత్స్వాసుశిప్రిన్ హరివస్తమీమహే త్వయా భూషన్తి వేధసః। తవ శ్రవాగ్ంస్యుపమాన్యుక్థ్య సుతేష్విన్ద్ర గిర్వణః॥

మంచిదవుడలుకలట్టి, హరియను గుఱ్ఱములుకలట్టి, స్తుతివాక్కులకు స్వాధీనమగునట్టి యింద్రా! నీ యందుఁబరిచారకు లలంకరించుచున్నారు. సోమముతో మదించుము. అట్టినిన్ను మేము యాచించుచున్నాము. ఓ స్తుత్యర్హుఁడా! సోమములభిషవించియుండఁగా నీయన్నములు మెచ్చుకొనఁదగినవి అగునుగాక.

ఉత్తరార్చికమందుఁ దృతీయాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

---

## 3 అధ్యాయము.

### ౫ ఖండము.

అమహీయు (అంగిరసవంశ్యుఁడు) ఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౭౯౯. యస్తే మదో వరేణ్యస్తేనా పవస్వాన్ధసా। దేవావీరఘశగ్ంసహా॥

ఓ సోమమా! నీయొక్క దేవతలంగోరునట్టి, రాక్షసులంజంపునట్టి, శ్రేష్ఠమయిన మదముకలిగించు నేరసముకలదో దానితోఁబ్రవహించుము.

౮౦౦. జఘ్నిర్వృత్రమమిత్రియగ్ం సస్నిర్వాజం దివే దివే। గోషాతిరశ్వసా అసి॥

ఓ సోమమా! నీవు శత్రువై పుట్టిన వృత్రునిజంపిన దానవు, ప్రతిదినమందును యుద్ధమును బొందియుండుదానవు, గోవులనిచ్చుదానవు, అశ్వములిచ్చుదానవు నగుచున్నావు.

౧ ౨ 3 ౨ ౨ 3 ౨ 3 ౨ 3౧ ౨ ౧ ౨ 3 ౨ఉ
౮౦౧. సమ్మిశ్లా అరుషో భువః సూపస్థాభిర్న ధేనుభిః। సీదంఛ్యేనో
3 ౧
నయోనిమా॥

సోమమా! నీవుమంచి ప్రార్థనలతోఁగూడిన గోక్షీరములతోఁగలిసినదానవై డేగ యెట్లు శీఘ్రము స్వస్థానముం జేరునట్లు స్వస్థానముం జేరుచు నిపుడు ప్రకాశించుదానవుకమ్ము.

3 ౨ 3 ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ ౨3౧ ౨ 3
౮౦౨. అయంపూషా దయిర్భగః సోమః పునానో అర్షతి। పతిర్విశ్వస్య
౧ ౨ 3క ౨ర 3 ౧ ౨ 3 ౧
భూమనో వ్యఖ్యద్రోదసీ ఉభే॥

పోషించునట్టి, సేవింపఁదగినట్టి, ధనమునకు గారణముగునట్టి, యీ సోమము పవిత్రమందు వడకట్టంబడుచుఁ గలశమునందుఁ జేరుచున్నది. సకల భూతములకును బాలకమయిన సోమము ద్యులోక భూలోకముల రెంటిని తన తేజస్సుతోఁ బ్రకాశింపఁజేసెను.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨
౮౦౩. సముప్రియా అనూషత గావో మదాయ ఘృష్వయః। సోమాసః
3 ౧ ౨ర 3 ౧౨
కృణ్వతే పథః పవమానాస ఇన్దవః॥

అత్యంతప్రియమైన, అత్యంతము ప్రకాశించుచున్న, స్తుతివాక్కులు సోమమునకు మదముకలుగుటకు స్తుతించుచున్నవి. వడకట్టఁబడుచు దీపించుచున్న సోమములు కారుటకు మార్గములు త్రొక్కినవి.

౭౦౪. యఓజిష్ఠస్తమాభర పవమాన శ్రవాయ్యం। యఃపంచ చర్షణీరభి రయింయేన వనామహే॥

మిగుల తేజస్సుగల (మూడవమాఱుపిండిన రసమేదికలదో) దానిని మెచ్చుకొనఁదగినదానిని మాకిమ్ము. అయిదువర్ణములవారి కభిముఖముగా నేదికలదో ఆరసమును ఇమ్ము (నిషాదుఁడు, చాతుర్వర్ణముకలిసి పంచవర్ణములు) ఏరసముతో మేము ధనమును పొందుదుమో దానినిమ్ము.

భార్గవఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౭౦౫. వృషామతీనాం పవతే విచక్షణః సోమో అహ్నాం ప్రతరీతోషసాందివః। ప్రాణాసింధూనాం కలశాఁ అచిక్రదదింద్రస్య హార్ద్యావిశన్మనీషిభిః।

ఈ సోమము స్తుతులను వర్షించునది, సర్వముఁజూచునది, పగళ్లను ఉషస్సులను సూర్యుని వృద్ధినొందించునది, ఉదకములను గదల్చునది యయి యింద్రుని హృదయమును ప్రవేశించుచుఁ గలశముల కభిముఖముగా ధ్వనించుచున్నది.

౭౦౬. మనీషిభిః పవతే పూర్వ్యః కవిర్నృభిర్యతః పరికోశాఁ అసిష్యదత్॥ త్రితస్య నామ జనయన్మధుక్షర న్నింద్రస్య వాయుఁ సఖ్యాయ వర్ధయన్॥

ఈ సోమము మేధావులయిన ఋత్విజులచేత వడకట్టఁబడుచున్నది. ఇది పురాతనము. మేధావంతము. (అగును) ఋత్విజులచేత నియమింపంబడుచుఁ గలశములందు స్రవించుచున్నది. యజమానునకు నుదకమునుబుట్టించుచు (వర్షమనితా॥)

మధురమగు రసమును ఇంద్రుని స్నేహమునకు వాయువును వృద్ధిపొందించుచు కార్చుచున్నది.

3 ౧ ౨ 3౨ 3౧ ౨ 3 ౧ ౨ర 3౨
౫౦౨. అయంపునాన ఉషసో అరోచయదయగ్ం సిన్ధుభ్యో అభవ దులోకకృత్॥
3 ౨ఉ 3౧ ౨ 3 ౨ 3౨3 ౧ ౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౨
అయంత్రిస్సప్త దుదుహాన ఆశిరగ్ం సోమో హృదేపవతే చారు మత్సరః

ఈ సోమము వడకట్టంబడి ఉషస్సులను ప్రకాశింపఁజేసెను. ఇది ఉదకములలో (కలిసి) వృద్ధినొందెను. ఇది లోకములకుఁగర్త. (వర్షాదికము గలిగించినందువల్ల లోకాధారమని తా॥) ఈ సోమము ఇరువదియొక్క ఋక్కులద్వారా ఆశిరమును బిదుకుచున్నదై (ఆశిరము=ఆవుపాలు. సోమముతోఁగలుపుటకు పితుకుదురు) మదము కలిగించునదియగుచు హృదయములోనికిఁ బ్రస్రవించుచున్నది.

ఉత్తరార్చికమున తృతీయాధ్యాయ పంచమఖండము సంపూర్ణము.

—*|*—

## 3 అధ్యాయము.

### ౬ ఖండము

ఆంగిరస శ్రుతకక్షఋషి-గాయత్రిచ్ఛంద-ఇంద్రదేవత.

3 ౧ ౨ర 3 ౨ 3౧ ౨ఉ 3౨3౨ 3 ౨3 ౨ 3 ౧ ౨
౫౦౩. ఏవాహ్యసి వీర యురేవ శూర ఉతస్థిరః॥ ఏవా తే రాధ్యం మనః॥

ఓ యోధా! నీవు శత్రువీరులను (జంపఁ) గోరువాఁడవే యగుదువు కదా! కనుక నేశూరుఁడవు. మఱియు ధైర్యవంతుఁడవు. ఇట్లయియుండ—నీమనస్సు స్తుతులతో నారాధింపఁదగినదియే.

3 ౨ 3౧౨ 3 ౧౨ 3 ౧ ౨ ౧ ౨ 3౧ ౨
౮౧౯. ఏవారాతిస్తువీమఘ విశ్వేభిర్ధాయి ధాతృభిః॥ అథాచిదింద్ర నస్సచా॥

అనేక ధనముకల యింద్రా! సమస్తయాగకర్తలచేతను నీదానము స్వీకరింపం బడినదేను. తర్వాత నో యింద్రా! నీవు మాకు (యాగకర్తలనితా॥) ధనాది దానము చేతను (కర్మకు) సహాయుఁడవుకమ్ము.

౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨ 3 ౨
౮౨౦. మోషు బ్రహ్మేవ తంద్రి యుర్భువో వాజానాంపతే॥ మత్స్వా సుత
3 ౧ ౨
స్య గోమతః॥

అన్నములకుఁ బతియయినవాఁడా! లేక బలములకుఁ బతియయినవాఁడా! యింద్రా! బద్ధకముగల బ్రాహ్మణునివలెను (కర్మలువదలి సోమరితనముకలయనితా) నీవు కాకుము. అభిషవించినది, తర్వాత నావుపాలతోఁగూర్చినది, లేక పెరుగుతోఁ గలిపినది, యగు సోమముయొక్క పాత్రతో మదించుము.

మధుచ్ఛందఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౨ 3౧ 3 ౧ ౨ 3౧౨ 3౧౨ 3౨3
౮౨౧. ఇంద్రంవిశ్వా అవీవృధన్ త్సముద్ర వ్యచసంగిరః। రథీతమగ్ం రథీనాం
౧౨3 ౧౨3౧౨
వాజానాగ్ం సత్పతింపతిం॥

మా స్తుతివాక్కులన్నియు, సముద్రమువలె విశాలమగువాఁడు, రథికులలో మహా రథికుఁడు, అన్నములకు నధికారి, సన్మార్గమున నడచువారిని బాలించు వాఁడు, నగు నింద్రుని వృద్ధి పొందించినవి.

3 ౧౨ 3 ౨ 3 ౧ ౨ ౨ 3 ౧ ౨ర 3
౮౨౨. సఖ్యేత ఇంద్ర వాజినో మాభేమ శవసస్పతే। త్వామభిప్రనోనుమో
౧ ౨3౧ ౨
జేతారమ పరాజితం।

బలము పాలించునట్టి యింద్రా! నీ సఖ్యమందున్న మేము అన్నవంతులమై (శత్రువులకు) భయపడము. కనుక అన్నివిధముల జయశీలుఁడవు, పరాజయము (యుద్ధములలో) లేనివాడవును, అగు నిన్ను స్తుతింతుము.

3 ౧ ౨ర 3 ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨
౮౧3. పూర్వీరింద్రస్య రాతయో న వి దస్యన్త్యూతయః। యదా వాజస్య గోమతః
3 ౨ 3 ౧ ౨ 3 ౨
స్తోతృభ్యో మగ్ంహతే మఘం॥

ఇంద్రుని దానములు అనాదికాలమునుండి సిద్ధములే. ఇప్పటియజమానుఁడు ఋత్విజులకు గోవులతోఁగూడిన యన్నము, దక్షిణారూపమయిన ధనము నెపుడిచ్చునో, యపుడే యింద్రుని ధన దానాదులును, రక్షణములును స్తుతికర్తలకు క్షీణింపవు. (పెరుఁగునని తా॥)

తృతీయాధ్యాయము సంపూర్ణము. ఆరవఖండమును పూర్ణము.

## ౪ అధ్యాయము.

### ౧ ఖండము.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩౧౨ ౩ ౧౨ ౩౨ ౩౧౨ ౩౧౨ ౧౨౩౧ ౨ర
౮౧౪. ఏత అసృగ్ర మిన్దవస్తిరః పవిత్రమాశవః। విశ్వాన్యభి సౌభగా॥

అడ్డుగాఁ బ్రసరించిన, పవిత్రమందు శీఘ్రముగాఁ బ్రవర్తించుచున్న యీ వడకట్టిన సోమములు సమస్త ధనములనుగూర్చి ఋత్విజులచేతఁ బ్రేరింపఁబడుచున్నవి.

౩౧ ౨ ౩౨ ౩౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧౨ ౧ ౨ ౩ ౨ ౩ ౧౨
౮౧౫. విఘ్నన్తో దురితా పురు సుగాతోకాయవాజినః। త్మనా కృణ్వన్తో అర్వతః॥

బలవంతములైన సోమములు పలువిధ కష్టములను లేక పాపములను నశింపఁ జేయుచు మా పుత్రులకు అతి సుఖమయిన ధనములను అశ్వములను స్వయముగా నిచ్చుచున్నవి.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨౩క ౨ర ౩౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౮౧౬. కృణ్వన్తో వరివో గవే భ్యర్షన్తి సుష్టుతిం। ఇడామస్మభ్యం సంయతం॥

సోమములు మా గోవులకును మాకును సమకూర్చిన ధనమును అన్నమును గలిగించుచు మా శుభమైన స్తోత్రమున కభిముఖముగాఁ బ్రసరించుచున్నవి.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩ ౧౨ ౩ ౧౨ ౩ ౧ ౨ర ౩ ౧౨ ౩ ౧ ౨
౮౧౭. రాజా మేధాభి రీయతే పవమానో మనావధి। అన్తరిక్షేణ యాతవే॥

మనుష్యుఁడు యాగము చేయుచుండఁగా రాజయిన సోమము వడకట్టఁబడుచు స్తుతులతోఁగూడ నాకాశమార్గమున (ద్రోణ కలశమున) పడుటకు గమనించుచున్నది.

౮౧౮. ఆనః సోమ సహో జువో రూపం న వర్చసే భర। సుష్వాణో దేవవీతయే॥

ఓ సోమమా! దేవతల పానముకొఱకు అభిషవింపంబడుచు నీవు బలమును సర్వత్ర ప్రకాశించుటకై రూపమునుగూడ మాకుఁ గలిగించుము.

౮౧౯. ఆన ఇందో శాతగ్వినం గవాంపోషగ్ం స్వశ్వ్యం। వహాభగత్తి మూతయే॥

ఓ సోమమా! నూర్లువేలు వాక్కులతోఁ గూడినట్టి, గోవులం బోషించునట్టి, మంచి గుఱ్ఱముల సమూహము గలట్టి, భోగింపఁదగిన ధనమును రక్షణముకొఱకు మాకు నిమ్ము. (గోవులు మొదలగువాటి వృద్ధికలిగించుమని తా॥)

కవిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౮౨౦. తంత్వా నృమ్ణాని బిభ్రతగ్ం సధస్థేషు మహోదివః। చారుగ్ం సుకృత్యయేమహే॥

గొప్పదయిన ద్యులోకముతోఁగూడియున్న స్థానములందుండిన, ధనములను భరించుచున్న, కల్యాణప్రదమయిన ఆ వడకట్టబడిన నిన్ను ఓ సోమమా! సత్యకర్మచేత ధనములను యాచించుచున్నాము.

౮౨౧. సంవృక్తధృష్ణు ముక్థ్యం మహామహివ్రతం మదం। శతంపురో రురుక్షణిం॥

ఓ సోమమా! శత్రువులను ఛేదించిన, స్తుతింపఁదగిన, గొప్పకర్మలు చేయు

చున్న, మదకరమయిన, అనేక శత్రుపురములను నశింపఁజేయుచున్న నిన్ను ధనములను యాచించుచున్నాము.

౧ ౨ ౩ ౨౩క ౨ర ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨౩౧
౮౨౨. అతస్త్వా రయిభ్యయ ద్రాజానగ్ం సుక్రతో దివః। సుపర్ణో అవ్యథీ
౨
భరత్॥

సత్కర్మలాచరించునట్టి వడపోయంబడిన సోమమా! ధనమునుగూర్చి యెదురుగాఁ బోవు రాజవయిన నిన్ను ఈ ద్యులోకమునుండి కష్టములేక డేగ (సుపర్ణ =గరుత్మంతుఁడు లేక ఆ డేగపేరు సుపర్ణ) తెచ్చెను.

౧ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧
౮౨౩. అధాహిన్వాన ఇన్ద్రియం జ్యాయో మహిత్వమానశే। అభిష్టి కృద్వి
౨ర
చర్షణిః॥

తరువాతఁ గర్మలకు సాక్షియగునట్టి, యాగకర్తలకుఁ గోర్కెలను దీర్చునట్టి, సోమము తన ఫలమును గలిగించుఁ బ్రశస్తమయిన మహత్త్వను బొందుచున్నది.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౨ ౩ ౨ ౩ ౨౩ ౧ ౨
౮౨౪. విశ్వస్మా ఇ స్వర్దృశే సాధారణగ్ం రజస్తురం। గోపామృతస్య బిభరత్॥

ఉదకమును ప్రేరించునట్టి, యాగమును రక్షించునట్టి, సమస్త దేవతలకు సమానముగాఁ జెందునట్టి, సోమమును పక్షి (సుపర్ణయనునది) తెచ్చెను (స్వర్గమునుండి యని తా॥) సూర్యునియొక్క కిరణమునకు సుపర్ణయని పేరు గలదు.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨ర
౮౨౫. ఇషేపవస్వ ధారయా మృజ్యమానో మనీషిభిః। ఇందో రుచాభిగా ఇహి॥

ఓ సోమమా! ఋత్విజులచేత శోధింపంబడుచున్న నీవు మాయన్నముకొఱకు ధారగా స్రవించుము. ప్రకాశించు నన్నముతోఁ బశువులను బొందుము.

౮౧౬. పునానో వరివ స్కృధ్యూర్జం జనాయ గిర్వణః। హరే సృజాన ఆశిరం॥

స్తుతివాక్కులతోఁ బ్రార్థింపఁదగినట్టి, ఆకుపచ్చని రంగు గలట్టి, ఓసోమమా! క్షీరమునందుఁ బోయంబడుచు వడకట్టఁబడి నీవు జనులకొఱకు ధనమును, అన్నమును గలిగించుము.

౮౧౭. పునానో దేవవీతయ ఇంద్రస్య యాహి నిష్కృతం। ద్యుతానో వాజిభిర్హితః॥

హవిస్సులం గూర్చుకొని సిద్ధులైయున్న యాగకర్తతోఁగూడ దీపించుచు నో సోమమా! యజ్ఞముకొఱకు వడకట్టంబడుచు మేలు కలిగించుదానవై నీవు ఇంద్రుని స్థానమును గూర్చి పొమ్ము.

ఉత్తరార్చిక చతుర్థాధ్యాయ ప్రథమ ఖండము సంపూర్ణము.

౪ అధ్యాయము.

౧ ఖండము.

మేధాతిథిఋషి-గాయత్రీచ్ఛంద-అగ్నిదేవత.

౮౧౮. అగ్నినాగ్నిః సమిధ్యతే కవిర్గృహపతిర్యువా। హవ్యవాడ్ జుహ్వాస్యః॥

ఆహవనీయాగ్నియందుంచఁబడిన (నిర్మంథనమగు) నగ్నితోఁగూడ మేధావియు, యజమాన గృహమును బాలించునదియు, నిత్యయౌవనమును, హవిస్సులను మోసికొనునదియు, జుహూరూపమయిన ముఖము కలదియు నగుచు అగ్ని చక్కఁగా దీపించుచున్నది.

౧ ౨ర ౩౧౨ ౩ ౧ ౨ ౩౧౨ ౧౨ ౩ ౧౨
౮౨౯. యస్త్వామగ్నే హవిష్పతిర్దూతం దేవసపర్యతి। తస్యస్మ ప్రావితాభవ॥

ఓ యగ్ని! దేవా! యేయజమానుఁడు దూతనుగా నిన్ను సేవించుచున్నాఁడో యతనికి రక్షకుఁడవు కమ్ము.

౨ ౩ ౨ ౩౧౨ ౩౧౨ ౩౧౨ ౧౨
౮౩౦. యో అగ్నిం దేవ వీతయే హవిష్మాగ్ం ఆవివాసతి। తస్మైపావక మృడయ॥

హవిస్సులను సేకరించుకొన్న యే యాగకర్త దేవయాగము కొఱకు నగ్ని సమీపమునఁ బరిచర్య చేయునో, యతనిని ఓ యగ్నిదేవా! సుఖింపఁజేయుము.

మధుచ్ఛందఋషి–గాయత్రీచ్ఛంద–మిత్రావరుణదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౩౧౨ ౧౨ ౩ ౨౩
౮౩౧. మిత్రగ్ం హువే పూతదక్షం వరుణంచ రిశాదసం। ధియం ఘృతాచీగ్ం

౧ ౨
సాధన్తా॥

ఈ కర్మ యందు (హవిస్సులర్పించుటకు) పవిత్రబలము కలట్టి మిత్ర దేవుని యాహ్వానించుచున్నాను. హింసకులను దినివేయు నట్టి వరుణదేవుని యాహ్వానింతును. ఉదకమును భూమి మీదఁగురియించునట్టి, కర్మను సాధించునట్టి, వారు ఆ మిత్రా వరుణులు.

౩ ౧౨ ౧౨ ౩ ౧ ౨
౮౩౨. ఋతేన మిత్రావరుణా వృధావృతే స్పృశా। క్రతుంబృహన్త మాశాథే॥

ఓ మిత్రావరుణులారా! మీరు సత్యమైన ఫలమును మాకునిచ్చుటకు సాంగమై జరుగుచున్న యీ యాగమునకుఁ జేరితిరి. మీరు ఉదకమును ముట్టియున్నారు.

౮౩౩. కవీనో మిత్రావరుణా తువిజాతా ఉరుక్షయా। దక్షంఁదధాతే అపసం॥

మేధావంతులు, అనేకులకుపకారులై పుట్టినటువంటివారును, అనేక నివాసములు కలవారును, అగు మిత్రావరుణులు మాయొక్క బలమును కర్మను పోషించుచున్నారు.

మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-మరుద్గణదేవత.

౮౩౪ ఇంద్రేణసగ్ం హిదృక్షసే సంజగ్మానో అబిభ్యుషా। మన్దూసమానవర్చసా॥

ఓ మరుద్గణమా! భయములేనట్టి ఇంద్రునితోఁగూడుకొని చక్కగాఁ జూడఁబడుచు నీవును ఇంద్రుఁడు గలిసి సంతోషము గలవారలై, సమానకాన్తి కలవారలై యున్నారు.

౮౩౫. ఆదహస్వధామను పునర్గర్భత్వ మేరిరే। దధానా నామ యజ్ఞియం॥

యజ్ఞార్హమయిన పేరును ధరించుచున్న మరుత్తులు వర్షర్తువు గడచిన తర్వాత మరల ఉదకమునకై గర్భమును ధరింతురు.

౮౩౬. వీడు (ళు) చిదారుజత్నుభిర్గుహా చిదింద్ర వహ్నిభిః। అవింద ఉస్రియా అను॥

ఓ యింద్రా! దృఢమయినదయినను (దుర్గమస్థానమును) బ్రద్దలుచేయునట్టి (దేనినైన) ఇంకొకచోటికి మోసికొనుపోవునట్టి మరుత్తులతోఁ గూడినవాఁడవై నీవు గుహలో దాచినవైనను గోవులను వెదకి పట్టుకొంటివి. (పణులనువారు దేవతల గొనిపోయి గుహలో దాచివేయగా మరుత్తుల సాయమున వెదకి యింద్రుఁడు వాటిని మరల సంపాదించెనని కథ.)

భరద్వాజఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నులు దేవతలు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౩ ౧ ౨ర
౮. ౭. తా హువే యయోరిదం పప్రే విశ్వం పురా కృతం। ఇంద్రాగ్నీ నమర్ధతః॥

ఏ యింద్రాగ్నులయొక్క పూర్వముచేసిన పను లివియన్నియు ఋషులచేత స్తుతింపఁబడుచున్నవో ఆ యింద్రాగ్నులను బిలుచుచున్నాను. వారు స్తుతికర్తలను హింసింపరు.

౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౮౩౮. ఉగ్రావిఘనితా మృధ ఇంద్రాగ్నీ హవామహే। తానోమృడాత ఈదృశే॥

ఉగ్రమయిన బలముకలవారు శత్రువులం జంపువారు, నగు నింద్రాగ్నుల నాహ్వానించుచున్నాము. ఆ యింద్రాగ్నులు ఈ యుద్ధమందు మమ్ము సుఖింపఁజేతురుగాక.

౨ ౩ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర ౩ ౨ఉ ౨ ౩ ౧ ౨
౮౩౯. హథో వృత్రా ణ్యార్యా హథో దాసాని సత్పతీ। హథో విశ్వా అపద్విషః॥

ఇంద్రాగ్నులారా! కర్మలుచేయువారిచే (మాకు) గలిగిన బాధలు నశింపఁజేయుఁడు. సత్పురుషుల బాలించువారలారా! కర్మహీనులచే (మాకుఁ) గల్గినబాధలను హింసింపుఁడు. అన్నివిధములయిన శత్రువులను సంహరింపుఁడు.

సామవేద చతుర్థాధ్యాయద్వితీయఖండము పూర్ణము.

## ౮ అధ్యాయము.

### ౩ ఖండము.

విశ్వామిత్రఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౮౮౦. అభి సోమాస ఆయవః పవన్తే మద్యం మదం। సముద్రస్యాధి విష్టపే మనీషిణో మత్సరాసో మదచ్యుతః॥

గమనించుస్వభావముగల సోమములు మదమును గలిగించు తమ రసమును అంతరిక్షముయొక్క యున్నతమయిన పవిత్రమందు లేక కలశముమీఁద వ్రేలాడఁగట్టిన పవిత్ర (=వడపోతవస్త్రము) మందు స్వేచ్ఛగలవై మదము గలిగించునవై మదమును గారించునవియు నై కారుచున్నవి.

౮౮౧. తరత్సముద్రం పవమాన ఊర్మిణా రాజా దేవ ఋతం బృహత్। అర్షా మిత్రస్య వరుణస్య ధర్మణా ప్రహిన్వాన ఋతం బృహత్॥

వడకట్టఁబడిన, ప్రకాశించుచున్న, మిగులసత్యమైన, రాజయిన సోమము(సోమమునకు రాజశబ్దము వాడఁబడుచున్నది)అంతరిక్షమును లేకకలశమును ధారతోఁ జేరుచున్నది. ప్రేరింపఁబడుచు (అనఁగాఁగలశమందుఁబోయఁబడుచుననితా)మిగులసత్యమయిన సోమముమిత్రునియొక్క వరుణునియొక్క ధారణకొఱకు గొప్పగాఁబ్రసరించుచున్నది.

౮౮౨. నృభిర్యేమాణో హర్యతో విచక్షణో రాజా దేవస్సముద్ర్యః॥

ఋత్విజులచేత నియమింపఁబడి(ఒకచోటనిలుపఁబడి) మనోహరమై సర్వమునెఱింగినట్టియుదీపించునట్టియు అన్తరిక్షమందుఁబుట్టిన సోమము ఇంద్రునికై స్రవించుచున్నది.

పరాశరఋషి-త్రిష్టుప్ఛందము-సోమదేవత.

౮౪3. త్రిస్రో వాచ ఈరయతి ప్రవహ్నిః ఋతస్య ధీతిం బ్రహ్మణో మనీషాం।
గావో యన్తి గోపతిం పృచ్ఛమానాః సోమం యన్తి మతయో వావశానాః।

(హవిస్సులఁ) బట్టుకొన్న యజమానుఁడు మూఁడు వాక్కులను (ఋగ్యజుస్సామ) ప్రేరించుచున్నాఁడు. (పఠించుచున్నాఁడని తా) యజ్ఞముచు ధరించునట్టి గొప్పదయినసోమమునకిష్టమగునది(అనగాఁ గళ్యాణకరమైనదని తా) వాక్కును బ్రేరించుచున్నాఁడు. గోవులు వృషభమునుగూర్చి పోవునట్లు గోవులకు స్వామియైన సోమమునుగోవులు అడుగుచున్నవై (ఎక్కడనున్నది సోమమని ప్రశ్నించుచునని తా) పోవుచున్నవి. (అనఁగాఁ దమపాలు సోమములోఁ గలుపుటకైయని తా) కోరుచున్న స్తుతులుగూడనట్లే పోవుచున్నవి.

౮౪౪. సోమగావో ధేనవో వావశానాః సోమం విప్రా మతిభిః పృచ్ఛమానాః।
సోమః సుత ఋచ్యతే పూయమానః సోమే అర్కా స్త్రిష్టుభః సం నవన్తే॥

పాడిమొదవులు సోమమును గోరుచున్నవి. మేధావులయిన స్తుతికర్తలు సోమమును స్తుతులతోఁ బ్రశ్నించుచున్నారు. అభిషవింపఁబడిన సోమము ఋత్విజులచేత వడకట్టఁబడి కారుచున్నది. త్రిష్టుప్ఛందముతో మేము పఠించిన మంత్రములు సోమమునందుఁ జేరుచున్నవి.

౮౪౫. ఏవానస్సోమ పరిషిచ్యమాన ఆపవస్వ పూయమానః స్వస్తి। ఇంద్ర
మావిశ బృహతా మదేన వర్ధయా వాచం జనయా పురన్ధిం॥

ఓ సోమమా! సర్వత్ర పాత్రలందుఁ బోయఁబడుచు వడకట్టఁబడిన నీవు మా యొక్క శుభమునే స్రవింపఁజేయుము. గొప్పమదము గలిగించు రసముతో నింద్రునిలోఁ బ్రవేశించుము. స్తుతివాక్కులను వృద్ధినొందించుము. విస్తారమయిన విజ్ఞానము మాకు గలిగింపుము.

ఉత్తరార్చికమునఁ జతుర్థాధ్యాయ తృతీయ ఖండము సంపూర్ణము.

---

౫ అధ్యాయము.

౫ ఖండము.

పురుహన్మఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౮౫౬. యద్ద్యావ ఇంద్రతే శతగ్ం శతం భూమిరుతాస్యుః। నత్వా వజ్రిన్త్సహస్రగ్ం సూర్యా అను న జాత మష్టరోదసీ॥

ఇంద్రా! నీ యొక్క ఉపమానమునకు ద్యులోకము నూఱు నూఱింతలు పెఱిగినను సరిపడదు. మఱియు భూమి నీ సామ్యమునకు తాను నూఱింత లయినను జాలదు. ఓ వజ్రధారీ! నిన్ను వేయిమంది సూర్యులును బ్రకాశింపఁజాలరు. (నతత్ర సూర్యోభాతి=ఆచోట సూర్యుఁడు ప్రకాశింపలేదు. అనఁగా సూర్య కాంతిలో నక్షత్రాల కాంతి రాణింపనట్లు ఇంద్రుని కాంతిలో వేయి సూర్యుల కాంతియు వెలుఁగదని తా॥ ఈ శ్రుతి ఉపనిషత్తులోనిది. బ్రహ్మపరముగా నచట

వ్యాఖ్యానించిరి దానినే మాధవులవారు తన వ్యాఖ్యానమున నింద్రుని విషయమున నుదాహరించిరి. దీనింబట్టి యింద్రుఁడే పరాత్పరుఁడని వేద మతము. ఉపనిషన్మతమున (బ్రహ్మ.) ఇంతెందుకు? — ఇదివఱకుఁబుట్టిన దేదియు నీకుసరిపోదు. ద్యులోక భూలోకములు చాలనే చాలవు.

౧ ౨ ౩ ౧ ౨ ౪ ౩ ౧ ౧ ౧ ౨ ౩ ౧ ౨
౮౪౭. ఆపప్రాథ మహినా వృష్ణ్యా వృషన్విశ్వా శవిష్ఠ శవసా అస్మాగ్ం అవ
౩ ౧ ౨ ౩ ౧ ౨ ౪ ౩ ౧ ౨ ౩ ౧ ౨
మఘవన్ గోమతి వ్రజే వజ్రిన్ చిత్రాభి రూతిభిః॥

(ఇష్టముల వర్షించు) నో యింద్రా! నీవు వర్ష బలముల నన్నింటిని గొప్ప బలముతోఁ బూరించుచున్నావు. అతిబలశాలీ! అనేక గోవులతోఁగూడిన యుద్ధము నిమిత్తమున ధనవంతుఁడవగు నింద్రా! నానావిధ రక్షణములచేతను మమ్ము రక్షింపుము.

మేధాతిథిఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౮౪౮. వయఁఘత్వా సుతావన్త ఆపోన వృక్త బర్హిషః। పవిత్రస్య ప్రస్రవ
౩ ౧ ౨ ౩ ౧ ౨
ణేషు వృత్రహన్పరి స్తోతార ఆసతే॥

ఓ యింద్రా! మేము సోమమభిషవించిన వారమై ఉదకములు పల్లము జేరునట్లు నిన్ను జేరుచున్నాము. పవిత్రమునుండి సోమము కారుచున్నపుడు దర్భల మీఁదఁగూర్చుండి స్తుతికర్తలు నిన్ను సేవించుచున్నారు.

౧ ౨ ౩ ౨ ౪ ౩ ౧ ౨ ౩ ౧ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩
౮౪౯. స్వరన్తిత్వా సుతే నరోవసో నిరేక ఉక్థినః। కదాసుతం తృషాణ ఓక
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨
ఆగమదింద్ర స్వబ్దీవవగ్ం సగః॥

నివాసమునకాధారమగు నింద్రా! అభిషవించిన సోమము పవిత్రమునుండి కారిన వెంటనే స్తుతికర్తలయినవారు నిన్ను స్తుతించుచున్నారు. మఱియు నింద్రుఁడు

అభిషవించిన సోమముంగూర్చి ఆశ కలవాఁడై అంకె వేయుచు సొగసుగ నడచు వృషభమువలె ధ్వనించుచు నెప్పుడు తన స్థానముంజేరునో కదా?

౮౫౦. కణ్వేభిర్ధృష్ణవా ధృషద్వాజం దర్షి సహస్రిణం। పిశఙ్గరూపం మఘవన్విచర్షణే మక్షూ గోమన్త మీమహే॥

(శత్రువుల) నణఁచునట్టి యింద్రా! కణ్వవంశ్యులయిన స్తుతికర్తల కొఱకు వేలకొలఁది అన్నము నిచ్చుచున్నావు. ధనవంతుఁడవయిన యింద్రా! సర్వముం జూచునట్టివాఁడా! గట్టిది, పసుపురంగుగలది యగు ధనమును గోవులతోఁగూడిన దానిని శీఘ్రము గోరుచున్నాము.

వశిష్ఠఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౮౫౧. తరణి రిత్సిషాసతి వాజం పురన్ధ్యా యుజా। ఆవ ఇంద్రం పురుహూతం నమే గిరా నేమిం తష్టేవ సుద్రువం॥

(యుద్ధాదులలో) దాటించు పురుషుఁడే మంచి సాహాయ్యబుద్ధితో అన్నమును బొందును. పలువురచేఁబిలువఁబడిన యింద్రుని స్తుతివాక్కుతో నోయజమానులారా! మీ కొఱకు నేను గట్టితోఁజెక్కిన చక్రముయొక్క అంచును వంచునట్లు మీ కభిముఖునిగాఁ జేయుచున్నాను (=వంచుచున్నాను.)

౮౫౨. నదుష్టుతి ర్ద్రవిణోదేషు శస్యతే నస్రేధన్తగ్ం రయిర్నశత్। సుశక్తిరిన్మఘవ న్తుభ్యం మావతే దేష్ణం యత్పార్యేదివి॥

ధనదాతల విషయమున చెడుస్తవము చేయుటతగదు. (అట్టిదాతల స్తుతులను) జెడఁగొట్టు జనని ధనము చెందదు. ఓ యింద్రా! సుత్యాదినమందు (సోమ

యాగ దినములలో నొకరోజుపేరు.) నావంటి స్తుతికర్తకు నివ్వఁదగిన యే ధనము కలదో దానిని నీవల్ల మంచి సమర్థుఁడైన స్తుతికర్తయే పొందును

ఇట్లు ఉత్తరార్చికమందుఁ జతుర్థాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

—♦●♦—

## ౫ అధ్యాయము.

### ౧ ఖండము.

త్రితఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౮౫౩. తిస్రో వాచ ఉదీరతే గావో మిమన్తి ధేనవః। హరిరేతి కనిక్రదత్॥

(ఋగ్యజుస్సామములను) మూఁడువాక్కులను ఋత్విజులు పఠించుచున్నారు. పాడియావులు (క్షీరమును సోమమునఁగలుపుటకు) ధ్వనించుచున్నవి. ఆకుపచ్చని సోమము ధ్వనించుచు ద్రోణకలశమును జేరుచున్నది.

౩౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ర
౮౫౪. అభిబ్రహ్మీరనూషత యహ్వీర్ఋతస్య మాతరః। మర్జయన్తీర్దివశ్శిశుం॥

బ్రాహ్మణులచేతఁ బ్రేరింపఁబడిన (=పఠింపఁబడిన) స్తుతులు యాగమును నిర్మించుచు, ద్యులోకము నకు శిశువయి యున్న (అనగా సోమము ద్యులోకమునుండి తేఁబడెను గనుక) సోమమును బవిత్రము చేయుచు స్తుతించుచున్నవి.

౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౨ ౧ ౧ ౨
౮౫౫. రాయస్సముద్రాగ్ం శ్చతురో౽స్మభ్యగ్ం సోమవిశ్వతః। ఆపవస్వ
౩ ౧ ౨
సహస్రిణః॥

ధనముల సముద్రములను నాల్గింటిని (అనఁగా నాల్గు సముద్రాల లోని

రత్న రాసు లని తా॥) మా కొఱకు ఓ సోమమా! సర్వ స్థలములందును (గలుగు నట్లు) స్రవించుము. అట్లే అపరిమితమగు కోర్కెలను సఫలము చేయుము.

యజాతిఋషి-అనుష్టుప్ఛంద-సోమ దేవత.

౩ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧౨ ౩౧౨
౧౫౬౬. సుతా సోమధు మత్తమాః సోమా ఇంద్రాయ మన్దినః। పవిత్రవన్తో అక్ష
౩ ౧ ౨ ౩ ౧ ౨
రం దేవాన్ గచ్ఛన్తు వో మదాః॥

చాలమధురమయి మదమును కలిగించునట్టి సోమములు అభిషవింపఁబడి పవిత్రమందు (వడపోతవస్త్రమున) పోయంబడినవై యింద్రుని నిమిత్తము పాత్రలందు గారుచున్నవి. ఓ సోమములారా! మీ మదముకలిగించు రసములు ఇంద్రాది దేవతలను జేరుఁగాక.

౨౩౧ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩
౧౫౬౭ ఇన్దు రింద్రాయ పవత ఇతి దేవాసో అబ్రువన్। వాచస్పతి ర్మఖస్యతే
౨౩ ౧ ౨౩ ౧౨
విశ్వ స్యేశాన ఓజసః॥

సోమము ఇంద్రుని కొఱకు (కలశమందు) గారుచున్నది. స్తుతికర్తలు (స్తుతులను) పలుకుచున్నారు. వాక్కులను బాలించునట్టి సోమము సర్వబలమునకు స్వామి యయినదై యజ్ఞముయొక్క స్తుతులతోఁ బూజను గోరుచున్నది.

౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౨౩౧౨ ౩ ౧
౧౫౬౮. సహస్రధారః పవతే సముద్రో వాచ మీఙ్ఖయః। సోమస్పతీ రయీణాగ్ం
౨ర ౩ ౧౨
సఖేంద్రస్య దివేదివే॥

అనేక ధారలుకలది, రసములను ఉట్టించునది, స్తుతులను ప్రేరించునది, ధనములకుఁబతియగునది, దినదినము నింద్రునకు మిత్రమైనది యగు సోమము, కారుచున్నది.

పవిత్రఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

3౧ ౨ 3 ౧౨ 3౧ ౨ర3 ౧ ౨
౧౫౯. పవిత్రంతే వితతం వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి
3౧ ౨ ౧౨ 3 ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర 3
విశ్వతః। అతప్తతనూర్న తదామో అశ్నుతే శ్రుతాస ఇద్వహన్తః
౧ ౨ర
సం తదాశత॥

మంత్రమునకు స్వామివయిన ఓ సోమమా! నిన్ను శోధించు పవిత్రము విశాలమయినది. (పవిత్రము=వడపోయుటకు వస్త్రము నాల్గుచివరలు తీసికట్టి సోమ రసము క్రుమ్మరింతురు. ఆవస్త్రము పవిత్రమనఁబడును.) అట్టి ప్రభువవయిన నీవు (పానము చేసినవాని) యవయవములను అంతట వ్యాపించుచున్నావు. పాకమును బొందనట్టి సోమము పవిత్రమందు వ్యాపించదు. పక్వమయినవే పవిత్రమందు వ్యాపించును. యాగము నవియే నిర్వహించును.

౧ ౨ 3 ౨ 3 ౧౨ 3౨3 ౧ ౨ 3౧ ౨ 3ఉ ౨ర ౧౨
౧౬౦. తపోష్పవిత్రం వితతం దివస్పదేZర్చన్తో అస్యతన్తవో వ్యథిరన్। అవన్త్యస్య
3 ౧ ౨ 3 ౧౨ 3౨ 3 ౧ ౨ర 3 ౧౨
పవితా రమా శవో దివః పృష్ఠమధి రోహన్తి తేజసా॥

శత్రువులఁదపింపఁజేయు సోమముయొక్క పవిత్రము ద్యులోకము నున్నత స్థానమున విస్తరింపఁబడినది. దీనితన్తువులు (వస్త్రపక్షమున దారములు-ఆకాశమను పక్షమునఁ గిరణములు) ప్రకాశించుచు వివిధముగా నున్నవి. భూమియందుపరువెత్తు చున్న దీని రసములు యాగకర్తను రక్షించుచున్నవి. తర్వాత—(హోమముద్వారా, ద్యులోకము వెనుకనున్న యున్నతస్థలమునఁ దన తేజస్సుతోఁగూడ నెక్కియున్నవి.

౧ ౨ 3౨ 3 ౧ ౧ ౨ 3 3౧ ౨ 3 ౧౨ 3 ౨
౧౬౧. అరురుచ దుషసః పృశ్నిరగ్రియ ఉక్షామిమేతి భువనేషు వాజయుః।
3 ౧౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3౨3 ౨ 3 ౧
మాయావినో మమిరే అస్యమాయయా నృచక్షసః పితరో గర్భమా
౨
దధుః॥

ఉషఃకాలములకు సంబంధించిన సూర్యుఁడు (అనఁగా ఉదయ సూర్యుఁడని తా॥) ముఖ్యుఁడు (లేక ముందున్నవాఁడు) అతఁడే ప్రకాశము కలిగించుచున్నాఁడు. అతఁడు జలమును వర్షించుచు లోకములందుఁ జల్లుచున్నాఁడు. వాటియన్నమును గోరినవారు ప్రజ్ఞావంతులునగు దేవతలు ఈ సోమముయొక్క ప్రజ్ఞచేతనే నిర్మించుచున్నారు. (సృష్టిని జేయుచున్నారనితా॥) ఈ సోమముయొక్క ప్రజ్ఞచేతనే నరులను జూచునట్టి పాలకులైన దేవతలు (ఓషధులందు) గర్భము గూర్చిరి. (ఈ ఋక్కులో సూర్య స్వరూపమే సోమముగా స్తుతింపఁబడెను.)

సామవేదోత్తరార్చికమందుఁ జతుర్థాధ్యాయ పంచమఖండము పూర్ణము.

—*—

## ౪ అధ్యాయము.

### ౬ ఖండము.

సౌభరిఋషి-కకుప్పగుచు బృహతీచ్ఛంద-అగ్నిదేవత.

౮౬౨. ప్రమగ్ంహిష్ఠాయ గాయత ఋతావ్నే బృహతే శుక్రశోచిషే। ఉపస్తుతాసో అగ్నయే॥

ఓ స్తుతికర్తలారా! దాతలలో శ్రేష్ఠుఁడు, సత్యవంతుఁడు, లేక యజ్ఞము కలవాఁడు, మహాత్ముఁడు, దీపించు తేజస్సుకలవాఁడు, నగు నగ్ని కొఱకు స్తోత్రమును బఠింపుము.

౮౬౩. ఆవగ్ంసతే మఘవా వీరవద్యశః సమిద్ధో ద్యుమ్న్యాహుతః। కువిన్నో
అస్య సుమతి భర్నవీ యస్యచ్ఛా వాజేభి రాగమత్॥

ధనవంతుఁడు, అన్నవంతుఁడు, ప్రజ్వలించుచున్నవాఁడు, అభిముఖముగా హోమము చేయఁబడినవాఁడు, నగు నగ్ని పుత్రులతోఁగూడిన కీర్తివంతమైన యన్నము ను యజమానులకిచ్చును. ఆ యగ్ని యొక్క మాయందుఁ గలుగఁదగిన యనుగ్రహబుద్ధి మావద్దకు అన్నములతో ననేకమార్లు వచ్చుఁగాక

గోయుక్తఋషి-అశ్వసూక్తఋషి కాని-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౮౬౪. తం తేమదం గృణీమసి వృషణం పృత్సునా సహిం। ఉలోక కృత్ను
మద్రివో హరిశ్రియం॥

వజ్రముఁ కలయిందా్ర! వర్షమును గురియించునది, సేనలందు శత్రువుల నో ర్చునది, లోకముల నిర్మించునది, హరియును రెండుగుఱ్ఱా లాశ్రయింపఁదగినది, యగు నా నీ (సోమపాన) మదమును స్తుతించుచున్నాము.

౮౬౫. యేన జ్యోతీగ్ంషి ఆయవే మనవేచ వివేదిథ। మన్దానో అస్య బర్హిషో
విరాజసి॥

ఓ యిందా్ర! నీస్వంతమైన మదముచేత (సూర్యశీపుత్రుఁడయిన) మనువు కొఱకు సూర్యాది తేజస్సుల (వృత్రాదు లావరించినవాఁటిని) లభింపఁజేసితివి. (ఆమదముచేత) మదించిన నీవు వృద్ధినొందిన యీ యజ్ఞమునందు విశేషముగా విరాజిల్లు చున్నావు.

౮౬౬. తదద్యా చిత్త ఉక్థినోऽనుష్టువన్తి పూర్వథా। వృషపత్నీరపో జయా దివేదివే॥

ఓ యింద్రా! నీయొక్క ఆ ప్రసిద్ధమైన బలము పూర్వకాలమందును వలె నిపుడుకూడ స్తుతికర్తలు క్రమముగా స్తుతించుచున్నారు. అట్టి నీవు వర్ష దేవత పాలించుచున్న యుదకములను ప్రతిదినమందును నీస్వాధీనము చేసికొనుము.

తిరశ్చీఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౮౬౭. శ్రుధీహవం తిరశ్చ్యా ఇంద్ర యస్త్వా సపర్యతి। సువీర్యస్య గోమతో రాయస్పూర్ధి మహాగ్ం అసి॥

ఓ యింద్రా! యెవఁడు నిన్ను సేవించుచున్నాఁడో అట్టి తిరశ్చియనెడు ఋషియొక్క యాహ్వానమును వినుము. (విని) యింద్రా! మంచిపుత్రులు గలట్టి, గోవులుకలట్టి, ధనముయొక్క దానముచేత మమ్ముఁబూరించుము. (ఏమంటే) నీవు మహానుభావుఁడవగుదువు (కనుక.)

౮౬౮. యస్త ఇంద్ర నవీయసీం గిరమన్ద్రామజీజనత్। చికిత్విమనసం ధియం ప్రత్నామృతస్య పిప్యుషీం॥

ఓయింద్రా యే యజమానుఁడు మిగుల క్రొత్తదయినది, మదముగలిగించునది, యగుస్తుతి వాక్కులను నీకొఱకుఁ జేసెనో యట్టి స్తుతికర్తకు నీవు పురాతనమైన, సత్యసంబన్ధమగుచు వృద్ధినొందిన, అతీంద్రియ విషయములం దెలిసిన నీకర్మను( రక్షణకర్మయనితా) నీవుచేయుము (అతనిరక్షింపుమనితా॥)

౧౨ ౩ ౨ఉ ౩ ౧ ౨౩౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨౩ ౨
౮౬౯. తముష్టవామ యంగిర ఇంద్రముక్థాని వావృధుః। పురూణ్యస్య పౌంస్యా సిషాసన్తో వనామహే॥
౩ ౧ ౨

ఏ యింద్రుని మాస్తుతులు ఉక్థ్యలు (ఇవియునుస్తుతులలోవే) వృద్ధినొందించినవో యాయింద్రునే (ఋషులము) మేముస్తుతించుచున్నాము. మేము ఈయింద్రుని యనేకములగు పౌరుషములను బొందఁదలఁచినవారమయి స్తుతులతో భజించుచున్నాము.

సామవేదమున చతుర్థాధ్యాయము దానిలోనా ఆవ ఖండమును సమాప్తము.

## ౫ అధ్యాయము.

### ౧ ఖండము.

ఋషిగణఋషి-జగతీచ్ఛంద-సోమదేవత.

౨౩౧౨ ౩౧౨ ౩౧ ౨ ౩ ౧౨ ౩ ౧౨
౮౭౦. ప్రతఆశ్వినీః పవమాన ధేనవో దివ్యా అసృగ్రన్ పయసా ధరీమణి।
౧ ౨ర౩౧ ౨ ౩ ౧ ౩ ౩౧౨ ౩౧౨
ప్రాంతరిక్షాత్స్థావిరీస్తే అసృక్షత యేత్వా మృజన్త్యృషిషాణ వేధసః॥

వడకట్టిన సోమమా! వ్యాపించినవి, ప్రీతిని గలిగించునవి, ద్యులోకము నుండి పడుచున్నవియు నగు నీ ధారలు పాలతోఁగూడినవి యగుచుఁ గలశమందుఁ బడుచున్నవి. ఏ ఋత్విజులు సోమమా! నిన్ను దుడిచి యభిషవించుచున్నారో, వారు స్థూలములైన ధారను అంతరిక్షమునుండి పాత్రలోనికిఁ బోయుచున్నారు.

౩౨౩ ౧౩ ౩౧ ౨ ౩౧౨ ౩౧ ౨ర ౩౧౨
౮౭౧. ఉభయతః పవమానస్య రశ్మయో ధ్రువస్య సతః పరియన్తి కేతవః।
౧౨౩౨౩ ౧౨౩౨౩ ౨౩ ౨౩౧ ౨ర ౩౧౨
యదీపవిత్రే అధిమృజ్యతే హరిః సత్తా నియోనా కలశేషు సీదతి॥

వడపోయుచున్న, నిశ్చలమయి యున్నట్టి, సోమముయొక్క కిరణములు ఇటు నటు వ్యాపించుచున్నవి. (ఇది యభిషవించునట్టి స్థితి) ఎపుడు దశాపవిత్రమందు (=వడపోయు వస్త్రము) ఆకుపచ్చనిరంగుగలిగిన యీ సోమము వడపోయఁబడునో, యపుడు స్థిరమయినదై యిది ద్రోణాది కలశములందు నిలుచుచున్నది.

౨౩ ౧౨ ౩ ౧౨ ౩౧౨ ౩౧ ౨ర ౩౧౨
౮౭౨. విశ్వాధామాని విశ్వచక్షు ఋభ్వసః ప్రభోష్టే సతః పరియన్తి కేతవః॥
౩ ౧౨ ౩౧౨ ౩ ౨౩౧ ౨౩ ౧౨
వ్యానశీ పవసే సోమధర్మణా పతిర్విశ్వస్య భువనస్య రాజసి॥

సర్వముం జూచునట్టి సోమమా! ప్రభువవయియున్న నీ గొప్ప కిరణములు తేజస్థానముల నన్నింటిని (నక్షత్రాలే దేవశరీరములని తా॥) బ్రకాశింపఁజేయు

చున్నవి. ఓ సోమమా! సర్వవ్యాపివైన నీవు (జీవనమునకు) ధారకమగు రస ప్రవాహముతోఁ గారుచున్నావు. సర్వలోకములకు స్వామివయిన నీవు రాజవగు చున్నావు.

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨     ౩ ౨ ౩ ౧    ౨ర ౩ ౨    ౧ ౨ ౩ ౨
౮౭౩. పవమానో అజీజన ద్దివశ్చిత్రం నత న్యతుం। జ్యోతిర్వైశ్వా నరం
౩ ౨
బృహత్॥

వడకట్టఁబడుచున్న సోమము గొప్పదగు వైశ్వానరజ్యోతిని ద్యులోకముయొక్క విచిత్రమైన పిడుగును వలెను బుట్టించుచున్నది.

౧ ౨   ౩ ౨ ౩ ౨ ౩   ౧ ౨    ౩ ౨   ౨ఉ ౩౧ ౩
౮౭౪. పవమాన రస స్తవ మదోరాజ న్నదుచ్ఛునః। వి వారమవ్య మర్షతి॥

ప్రకాశించుచున్న వడకట్టఁబడుచున్న సోమమా! మదకరమును రక్షస్సులకు దొరకనిదియు నగు రసము గొఱ్ఱెబొచ్చుతోఁ జేసిన వస్త్రమందు అనఁగా దశాపవిత్ర మందు వివిధముగాఁ బ్రసరించుచున్నది.

౧ ౨    ౩ ౨ ౩   ౨ ౩ ౧ ౨ ౩   ౩ ౨    ౨ ౩ ౨ ౩క   ౨ర
౮౭౫. పవమానస్య తేరసో దక్షో వి రాజతి ద్యుమాన్ జ్యోతిర్విశ్వగ్ం స్వ
౩ ౨
ర్దృశే॥

వడపోయంబడిన నీ యొక్క రసము బలముగలది, దీపించునదియై, ప్రకాశించుచున్నది. (లోకమున) వ్యాపించిన తేజస్సు నంతటిని జూచుటకై యుప యోగించుచున్నది.

మేధాతిథిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౨ఉ 3 ౧ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨
౮౭౬. ప్రయద్గావో న భూర్ణయ స్త్వేషా అయాసో అక్రముః। ఘ్నన్తః
3 ౨ఉ 3౧ ౨
కృష్ణా మపత్వచం॥

అభిషవించిన (=దంచి పిండిన) యే సోమరసములు కలవో, ఉదకములవలె శీఘ్రము క్రిందికిఁ బడుచున్నవి. లేక గోవులు తమ నివాసమును జేరునట్లు, అట్లు కాక స్తుతివాక్కులు స్తుతింపఁబడువానిం జేరునట్లు, (అని మూఁడు వ్యాఖ్యానములు వ్రాసిరి. గో=ఆవు. నీరు. వాక్కు. మూఁడర్థములు కలవు కనుక, యేది సందర్భ శుద్ధమో?) శీఘ్రగాములై పరువిడునవై, కాన్తిమంతములై, నల్లని తీసివేయుంబడిన తొక్కను నశింపఁజేయుచు (అనఁగాఁ దీగను దంచి పిండితే స్వరూపము నశించి రసముగాఁ గారును అని తా॥) నే సోమములు కారుచున్నవో, వాఁటిని స్తుతించుచున్నాము.

3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3క ౨ర 3 ౨ 3 ౧ ౨ 33 ౨
౮౭౭. సువి తస్య వనా మహేఽతి సేతుం దురాయ్యం। సాహ్యామ దస్యుమవ్రతం॥

శుభముగా లభించిన సోమముయొక్క రాక్షసబంధనమును (రాక్షసులను రాకుండఁ జేసిన సోమముయొక్క కార్యమని తా॥) స్తుతించుచున్నాము. అట్టి పని యెవ్వరు చేయలేనిది. మఱియు యాగాది కర్మలాచరింపనట్టివాని దిరస్కరింతుము గాక.

3 ౨ 3 ౧ ౨ 3౧ ౨ర 3 ౧ ౨ ౧ ౨ 3౧ ౨ 3 ౨
౮౭౮. శృణ్వే వృష్టేరివ స్వనః పవమానస్య శుష్మిణః। చరన్తి విద్యుతా దివి॥

వర్షధ్వనివలె వడకట్టబడుచున్న బలవంతమైన సోమము యొక్క ధ్వని వినఁబడుచున్నది. దానియొక్క కాన్తు లంతరిక్షమందుఁ జరించుచున్నవి.

౮౭౯. ఆ పవస్వ మహీమిషం గోమ దిందో హిరణ్యావత్। అశ్వావత్సోమ వీరవత్॥

ఓ సోమమా! అభిషవింపఁబడిన నీవు గోవులతోఁగూడినది, బంగారముగలది, పుత్రులు గలది, యశ్వములుకలది యగు గొప్ప యన్నమును గలిగింపుము. (సోమ యాగమువల్ల వర్షము, దానివల్లఁ దదితరములు కలుగునని తా॥)

౮౮౦. పవస్వ విశ్వచర్షణ ఆ మహీరోదసీ పృణ। ఉషాస్సూర్యో న రశ్మిభిః॥

సర్వమును జూచునట్టి సోమమా! నీవు రసము కార్చుము. దానితో ద్యులోక భూలోకములను, పగళ్ళను గిరణములతో సూర్యుఁడువలె నింపుము. ( నిండింపుమని తా॥ )

౮౮౧. పరినశ్శర్మయన్త్యా ధారయా సోమ విశ్వతః। సరా రసేవ విష్టపం॥

ఓ సోమమా! మాకు సుఖము కలిగించుచున్న ధారతో నీటితో భూలోకమువలెఁ బ్రస్రవించుము. వ్యాపించుము. (నీరు భూమినంతటిని వ్యాపించి యిటు నటు సంచరించునట్లు సోమరసము యాగములోఁగాని లేక శరీర నాడులలోగాని వ్యాపించి యిటు నటుతిరుగుఁగాక యని ప్రార్థనము )

ఇట్లు పంచమాధ్యాయ ప్రథమ ఖండము సంపూర్ణము.

:o:

## ౫ అధ్యాయము.

### ౨ ఖండము.

బృహన్మతిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩౧౨ ౩ ౧౨౩ ౨౩ ౧ ౨ ౧౨ ౩౨ఉ ౩౧౨
౧౧౨. ఆశురర్ష బృహన్మతే పరిప్రియేణ ధామ్నా। యత్రా దేవా ఇతిబ్రువన్॥

గొప్పబుద్ధిగల సోమమా! (దేవతలకు) ప్రియమైనశరీరముతో ననఁగాధారతో శీఘ్రముగా పరువెత్తుము ఏచోట "దేవతలు" అని పలుకుదురో (ఆచోటికిం బొమ్ము అనియన్వయము)

౩ ౧ ౨ర ౩౧౨ ౩ ౨౩౧౨ ౩౨ ౩౧
౧౧౩. పరిష్కృణ్వన్ననిష్కృతంజనాయ యాతయన్నిషః। వృష్టిందివః పరిస్రవ॥

సంస్కరింపఁబడని (=శుద్ధిచేయఁబడని) యజమానుని లేక స్థానమును సంస్కరించుచు, జనులకు నన్నములను బయలుదేరించుచు, నంతరిక్షమునుండి ఓ సోమమా! స్రవించుము.

౩౨ఉ ౩౧ ౨ర ౩ ౧ ౨ ౩౨౩ ౨ ౧ ౨౩ ౧
౧౧౪. అయగ్ం సయో దివస్పరి రఘుయామా పవిత్ర ఆ। సింధోరూర్మా
౨ర
వ్యక్షరత్॥

ఈ సోమము పవిత్రమందు (పోయంబడి) నీటి సమూహామందు వివిధముగాఁ గారెను. ద్యులోకము మీఁది భాగమందు చులుకని నడకగలదై యది యున్నది.

౩౧౨ ౩౧౨ ౨ఉ ౩ ౧౨ ౩౧౨ ౩౧౨ ౩౧౨
౧౧౫. సుతఏతి పవిత్ర ఆ త్విషిందధాన ఓజసా। విచక్షాణో విరోచయన్।

అభిషవింపఁబడినదై దశాపవిత్రమందు (=వడపోతవస్త్రము); కాంతిని

ధరించుచు, సర్వమును జూచుచు, (దేవతలను) ప్రకాశింపఁజేయుచు, శీఘ్రము గమనించుచున్నది. (సోమము కర్త)

౮౮౬. ఆ వివాసన్ పరావతో అథో అర్వావతః సుతః। ఇంద్రాయ సిచ్యతే మధు॥

అభిషవించిన సోమము దూరస్థానమునుండి, మఱియు దగ్గఱచోటినుండియు, దేవతలను దెప్పించుచు నింద్రునికొఱకు మధురమయినదయి పోయఁబడుచున్నది. లేక తృప్తిపరచుచున్నది.

౮౮౭. సమీచీనా ఆనూషత హరిగ్ం హిన్వన్త్యద్రిభిః॥ ఇందు మింద్రాయ పీతయే॥

చక్కఁగాఁ గలిసిన స్తుతికర్తలు స్తుతించుచున్నారు. ఆకుపచ్చని సోమమును ఇంద్రుని పానమునకై శిలలతోఁ బిండుచున్నారు.

జమదగ్ని లేక భృగుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౮౮౮. హిన్వన్తి సూరముస్రయః స్వసారో జామయస్పతిం। మహామిందుం మహీయువః॥

(కర్మార్థము సర్వత్రా) గమనించుచున్న, పరస్పరము కలసి వెలసియున్న చేతిప్రేళ్ళు సోమ మభిషవింపఁగోరి మంచి ధైర్యమును గలిగించునట్టి, యంతటిని పాలించునట్టి, మహత్త్వము గలట్టి, సోమరసమును (పాత్రలలో) పోయుచున్నవి (అనఁగా రెండుచేతులప్రేళ్ళుకలసి పిండి రసము పాత్రలోఁ బోయుచున్నారని తా॥ )

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౩౧ ౩౧ ౨ ౩ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౮౯౯. పవమాన రుచా రుచా దేవ దేవేభ్యః సుతః। విశ్వావసూన్యా విశః॥

(పవిత్రమందు) వడఁబోసిన సోమమా! తేజస్సంతటితోను దీపించువానా! దేవతలకొఱకు నభిషవింపఁబడి నీవు వ్యాపించిన సర్వధనములను మాకుం బొందించుము లేక సర్వ పాత్రములందును బ్రవేశించుము. (వసు=నివాసస్థానమని రెండవ యర్థమునవ్యుత్పత్తి.)

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౯౦౦. ఆ పవమాన సుష్టుతిం వృష్టిం దేవేభ్యోదువః। ఇషే పవస్వ సంయుతం॥

ఓ సోమమా! మంచి స్తుతితోఁగూడిన వర్షమును దేవతల సేవకొఱకుఁ గురియించుము. (నా స్తుతితో వర్షము కురియునట్లు దేవతలం దృప్తిపఱచుమని తా॥) మఱియు మా యన్నముకొఱకుఁ జక్కగా (మాకు నుపయోగించు వర్షమును) గురియించుము

సామవేదోత్తరార్చికమందుఁ బంచమాధ్యాయ ద్వితీయఖండము సంపూర్ణము.

౫ అధ్యాయము.

౩ ఖండము.

శతంభరఋషి-జగతీచ్ఛంద-అగ్ని దేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౯౦౧ జనస్యగోపా అజనిష్ట జాగృవి రగ్నిః సుదక్షః సువితాయ నవ్యసే। ఘృత
౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨
ప్రతీకో బృహతా దివిస్పృశా ద్యుమది భాతి భరతేభ్యః శుచిః॥

జనులను రక్షించువాఁడు, జాగ్రత్త కలవాఁడు, (ఎల్లపుడు మేల్కొనియుండువాఁడని తా) మంచిబలము కలవాఁడు నగునగ్ని క్రొత్తదగు లోకకళ్యాణమునకుఁ

బ్బెను. నేతితోఁ బ్రజ్వలించిన యవయవములు కలవాడు, ద్యులోకమున వ్యాపించిన గొప్ప తేజస్సుతోఁ గూడినవాఁడు, పరిశుద్ధుఁడు నగునగ్ని ఋత్విజులకొఱకు (భరత= ఋత్విజుఁడు)దీప్తి మంతుఁడై ప్రకాశించు చున్నాఁడు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ర
౮౯౨. త్వామగ్నే అంగిరసో గుహా హితమన్వ విన్దం శిశ్రియాణం వనే
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩
వనే। స జాయసే మథ్యమానః సహూ మహా త్వా మాహుః సహసస్పు
౧ ౨
త్ర మంగిరః॥

ఓయగ్నీ! అంగిరసులనెడు ఋషులు గూఢముగా నున్నట్టి ప్రతివృక్షము నాశ్రయించినట్టినిన్ను బొందిరి. గొప్పబలముతోఁ గూడిననీవు మథించఁబడుచు బుట్టుచున్నావు. (కనుక) అంగిరసులవాఁడవని, బలమునకుఁబుత్రుఁడవని నిన్నంచురు. (బలముతో కఱ్ఱలు మథించినందున నగ్ని పుట్టుటచే బలమునకుఁ బుత్రుఁడయ్యెనని తా॥)

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౨ ౧ ౩ ౩ ౩ ౨ ౩ ౧
౮౯౩. యజ్ఞస్య కేతుం ప్రథమం పురోహిత మగ్నిం నర స్త్రిషధస్థే
౨ర ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧
సమిన్ధతే॥ ఇంద్రేణ దేవైః సరథగ్ం సబర్హిషి సీదన్నిహోతా యజ
౨ ౩ ౧ ౨
థాయ సుక్రతుః॥

కర్మనాయకులైన ఋత్విజులు యజ్ఞమునకు గుఱుతుగానున్నవాఁడు, ముందట నుంచఁబడినవాఁడు, ఇంద్రునిచే దేవతలతో సమానరథమందుంచఁ బడినవాఁడు, నగు నగ్నిని మూఁడుచోట్లను (విహారస్థలమని వాటినందురు. విహారము=అగ్నిని ప్రతిష్ఠించిన స్థలము.) మొట్టమొదటఁ బ్రజ్వలింపఁజేతురు. సత్కర్మ నెఱవేర్చువాఁడు, దేవతలను బిలుచుకొని వచ్చువాఁడు, నగు నగ్ని దర్భలు పరిచినచోట యాగముఁకొఱకు బ్రతిష్ఠింపఁబడియుండెను.

గృత్సమదఋషి-గాయత్రీచ్ఛంద-మిత్రావరుణదేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ఉ౩౧
౮౯౪. అయంవాం మిత్రా వరుణాసుతః సోమ ఋతావృధా॥ మమేదిహ
౨ ౩ ౧ ౨
శ్రుతగ్ం హవం॥

సత్యమును లేక యజ్ఞమును వృద్ధిపొందించునట్టి ఓ మిత్రా వరుణులారా! మీకొఱకు ఈ సోమము అభిషవింపఁబడినది. కనుక నీ యాగమునందు నా యాహ్వానమునే వినుఁడు.

౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨
౮౯౫. రాజానావన భిద్రుహాధ్రువే సదస్యుత్తమే॥ సహస్రస్థూణ ఆశాతే॥

ప్రకాశించుచున్నవారు, ఎవరికిని ద్రోహముచేయనివారు, నగు మిత్రావరుణులిద్దఱుస్థిరమై అనేక స్తంభములుగల స్థానమునఁగూర్చున్న మీరురండు.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర౩౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౮౯౬. తాసమ్రాజా ఘృతాసుతీ ఆదిత్యా దానునస్పతీ। సచేతే అనవహ్వరం॥

సామ్రాజ్యము చేయుచున్నట్టి, (అనఁగాఁదనయాజ్ఞచేత నెల్లరను శాసించుచున్నయనితా॥) వర్షమును గురియించునట్టి, ఆదితికిఁబుత్రులైనట్టి, ధనమునకు నీశ్వరులైనట్టి, యా మిత్రావరుణులు కపటములేని యాగకర్తను (హవిర్భక్షణమునకు) సేవించుచున్నారు. (ఆశ్రయించుచున్నారని తా॥)

రాహుగణగౌతమఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ ౩౨ ౩౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩౧ ౨ర
౮౯౭. ఇంద్రో దధీచీ అస్థభిర్వృత్రా ణ్యప్రతిష్కుృతః। జఘానవతీర్నవ॥

(ఇచట నొకకథకలదు—ఎట్లన అధర్వణపుత్రుఁడు దధీచుఁడు బ్రతికి యున్నపుడు రాక్షసులతనికోడి పాఱిపోయిరి. అతఁడు స్వర్గస్థుఁడుకాఁగానే భూమి యంతటను రాక్షసులాక్రమించిరి. వారితో యుద్ధముచేయలేక ఇంద్రుఁడు అతని మరణమెఱిఁగి అతని యవయవమేదైన భూమిమీఁద నున్నదాయని వెదకించెను. కురుక్షే

త్రముచివరను శర్యణావతి యను సరస్సులో నతని యశ్వ శిరస్సున్నదని తెలిసి కొనెను. దానిలోని యెముకతో నాయుధముం జేసి దానితో రాక్షసులఁజంపెను. దధీచికి మధువిద్య నశ్వినులకుఁ జెప్పునపుడు అశ్వినులు అశ్వ శిరస్సునిచ్చి విద్యనతని వద్ద నభ్యసించి ఆశిరస్సుపారవైచి మరల మనుష్య శిరస్సును సంధించిరట) శత్రువులచేఁ దిరస్కరింప శక్యముగాని యింద్రుఁడు దధీచఋషియొక్క యెముకల తో నెనిమిదివందల పది రూపములయిన మాయావులగు నసురులను జంపెను. ముల్లోకములందున్న దేవతలను ముంచివేయుటకు అసురమాయ మొదట మూఁడు విధములయ్యె, 3. కాని అదిచాలినదికాదు. భూత-భవిష్యద్వర్తమాన కాలముల వారిని ముంచివేయుటకు ఒక్కొక్కటి మఱల మూఁడేసి భాగములయ్యె ౯. ఈ తొమ్మిదియు ఉత్సాహ-ప్రభు-మంత్ర-శక్తుల దేవతలను ఆవరించుట మఱల మూఁడేసి భాగములయ్యె. కనుక ౨౭. ఈ యిరువదియేడు విధాలమాయయు సత్వరజ స్తమస్సులను గుణములతో మఱల మూఁడేసియయ్యె. ఇట్లు ౮౧ అయ్యె. ఈ యెన భైయొక్క మాయాభాగములు ఒక్కదిక్కునే ఆవరించెను. మిగిలినతొమ్మిది దిక్కు లుండిపోయి నందునఒక్కొక్కటి మఱలపదేసి భాగములయి పది దిక్కులందు ౮౧౦ గావ్యాపించి దేవతలను మాయలు ఆవరించినవి. (దేవతలు=సూర్యకిరణములు, అసురమాయలు, చీఁకట్లు. లేక మేఘములు అని అనవచ్చును.)

3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౧ ౨3౧౨ ౧౨ 3 ౧౨
౮౯౮. ఇచ్ఛన్నశ్వస్య యచ్ఛిరః పర్వతేష్వపశ్రితం। తద్విదచ్ఛర్యణావతి॥

ఏ శిరస్సు కొండలమీఁదనుండి (జారి) పడి శర్యణావతియను సరస్సున నుం డెనో, ఆయశ్వముయొక్క శిరస్సును ఇంద్రుఁడు కోరుచు (దానిని తెచ్చి శత్రువుల నోడించెనని పూర్వఋక్కుతో నన్వయము.)

౨ఉ 3 ౨ 3 ౨ 3 ౧౨ 3క ౨ర 3౨3 ౧౨ 3 ౨
౮౯౯. అతాహ గోరమన్వత నామ త్వష్టు రపీచ్యం। ఇత్థాచంద్రమసో గృహే॥

గమనించునట్టి యీ చంద్రమండలమునందే రాత్రియందు సూర్యసంబంధము లగు దాగియున్న యే కిరణములు ఈ విధముగాఁ దెలియంబడుచున్నవి. (అనఁగా

చంద్రబింబమందుఁ బ్రతిఫలించి కనఁబడుచున్నవని తా॥) ఇట్లు చెప్పుట సూర్య చంద్ర రూపియగు నింద్రునకే స్తవము. ఇంద్రుఁడు పన్నిద్దఱు సూర్యులలో నొకఁడుగాఁ జెప్పఁబడినాఁడు) ఇట్లు సూర్యచంద్రులు తేజోవంతులగుచున్నారు.

వశిష్ఠఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నులు దేవత.

3 ౧ ౨ 3౧ ౨ర3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 3౧
౯౦౦. ఇయం వా మస్య మన్మన ఇంద్రాగ్నీ పూర్వ్యస్తుతిః। అభ్రాద్ వృష్టి
౨
రివా జని॥

ఓ యింద్రాగ్నులారా! యీ స్తుతి ముఖ్యమయినది. (వసిష్ఠుఁడను) స్తుతికర్త (నగు నా) వల్ల మీ కొఱకుఁ జేయఁబడినది. మేఘమునుండి వర్షమువలె పుట్టెను. (దానిని వినుఁడని ముందుకన్వయము)

3 ౧ ౨3౨ఉ 3 ౧ ౨ 3 ౧౨3 ౧౨ 3 ౧ ౨ 3
౯౦౧. శ్రుణుతం జరితు ర్హవ మింద్రాగ్నీ వనతం గిరః। ఈశానా పిప్యతం
౧ ౨
ధియః॥

ఓ యింద్రాగ్నులారా! స్తుతికర్త యొక్క యాహ్వానమును మీరు వినుఁడు. అతని వాక్కులను సేవించుఁడు. ఈశ్వరులైన మీరు (మేము చేసిన కర్మలకు ఫలములను) పూరించుఁడు.

౧ ౨ 3 ౧ ౨ 3౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨
౯౦౨. మా పాపత్వాయ నో నరేంద్రాగ్నీ మాభిశస్తయే। మా నో రీరధతం
3 ౨
నిదే॥

నాయకులైన యింద్రాగ్నులారా! మమ్ము నీచులకు వశమగు వారింగాఁ జేయకుఁడు. (శత్రువులొనరించిన) కష్టములకుఁ బాలుకానివ్వకుఁడు. మమ్ము నిందించు వానికిని స్వాధీనము చేయకుఁడు.

ఉత్తరార్చికమందుఁ బంచమాధ్యాయ తృతీయఖండము పరిసమాప్తము.

## ౫ అధ్యాయము.

### ౪ ఖండము.

దృఢచ్యుత్ ఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౦౩. పవస్వ దక్షసాధనో దేవేభ్యః పీతయే హరే। మరుద్భ్యో వాయవే మదః॥

ఆకుపచ్చనిరంగుగల యో సోమమా! బలమునకు సాధనమయినట్టి, మదమును గలగించునట్టి, నీవు ఇంద్రుండు మొదలగు దేవతలయొక్కయు, మరుత్తులయొక్కయు పానముకొఱకు రసముకార్చుము.

౯౦౪. సం దేవైః శోభతే వృషా కవిర్యోనావధి ప్రియః। పవమానో అదాభ్యః॥

వర్షముకురియించునది, జరిగిపోయినదాని నెఱుంగునది, తనచోటనున్నది, అందఱికిఁ బ్రియమగునది, కారుచున్నది, యెవరును ఎదిరింపశక్యముకానిది, అగుచు సోమము శోభిల్లుచున్నది.

౯౦౫. పవమాన ధియా హితో3ऽభి యోనిం కనిక్రదత్। ధర్మణా వాయుమారుహః॥

(మిత్రావరుణపుత్ర) వసిష్ఠఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౯౦౬. తవాహꣳ సోమ రారణ సఖ్య ఇంద్రో దివే దివే। పురూణి బభ్రో ని చరన్తి మామవ పరిధీꣳరతి తాꣳ ఇహి॥

ఓ సోమమా! నీ స్నేహమునందు నేను ప్రతిదినమందు ఆనందింతునుగాక. బూడిదరంగుగల సోమమా! అనేక రక్షస్సులు నీ సఖ్యమందున్న నన్ను బాధించుచున్నవి. ఆయడ్డులనుదాటి (అనఁగా వానినిగొట్టి) పొమ్ము.

౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౯౦౭. తవాహం న క్తముత సోమ తే దివాదుహానో బభ్రఊధని। ఘృణా
౨ర౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౧ ౨
తప న్త మతి సూర్యం పరః శకునాఇవ ప ప్తిమ॥

బూడిదరంగుగల సోమమా! మఱియు రాత్రియందును బగటియందును గూడ సఖ్యముకొఱకు నీ సమీపమందు నేను విహరింతును. అట్టి మేము మీఁదుగానుండి తపింపఁజేయుచున్న సూర్యుని రూపముననున్న నిన్నుగూర్చి పక్షులెగురునట్లు ఎగిరి పడుదుముగాక.

బృహన్మతిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౯౦౮. పునానో అక్రమీదభి విశ్వామృధో విచర్షణిః। శుమ్భన్తి విప్రం ధీతిభిః॥

వడపోయఁబడుచున్న, సర్వముంజూచుచున్న, సోమము శత్రువుల నందఱిని ఓడించెను. మేధావియగు నా సోమమును (అభిషవాది) కర్మలచేత లేక స్తుతికర్తలచేతను (యజమాన ఋత్విజులు) అలంకరించుచున్నారు.

౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౩ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర
౯౦౯. ఆ యోని మరుణో రుహద్గమ దింద్రోవృషా సుతం। ధ్రువే సదసి సీదతు॥

ఈ యెఱ్ఱసోమరసము ద్రోణకలశమును ఎక్కెను. (అనఁగా నందులోఁబడెనని) తర్వాత వర్షమునుగురియించు నింద్రుఁడు అభిషవించిన సోమమును బొందెను స్థిరమైన స్థానమందు (అనఁగా ద్యులోకమందు) నింద్రుఁడు నివసించెను. (సోమము

త్రాగి స్వర్గమునకేగెననితా॥) ఒకచో బూడిదరంగు నింకొకచో నెఱ్ఱరంగు మఱొక చోట నాకుపచ్చనిరంగు సోమమునకు వర్ణించుచున్నారు. అది తీగగానున్నపుడు, చిదుకఁగొట్టి రసము పిండునపుడు, పాలు పెరుగు మొదలగునవి కలిపి సిద్ధమగు నపుడు, దానికిం గలుగఁనని యవస్థానుగుణ వర్ణనముగా గ్రహింపనగును.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౯౧౦. నూనో రయిం మహామిన్దోऽస్మభ్యగ్ం సోమ విశ్వతః। ఆపవస్వ
౩ ౧ ౨
సహస్రిణం॥

ఓ సోమమా! యభిషవింపఁబడిన నీవు మాకు శీఘ్రముగా గొప్పది, లెక్కలేనిది యగు ధనమును సర్వస్థలములనుండి ప్రవహింపఁజేయుము.

ఉత్తరార్చికమందుఁ బంచమాధ్యాయమున చతుర్థఖండము సంపూర్ణము.

———:o:———

## ౬ అధ్యాయము.

## ౬ ఖండము.

(మైత్రావరుణ) వశిష్ఠఋషి-విరాట్ఛంద-ఇంద్రదేవత.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౯౧౧. పిబా సోమ మింద్ర మన్దతు త్వా యంతే సుషావ హర్యశ్వాద్రిః
౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
సోతుర్బాహుభ్యాగ్ం సుయతో నార్వా॥

ఓ యింద్రా! సోమమును ద్రావుము. సోమము నిన్ను మదింపఁజేయును గాక. హరియను గుఱ్ఱములు కలవాఁడా! నీ కొఱకు నభిషవము (=సోమముఁబిండిన)

చేసినవానియొక్క బాహువులతో, గ్రైవములతో, గుఱ్ఱమునుబట్టినట్లు పట్టుకొని శిలయే సోమమును అభిషవించెనో ఆ సోమము మదింపఁజేయుఁగాక.

౯౧౨. యస్తే మదో యుజ్యశ్చారు రస్తి యేన వృత్రాణి హర్యశ్వ హంసి
స త్వామింద్ర ప్రభూవసో మమత్తు॥

ఓ యింద్రా! నీకు యోగ్యమయినట్టి మంచి మదముకలిగించు సోమ మేది కలదో, దేనిని పానముచేసినందున (ఆవరించిన రాక్షసాది) శత్రువులను జంపుచున్నావో, ఓ విశేషధనముకలవాఁడా! ఆ సోమము నిన్ను మదింపఁజేయుఁగాక.

౯౧౩. బోధ సు మే మఘవ న్వాచ మేమాం యాం తే వసిష్ఠో అర్చతి
ప్రశస్తిం॥ ఇమా బ్రహ్మా సధమాదే జుషస్వ॥

ఓ యింద్రా! నీయొక్క స్తుతిరూపమయిన యే వాక్కును వశిష్ఠఋషి పఠించుచున్నాఁడో, యీ వశిష్ఠుని వాక్కును బాగుగాఁదెలిసికొమ్ము. ఈ హవిస్సుల రూపములగు నన్నములను యజ్ఞమందు అనుభవింపుము.

త్రిశోక లేక రేభఋషి-అతిజగతీచ్ఛంద-ఇంద్రదేవత.

౯౧౪. విశ్వాః పృతనా అభిభూతరం నరః సజూస్తతక్షురింద్రం జజనుశ్చ
రాజసే॥ క్రత్వేవరే స్థేమన్యామురీ ముతోగ్రమోజిష్ఠం తరసం
తరస్వినం॥

వ్యాపించిన సర్వసేనలు అన్యోన్యముకలిసినవై శత్రువుల నోడించు నింద్రుని జూరుకుగలవానింజేసెను. లేక యుద్ధముల నన్నిఁటిని జయించునట్టి యింద్రుని స్తుతికర్తలు స్తుతులతో నందముకలిసి వాడికలవానింగాఁజేసిరి. లేక యాగకర్తలు

హవిస్సులతోనని (కూడ నర్థము వ్రాసిరి ) మఱియు స్తుతికర్తలు అతని ప్రకాశము కొఱకు సూర్య రూపేంద్రునిఁ బుట్టించిరి (స్తుతులతోఁ బ్రత్యక్షము చేసికొనిరి అని తా॥) శత్రువులైన యసురులను జంపువాఁడు, ఉగ్రబలముకలవాఁడు, తేజోవంతుఁడు, వృద్ధినొందినవాఁడును, వేగవంతుఁడు నగు నింద్రుని ధనముకొఱకు స్తుతించుచున్నారు.

3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౨ 3 ౧ ౨
౯౧౫. నేమిం నమన్తి చక్షసా మేషం విప్రా అభిస్వరే। సుదీతయో వో
3 ౨ఉ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర
అద్రుహోఽపి కర్ణే తరస్వినః సమృక్వభిః॥

చక్రముయొక్క అంచు చక్రములోని ఆకులను (ఆకులంటారు) జుట్టినట్లింద్రుఁడు సర్వమును వ్యాపించి యున్నాఁడు. అట్టి యింద్రుని దర్శన మాత్రముచేత మేధావంతులు స్తోత్రగానములకు వశునిగాఁ జేయుచున్నారు. మేష (=గొఱ్ఱె) రూపుఁడగు నింద్రుని స్తుతించుచున్నారు. (ఇంద్రుఁడు పూర్వము తాను మేషరూపుఁడై మేధాతిథిని స్వర్గమునకు గొనిపోయెనట!) (ఇపుడు యజమానుఁడు స్తుతికర్తలతో ననుచున్నాఁడు.) స్తుతికర్తలారా! యెవరికిని ద్రోహముచేయని మీరు కర్మలందు త్వరగల వారలగుచు నింద్రుని చెవిలో మంత్రములతో వినునట్లు స్తుతుల వినిపింపుడు.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3౧ ౨ ౨ర 3 ౧ ౨ 3 ౨
౯౧౬. సము రేభాసో అస్వరన్నింద్రగ్ం సోమస్య పీతయే। స్వఃపతిర్యదీ వృధే
3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
ధృతవ్రతో హ్యోజసా సమూతిభిః॥

ధ్వనించుచున్న స్తుతికర్తలు లేక రేభవంశఋషులు సోమపానము కొఱకు నింద్రుని స్తుతించిరి. (ప్రార్థించిరని తా॥) ఎపుడు స్వర్గముపాలించు నింద్రుఁడు యజమానుల వృద్ధికొఱకు నగుచున్నాఁడో యపుడు కర్మలనాచరించు నింద్రుఁడు బలముచేత మరుత్తులతోఁ గూడుకొనుచున్నాఁడు.

పురుహన్మాఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర ౩ ౨ఉ ౩ ౧౨౩ ౧౨ ౧౨ ౩౧
౯౧౭. యో రాజా చర్షణీనాం యాతా రథేభి రధ్రిగుః। విశ్వాసాం తరుతా
౨ర ౩ ౨౩ ౧ ౨ ౩౨ ౩౨
పృతనానాం జ్యేష్ఠంయో వృత్రహా గృణే॥

ఏ యింద్రుఁడు మనుష్యులకు రాజయినవాఁడును, రథములతో వచ్చువాఁడును, ఇతరులుచేర శక్యముగాని గమనముగలవాఁడును, సకల శత్రుసేనలను అతిక్రమించువాఁడును, ఎవఁడు వృత్రునిసంహరించెనో, అట్టి గుణవంతుఁడు మహాత్ముఁడునగు నింద్రుని స్తుతించుచున్నాను.

౨౩౧ ౨ ౩౧౨౩ ౧౨౩౧ ౨౩౧౨ ౧౨౩౨౩
౯౧౮. ఇంద్రంతగ్ం శుమ్భ పురుహన్మన్నవసే యస్యద్వితా విధర్తరి హస్తేనవజ్రః
౧౨ ౩౨ ౩౨౩౧ ౨ర
ప్రతిధాయిదర్శతో మహాందేవో నసూర్యః॥

ఓ పురుహన్మఋషీ! నీవు (హవిస్సులిచ్చి) రక్షించుకొఱకు అలంకరింపుము. ఏ నీకాధారుఁడయిన యింద్రునందు (ఉగ్రత్వము-శాంతము) నను రెండుగుణములు గలవో (అతనిచేతి॥) చూడఁదగినట్టి గొప్పదయిన వజ్రము సూర్యదేవుని వలె నున్నది. చేతిలోఁబట్టుకొనంబడినది.

ఉత్తరార్చికమున బంచమాధ్యాయ పంచమఖండము సంపూర్ణము.

———:౦:———

## ౫ అధ్యాయము.

### ౬ ఖండము.

అసిత లేక దేవలుఁడు ఋషి-గాయత్రీచ్ఛంద ఇంద్ర దేవత.

౧౨౩ ౨ ౩౨ ౩౧ ౨ర ౩క౨ర ౩ ౨ ౩౧౨
౯౧౯. పరిప్రియా దివః కవిర్వయాగ్ంసి నప్త్యో హితః। స్వానైర్యాతి
౩౧౨
కవిక్రతుః॥

మేధావియు, కర్మనవలంబించినదియు, అధిషవణ ఫలకముల యందుంచఁబడినదియు నగు సోమము ద్యులోకము మీఁదిభాగమున తాళ్లమీఁద సిద్ధపఱుపఁబడి (అధ్వర్యునిద్వారా) స్రవింపఁజేయఁబడుచున్నది. (తాతిపలకలలో దంచి తాతిపలకలోనొక్కి యధ్వర్యుఁడు రసముఁబిండును )

౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧
౯౨౦. ససూనుర్మాతరా శుచిర్జాతో జాతే అరోచయత్। మహాన్మహీ
౨ ౩ ౧ ౨
ఋతావృధా॥

పుట్టినది, శుద్ధమైనది, ఉత్తమమయినది, యగు సోమమనెడు పుత్రుఁడు, గొప్పవి, యజ్ఞమును వృద్ధినొందించునట్టి ప్రపంచమునకుఁ దలిదండ్రులయిన ద్యులోక భూలోకములను ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩౧౨
౯౨౧. ప్రప్రక్షయాయ పన్యసే జనాయ జుష్టో అద్రుహః। వీత్యర్షపనిష్టయే॥

సోమమా! నీకత్యంతము నివాసమయినవాఁడు, ద్రోహమెఱుఁగనివాఁడు, నగు స్తుతికర్తయగు జనునికై భక్షింపుటకు సరిపడినంతదానవై నీవు స్తుతి కొఱకుఁ బొమ్ము.

శక్తిఋషి-కకుప్ఛంద-సోమదేవత.

౯౨౨. త్వగ్ంహ్యాం౩గ దైవ్యా పవమాన జనిమాని ద్యుమత్తమః। అమృతత్వాయ ఘోషయన్॥

వడకట్టంబడినట్టి, దేవతల సంబంధమయినట్టి, సోమమా! మిగులకాన్తిగల నీవే శీఘ్రముగా ధ్వనించుచు (దేవతల) జన్మములనుగూర్చి మరణము లేకుండుటకు రమ్ము. (దేవతలజన్మ=దేవతలు యాగమునవచ్చుట)

౯౨౩. యేనా నవగ్వా దధ్యఙపోర్ణుతే యేన విప్రాస ఆపిరే। దేవానాగ్ం సుమ్నే అమృతస్య చారుణాయేన శ్రవాగ్ం స్యాశత్॥

తొమ్మిదిమాసములు మంత్రమును జపించిన దధ్యఙ్ఙుఋషి యే సోమముచేత (పణులపహరించి గోవులనుంచిన ద్వారమును) దెరచెనో, మేధావులగు నాతని ముఖ్యవంశ్యులు (అంగిరసులు) గోవులను (మఱల) సంపాదించుకొనిరో, మఱియు దేవతలసుఖమునకై యజ్ఞమందు బుట్టినదై కళ్యాణకరమైన యమృతముయొక్క (=ఉదకముయొక్క అని యిచటనర్థము) సంబంధముగల యన్నములను భక్షించెనో, (ఉదకమువల్ల సస్యములుపండినవాటిని భక్షించెననితా॥) అట్టి యో సోమమా! (దేవతల మరణరాహిత్యమునకై (అనఁగా అమరత్వము సిద్ధించుటకనితా॥) రమ్ము అని పూర్వమంత్రములోని కన్వయము.)

అగ్నిఋషి-ఉష్ణిక్ఛందము-సోమదేవత.

౯౨౪. సోమః పునాన ఊర్మిణా వ్యంవారం విధావతి। అగ్రేవాచః పవమానః కనిక్రదత్॥

వడకట్టఁబడినసోమము తనధారచేత గొఱ్ఱెబొచ్చుతో నిర్మించిన పవిత్రమందు (=వడపోతబట్ట) పలువిధములఁ బ్రసరించుచున్నది. (ఆసోమము) వడకట్టంబడినది. (స్తోత్రము సమీపమున) ధ్వనించుచు (బ్రసరించుచున్నదని పూర్వమున కన్వ యము.)

౩౧ ౨ ౩ ౨౩ ౨౩౧౨౩ ౧ ౨ ౩౧౨౩ ౨ ౩ ౨ ౩
౯ ౨౫. ధీభిర్మృజన్తి వాజినం వనేక్రీడన్త మత్యవిం। అభిత్రిపృష్ఠం మతయ
౧ ౨
స్సమస్వరన్॥

బలముగలదియు (వసతీవరీయను) ఉదకములందు విహరించుచున్నది. (అనఁగానీటిలోఁగలిసినదనితా॥) గొఱ్ఱెబొచ్చువస్త్రమును దాటినది, యగు సోమమును ఋత్విజులు వ్రేళ్లతో సృజించుచున్నారు. (పిండుచున్నారనితా॥) మూఁడు పాత్రలందు (ద్రోణకలశ-ఆధవనీయ-పూతభృతు-అనిపేర్లుగలవి) పడుచున్న సోమమును లేక (ప్రాత-ర్మధ్యాహ్న-సాయం-సవనములం (=యాగములు) దు) వినియోగించఁబడుచున్న సోమమును స్తోత్రములు సర్వత్రస్తుతించుచున్నవి.

౧ ౨ ౩౧ ౨ ౩౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర
౯ ౨౬. అసర్జికలశాగ్ం అభిమీఢ్వా న్సప్తిర్నవాజయుః। పునానోవాచం
౩౧౨
జనయన్నసిష్యదత్॥

(యాగకర్తలకు) అన్నమును గోరుచున్నది, వర్షించునది. లేక చలువనిచ్చునది యగు నా సోమము కలశములందు యుద్ధమందు గుఱ్ఱమువిడువఁబడినట్లు పోయఁబడినది. తర్వాత వడకట్టఁబడిన సోమము ధ్వనించుచుఁ బాత్రలందు జారుచున్నది.

ప్రతర్దనఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౩ ౨౧ ౩ ౧ ౨౩౧ ౨౩ ౨ ౩ ౨ ౨౧ ౨ ౨ ౩ ౨
౯ ౨౭. సోమఃపవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః।
౧ ౧ ౨ర ౩౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
జనితాగ్నే ర్జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోత విష్ణోః॥

బుద్ధులను లేక మంత్రములను బుట్టించునది, ద్యులోకమును బుట్టించునది, (బయలుదీయునదని తా॥) పృథివిని బయలుపఱచినది, అగ్నిని ప్రకాశింపఁ జేయునది, సూర్యునిం బుట్టించినది, ఇంద్రునకు (మదమును) బుట్టించునది, మఱియు విష్ణువునుబుట్టించునది, యగుసోమము పాత్రలందుఁ గారుచున్నది. (సోమ మభిషవింపగానే యీ సంగతులన్నియుం గలిగినవనితా॥)

౯౨౮. బ్రహ్మా దేవానాం పదవీః కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణాం, శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితి ర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతి రేభన్॥

(సోమము ఇన్నిరూపములుగా నున్నది) ఇంద్రాదిదేవతలలో రాజయియున్నది, దేవతలు=స్తుతికర్తలు వారిలో బ్రహ్మయను ఋత్విజుని రూపముగా (గాని)యున్నది (అని రెండర్థాలువ్రాసిరి) ప్రజ్ఞాశాలురలోఁ బదములను దప్పులేకుండ గూర్పించునదియు, మేధావంతులలో ఋషిరూప మయియు (ఋషియనఁగా నందఱికిని గోచరింపని దానినెఱిఁగినవాఁడు) మృగములలో మహిష రూపమయి యున్నది( మహిషము= ఎనుపోతు. బలమయినది ) గ్రద్దలలో డేగరూపమయినది. (శ్యేన=స్తుతింపఁదగిన అనివ్యుత్పత్తి. కనుక రాజు అని తా॥) (వన=కోయునది.) కోయునట్టి యాయుధములలో స్వధితియను (ఖడ్గమువంటిది. కత్తితోఁ జేసినది) ఇట్టి ప్రభావముగల సోమము ధ్వనించుచుఁ బవిత్రమును (అనఁగా గొఱ్ఱెబొచ్చుతో సల్లిన వడపోతకు పయోగించు వస్త్రము) దాటికారుచున్నది.

౯౨౯. ప్రావీ విపద్వాచ ఊర్మిం న సింధుర్గిర స్తోమాన్పవ మానో మనీషాః। అన్తః పశ్య న్వృజనే మావరాణ్యా తిష్ఠతి వృషభో గోషు జానన్॥

సోమము మనోహరములైన వాక్కులను (స్తుతిమంత్రములనితా॥) నది కెరటములను బ్రేరించునట్లు బ్రేరించుచున్నది.ఉదకముల వర్షించునట్టి సోమము లోపలనణగి

యున్న వస్త్రములను జూచుచు, గోవులవిజయ మొజెంగినదగుచు, దుర్బలులు వారింపశక్యము కాని యీశత్రుబలములను బొందుచున్నది. (శత్రుసేనలలోఁ బ్రవేశించి జయించి తమగోవులను వెచ్చుకొనుట, సోమకార్యమనితా॥)

సామవేదోత్తరార్చికమునఁ బంచమాధ్యాయషష్ఠఖండము సమాప్తము.

---

## ౬ అధ్యాయము.

### ౧ ఖండము.

ప్రయాగ-లేక-అగ్ని ఋషి-గాయత్రీచ్ఛంద-అగ్ని దేవత.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౯౩౦. అగ్నింవో వృధన్త మధ్వరాణాం పురూతమం। అచ్ఛానప్త్రే సహస్వతే॥

హింసారహితమైన, బలవంతులకు బంధువయినట్టి, బలవంతుఁడైనట్టి, వృద్ధి బొందుచున్నట్టి, మిగులబహు రూపములయిన యగ్నినిఋత్విజులారా! మీరుస మీపించుడు.

౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨
౯౩౧. అయం యథాన ఆభువ త్త్వష్టా రూపేవ తష్ట్యా। అస్యక్రత్వా యశ స్వతః॥

బాగుచేయవలసిన వస్తువులను, చెక్కడపుపని వాఁడెట్లుబాగుచేయుటకు నందుకొనునో, అట్లుయగ్నిమనల అవలంబించుఁగాక. మనమీయగ్నియొక్క కర్మ లేక ప్రజ్ఞతోడనుగూడినవారమై కీర్తివంతులము అగుదుముగాక.

౩ ౧ ౨ర ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౨ఉ ౩ ౧ ౨
౯౩౨. అయంవిశ్వా అభిశ్రియో ౽గ్నిర్దేవేషు పత్యతే। ఆ వాజైరుప నో గమత్॥

(మనుష్యుల) సంపదలన్నిటిని దేవతలలో నే యగ్నిపొందుచున్నాఁడో, ఆయగ్ని మమ్ములనుగూడ నన్నములతోఁ బొందుగాక. లేక-ఏయగ్ని దేవతల యందన్ని సంపదలను జేర్చుచున్నాఁడో, ఆయగ్నిమాకుంగూడ నన్నముల బొందించు గాక.

గోతమఋషి-అనుష్టుప్ఛంద-అగ్ని దేవత.

౯౩౩. ఇమమింద్ర సుతం పిబ జ్యేష్ఠ మమ ర్త్యం మదం। శుక్రస్య త్వా భ్యక్షరన్ధారా ఋతస్య సాదనే॥

ఓయింద్రా! యభిషవించినట్టి, ప్రశస్తమైనట్టి, మదముకలిగించునట్టి, మరణముగలిగింపనట్టి, (అనఁగాఁగల్లు మొదలగు మత్తుపదార్థములు అధికముగా సేవించినఁజావుఁదెచ్చును. సోమ మెంతత్రావినను జావుగలిగింపదనితా.) యీ సోమమును బానముచేయుము. యజ్ఞగృహమందున్నట్టి, దీపించునట్టి, సోమముయొక్క ధార నిన్ను స్వయముగాఁ జేరుచున్నది.

౯౩౪. నకిష్ట్వ ద్రథీతరో హరీ యదింద్ర యచ్ఛసే। నకిష్ట్వాను మజ్మనా నకిః స్వశ్వ ఆనశే॥

ఓ యింద్రుఁడా! ఎందువల్ల నీవు హరియను గుఱ్ఱములను రథమందుఁగూర్చుచున్నావో, అందువల్ల నీకంటె నితరుఁడు మహాయోధుఁడు మహారథుఁడు లేడు. నీతో బలమునకు సమానుఁడును లేడు. మంచియశ్వములు కలవాఁడును గనఁబడఁడు. (సర్వోత్తమ బలాశ్వ రథములు గలవాఁడనితా॥)

౯౩౫. ఇంద్రాయ నూ న మర్చతో క్థానిచ బ్రవీతన। సుతా అమత్సు రిందవో జ్యేష్ఠం నమస్యతా సహః॥

ఓ ఋత్విజులారా! యింద్రుని కొఱకు శీఘ్రముగాఁ బూజనొనర్పుఁడు. ఉక్థలను (శ్రేష్ఠమంత్రములతోఁ జేసిన స్తుతులను) బఠింపుఁడు. అభిషవించిన సోమములు వచ్చిన యింద్రుని మదింపఁజేయుఁగాక. పిమ్మట బలవంతుఁడు స్తోత్రార్హుఁడునగు నింద్రుని (ఓ స్తుతికర్తలారా!) నమస్కరింపుఁడు.

ఋషిఛందోదైవతములు సందిగ్ధములన్నారు.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౯౩౬. ఇంద్ర జుషస్వ ప్రవహా యాహి శూర హరిహా। పిబా సుతస్య మతిర్న
౧ ౩ ౨ ౧ ౩ ౧ ౨
మధోశ్చ కానశ్చారు ర్మదాయ॥

ఓ యింద్రా! యేహవిస్సులను నేనిచ్చితినో, వాటికై రమ్ము. శూరుఁడా! హరితవర్ణములగు గుఱ్ఱాలు కలవాఁడా! అభిషవించినట్టి, బుద్ధిని వికసింపఁజేయునట్టి, శోభనమయినట్టి, మధురమైనట్టి, ప్రకాశించునట్టి, యిప్పటి సోమమును బానము చేయుము. (భాష్యంలో నట్లున్నదికాని దేవత యింద్రుఁడని స్పష్టము. ఒక్కక్షర మెక్కువగా ముప్పదిమూఁడక్షరములున్నవి. అనుష్టుప్ఛందమునకు ముప్పదిరెండే యుండవలెనంటే "ఇమమింద్రసుతంపిబ" ఇత్యాదులలో భాష్యకారులు చెప్పినట్టి యనుష్టుప్ఛందమునకు ముప్పదియక్షరములే కలవు, కనుక ఈ షడ్వైషమ్యమును వివక్షింపక అనుష్టుప్ఛందమే యిదనవచ్చునని నాయూహ.)

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨
౯౩౭. ఇంద్రం జఠరం నవ్యం న పృణస్వ మధోర్దివోన। అస్య సుతస్య స్వా౩
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
ర్ణోపత్వా మదాః సువాచో అస్థుః॥

(ఇవిసరిగా ముప్పదిరెండక్షరములు)

ఇంద్రుఁడా! నీకడుపును గొత్తదానివలెఁ బూరించుకొమ్ము మధురమయినట్టిదై స్వర్గముయొక్కవలె నీయభిషవించిన సోమముయొక్క ధ్వనియును, మదము గలిగించు స్తుతులును, నీసమీపమున నున్నవి.

౧ ౨ ౩ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ
౯౩౮. ఇంద్రస్తురాషాణ్మిత్రో న జఘాన వృత్రం యతిర్న। బిభేద బలం
౩ ౧ ౨ ౩ఉ ౩ ౨ ౩ ౧ ౨
భృగుర్న ససాహే శత్రూన్మదే సోమస్య॥

యుద్ధమందు మిగుల ధైర్యవంతుఁడయిన యింద్రుఁడు, శత్రువును మిత్రదేవుని వలెను, తపశ్శాలివలెను, గొట్టెను. జలాసురుని ముక్కముక్కలు చేసెను. భృగునివలె శత్రువులను ఈ సోమమదము కలిగినపుడు ఓడించెను.

సామవేదమునఁ బంచమాధ్యాయము సమాప్తము, అందు సప్తమ ఖండమును సంపూర్ణము.

:o:

## ౬ అధ్యాయము.

### ౧ ఖండము.

సికతానివారి-పృశ్న్యజఋషి-జగతీచ్ఛంద-సోమదేవత.

౩౧౨ ౩౧ ౨౩౧ ౨౩౧ ౨ ౩౧ ౩౧౨ ౨
౯౩౯. గోవిత్పవస్వ వసువి ద్ధిరణ్య విద్రేతోధా ఇన్దో భువనే ష్వర్పితః। త్వగ్ం
౩౧౨ ౩౨ఉ ౩ ౨౩౧౨ ౩౧ ౨ర
సువీరో అసిసోమ విశ్వవిత్తం త్వా నరఉప గిరేమ ఆసతే।

సోమమా! గోవులను లభింపఁజేయునట్టి, ధనమును లభింపఁజేయునట్టి, బంగారమును లభింపఁజేయునట్టి, ఉదకమును (ఓషధులకు) నిచ్చునట్టి, లేక (శుక్ర=) వీర్యమును వృద్ధినొనర్చునట్టి, నీవు స్రవించుము. ఉదకములందుంచఁబడిన దానవయి మంచిపుత్ర పౌత్రాదులు కలిగించుదానవు, లేక వీరత్వముకలదానవు, సర్వమునుం దెలిసినదానవు నగుచున్నావు. కనుక ఈ నరులు స్తుతివాక్కులతోఁ బ్రార్థించుచున్నారు.

౨ ౩౧ ౨ ౩౨ ౨ ౧౨ ౩ ౧ ౨ర
౯౪౦. త్వం నృచక్షా అసి సోమ విశ్వతః పవమాన వృషభ తా విధావసి।
౧ ౩ ౩ ౧౨౩౧౨ ౩ ౧ ౨ ౩ ౧౨ ౩౧౨
సనఃపవస్వ వసుమద్ధిరణ్య వద్వయగ్ం స్యామ భువనేషు జీవసే॥

ఓ సోమమా! నీవు అన్నిలోకములందు నరులను జూచుదాన వగుదువు. (అనఁగా సాక్షి) వడకట్టిన సోమమా! ఉదకముల వర్షించుదానా! ఆయుదకములందు వివిధముగాఁబరువిడుచున్నావు. అట్టి నీవు మాకొఱకు స్రవించుము. నివాసములు కలిగి బంగారముకలుగునట్లుగా లోకములందు మేము జీవనముకొఱకు (సమర్థుల) మగుదుముగాక.

౯౪౧. ఈశాన ఇమా భువనాని ఈయసే యుజాన ఇందో హారితః సుపర్ణ్యాః।
తాస్తే క్షరన్తు మధుమద్ఘృతం పయస్తవ వ్రతే సోమ తిష్ఠన్తు కృష్టయః॥

ఓ సోమమా! (సర్వమునకు) స్వామివగు నీవు ఈ భూతజాలమునంతటిని ఆకుపచ్చనిరంగుగల్గినట్టి, బాగుగ నెగిరిపడునట్టి, (ఇంద్రుని గుఱ్ఱములను) రథమునకుం బూన్చుకొనుచు తిరుగుచున్నావు. లేక చేరుచున్నావు.

ఆ సపర్ణులు (=ఆగుఱ్ఱములు) నీయొక్క మధురమైన దీపించుచున్న యుదకమును గార్చునుగాక. సోమమా! మానవులందఱు నీకర్మయందు నుందురుగాక.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౪౨. పవమానస్య విశ్వవిత్ప్రతే సర్గా అసృక్షత సూర్యస్యేవ నరశ్మయః॥

సర్వము నెఱింగినదానా! సోమమా! వడపోయబడిన నీయొక్క ధారలు సూర్యకిరణములవలె నిపుడు ప్రకాశించుచున్నవి.

౯౪౩. కేతుంకృణ్వన్దివస్పరి విశ్వా రూపాభ్యర్షసి। సముద్రః సోమ పిన్వసే॥

రసమును గార్చునట్టి దానవగుచు నీవో సోమమా! మాకుఁ బ్రజ్ఞానమును గల్గించుచు సమస్తరూపములను అంతరిక్షమునుండి కార్చుచున్నావు. (నానాధనములతో మమ్ము) బోషించుచున్నావు.

౯౪౪. జజ్ఞానో వాచమిష్యసి పవమాన విధర్మణి। క్రన్దం దేవో నసూర్యః॥

ఓ సోమమా! ప్రకాశించు సూర్యునింబోలి యుదయించిన దానవగుచు నీవు ఆధారమయిన దశాపవిత్రమందు (=వడపోతవస్త్రము) ధ్వనించుచు స్తుతిని బ్రేరించుచున్నావు.

అసిత-లేక-దేవల-ఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౪౫. ప్రసోమాసో అధన్విషుః పవమానాస ఇన్దవః। శ్రీణానా అప్సు వృజ్ఞతే॥

వడకట్టుచున్న సోమములు బాగుగఁ బ్రసరించుచున్నవి ఆవు పాలతోఁ గూర్చఁబడినవై ఉదకములందుఁ జేరుచున్నవి.

౯౪౬. అభిగావో అధన్విషు రాపోన ప్రవతా యతీః। పునానా ఇంద్రమాశత॥

గమనించునట్టి సోమములు పల్లపునేలకుంబోవు నుదకములంబోలి దశాపవిత్రమున కెదురుగఁ బ్రసరించుచున్నవి. తర్వాత వడకట్టఁబడినవై యింద్రునింబొందెను.

౯౪౭. ప్రపవమాన ధన్వసి సోమేన్ద్రాయ మాదనః। నృభిర్యతో వి నీయసే॥

సోమమా! యింద్రుని మదింపఁజేయు నీవు పవిత్రమందు బాగుగఁ బ్రసరించుచున్నావు. ఋత్విజుల చేతఁబట్టుకొనఁబడి తీసికొని పోఁబడుచున్నావు. (హవిర్ధానమునెడు చోటినుండి.)

౯౪౮. ఇన్దో యదద్రిభిః సుతః పవిత్రం పరిదీయసే। అర మింద్రస్య ధామ్నే॥

ఓ సోమమా! నీవెపుడు శిలలతో నభిషవింపఁ (నొక్కి-పిండఁ) బడి దశాపవిత్రమునందు వడకట్టఁబడుచుఁ బ్రసరించితివో, యపుడు ఇంద్రుని స్థానము కొఱకుఁ బూర్ణముగా సరిపోవునట్లుగాఁ బ్రసరించుచున్నావు.

౯౪౯. త్వꣳ సోమ నృమాదనః పవస్వ చర్షణీ ధృతిః। సస్నిర్యో అనుమాద్యః॥

సోమమా! నరులకు మదముకలిగించునట్టి, ఋత్విజులగు ప్రజలచేతఁబట్టుకొనంబడినట్టి, నీవు స్రవించుము. ఏ నీవు శుద్ధమవై స్తుతింపఁదగుదానవో, (ఆ నీవు స్రవింపుమని యన్వయము.)

౯౪౦. పవస్వ వృత్రహా స్తమ ఉక్థేభిరను మాద్యః। శుచిః పావకో అద్భుతః॥

ఓ సోమమా! శత్రువులను గట్టిగాఁగొట్టుదానా! నీవు బాగుగా స్రవించుము. నీవు స్తుతులతో స్తుతింపఁదగినదానవు, శుద్ధమగుదానవు, పవిత్రము చేయుదానవు, మహత్తు కలదానవు నగుచుఁగారుము.

౯౪౧. శుచిః పావక ఉచ్యతే సోమః సుతః సమధుమాన్। దేవావీ రఘుశగ్ం సహా॥

అభిషవించిన మధురమగు నా సోమము స్వయము పరిశుద్ధమై యితరులను బవిత్రులంజేయునదిగాఁ జెప్పఁబడుచున్నది. దేవతలందృప్తిపఱచునది, పాపములాచరించు (రాక్షసులు మొదలగు) వారినిజంపునది, యనికూడఁజెప్పఁబడెను.

ఇట్లు ఉత్తరార్చికమునందు షష్ఠాధ్యాయ ప్రథమఖండము సమాప్తము.

— :(౧):—

## ౬ అధ్యాయము.

### ౨ ఖండము.

అసిత- దేవలఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౪౨. పరి కవిర్దేవ వీతయేऽవ్యా వారేభిరవ్యత। సాహ్వాన్విశ్వా అభి స్పృధః॥

మేధావియగు సోమము దేవతలపానముకొఱకు గొఱ్ఱెబొచ్చుతో నల్లిన దశాపవిత్రమందుఁబడెను. శత్రువుల నోడించు సోమము యుద్ధములనన్నిఁటిని దిరస్కరించును.

౧ ౨ర　౩౨ ౩　౨ఉ　౩　౧ ౨ ౩　౧౨　౧౨　౩ ౧౨
౯౫౩. సహిష్మా జరితృభ్య ఆవాజం గోమన్త మిన్వతి! పవమాన స్సహస్రిణం॥

ఆవడపోసిన సోమముకదా! స్తుతికర్తలకు గోవ్రులతోఁగూడిన వేలకొలఁది యన్నమును (అనఁగా వేయిమందికి సరిపడిన ధాన్యములనితా॥) ఇచ్చును.

౨౩౧ ౨ ౩　౧౨　౩ ౨ ౩　౧౨ ౩౨　౧౨　౩ ౧౨
౯౫౪. పరివిశ్వాని చేతసా మృజ్యసే పవసేమతీ| సనః సోమ శ్రవోవిదః॥

సోమమా! నీవు మాయందనుకూల బుద్ధితో సర్వధనములను మాస్తుతితో శుద్ధిచేయుచున్నావు. పిమ్మట రసమును కార్చుచున్నావు. అట్టి నీవు మాకునన్నము నులభింపఁజేయుము.

౩క ౨ర　౩ ౧ ౨ర్క　౩౨　౩ ౨　౧౨　౩౨
౯౫౫. అభ్యర్షబృహద్యశో మఘవద్భ్యో ధ్రువగ్ం రయిం| ఇషగ్ం స్తోతృ
౩ ౧౨
భ్య ఆభర॥

సోమమా! గొప్పకీర్తిని గలిగింపుము. హవిస్సులనిచ్చుమాకు స్థిరమైన ధనమునుగూడనిమ్ము. స్తుతికర్తలమగు మాకు నన్నమునుగూడఁదెచ్చియిమ్ము.

౧　౨ర　౩ ౧ ౨ర ౩ ౧ ౨　౩　౧ ౨
౯౫౬. త్వగ్ంరాజేవ సువ్రతో గిరః సోమావివేశిథ| పునానో వహ్నే అద్భుత॥

(యాగాదులను) వహించునట్టి, యాశ్చర్యము కలిగించునట్టి సోమమా! మంచికర్మలు కలిగి పవిత్రతను కలిగించు నీవు రాజువలె మాస్తుతులను పొందుచున్నావు.

౧ ౨ర ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧౨　౧ ౨ ౩　౧౨
౯౫౭. సవహ్ని రప్సు దుష్టరో మృజ్యమానో గభస్త్యోః| సోమశ్చమూషుసీదతి॥

ఆ సోమము (యాగాదులను) వహించునది, అంతరిక్షమందున్నది, యితరులు తిరస్కరింప శక్యముగానిది, లేక యెవరికిని లొంగనిది, రెండు చేతులందు

శోధింపఁబడుచున్నది. (తుడిచి బాగు చేయుచున్నారని తా॥) యగుచుఁ బాత్ర లందున్నది.

౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩౧౨ ౧౨౩ ౨
౯౫౮. క్రీడుర్మఖో న మగ్ం హయుః పవిత్రగ్ం సోమ గచ్ఛసి। దధస్తోత్రే
౩౧౨
సువీర్యం॥

ఆటలాడునట్టి నీవు, ధనము కోరినవాఁడు దానమును బొందునట్లు, స్తుతి కర్తకు మంచి వీర్యమును కలిగించుచుఁ, బవిత్రమును జేరుచున్నావు.

అవతారఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨౩ ౧౨ ౧౨ ౩ ౧ ౨
౯౫౯. యవంయవంనో అన్ధసా పుష్టం పుష్టం పరిస్రవ। విశ్వాచ సోమ సౌభగా॥

సోమమా! నీవు మాకు అత్యంతము సంపూర్ణమైన, మాటి మాటికిని వచ్చుచున్న రసమును అన్నరూపధారతోఁ గార్చుము. సౌభాగ్యముల నన్నిఁటిని మాకొఱకుఁ గార్చుము. (ఇమ్మని తా॥)

౨ ౩ ౨ ౩ ౨౫ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧
౯౬౦. ఇందో యథా తవ స్తవో యథా తే జాతమన్ధసః। ని బర్హిషి ప్రియే
౨
సదః॥

సోమమా! అన్నరూపమైన నీయొక్క స్తోత్రము ఎట్లు నీకై పుట్టినదో, యట్లు నీవు ప్రియమగు మా యజ్ఞమందుఁ గూర్చుండుము.

౩౧ ౨ ౩౧౨ ౩౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨
౯౬౧. ఉతనో గోవిద శ్వవిత్పవస్వ సోమాన్ధసా। మక్షూతమే భిరహభిః॥

మఱియు నో సోమమా! మాకు గోవులనిచ్చు దానవు, అశ్వము లిచ్చు దానవు,

నగు నీవు అతి శీఘ్రములైన పగళ్ళతోను అన్నరూపధారతోనుఁ గారుము (పగటియందే సోమవ్యవహారమని తోచు).

౯౬౨. యోజినాతి న జీయతే హన్తి శత్రుమభీత్య। సపవస్వ సహస్రజిత్॥

లెక్కలేని శత్రువులను జంపునట్టి సోమమా! యే నీవు శత్రువులం జంపుచున్నావో, శత్రువులచే జయింపఁబడచున్నావో, శత్రువు నెదిర్చి జంపుచున్నావో అట్టి నీవు ధారతోఁ గారుము.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౬౩. యాస్తేధారా మధుశ్చుతోऽ సృగ్రన్నింద ఊతయే। తాభిః పవిత్రమాసదః॥

సోమమా! నీయొక్క మధురమయిన యే ధారలు రక్షణముకొఱకు విడువంబడుచున్నవో, వాటితో నీవు పవిత్రమును (వడపోతవస్త్రము) బొందుము.

౯౬౪. సో అర్షేన్ద్రాయ పీతయే తిరో వారాణ్యవ్యయా। సీదన్నృతస్య యోనిమా॥

సోమమా! అట్లు అభిషవింపఁబడిన నీవు గొఱ్ఱెబొచ్చు పవిత్రమును తిరస్కరించి, యజ్ఞమునకుఁ గారణమయిన దశాపవిత్రమునందు అభిముఖముగాఁ గూర్చుండి యింద్రుని పానమునకై స్రవింపుము.

౯౬౫. త్వꣳసోమ పరి స్రవ స్వాదిష్ఠో అంగిరోభ్యః। వరివోవిద్ ఘృతం పయః॥

సోమమా! మిగుల రుచిగలట్టి, మాకు ధనము గలిగించువాఁడవు నగు నీవు అంగిరసులకొఱకు దీపించుచున్న క్షీరమువలె సారమయిన రసమును గార్చుము.

ఉత్తరార్చికమందు షష్ఠాధ్యాయమున ద్వితీయ ఖండము సంపూర్ణము.

## ౬ అధ్యాయము.

### 3 ఖండము.

అరుణఋషి-జగతీచ్ఛంద-అగ్ని దేవత.

౯౬౬. తవ శ్రియో వర్ష్యస్యేవ విద్యుతోऽగ్నేశ్చికిత్ర ఉషసామివేతయః।
యదోషధీరభిసృష్టో వనానిచ పరి స్వయం చినుషే అన్నమాసాని॥

అగ్నివగు నీయొక్క కిరణరూపమయిన సంపదలు, మేఘముయొక్క మెఱుపులవలెఁ దెలియంబడుచున్నవి. ఉషస్సులయొక్క వ్యాపించునట్టి కాంతులు తెలియబడుచున్నట్లు నీ కాంతులు తెలియఁబడుచున్నవి. ఎపుడు నీవు ధాన్యాసస్యములను, వనములను, దహించుటకువిడువంబడుచు స్వయముగా ముఖమునందు (చెట్లనెడు) అన్నమును పడవేసికొనుచున్నావు.

౯౬౭. వాతోపజూత ఇషితో వశాగ్ం అను తృషుయదన్నా వేవిషద్వితిష్ఠసే।
ఆతే యతన్తే రథ్యోయథా పృథక్ఛర్ధాగ్ంస్యగ్నే అజరస్య ధక్షతః॥

ఓ యగ్నీ! నీవు యెపుడు వాయువుచేఁ గదల్పఁబడి మనోహరమయిన వృక్ష

ములనుగూర్చి ప్రేరింపఁబడి తినఁదగిన వృక్షములను వ్యాపించుచు నిటు నటు తిరుగుచున్నావు

3 ౨ 3౧౨ 3౧౨3 ౨ర 3౧౨
౯౬౮. మేధాకారం విదథస్య ప్రసాధనమగ్నిగ్ం హోతారం పరిభూతరం
3 ౨ ౧ ౨ర 3౧౨ 3౨ఉ ౧3 ౨
మతిం। త్వా మర్భస్య హవిషః సమానమిత్వాం మహో వృణ
3౨
తేనాన్యం త్వత్॥

ప్రజ్ఞను గలిగించునట్టి, యజ్ఞమునకు సాధనమగునట్టి, దేవతలం బిలుచునట్టి శత్రువులను బలాత్కారముగఁ బరాభవించునట్టి, ఆలోచన గలట్టి, అగ్నివైన యే నిన్ను ఋత్విజులమగు మేము కోరుచున్నాము. ఓ యగ్నీ! నిన్నే అల్పమయిన (పురోడాశాది హవిర్భక్షణమునకు) మాతోఁ గలిసిరమ్మని కోరుచున్నాము. గొప్పదగు ( సోమ భక్షణమునకు ) రమ్మని కోరుచున్నాము. నిన్ను దప్పి యితర దేవుని గోరము.

ఉరుచక్రిఋషి-గాయత్రీచ్ఛంద-మిత్రావరుణ దేవత.

3 ౧౨ 3 ౧ ౨ర 3౧ ౨ ౨3 ౧ ౨
౯౬౯. పురూరుణాం చిద్ధ్యస్త్యవో నూనం వావరుణ। మిత్ర వగ్ంసి వాగ్ం
3౨
సుమతిం॥

ఓ మిత్రా వరుణులారా! మీ యిద్దఱియందును మిగుల నధికమగు రక్షణము కలదుకదా! మిత్రుఁడా! వరుణుఁడా! మీ యిద్దఱి యనుగ్రహ బుద్ధిని నేను బొందుదునుగాక.

౧౨ 3 ౧ ౨ 3౧౨ 3 ౧౨ 3 ౧ ౨
౯౭౦. తావాగ్ం సమ్యగద్రుహ్వాణేషమశ్యామ ధామచ। వయం వాం
మిత్రా స్యామ॥

ద్రోహము నెఱుఁగనట్టి మీ యిద్దఱిని మేము బాగుగ స్తుతించుచున్నాము. మే మన్నముచు నివాసమును బొందియుందుముగాక. మేము మీకు మిత్రులమై యుందుముగాక.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩ ౨
౯౭౧. పాతంనోమిత్రా పాయుభిరుత త్రాయేథాంగం సుత్రాత్రా। సాహ్యా
౩ ౧ ౨ ౩౧ ౨
మదస్యాం తనూభిః॥

మిత్రావరుణదేవతలారా! మీరు మమ్మును రక్షణలతో రక్షించుడు. మఱియు మంచి రక్షణ సాధనముతో రక్షింపుఁడు మేమును బుత్రపౌత్రులతోఁ గూడి శత్రువులను జయింతుముగాక.

కురుసుతిఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౩ ౨౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨ ౨ర ౧ ౨ ౩ ౨
౯౭౨. ఉత్తిష్ఠన్నోజసా సహపీత్వా శిప్రే అవేపయః। సోమమింద్ర చమూ
౩ ౨
సుతం॥

ఇంద్రా! నీవు ఫలకములలోనుంచి పిండిన సోమమును పానము చేసి బలముతోఁ గూడిన వాఁడవై లేచుచు దవుడలను గదలించితివి.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩క ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౯౭౩ అనుత్వారోదసీ ఉభే స్పర్ధమాన మదదేతాం। ఇంద్రయద్దస్యుహాభవః॥

శత్రువులతోఁ బోటీ చేసి ఇంద్రా! నిన్నుంగూర్చి ద్యులోక భూలోకములు రెండును హర్షము నొందినవి. శత్రువుల నెపుడు చంపినవాఁడవో అపుడు (హర్షము నొందినవని యన్వయము)

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర
౯౭౪. వాచమష్టా పదీమహం నవస్రక్తి మృతావృధం। ఇంద్రాత్పరి తన్వం
మమ॥

ఎనిమిది దిక్కులతోఁ గలసి తొమ్మిదవ (సూర్యునిం) గూడఁ గలిసి వ్యాపించినది, యజ్ఞమును వృద్ధిచేయునది యగు స్తుతిరూపవాక్కును కొంచెము తక్కువదానింగాఁ గొలఁతఁ జేయుచున్నాను. (పూర్ణము కావుటకుఁ గొంచెము తక్కువని, నీస్వరూపము పూర్ణముగా దెలియదని తా॥)

భరద్వాజఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నిదేవత.

౮౭౫. ఇంద్రాగ్నీ యువామిమే౩ఽభి స్తోమా అనూషత। పిబతꣳ శమ్భువాసుతం॥

ఓ యింద్రాగ్నులారా! మీ ఇద్దఱను స్తుతికర్తలు నుతించుచున్నారు. సుఖమును గలిగించువారలారా! అభిషవించిన సోమమును బానము చేయుఁడు.

౮౭౬. యావాꣳ సన్తి పురుస్పృహో నియుతో దాశుషే నరా। ఇంద్రాగ్నీ తాభిరాగతమ్॥

నాయకులైన యింద్రాగ్నులారా! మీ స్వంతములైనట్టి, పలువురు కోరఁదగినట్టి, యజమానుని కొఱకై పుట్టినట్టి గుఱ్ఱము లేవికలవో వాటితోఁ గూఁడ రండు.

౮౭౭. తాభిరాగచ్ఛతం నరోపేదꣳ సవనꣳ సుతం। ఇంద్రాగ్నీ సోమపీతయే॥

నాయకులైన యింద్రాగ్నులారా! అభిషవించిన యీ సోమమును గుఱించి ఆ నియుత్తులను నశ్వములతో రండు.

ఇట్లు సామవేదోత్తరార్చికమున షష్ఠాధ్యాయతృతీయ ఖండము సంపూర్ణము.

## ౬ అధ్యాయము.

## ౪ ఖండము.

భృగుఋషి లేక జమదగ్ని-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩
౯౭౮. అగ్నాసోమం ద్యుమత్తమోఽభి ద్రోణాని రోరువత్। సీదన్యోనౌ
౨ ౩ ౨
వనేష్వా॥

ఓ సోమమా! మిగులఁ గాన్తి గల్గి వనములందుఁ దన జన్మస్థానమున (పర్వతాదులందని తా॥) నంతట నల్లుకొనుచున్న నీవు ద్రోణకలశములోనికి ధ్వనించుచు రమ్ము. (ధారగాఁ బడునపుడు చప్పుడగును.)

౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౯౭౯. అప్సా ఇంద్రాయ వాయవే వరుణాయ మరుద్భ్యః॥ సోమా అర్షన్తు
౩ ౧ ౨
విష్ణవే॥

(వసతీ వరీయను) ఉదకములతోఁ గూడిన సోమములు ఇంద్రుని కొఱకు, (తర్వాత) వాయువు కొఱకు, (ఁబిమ్మట) వరుణుని కొఱకు, (ఆ వెనుక) మరుత్తుల కొఱకును, (పిదప) విష్ణుదేవత కొఱకును, ఉపయోగించునదై (ద్రోణకలశము లోనికి) పడును గాక.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨
౯౮౦. ఇషంతోకాయ నో దధదస్మభ్యం సోమవిశ్వతః। ఆ పవస్వ
౩ ౧ ౨
సహస్రిణం॥

సోమమా! నీవు మా పుత్రుని కొఱకు అన్నము నిచ్చుచు వేల కొలఁది ధనమును అన్ని చోట్లనుండియు మాకు నిమ్ము.

గోతమఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౯౮౧. సోమ ఉష్వాణః సోతృభిరధిష్ణుభి రవీనాం। అశ్వయేవ హరితా
యాతి ధారయా మంద్రయా యాతిధారయా॥

అభిషవించుచు (పిండుచు) న్న ఋత్విజులచేత నభిషవింపంబడుచు, సోమము ఉన్నతమైన గొఱ్ఱె బొచ్చుతోఁ జేసిన వస్త్రమందు (అనఁగా దశా పవిత్రమందు) పడుచున్నది. ఆడు గుఱ్ఱముతోనువలె ఆకుపచ్చని ధారతో గమనించుచున్నది. మదముం గలిగించు ధారతో ద్రోణ కలశమందుఁ బడుచున్నది.

౯౮౨. అనూపే గోమాన్ గోభిరక్షాః సోమో దుగ్ధాభి రక్షాః। సముద్రంన
సంవరణా న్యగ్మన్మన్దీ మదాయ తోశతే॥

గోవులతోఁ గూడిన సోమము పల్లమున (ద్రోణకలశము లోనని తా॥) ఆవుపాలతోఁ గలసి కారుచున్నది. ఆ సోమము (తనతోఁ గలిసిన) పాలతోఁ గారుచున్నది. ఉదకములు సముద్రముం జేరునట్లు ద్రోణకలశమందు రసరూపము లగు సన్నములు చేరుచున్నవి. మదముకలిగించు సోమము మదముకొఱకు పిండఁబడుచున్నది.

అసిత లేక దేవలఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత

౯౮౩. యత్సోమ చిత్రముక్థ్యం దివ్యం పార్థివంవసు। తన్నః పునాన
ఆభర॥

ఓ సోమమా! యేది కోరఁదగినది, స్తుతింపఁదగినది, ద్యులోకమందుఁ బుట్టి

నది, భూమియందుఁ బుట్టినది యగు ధనము కలదో, దానిని మాకు స్రవింపఁ జేయుచు ( అనఁగా నీ ధారతో నిచ్చుచు ) నిమ్ము.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ఉ ౩
౯౭౪. వృషాపునాన ఆయూగ్ంషి స్తనయన్నధిబర్హిషి। హరిఃసన్ యోని
౧ ౨
మాసదః ॥

ఓ సోమమా! ( యజమాన ఋత్విజుల ) జీవితములను పవిత్రములం జేయుచు, (కోర్కెల) వర్షించుచు, ధ్వనించుచుఁ, బరచిన దర్భలందు ఆకుపచ్చని రంగు గలిగి కూర్చుండుము.

౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩
౯౭౫. యువగ్ం హిస్థః స్వఃపతీ ఇన్ద్రశ్చ సోమగోపతీ॥ ఈశానా పిప్యతం
౧ ౨
ధియః ॥

సోమమా! నీవును ఇంద్రుఁడును, మీరిద్దఱునుగదా సర్వమునకు నధిపతులు అయియున్నారు! గోవులం బాలించువారు, ఈశ్వరులు నగుచు మా కర్మలను ( పనులను ) పోషించుడు.

ఉత్తరార్చికమున షష్ఠాధ్యాయ చతుర్థ ఖండము సమాప్తము.

## ౬ అధ్యాయము.

### ౫ ఖండము.

గోతమఋషి-పంక్తిచ్ఛంద-ఇంద్రదేవత.

౯౮౬. ఇంద్రో మదాయ వావృధే శవసే వృత్రహా నృభిః। తమిన్మహ
త్స్వాజిషూతి మర్భే హవామహే సవాజేషు ప్రనోఽవిషత్॥

(వర్షమును నిరోధించిన) మేఘమును, లేక వృత్రాసురుని జంపిన యింద్రుఁడు మదముకొఱకు, బలము కొఱకును స్తుతులతో వృద్ధినొందెను. ఆ యింద్రుఁడే గొప్ప యుద్ధములలో రక్షణమును జేయుచున్నాఁడు. మా రక్షణకుగాఁ బిలుచుచున్నాము. మఱియు నీతనిని చిన్నయుద్ధములలోను బిలుచుచున్నాము. మమ్ము రక్షించుఁగాక.

౯౮౭. అసి హి వీర సేన్యోఽసి భూరి పరాదదిః। అసిదభ్రస్య చిద్వృధో
యజమానాయ శిక్షసి సున్వతే భూరి తే వసు॥

ఓ వీరుఁడయిన యింద్రా! నీవు సేనకుం దగినవాడవు. (అనగా నీ వొకఁడవే సేనయంతటి పనిం జేతువని తా॥) కనుక విస్తారముగా శత్రుధనములను దీసికొందువు. కొద్దివాఁడయినను నీ స్తుతికర్తకు వృద్ధి గలిగింతువు. యాగకర్తకును, సోమ మభిషవించినవానికిని, కావలసినధనము నిత్తువు. కనుక నీకు ధనము విస్తారము, తఱుగనిది కలదు.

౯౮౮. యదుదీరత ఆజయో ధృష్ణవే ధీయతే ధనం। యుఙ్క్ష్వా మదచ్యుతా
హరీకగ్ం హనః కంవసో దధోఽస్మాగ్ం ఇంద్రవసౌ దధః॥

(రహూగణుని కొడుకు గోతముఁడు. కురు సృంజయ దేశముల రాజులకుఁ బురోహితుఁడు. ఆ రాజులకు శత్రువులతో యుద్ధము తటస్థించినపు డాతఁ డింద్రుని ప్రార్థింపగా నతఁడు శత్రువిజయము నా రాజుల కిచ్చెనని కథ)

ఎపుడు యుద్ధములు బయలుదేరునో, యపుడు జయించినవానికి ధనములు వచ్చును. ఓ యింద్రా! నీవు అట్టి యుద్ధాలు ప్రవర్తించినపుడు శత్రువుల గర్వమును గలఁగించునట్టి హరియను పేర్ల రెండు గుఱ్ఱాలను రథమునం గూర్చుము. (నీ సేవ చేయని రాజు) నెవనినైనఁ జంపుదువు. (నిన్ను సేవించిన రాజు) నొకనిని ధనము లకు నిధిని జేతువు. మాకు ధనములం గూర్పుము.

గోతమఋషి-పంక్తిచ్ఛంద-ఇంద్రదేవత.

౩ ౨౩౧ ౨౩ ౧౨ ౨౩ ౩క ౨ర ౧ ౨ర ౩ ౧
౯౮౯. స్వాదోరిత్థా విషూవతో మధోఃపిబన్తి గౌర్యః। యాఇంద్రేణ సయా
౨౩ ౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧౩ ౩ ౧ ౨
వరీ ర్వృష్ణా మదన్తి శోభథావస్వీ రను స్వరాజ్యం॥

రుచికలిగి యీ విధముగానే సర్వ యజ్ఞములందు వ్యాపించినట్టి, మధుర రసముగల సోమమును గోధుమ వర్ణములగు గోవులు త్రాగుచున్నవి. ఏ గోవులు ఇంద్రునితోఁగూడ శోభిల్లుచున్నవో, (అవని అన్వయము) వర్షించు నింద్రునితోఁ గూడ నడచుచున్నవై మదించుచున్నవో (అవి) ఇంద్రుఁడు పానము చేయఁగా మిగిలిన సోమమును నివాసాధారమైన యీ గోవులు ఇంద్రుని రాజ్యము ననుసరించి పానము చేయుచున్నవి.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర
౯౯౦. తాఅస్య పృశనాయువః సోమగ్ం శ్రీణన్తి పృశ్నయః। ప్రియాఇంద్రస్య
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
ధేనవో వజ్రగ్ం హిన్వన్తి సాయకం వస్వీరను స్వరాజ్యం॥

పూర్వము చెప్పఁబడినట్టి, ఇంద్రుని సంబంధులగునట్టి, ముట్టుకొనఁగోరునట్టి, గోవులు (పృశ్ని=నానావర్ణ) ఇంద్రుఁడు త్రావఁదగిన సోమమును పాలతోఁ

గూర్చుచున్నవి. ఇంద్రునకు ప్రియములైన యే గోవులు శత్రువులం జంపునట్టి వజ్రాయుధమును విసరుచున్నవో, (ఇంద్రునిచే విసరించుచున్నవని తా॥) తక్కినది పూర్వవతు.

౯౯౧. తా అస్య నమసా సహః సపర్యంతి ప్రచేతసః। వ్రతాన్యస్య సశ్చిరే పురూణి పూర్వచిత్తయే వస్వీరను స్వరాజ్యం॥

ఉత్తమ జ్ఞానముకల యా గోవులు ఈ యింద్రుని బలమును దమ (క్షీరరూపముగు) నన్నముతో సేవించుచున్నవి. అనేకములైన యీ యింద్రుని కార్యములు (ముందుగా శత్రువు లెఱుంగునట్లు) ప్రకటించుచు, (అనేకమంది వృత్రాది శత్రువులు ఇంద్రునితోఁ జాలలేక చచ్చినారు. మీ రెందు కెదిరించెదరని) సేవించుచున్నవి. (తక్కినది పూర్వవతు.)

ఉత్తరార్చికమునందు షష్ఠాధ్యాయ పంచమ ఖండము సంపూర్ణము.

## ౬ అధ్యాయము.

### ౬. ఖండము.

జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౯౨. అసావ్యగ్ంశుర్మదాయాప్సు దక్షో గిరిష్ఠాః। శ్యేనో న యోనిమాసదత్॥

పర్వతమందుఁ బుట్టిన ఆ సోమలత మదముకొఱకు (తెచ్చి) రసము పిండఁ

బడినది. ఉదకములతోఁగలసి వృద్ధినొందెను. వేగ శీఘ్రమున వచ్చి స్వస్థానము చేరునట్లు స్వస్థానముఁజేరెను.

౯౯౩. శుభ్రమన్నో దేవవాతమప్సు ధౌతం నృభిఃసుతం। స్వదన్తి గావః పయోభిః ॥

దేవతలు కోరినట్టి శుభ్రమయినట్టి యన్నము ( సోమమే ) ఋత్విజులచేతఁ బిండఁబడినది. ఉదకములందు శుద్ధి చేయంబడినది ఆ సోమమును పశువులు క్షీరముతో రుచి గలిగించుచున్న ( ఆవు లనక పశువు లనుటవల్ల మేకపాలుగూడ సోమములో గలుపుదురని తెలియవలెను. ఇతరత్రి అట్లు చెప్పంబడెను. )

౯౯౪. ఆదీమశ్వం నహోతార మశూశుభన్నమృతాయ। మధ్వో రసగ్ం సధమాదే॥

తర్వాత హోమము నిర్వర్తించునట్టి యీమధుర సోమరసమును యజ్ఞమందు మరణధర్మము ( తనకు ) లేకుండుటకై ఋత్విజులు, అశ్వమును యుద్ధమున కలంకరించునట్లు, అలంకరించుచున్నారు. ( సంస్కరించుచున్నారని తా॥)

ఊర్ధ్వసద్మఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౯౯౫. అభి ద్యుమ్నం బృహద్యశ ఇషస్పతే దిదీహి దేవ దేవయుం। వి కోశం మధ్యమం యువ॥

అన్నమునకుఁ బతియయి స్తుతింపఁదగిన సోమమా! ప్రకాశించుచున్న, దేవతలం గోరుచున్న, హవిస్సురూపమయిన, యన్నమగు విస్తారమయిన నీ రసమును,

మా కభిముఖముగునట్టిమ్ము. మఱియు నంతరిక్షమందున్న మేఘమును బ్రద్దలు సేయుము. (వర్షము కురియించుమని తా॥)

౧ ౨ 3క ౨ర 3 ౨ 3 ౨ఉ 3 ౨ 3౧౨
౯౯౬. ఆ వచ్యస్వ సుదక్ష చమ్వోః సుతో విశాం వహ్నిర్న విశ్పతిః।
3 ౨ 3౧ ౨ 3౨ 3 ౨ఉ 3 ౧౨ 3 ౧ ౨
వృష్టిందివః పవస్వరీతి మపో జిన్వన్ గవిష్టయే ధియః॥

మంచి బలముగలిగి యధిషవణ ఫలకములలోఁ బిండఁబడిన నీవు ప్రజలను రాజు వహించునట్లు ( పాలించునట్లు) వహించుచు రమ్ము. కలశమున స్రవించుము. మఱియు నీవు ఉదకములయొక్క వ్యాపించు వర్షమును, గోవులం గోరిన యాగ కర్తకుఁ గర్మలను సాగించుచు ద్యులోకమునుండి కురియించుము.

పర్వతనారదులుఋషులు-ఉష్ణిక్ఛందము-సోమదేవత.

3 ౧ ౨ర 3 ౨ ౨ 3 ౨ 3 ౨ 3 ౧౨ ౨ 3 ౧౨ 3 ౧
౯౯౭. ప్రాణా శిశు ర్మహీనాగ్ం హిన్వన్నృతస్య దీధితిం। విశ్వాపరిప్రియా
౨3౧౨3 ౨
భువదధద్వితా॥

(యజ్ఞమును) నడపించునట్టి గొప్పవయిన యుదకములకు శిశువువంటి సోమము, యాగమును బ్రకాశింపఁజేయు తన రసమును, బ్రేరించుచుఁ బ్రియములయిన హావిస్సుల నన్నిఁటిని వ్యాపించుచున్నది. మఱియు రెండు విధములగుచున్నది. ( అనఁగా భూమియందు, ద్యులోకమునందునని తా॥)

౧౨3౧౨ 3 ౨ ౧౨3 ౧ ౨ర3౨ 3 ౧ ౨ 3౧ ౨ర3
౯౯౮. ఉపత్రితస్య పాష్యో3రభక్త యద్గుహాపదం। యజ్ఞస్య సప్తధామభి
౧౨3 ౨
రధప్రియం॥

త్రితుఁడను ఋషి (నగు నా) యొక్క గుహాయందు (అనగ హావిస్సు లుంచు కొనెడు యాగస్థలమందు) ఉన్నటువంటి పాషాణమువలె దృఢమయిన ఫలకములలో

సోమము చేరినపుడు అపుడు ఆధారములయిన యేడు ఛందస్సులతో (అనగా వేద మంత్రములతో) ప్రియమయిన సోమమును స్తుతించుచున్నారు. (ఋత్విజులు-కర్త) (సప్త=స్రవించు నుదకములని యర్థముచెప్పి యుదకములలోఁ గలుపుచున్నారని మఱొక వ్యాఖ్యానము చేసెరి.)

౯౯౯. త్రీణి త్రితస్య ధారయా పృష్ఠేష్వా రయా రయిం। మిమీతే అస్య యోజనా విసుక్రతుః॥

త్రితుఁడ ననెడు (నా)యజ్ఞమునందలి మూఁడుసవనములను దనధారతో సోమము, సోమములు పతించుచుండగా, ధన దాతయగు నింద్రుని రప్పించుఁగాక. మంచి యాగము చేయు స్తుతికర్త యీ యింద్రుని రప్పించు స్తవములను జేయుచున్నాఁడు కనుక (ఇంద్రునిరప్పించుఁగాక.)

రేభఋషి-అనుష్టుప్ఛంద-సోమదేవత.

౧౦౦౦. పవస్వవాజ సాతయే పవిత్రే ధారయా సుతః। ఇంద్రాయ సోమ విష్ణవే దేవేభ్యో మధుమత్తరః॥

సోమమా! అభిషవింపఁబడిన నీవు ఇంద్రుని కొఱకు, విష్ణువు కొఱకును, ఇతర మిత్రాది దేవతల కొఱకును, మిగుల మధురమగుచు నన్నలాభము కొఱకుఁ గాఁ బవిత్రమందు ధారగాఁ గారుము.

౧౦౦౧. త్వాగ్ం రిహన్తి ధీతయో హరింపవిత్రే అద్రుహః। వత్సం జాతం నమాతరః పవమానా విధర్మణి॥

సోమమా! యజ్ఞమందు ద్రోహము లేనట్టి వ్రేళ్ళు (చేతులవి) ఆకుపచ్చనైన

పవిత్రమందున, బిడ్డను దల్లి నలుపునట్లు (నలుగుబెట్టినపుడని తా॥) నిన్ను బీడించు చున్నవి. (వే)ళ్లతోఁ బిసికి నలుపుచు వడకట్టుదురు.)

౧౦౦౨. త్వేంద్యాంచ మహివ్రత పృథివీం చాతి జభ్రిషే। ప్రతిద్రాపి సముం చథాః పవమాన మహిత్వనా॥

గొప్ప కర్మగల సోమమా! నీవు ద్యులోకమను భూమిని బాగుగా భరించుచున్నావు. సోమమా! వడ కట్టంబడుచు నీవు మహత్తుతోఁగూడి కవచమును విడుచుచున్నావు.

మన్యుఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత.

౧౦౦౩. ఇందుర్వాజీ పవతే గోన్యోఘా ఇందే సోమః సహఇన్వ న్మదాయ। హన్తిరక్షో బాధతే పర్యరాతిం వరివస్కృణ్వ న్వృజనస్య రాజా॥

కారునట్టి సోమము బలము కలది, క్రిందికి జారుచున్న ప్రవాహాగ్రము కలది, ఇంద్రుని విషయమై బలకరమైన రసమును గలిగించుచు. గార్చుచున్నది.

౧౦౦౪. అధధారయా మధ్వాపృచాన స్తిరోరోమ పవతే అద్రిదుగ్ధ ఇందు రింద్రస్య సఖ్యాం జుషాణో దేవో దేవస్య మత్సరో మదాయ॥

తర్వాత శిలలతో నభిషవింపఁబడిన సోమము మదము కలిగించు ధారతో దేవతలను దృప్తి పఱచుచు గొఱ్ఱెబొచ్చుతోఁ జేసిన పవిత్రమునుదాటి (కలశములందు) (బడుచున్నది. ఇంద్రునకు స్నేహకార్యమును జేయుచు లేక స్నేహముం బొందుచుఁ, బ్రకాశించుచు, మదము కలిగించుచు, సోమము ఇంద్రుని మదము కొఱకుఁ గారుచున్నది.

౧౦౦౫. అభివ్రతాని పవతే పునానో దేవోదేవాం స్తేన రసేన పృఞ్చన్।
ఇందు ర్ధర్మాణ్యృతుథా వసానో దశక్షిపో అవ్యత సానో అవ్యే॥

ఆధారములైన, లేక పోషకములయిన, కర్మలను కాలమందుఁ గప్పుకొనుచు, సోమము పిండంబడినదై యాటలాడుచుఁ, దన రసముతో నింద్రాదులనుగూర్చుచుఁ, (గలశములందు) ఁబడుచున్నది. దానిని బదివ్రేళ్ళును ఉన్నతమైన గొఱ్ఱెబొచ్చు వస్త్రమందుఁ బోయుచున్నవి.

ఉత్తరార్చికమందు షష్ఠాధ్యాయ షష్ఠమ ఖండము సంపూర్ణము.

## ౬ అధ్యాయము.

### ౭ ఖండము.

వసుశ్రుతఋషి-లేక-వత్సఋషి-పంక్తిచ్ఛంద-అగ్ని దేవతే.

౧౦౦౬. ఆతే అగ్న ఇధీమహి ద్యుమన్తం దేవాజరం। యద్ధస్యా తేపనీయసీ
సమిద్దీదయతి ద్యవీషగ్ం స్తోతృభ్య ఆ భర॥

ఓ యగ్నీ! కాంతిగలట్టి, నశించనట్టి, నిన్ను అంతటను ప్రకాశింపఁ జేయుచు చున్నాము. ఎప్పుడైతే నీయొక్క స్తవనీయమైన కాంతి ద్యులోకమందుఁ బ్రకాశించు చున్నదో, యప్పుడు ఓ యగ్నీ! మాకు నన్నమును దెచ్చిపెట్టుము.

౧౦౦౭. ఆతేఅగ్న ఋచాహవిః శుక్రస్య జ్యోతిషస్పతే సుశ్చంద్ర దస్మ
విస్పతే హవ్యవాట్ తుభ్యగ్ం హూయత ఇషగ్ం స్తోతృభ్య ఆభర॥

కాన్తికి స్వామియైన యగ్నీ! కాంతిమంతుఁడవైన నీ కొఱకు మంత్రముతోఁ గూడ హవిస్సును అభిముఖముగా నీలో హోమము చేయఁబడుచున్నావు. మంచి సంతోషకారివి. శత్రువులఁ దిరస్కరించుదువు. స్తుతికర్తలకు నన్నమును దెచ్చి పెట్టుము.

౧౦౦౮. ఓభే సుశ్చంద్ర విస్పతే దర్వీ శ్రీణీష ఆసని। ఉతోన ఉత్పుపూ
ర్యా ఉక్థేషు శవసస్పత ఇషగ్ం స్తోతృభ్య ఆభర॥

మంచి సంతోషము లేక బంగారము నిచ్చు నగ్నీ! రెండు దర్వులను (దర్వీ =కఱ్ఱతోఁ జేసిన హోమ సాధనము. గరిటె వంటిది) ముఖమునందుఁ బట్టుకొనుచున్నావు. లేక అందుకొనుచున్నావు. (దర్వులంటే దర్వులలోని హోమ ద్రవ్యము =హవిస్సు అని తా॥) మఱియు మమ్ము యాగములందు (ఫలములతోఁ) బూరించుము. ఓ బలాధిపతీ! స్తుతికర్తకు నన్నముఁ దెచ్చియిమ్ము.

నృమేధఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౧౦౦౯. ఇంద్రాయ సామ గాయత విప్రాయ బృహతే బృహత్। బ్రహ్మ
కృతే విపశ్చితే పనస్యవే॥

ఓ ఉద్గాతలారా! (=సామమంత్రపాఠకులు) బృహత్సామను (బృహత్తనిదాని పేరు) మేధావియు, మహాత్ముఁడు, (వర్షముద్వారా హవిస్సురూపమైన) అన్నమును జేయువాఁడు, విద్వాంసుఁడు, స్తుతినిగోరువాఁడు, నగు నింద్రుని కొఱకుఁబఠింపుడు. లేక గానము చేయుఁడు.

౧౦౧౦. త్వమింద్రాభిభూరసి త్వగ్ం సూర్య మరోచయః। విశ్వకర్మా విశ్వ
దేవో మహాగ్ం అసి॥

ఓ యింద్రా! నీవు శత్రువులం దిరస్కరించువాఁడవు అగుచున్నావు మఱియు నాదిత్యుని (=సూర్యుని) బ్రకాశింపఁ జేసితివి. సర్వమును జేయువాఁడవు, అన్నిదేవతలును నీవే యగుదువు. కనుక నీవు సర్వాధికుఁడవగుచున్నావు. లేక అగుదువు.

౧౦౧౧. విభ్రాజం జ్యోతిషా స్వ౩రగచ్ఛో రోచనం దివః। దేవాస్త ఇంద్ర సఖ్యాయ యేమిరే॥

నీవో యింద్రా! తేజస్సుతో సూర్యుని బ్రకాశమున కాధారమైన స్వర్గమును బ్రకాశింపఁ జేసితివి. సర్వదేవతలు నీసఖ్యముకొఱకు నియమించిరి. (అనఁగా మాకింద్రుఁడు స్నేహితుఁడు మాకు స్నేహితుఁడు అని ప్రయత్నించిరని తా॥)

గోతముఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్రదేవత.

౧౦౧౨. అసావి సోమ ఇంద్రంతే శవిష్ఠ ధృష్ణవా గహి। ఆత్వా పృణక్త్వింద్రియగ్ం రజః సూర్యో నరశ్మిభిః॥

ఇంద్రా! నీకొఱకు సోమము అభిషవింపఁబడినది. మహాబలవంతుఁడవు, శత్రువులను అణచువాఁడవునగు నింద్రా! (దేవయజనస్థానమునకు) రమ్ము. నిన్ను (సోమపానమువల్లఁగలిగిన) బలము అంతరిక్షమందు సూర్యకిరణములు పూరించునట్లు పూరించుఁగాక.

౧౦౧౩. ఆ తిష్ఠ వృత్రహన్రథం యుక్తాతే బ్రహ్మణా హరీ। అర్వాచీనగ్ం సుతేమనో గ్రావా కృణోతు వగ్నునా॥

శత్రువులంజంపునట్టి యింద్రా! రథము నెక్కుము. (ఏమంటే) నీగుఱ్ఱములు

రెండును స్తుతిమంత్రముతో (మాచే) బూన్పఁబడినవి. నీమనస్సును ఈ అభిషవ శిల మనోహర ధ్వని చేత మాయభిముఖముగాఁ జేయుఁగాక.

౧౦౭౮. ఇంద్ర మిద్ధరీ వహతాऽప్రతిధృష్టశవసం । ఋషీణాగ్ం సుష్టురు ప
యజ్ఞంచ మానుషాణాం॥

ఎవరును లొంగదీయరాని బలముగల యింద్రునే, ఋషులయొక్కయు, నితర మానవుల యొక్కయు, స్తవములు (ప్రవర్తించునపుడు) ఆ స్తవములు యజ్ఞము సమీపమునకు గుఱ్ఱములుతీసికొని వచ్చును.

ఇట్లు సామవేదోత్తరార్చిక షష్ఠాధ్యాయము సంపూర్ణము.

సప్తమఖండము సమాప్తము.

## ౭ అధ్యాయము.

### ౧ ఖండము.

---

సికతానివారిఋషిగణము-జగతీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౩ ౧
౧౦౧౫. జ్యోతిర్యజ్ఞస్య పవతే మధుప్రియం పితా దేవానాం జనితా విభూ
౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩క ౨ర ౩౧ ౨ ౩ ౧
వసుః ॥ దధాతి రత్నꣳ స్వధయో రపీచ్యం మదిన్తమో మత్సర
౨ ౩ ౧ ౨ర
ఇంద్రియో రసః ॥

యజ్ఞమునకు ప్రకాశము గలిగించుసోమము (దేవతలకు) ప్రియమైన మధురరసమును గార్చుచున్నది. (ఆరసము) పాలించునది, ఫలముంబుట్టించునది, విశేష ధనముగలది యగుచు ద్యులోక భూలోకములయందు ఇతరులకుఁగనఁబడని మంచి ధనమును నిలుపుచున్నది. రుచిగలది, మదముగలిగించువాటిలో శ్రేష్ఠమయి మదముగలిగించునది యగు సోమము ఇంద్రియములను వృద్ధిచేయునదగును.

౩ ౧ ౨ ౩౧ ౨ ౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౨
౧౦౧౬. అభిక్రన్దన్ కలశం వాజ్యర్షతి పతిర్దివః శతధారో విచక్షణః ।
౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౩ ౨౩ ౧ ౨౩ ౧ ౨
హరి ర్మిత్రస్య సదనేషు సీదతి మర్మృజానోఽవిభిః సిన్ధుభి ర్వృషా ॥

వేగముగలదై ధ్వనించుచు అంతరిక్షమునకు (అనఁగా మీఁద వ్రేలాడగట్టిన వడపోతవస్త్రమునకు) అధిపతియగుచు, లేక ద్యులోకమున కధిపతి యగుచున్నదై నూఱుధారలుగల్గి విశేషముగాఁజూచుచున్నదై, ఆకుపచ్చని రంగుగల సోమరసము కలశమందుఁబ్రసవించుచున్నది. అది మిత్రునివలె సంతోషపఱచు యాగముయొక్క-

గృహములందు సాధనములద్వారా స్రవించుచు, శోధింపఁబడుచు, (ఫలములను) వర్షించుచుఁ గారుచున్నది

౧౦౧౭. అగ్రే సింధూనాం పవమానో అర్షస్యగ్రే వాచో అగ్రియో
గోషు గచ్ఛసి॥ అగ్రే వాజస్య భజసే మహద్ధనగ్ం స్వాయుధః
సోతృభిః సోమసూయసే॥

ఓ సోమమా! నీవు ఉదకములయొక్క అగ్రమందు వడకట్టఁబడుచు గమనించుచున్నావు. మధ్యమవాక్కు (అనఁగా వర్షమునకు హేతువైన యాకాశమందలి యొకధ్వనికి పేరు) కంటెముందే పోవుచున్నావు. (సోమము హోమముసేయగా నది పోయి అంతరిక్షమున వర్షముకురియించుననితా॥) కిరణములకుముందే పోవుచున్నావు. శత్రువుల యన్నమును దీసికొనుటకు మంచియాయుధములు గలిగి యుద్ధమునఁజేరుచున్నావు. అట్టిసోమమా! నీవు అధ్వర్యుఁడు మొదలగు నభిషవకర్తలైన ఋత్విజులచే నభిషవింపఁ (=పిండఁ) బడుచున్నావు.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౧౮. అసృక్షత ప్రవాజినో గవ్యా సోమాసో అశ్వయా। శుక్రాసో
వీరయా శవః॥

బలముగలట్టి, ప్రకాశించునట్టి, వేగముకలట్టి, సోమములు యజమానునకు గోవులనిచ్చు కోర్కెతోను, అశ్వములనిచ్చు కోర్కెతోను, పుత్రభృత్యాదులనిచ్చు నిచ్ఛతోను, రసములం గార్చుచున్నవి.

౧౦౧౯. శుమ్భమానా ఋతాయుభిర్మృజ్యమానా గభస్త్యోః। పవన్తే వారే
అవ్యయే॥

యాగముంగోరుచున్న యధ్వర్యుఁడు మొదలయిన వారిచేత నలంకరింపంబడినవి, చేతులతోఁ దుడువఁబడుచున్నవి, గొఱ్ఱెబొచ్చుతో నల్లిన పవిత్రమందు (సోమములు) వడకట్టంబడుచున్నవి.

౧ ౨ర ౩ ౨ ౩ ౨౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩
౧౨౦. తే విశ్వా దాశుషే వసు సోమా దివ్యాని పార్థివా। పవన్తా
౨ర
మన్తరిక్ష్యా॥

ఆ సోమములు వడకట్టఁబడుచు యజమానునకు సమస్తధనములను గార్చును గాక. ద్యులోకమందుఁబుట్టినవి, భూలోకమందుఁబుట్టినవి, అంతరిక్షమందుఁబుట్టినవి, (అగుధనముల నన్నిఁటిని యిచ్చుఁగాకయని యన్వయము.)

మేధాతిథిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ ౩౧ ౨ర ౩౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧
౧౨౧. పవస్వ దేవవీరతి పవిత్రꣳ సోమరꣳహ్యా। ఇన్ద్రమిన్దో వృషా
౨ర
విశ॥

ఓ సోమమా! దేవతలంగోరిన నీవు వేగముగాఁ బవిత్రమునుదాటి స్రవించుము. ఓ సోమమా! చలువంగలిగించు లేక వర్షముంగురియించు నీవు ఇంద్రునిలోఁ బ్రవేశించుము.

౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ర
౧౨౨. ఆపవ్యస్వ మహీ ప్సరో వృషేన్దో ద్యుమ్నవత్తమః। ఆ యోనిం
౩ ౧ ౨
ధర్ణసిః సదః॥

ఓ సోమమా! వర్షముకురియించునట్టి, అతికీర్తివంతమవగునట్టి, సర్వాధారమవగునట్టి, నీవు గొప్పదయి పానయోగ్యమయిన యన్నరసమును (అన్నమనఁగా నిచట నాహారమని తా॥) మాకునిమ్ము. నీస్థానమందుండుము.

౧ ౨ ౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౨౩. అధుక్షత ప్రియం మధు ధారా సుతస్య వేధసః। అపో వశిష్ట
౩ ౧ ౨
సుక్రతుః॥

అభిషవింపఁబడినది, (కోర్కెలసఫలము) చేయునదియగు సోమముయొక్క ధార ప్రియమైన యమృతమును స్రవింపఁజేయుచున్నది. మంచికర్మకలదియగు నా సోమము ఉదకములను గప్పుకొనుచున్నది. (అనఁగా వసతీ-వరీ-అను యాజ్ఞిక పరి భాషితమైన యుదకములలోఁగలిసినదని తా॥)

౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౧ ౨ర
౧౦౨౪. మహాన్తం త్వా మహీరన్వాపో అర్షన్తి సిన్ధవః। యద్గోభిర్వాస
౩ ౧ ౨
యిష్యసే॥

సోమమా! నీవు ఎపుడు యజ్ఞమందు గోక్షీరములతోఁ గలుపఁబడు చున్నావో, యపుడు అధికగుణములుగల నిన్ను అనుసరించి గొప్పయుదకములు పొందు చున్నవి.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౨౫. సముద్రో అప్సుమామృజే విష్టమ్భో ధరుణో దివః। సోమః పవిత్రే
౩ ౨
అస్మయుః॥

రసములంగార్చునట్టి, స్వర్గమునునిల్పునట్టి, మమ్ముంగోరునట్టి, సోమము ఉదకములందు శోధింపంబడుచుఁ బవిత్రమందుఁ బోయఁబడుచున్నది.

౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౧ ౨ర
౧౦౨౬. అచిక్రదద్వృషా హరిర్మహాన్మిత్రో నదర్శతః। సగ్ం సూర్యేణ
విద్యుతే॥

కోర్కెలు వర్షించునట్టి, ఆకుపచ్చని రంగుగలట్టి, సర్వోత్తమ మగునట్టి,

స్నేహితునింబోలి చూడందగినట్టి సోమము ధ్వనించుచున్నది. అది సూర్యునితోఁ గూడఁ బ్రకాశించుచున్నది.

౧౦౨౭. గిరస్త ఇన్ద్ర ఓజసా మర్మృజ్యన్తే అపస్యువః। యాభిర్మదాయ శుంభసే॥

ఓ సోమమా! యేవాక్కులతో నీవు మదముకొఱకు (ఁగాఁచు) ఁబ్రకాశించుచుంటివో, యట్టి నీబలముతోఁ గోర్కెలంగూడియున్న యా వాక్కులు శోధింపఁబడుచున్నవి.

౧౦౨౮. తంత్వా మదాయ ఘృష్వయ ఉలోకకృత్నుమీమహే। తవప్రశస్తయే మహే॥

లోకములను జేసినట్టి యా నిన్ను (అనఁగా సోమమును) శత్రువులందిరస్కరించు మదమునిమిత్తము నీ గొప్పప్రకాశము నిమిత్తమును (తాగుటకు) ఁగోరుచున్నాము.

౧౦౨౯. గోషా ఇందో నృషా అశ్వసా వాజసా ఉతఆత్మా యజ్ఞస్య పూర్వ్యః॥

సోమమా! యజ్ఞస్వరూపమయిన, నిత్యమయిన, నీవు మాకు గోవులనిచ్చుదానవు, అశ్వములిచ్చుదానవు, అన్నమునిచ్చుదానవు నగుచున్నాము.

౧౦౩౦. అస్మభ్య మిందవిన్ద్రియం మధోః పవస్వ ధారయా। పర్జన్యో వృష్టిమాఁ ఇవ॥

సోమమా! వీర్యమును వృద్ధిచేయు రసమును, మదము గలగించు నమృత ధారతో, వర్షముం గురియు మేఘమువలె మాకొఱకు (మేధాతిథి వంశ్యులకు) స్రవించుము.

సామవేదోత్తరార్చికమున సప్తమాధ్యాయ ప్రథమ ఖండము సంపూర్ణము.

౭ అధ్యాయము.

౧ ఖండము.

హిరణ్యస్తూపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౩౧. సనాచ సోమ జేషిచ పవమాన మహిశ్రవః। అథానో వస్యసస్కృధి॥

అధికమయిన యన్నముకల సోమమా! మాయాగమందు ఆరాధింపఁదగిన దేవతలను (సేవించి) శత్రువులం జయించుచున్నావు. తర్వాత మాకుఁ గళ్యాణముం గూర్చుచున్నావు.

౧౦౩౨. సనాజ్యోతి స్సనా స్వ౩ర్విశ్వాచ సోమసౌభగా। అథానోవస్య సస్కృధి॥

సోమమా! మాకుఁ దేజస్సును గలిగించుము. స్వర్గమునిమ్ము. సమస్త సౌభాగ్యములు కలిగించుము. తక్కినది పూర్వవతు.

౧౦౩౩. సనాదక్ష ముతక్రతు మపసోమ మృధోజహి। అథానోవస్య సస్కృధి॥

సోమమా! మాకుబలమునిమ్ము మఱియు యజ్ఞమును జరిపించుము శత్రువులం జయింపుము. తక్కినవి పూర్వోక్తము.

౧౨ ౩౨౩ ౨౩౧ ౨ ౨ ౧౨ ౧౨
౧౦౩౪. పవీతారః పునీతన సోమమింద్రాయ పాతవే। అథా—కృధి॥

సోమమును శోధించు ఋత్విజులారా! సోమమును ఇంద్రుని పానమునకై వడకట్టుఁడు. తక్కినది పూర్వోక్తము

౧ ౨ర౩ ౧౨౩ ౨౩౨౩ ౨౩౧౨ ౧౨
౧౦౩౫. త్వగ్ం సూర్యేన ఆభజ తవక్రత్వా తవోతిభిః।అథా—కృధి।

సోమమా! నీపనిచేతను, నీరక్షణలచేతను, మమ్ము సూర్యునందుఁ జేర్చుము. తక్కినది పూర్వోక్తము.

౨౩౨౩ ౨౩౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧౨
౧౦౩౬. తవక్రత్వా తవోతిభి జ్యోక్పశ్యేమ సూర్యం। అథా—కృధి॥

సోమమా! నీప్రజ్ఞచేత, నీరక్షణములచేతను, చిరకాలము మేము సూర్యుని జూతుముగాక. (ఆయువధికముగానిమ్మని తా॥) పూర్వోక్తము.

౩క ౨ర ౩ ౧౨౩ ౧ ౧ ౩ ౨ ౧౨
౧౦౩౭. అభ్యర్షస్వాయుధ సోమద్విబర్హసగ్ంరయిం। అథా—ధి॥

మంచియాయుధములు కలిగినసోమమా! నీవు (ద్యులోక భూలోకములందు) శ్రేష్ఠమగుధనమును మాకుఁగలిగించుము. పూర్వోక్తము.

౩ ౨ ౧ ౨ ౩ ౧౨౩౧౨ ౩౨ ౧౨
౧౦౩౮. అభ్యా౩ర్షానపచ్యుతో వాజింత్సమత్సు సాసహిః। అథా—ధి॥

సోమమా! యుద్ధములందుఁ దిరస్కరింపఁబడక (శత్రువులం) దిరస్కరించుచున్న నీవు అన్నమును గలిగింపుము. పూర్వోక్తము.

౨ ౩౧౨ ౩ ౧౨ ౩ ౧౨ ౧౨
౧౦౩౯. త్వాం యజ్ఞైర వీవృధన్ పవమాన విధర్మణి। అథా - - - ధి॥

సోమమా! నిన్ను యాగమందు స్తోత్రములతో యజమానులు వృద్ధినొందించిరి. శేషము పూర్వవతు.

౩ ౧ ౨౩౨ ౩౨౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౧౨
౧౦౪౦. రయిం నశ్చిత్ర మశ్విన మిందో విశ్వాయు మాభర। అథా - - - ధి॥

సోమమా! నీవు నానావిధమైన యశ్వములతోఁగూడిన అన్నివిధముల నుపయోగించుధనమును దెచ్చియిమ్ము. శేషము పూర్వవతు.

ఉచథ్యఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౨౩ ౨ ౩ ౧౧ ౧ ౧ ౨ ౩౧ ౨ర ౨౩౨ ౨ ౧ ౨
౧౦౪౧. తరత్సమందీధావతి ధారా సుతస్యాన్ధసః। తరత్సమందీ ధావతి॥

(దేవతలను) సంతసింపఁజేయునట్టి సోమము (స్తుతికర్తలను పాపమునుండి) తరింపఁజేయుచు (పవిత్రమందు) కారుచున్నది. అభిషవించిన సోమధార పరువిడుచున్నది చెప్పినదే మరలఁ జెప్పుట ఆదరాతిశయార్థము.

౩ ౧ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨౩౨ ౩ ౧ ౨
౧౦౪౨. ఉస్రా వేద వసూనాం మర్తస్య దేవ్యవసః। తరత్సమందీ ధావతి॥

ధనములయొక్క దానముం జేయునట్టి, స్తుతింపఁబడుచున్న సోమముయొక్క ధార యాగకర్తను రక్షించుటకు నెఱుఁగును. స్తుతికర్తల పాపమును దరింపఁజేయునట్టి, (దేవతలను) సాదింపఁజేయునట్టి సోమము కారుచున్నది.

౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౨౩౨ ౩ ౧
౧౦౪౩. ధ్వస్రయోః పురుషన్త్యోరా సహస్రాణి దద్మహే। తరత్సమందీ

ధావతి॥

ధ్వ పురుషన్తి యను రాజులయొక్క ధన సహస్రములను మేము పుచ్చు

కొనుచున్నాము. (దానమును పట్టుచున్నారని తా॥) సంతోషము కలిగించు సోమము (పాపమునుండి) దాటించుచుం బరువిడుచున్నది.

౧౦౪౪. ఆయరో ద్రీగ్ంశతం తనా సహస్రాణిచ దద్మహే। తరత్స మందీ ధావతి॥

ఏ ధ్వస్ర పురుషన్తులయొక్క మూండువందలవేలు వస్త్రములను (అభ్రాయమేమో యూహ్యాము) మేము పుచ్చుకొంటిమి. (ఆ పుచ్చుకొన్న దానమువల్ల దోషములేకుండం జేయుమని సోమమును బ్రార్థించుచున్నాండు ఋషి.) తక్కినది పూర్వసమము

జమదగ్ని ఋషి-గాయత్రీచ్ఛంద-సోమ దేవత.

౧౦౪౫. ఏతే సోమా అసృక్షత గృణానాః శవ సేమహే। మదింతమస్య ధారయా॥

(దేవతలను) మదింపంజేయుటలో నుత్తమమగు సోమరసములు ఇవి అభిషవింపంబడి స్తుతింపంబడుచు గొప్ప గొప్పబలముకొఱకు ధారతోం గారుచున్నవి.

౧౦౪౬. అభి గవ్యాని వీతయే నృమ్ణా పునానో అర్షసి। సనద్వాజః పరిస్రవ॥

సోమమా! (దేవతల) భక్షణముకొఱకు, ధనమువలెం బ్రియములైన ఆవుపాలు మొదలయినవాటిని ఇచ్చుచు లేక వాటినివడకట్టుచు వచ్చుచున్నావు. అన్నము నిచ్చువాడవై (దశాపవిత్రము) నందంతట స్రవించుము.

3౨ ౧ ౧ ౦3౨3 ౧ ౨ 3 ౧ ౦ ౧ ౨ 3౧
౧౦౪౭. ఉతనో గోమతీరిషో విశ్వా అర్ష పరిష్టుభః । గృణానో జమ
౨
దగ్నినా॥

మఱియు నో సోమా! జమదగ్ని ఋషిచేత (తానే) స్తుతింపంబడుచు నీవు మాకు గోవులతోఁ గూడిన, బాగుగ మెచ్చఁదగిన, యన్నముల నన్నిఁటిని యిమ్ము.

ఉత్తరార్చిక సప్తమాధ్యాయ ద్వితీయ ఖండము సంపూర్ణము.

— :( ): —

౭ అధ్యాయము.

3 ఖండము.

కుత్సమదఋషి-జగతీచ్ఛంద-అగ్నిదేవత.

౧౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౧౦౪౮. ఇమగ్ం స్తోమమర్హతే జాతవేదసే రథమివసంమహేమా మనీషయా।
3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ర
భద్రాహినః ప్రమతిరస్య సగ్ం సద్యగ్నే సఖ్యే మారిషామా
3 ౧ ౨ర
వయంతవ॥

పూజ్యుఁడగునట్టి, పుట్టినవాఁటి నన్నిఁటిం దెలిసినట్టి, యగ్నికొఱకు చుఱుకయిన బుద్ధితో ఈ (సూక్తరూప) స్తవమును, రథమును ఆసరి (వడ్లంగి) బాగు చేయునట్లు, బాగుగాఁ బూజింతుము. ఈ యగ్ని సేవయందు మా యున్నతమైన బుద్ధి కళ్యాణమయినదికదా! ఓ యగ్నీ! నీతో స్నేహము గలప్పుడు మేము హింసను బొందకుందుముగాక.

౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧౨ ౩ ౧౨
౧౦౪౯. భరామేధ్మం కృణవామా హవీగ్ంషి తే చితయన్తః పర్వణా పర్వణా
౩ ౨ ౩౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౨ర
వయం। జీవా తవే ప్రతరాగ్ం సాధయా ధియోऽగ్నే సఖ్యే మారి
౩ ౧ ౨ర
షామా వయంతవ ॥

ఓ యగ్నీ! నీయాగముకొఱకు ఇధ్మమును (అనఁగా నిరువదియొక్క పుల్లల కట్టకుఁ బేరు) సంపాదింతుముగాక. నీ కొఱకు హవిస్సులను (అనఁగాఁ జరు=క్షీరాన్నము మొ॥ పురోడాశము=చిన్నరొట్టెవంటి వస్తువు. ఇవి హవిస్సు లనఁబడును) సంపాదింతుము. ప్రతి పర్వమందును (=పున్నమ-అమావస్యలకు పేరు.) నిన్ను బురికొల్పుచుందుము ఆ నీవు మా జీవనముకొఱకుఁ గర్మలను మిగుల సాధించుము. తక్కినది పూర్వసమము

౩ ౧౨ ౩౧౨ ౩ ౧ ౨ ౨౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨౩ ౧ ౨
౧౦౫౦. సకేమత్వా సమిధగ్ం సాధయాధియ స్త్వే దేవాహవి రదన్త్యాహుతం।
౧ ౨ ౩౧ ౨ర ౩ ౨ ౧ ౨ర ౩౧
త్వమా దిత్యాగ్ం ఆ వహ తాన్ హ్యూ౩శ్మస్యగ్నే సఖ్యేమా
౨ర ౩౧ ౨ర
రిషామా వయంతవ।

ఓ యగ్నీ! నిన్ను బ్రజ్వలింపఁజేయుటకు శక్తులమగుదుముగాక. నీవును మా కర్మలను (పున్నమ అమావాస్యల చేయువాటినని తా॥) సాధించుము. నీయందు హోమముచేసిన హవిస్సును దేవతలు భక్షింతురు. (కనుక) నీవు సర్వదేవతలను (మా యజ్ఞము కొఱకు) దెమ్ము. వారి నిపుడు మేము కోరుచున్నాము. ఇతరము పూర్వోక్తము.

వశిష్ఠఋషి-గాయత్రీచ్ఛంద-ఆదిత్యదేవత

౧ ౨ ౩ ౨ ౩ ౧౨ ౩౧ ౨ ౩ ౧౨ ౩ ౧౨
౧౦౫౧. ప్రతివాగ్ం సూర ఉదితే మిత్రం గృణీషే వరుణం। అర్యమణగ్ం
౩ ౨ ౩
రిశాదసం ॥

ఓ మిత్రా వరుణులారా! మిత్రుని నిన్ను, వరుణుని, మీయిద్దఱను, శత్రువులను దినివేయునట్టి వరుణుని, ఒక్కొక్కరునిగా సూర్యుఁడుదయింపఁగా స్తుతించుచున్నాను.

౩ ౧ ౨ ౩ ౨ ౩౧౩౧ ౨౩ ౨ ౩ ౧౨ ౩౧ ౨ర
౧౦౪౨. రాయా హిరణ్యయా మతిరియ మవృకాయ శవసే। ఇయంవిప్రా
౩౧౨
మేధసాతయే ॥

హితమై, రమణీయమైన, ధనముతోఁ గూడినట్టి, (ఇతరులను) బాధించునట్టిది గాని, బలమునకై యిప్పటి స్తుతి యగుగాక. ఓ బుద్ధిమంతులారా! యీ స్తుతియే యజ్ఞలాభమున కగుఁగాక.

౧౨ ౩ ౧ ౨ ౩౧౨ ౩ ౨ ౨౩క ౨ర
౧౦౪౩. తేస్యామ దేవ వరుణ తే మిత్ర సూరిభి స్సహ। ఇషగ్ం స్వశ్చ ధీమహి॥

వరుణ దేవా! (యజమానుల మయిన మేము) స్తుతికర్తలతోఁ గూడ నీ వారల మగుదుముగాక. ఓ మిత్ర దేవుఁడా! నీవారల మవుదుముగాక. మఱియు నన్నమును బంగారమును ధరింతుముగాక.

త్రిసోకఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౩౨ఉ ౩ ౨౩౨ ౩ ౨౩౧ ౨ ౩౧ ౨ర ౧౨ ౩ ౧
౧౦౪౪. భిన్ధి విశ్వా అపద్విషః పరిబాధో జహీమృధః। వసు స్పార్హం
౨ర
తదా భర॥

ఓ యింద్రా! నీవు శత్రువుల నందఱిని జీల్చి చెండాడుము. హింసకుల యుద్ధములఁ దిరస్కరింపుము. నివాసాధారమైన యింద్రా! (శత్రువులయొక్క) కోరఁదగిన ధనమును దెచ్చియిమ్ము.

౧౦౫౫. యస్య తే విశ్వమానుష గ్భూరేర్దత్తస్య వేదతి। వసు స్పార్హం
తదా భర॥

ఇంద్రా! నిన్ను ధనము నిచ్చు వానిఁగా నందఱును వరుసగా నెఱుంగుదురు. కోరఁదగిన యా ధనమును దెచ్చియిమ్ము.

౧౦౫౬. యద్వీడా విన్ద్ర యత్స్థిరే యత్పర్శానే పరా భృతం। వసు
స్పార్హంతదా భర॥

ఇంద్రా! ఇతరులు కదలుప శక్యము కానట్టి చోట (నీచేత) నే ధనముంచంబడినదో, యేది కదలని చోట నుంచఁబడినదో, విమర్శింప వలసిన చోట నేది యుంచఁబడినదో, కోరందగిన యా ధనమును దెచ్చియిమ్ము.

శ్యావాశ్వఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నీ దేవత.

౧౦౫౭. యజ్ఞస్య హి స్థ ఋత్విజా సస్నీ వాజేషు కర్మసు। ఇంద్రాగ్నీ
తస్య బోధతం॥

ఓ యింద్రాగ్నులారా! మీరు యాగమునందు ప్రతి కాలమును యజింపఁ (=పూజింపఁ) దగినవారు అగుచున్నారు. కనుక యుద్ధము లందును, యజ్ఞకర్మ లందునుంగూడ శుద్ధులరై నా స్తుతి నెఱుంగుఁడు.

౧౦౫౮. తోశాసా రథయావానా వృత్రహణా పరాజితా। ఇంద్రాగ్నీ!
తస్యబోధతం॥

ఇంద్రాగ్నులారా! రథముతోఁ బోవుచున్నట్టి, శత్రువులఁ జంపునట్టి, వృత్రుని (పాపము - లేక - మేఘము) కొట్టునట్టి, వారలగుచు మీరు నా స్తుతిని దెలియుఁడు.

౧౦౫౯. ఇంద్రాగ్నీ మదిరం మధ్వధుక్షన్నద్రిభిర్నరః। ఇంద్రాగ్నీ తస్య బోధతం॥

ఇంద్రాగ్నులారా! మిమ్ము నుద్దేశించి యాగకర్తలు శిలలతో మదము గలిగించు సోమరూపమృతమును దంచి పిండినారు. ఇతరము పూర్వసమము.

ఇట్లు సామవేదోత్తరార్చికమందు సప్తమాధ్యాయ తృతీయ ఖండము సంపూర్ణము.

## ౮ అధ్యాయము.

## ౧ ఖండము.

కశ్యపఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౬౦. ఇంద్రాయేందో మరుత్వతే పవస్వ మధుమత్తమః। అర్కస్య యోనిమాసదం॥

ఓ సోమమా! మిగుల మధురమైన నీవు యజ్ఞముయొక్క స్థానమునందుం డుట్కు, మరుత్తులతోఁగూడిన యింద్రుని కొఱకు స్రవించుము.

౧౦౬౧. తంత్వా విప్రా వచోవిదః పరిష్కృణ్వన్తి ధర్ణసిం। సంత్వా
మృజన్త్యాయవః॥

సోమమా! వడకట్టిన నిన్ను, బోషించు దానిని, ప్రాజ్ఞులైన స్తుతికర్తలు అలంకరించుచున్నారు. మనుష్యులు నిన్ను జక్కగా శోధించుచున్నారు.

౧౦౬౨. రసంతే మిత్రో అర్యమా పిబన్తువరుణః కవే। పవమానస్య మరుతః॥

కర్మలను సాధించు నో సోమమా! కారుచున్న నీ రసమును మిత్రుఁడు, అర్యముఁడు, వరుణుఁడు, మరుత్తులు పానము చేతురుగాక.

వశిష్ఠఋషి-బృహతీచ్ఛంద-సోమదేవత.

౧౦౬౩. మృజ్యమాన స్సుహస్త్యా సముద్రే వాచమిన్వసి। రయిం పిశఙ్గం
బహులం పురుస్పృహం పవమానాభ్యర్షసి॥

మంచి వ్రేళ్ళ సహవాసము గల సోమమా! (అనఁగా వ్రేళ్ళతో సోమమును పిండుట, కడుగుట మొదలగు పనులు జరుగును గనుక నట్లు చెప్పఁబడెను) శోధింపఁబడుచు నీవు అంతరిక్షమందు లేక కలశమందు ధ్వనించుచున్నావు. వడ కట్టఁబడుచున్న సోమమా! బంగారురంగు గల్గినట్టి, పలువురు కోరుచున్నట్టి, విస్తారమయిన ధనమును (స్తుతికర్తలకు) (గలిగించుచున్నావు.

౧౦౬౪. పునానో వారే పవమానో అవ్యయే వృషో అచిక్రదద్వనే। దేవా
నాగ్ం సోమ పవమాన నిష్కృతం గోభిరంజానో అర్షసి॥

ఈ సోమము వృషభము వంటి దగుచు సర్వమును పవిత్రము జేయుచు, గొఱ్ఱె బొచ్చుతో నల్లిన వస్త్రమందు వడకట్టఁబడి ఉదకమందు లేక కఱ్ఱతోఁజేసిన

కలశమందు ధ్వనించెను. సోమమా! వడకట్టఁబడుచు గోక్షీరాదులతోఁ గలిసి సంస్కరింపంబడి ( దేవతలస్థానమును ) జేరుచున్నావు

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

3౨3 ౨ఉ 3౧౨ 3౨3 ౧౨ ౧౨3౧౨
౧౦౬౫. ఏతముత్యం దశక్షిపో మృజన్తి సింధుమాతరం। సమాదిత్యేభిరఖ్యత॥

సముద్రములు తల్లులుగాఁగల ఆ యీ సోమమును బదిద్రేళ్ళు శుద్ధి చేయు చున్నవి. మఱియు నీసోమము ఆదిత్యులతో (=దేవతలు. అదితి పుత్రులు గనుక)఼ గూడుచున్నది. (సముద్రములు తొమ్మిదని భాష్యములో)

౧ ౨ర3౨ 3౧౨ 3౧౨ 3౨3 ౨ ౧ ౨ర
౧౦౬౬. సమింద్రేణోత వాయునా సుత ఏతి పవిత్ర ఆ। సగ్ం సూర్యస్య
3౧౨
రశ్మిభిః॥

అభిషవించిన సోమము పవిత్రమందు నింద్రునితోఁ గూడుచున్నది. వాయువుతోనుండి గూడుచున్నది. సూర్యుని కిరణములతోఁ గూఁడ గలియుచున్నది.

౨3౧౨ 3౧౨ 3౧౨3 ౧౨ ౧౨3౧
౧౦౬౭. సనోభగాయ వాయవే పూష్ణేపవస్వ మధుమాన్। చారుమిత్రే
౨ర
వరుణేచ॥

సోమమా! మధురరసముగల, సుందరమయిన, అభిషవింపఁబడిన, నీవు మా యాగమందు భగుండను దేవత కొఱకు, వాయు దేవుని కొఱకు, పూష దేవుని కొఱకును, మిత్రదేవుని కొఱకు, వరుణదేవుని కొఱకును స్రవించుము.

ఇట్లు సామవేదోత్తరార్చికమందు సప్తమాధ్యాయ చతుర్థఖండము సంపూర్ణము.

—:( ):—

## ౭ అధ్యాయము.

## ౫ ఖండము.

---

శునశ్శేఫఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౬౫. రేవతీర్నః సధమాద ఇంద్రే సన్తు తువివాజాః। క్షుమన్తో యాభిర్మదేమ॥

అన్నము కలవారమై యే గోవులతోఁ గూడ మదింతుమో, ఇంద్రుఁడు యాగమందు మాతోఁ గూడ సంతోషించుచుండగా మాయొక్క యా గోవులు క్షీరాది సంపన కలవగుచు, మిగుల బలము కలవై యుండుఁగాక.

౧౦౬౬. ఆఘత్వావాం త్మనా యుక్తః స్తోతృభ్యో ధృష్ణవీయానః। ఋణోరక్షం నచక్ర్యోః॥

భయంకరుఁడవయిన యింద్రా! నీవంటివాఁడు, (దేవతలలో) మాయందను గ్రహబుద్ధికలవాఁడు, అవశ్యముగా చక్రముల రెంటిలో నొక యిరుసు ఉంచునట్లు మాచేత యాచింపఁబడినవాఁడై, కోరిన వస్తువును దెచ్చియిచ్చుఁగాక. (చక్రములలో నిరుసు సంధించునంత సరిగా ధనములను మాకుఁ గూర్చుఁగాకని తా॥)

౧౦౭౦. ఆయద్దువః శతక్రతవా కామం జరితౄణాం। ఋణోరక్షం నశచీభిః॥

ఇంద్రుఁడా! యేదానిని స్తుతికర్తలు కోరుదురో దానిని ఆయా పనులతో ఇరుసును (బండియందు) గూర్చునట్లు, కూర్తువుగాక.

మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧౦౭౧. సురూపకృత్నుమూతయే సుదుఘామివ గోదుహే। జుహూమసి ద్యవిద్యవి।

మంచి రూపముకల కర్మలను జేయునట్టి యింద్రుని మా రక్షణమునకై ప్రతిదినమందును, పాలుపిదుకు వాఁడు పాడి మొదవును పిదుకటకై పిలుచునట్లు, పిలుచుచున్నాము.

౧౦౭౨. ఉపనః సవనా గహి సోమస్య సోమపాః పిబ। గోదా ఇద్రేవతో మదః॥

సోమపానము చేయు నింద్రా! మా యాగములనుగూర్చి (ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములఁ జేయు సవనములని తా॥) రమ్ము. వచ్చి సోమమును ద్రావుము. ధనవంతుఁడవయిన నీ మదము మాకు గోవు లిచ్చునది కదా!

౧౦౭౩. అథా తే అన్తమానాం విద్యామ సుమతీనాం। మానో అతిఖ్య ఆగహి॥

ఓ యింద్రా! సోమ పానానన్తరము నీకుఁ జాల దగ్గఱగానున్న బుద్ధిమంతులయినవారిమధ్యను ఉండి నిన్ను మేము తెలియుదుముగాక. నీవును మాకుఁ దప్ప నితరులకు నీ స్వరూపమును దెలియఁ జేయకుము

మాంధాతఋషి-మహాపంక్తిచ్ఛంద-ఇంద్రదేవత.

౧౦౭౪. ఉభే యదింద్ర రోదసీ ఆపప్రా థోషా ఇవ। మహాన్తం త్వా మహీనాం సమ్రాజం చర్షణీనాం। దేవీజనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్॥

ఓ యింద్రుఁడా! ద్యులోక భూలోకముల రెంటిని యే నీవు (నీతేజస్సుతో) ఉషస్సు తన కాంతితో నెల్లలోకమును బూరించునట్లు పూరించితివో, గొప్పవారగు దేవతలకు నధికుఁడవు, మనుష్యుల కీశ్వరుఁడవగు నట్టి నిన్ను తల్లి (అదితి) కన్నది. కనుక నామె కళ్యాణి యయియున్నది.

౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩ ౧.౨ ౧ ౨
౧౦౭౫. దీర్ఘఁహ్యంకుశం యథాశక్తిం బిభర్షి మంతుమః। పూర్వేణ
౨ ౩౨ ౩౧ ౨ర ౩౧
మఘవ న్పదా వయామజో యథాయమః। దేవీ - - - - జనత్॥ పూర్వ
వత్తు॥

పొడవయిన యంకుశమును ఎట్లు ధరించితివో, అట్లు పొడవయిన శక్తిని (ఇదొక ఆయుధమె) ఓ జ్ఞానవంతుఁడా! ధరించుచున్నావు. ఓ ధనవంతుఁడవగు నింద్రా! శరీరము ముందు భాగముననున్న కాలితో మేక చెట్టుకొమ్మను లాగునట్లు ఆ శక్తితో లాగి మా శత్రువులను లొంగఁదీయుచున్నావు. తక్కినది పూర్వోక్తము.

౧౨ ౩౧ ౨ర ౩౨ ౩ ౧ ౨ర
౧౦౭౬. అవస్మ దుహర్ణాయతో మర్త్తస్య తనుహిస్థిరం। అఘస్పదం తమీం
౩ ౨ ౩౧
కృధి యో అస్మగ్ం అభిదాసతి। దేవీజనిత్ర్య - - - - జనత్॥

దుఃఖకరమయిన అపహారమును జేయు మనుష్యుని యొక్క ధృఢమయిన బలమును దగ్గిపోవునదిగాఁ జేయుము. (అపహారము=ఇతరుల సొత్తును బలాత్కారముగా లాగుకొనుట) ఆ శత్రువును ఈ పాదముల క్రిందఁ ద్రొక్కివేయుము. ఏ శత్రువు మమ్మును బాధించునో (వానిని ద్రొక్కివేయుమని పూర్వాన్వయము) తక్కినది పూర్వసమము.

ఉత్తరార్చిక సప్తమాధ్యాయమునఁ బంచమ ఖండము సంపూర్ణము.

## ౭ అధ్యాయము.

## ౬ ఖండము.

అసిత లేక దేవలఋషి–గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౭౭. పరిస్వానో గిరిష్ఠాః పవిత్రే సోమో అక్షరత్। మదేషు సర్వధా అసి॥

ఱాళ్లలోనుండునట్టిదైన యీ సోమము ధ్వనించుచుఁ బవిత్రమందుఁ గారుచున్నది. సోమమా! ఆ నీవు మదముగలిగించు స్తుతికర్తల కన్నివిధముల నుపయోగింతువు. ( కావలసినవాటిని గూర్తువని తా॥ )

౧౦౭౮. త్వం విప్రస్త్వం కవిర్మధు ప్రజాత మన్ధసః। మదేషు సర్వధా అసి॥

సోమమా! అన్నివిధముల ప్రియమగుదానవు, బుద్ధిగలదానవు నగుచున్నావు. కనుక యన్నమునుండి పుట్టిన మధురరసమును ఇచ్చుచున్నావు. శేషము పూర్వవతు.

౧౦౭౯. త్వే విశ్వే సజోషసో దేవాసః పీతి మాశత। మదేషు సర్వధా అసి॥

సోమమా! నీయందు సర్వదేవతలు సమాన ప్రీతికలవారయి పానము నాచరించుచున్నారు. తక్కినది పూర్వవతు.

ఋణవఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౮౦. ససున్వేయో వసూనాం యోరాయా మానేతా య ఇడానాం
సోమో యః సుక్షితీనాం॥

ఆ సోమము అభిషవింపఁబడుచున్నది. ఏది ధనములను దెచ్చియిచ్చునో, యేది గోవులను దెచ్చియిచ్చునో, (రాయ=క్షీరాదికము నిచ్చునట్టి యని వ్యాఖ్యానము) ఎయ్యది యన్నములను మంచి నివాసములను గలిగించునో, (ఆ సోమమని యన్వయము.)

౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
౧౦౮౧. యస్యత ఇంద్రః పిబాద్యస్య మరుతో యస్యవార్య మణా భగః।
౧ ౨ర 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨
ఆ యేన మిత్రావరుణా కరామహ ఏంద్ర మవసే మహే॥

ఓ సోమమా! ప్రసిద్ధమైన యే నీయొక్క రసమును నింద్రుఁడు పానము చేయునో, అర్యమణదేవునితోఁ గలసి భగదేవుఁ డెద్దానిం ద్రావునో, యే సోమముతో మిత్రావరుణ దేవతల నిద్దఱిని మేము అభిముఖులం జేయుదుమో, యే రసముతో నింద్రుని మేము రక్షణముకొఱకుఁ బిలుచుచున్నామో, ఆ రసమును అభిషవించుచున్నాను అని.

పర్వత నారదులు ఋషులు-ఉష్ణిక్ఛంద-సోమదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3౧ ౨ ౨ 3 ౨
౧౦౮౨. తం వస్సఖాయో మదాయ పునాన మభిగాయత। శిశుం న
3 ౧ ౨ 3 ౧ ౨
హవ్యైః స్వదయన్త గూర్తిభిః॥

ఓ స్నేహితులారా! దేవతల మదముకొఱకు వడకట్టంబడుచున్న సోమమును గూర్చి గానము చేయుఁడు. ఆ యీ సోమమును, శిశువు నలంకారములతోఁ క్షీరాదులతోను అలంకరించునట్లు, హవిస్సులతో (అనఁగా దానిలోఁ గలుప వలసిన పాలు పెరుగు మొదలగు పదార్థములతో) (గలిపి రుచికలుగఁ జేయుఁడు.

౨ 3౧ ౨ 3 ౨ 3౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర
౧౦౮౩. సంవత్స ఇవ మాతృభిరిన్దు హిన్వానో అజ్యతే। దేవావీర్మదో
3 ౨ 3 ౧ ౨
మతిభిః పరిష్కృతః॥

కార్చఁబడుచున్న లేక పిండఁబడుచున్న సోమము ఉదకములతోను, బాగుగా దూడతల్లులయిన మొదవులతోను గూర్చునట్లు కలుపఁబడుచున్నది. అది మదము కలిగించునది, దేవతలను బోషించునది, స్తుతులచే నలంకరింపఁబడినది.

3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ 3 ౨
౧౦౮౪. అయం దక్షాయ సాధనో౽యం శర్ధాయ వీతయే। అయం దేవేభ్యో
౧ ౨ 3 ౨
మధుమత్తరః సుతః॥

ఈ సోమము బలముకొఱకు సాధనము అగుచున్నది. ఇది వృద్ధికొఱకు దేవతల భక్షణమునకై యగుచున్నది. అభిషవించిన యీ సోమము ఇంద్రాదులకు జాల మధురమయినది. లేక మదమును బాగుగాఁ గలిగించునది యగుచున్నది.

మనుఋషి-అనుష్టుప్ఛంద-సోమదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧
౧౦౮౫. సోమాః పవన్త ఇందవో౽స్మభ్యం గాతువిత్తమాః। మిత్రాః స్వానా
౨ 3 ౧ ౨ 3క ౨ర 3 ౧ ౨
అరేపసః స్వాధ్యః స్వర్విదః॥

బాగుగా మార్గమును గలిగించునట్టి, ప్రకాశించునట్టి, సోమములు (దేవతలకు) మిత్రములును అభిషవింపఁబడుచున్నవి, పాపములు లేనివి, మంచి ధ్యానము గలవి, స్వర్గమును బొందించునవి యగుచు మాకై స్రవించుచున్నవి.

౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨ 3
౧౦౮౬. తే పూతాసో విపశ్చితః సోమాసో దధ్యాశిరః। సూరాసో న దర్శ
౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨
తాసో జిగత్నవో ధ్రువా ఘృతే॥

వడకట్టఁబడినవి, మేధావులును, పెరుగుతోఁ గూర్చఁబడినవి, ఉదకమునందు జేరినవియును, స్థిరముగా (నీటిలో) నుండునవియు నగు సోమములు సూర్యులం బోలి (పాత్రమునందు) వెలయుచున్నవి.

౩ ౨౩ ౧ ౨౩౧ ౨ ౩౧ ౨ర ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ౩౨౩
౧౦౫౭. సుష్వాణాసో వ్యద్రిభిశ్చితానాగో రధిత్వచి। ఇషమస్మభ్య మభితః
౧ ౨ ౩ ౧ ౨
సమస్వర న్వసువిదః॥

ఎద్దుచర్మముమీఁద నుంచఁబడి, శిలలతో అభిషవింపఁబడుచున్నవి, ధనము లభింపఁజేయునవి, యగు నీ సోమములు మాకు నన్నమును బాగుగ నిచ్చుచున్నవి.

కుత్సఋషి-త్రిష్టుప్ఛంద-సోమదేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩
౧౦౫౮. అయా పవా పవస్వైనా వసూని మాగ్ంశ్చత్వ ఇన్దో సరసి
౧ ౨ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩
ప్రధన్వ। బ్రధ్నశ్చిద్యస్య వాతో న జూతిం పురుమేధాశ్చిత్తకవే
౧ ౨
నరం ధాత్॥

సోమమా! యీ ధారతో ఈ ధనములను గార్చుము. స్తుతించువారు పొందఁదగిన యుదకమునందుఁ గారుము. ఏ సోమును సిద్ధమయియుండ సూర్యుఁడుఁ గూడ వాయువువలె వేగమును అవలంబించునో, బహువిధ ప్రజ్ఞలుగల యింద్రుఁడుఁ గూడ (సోమమును) సిద్ధపఱచిన నాకు (కర్మ) నాయకుఁడైన పుత్రుని నిచ్చునో, యట్టి నీవు (కారుము అని పూర్వాన్వయము.)

౧ ౨ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౧౦౫౯. ఉతన ఏనా పవయా పవస్వాధి శ్రుతే శ్రవాయ్యస్య తీర్థే
౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౨ర ౩ ౨ ఉ ౩ ౧ ౨
షష్టిగ్ం సహస్రా నైగుతో వసూని వృక్షం న పక్వం ధూనవ
౩ ౧ ౨
ద్రణాయ॥

సోమమా! మఱియు అందఱు వినందగిన, ప్రసిద్ధమయిన, మా యజ్ఞమందు ఈ ధారతో నెక్కుడుగా స్రవించుము. శత్రువులను సంహరించునట్టి యీ సోమము

అరువదివేల ధనములను శత్రు జయముకొఱకు, (ఫలము కోరినవాఁడు) చెట్టును గదల్చునట్లు మాకై కదల్చునుగాక.

౧౦౯౦. మహీమే అస్య వృషనామ శూషే మాంశ్చత్వే వా పృశనే వా వధత్రే। అస్వాపయన్నిగుతః స్నేహయచ్చాపమిత్రాగం అపాచితో అచేతః॥

శత్రువులమీఁద (బాణములు) వర్షించుట, (వారిని) వంచుట, యను నీ రెండు గొప్పపనులు ఈ సోమమునకు సులభములు అయియున్నవి. ఏ రెండు పనులు గుఱ్ఱముల యుద్ధమందుగాని, బాహు యుద్ధమందుఁగాని, శత్రుహింస జేయుటలో సుఖముల్తో అట్టి సోమము శత్రువులను నిద్రింపఁజేయును. (చంపునని తా॥) (శత్రువులను) బరువెత్తించుచు నో సోమమా! నీశత్రువుల నణంచుము. అట్లే యజ్ఞమును జేయని నాస్తికులను మావద్దనుండి దూరము చేయుము.

ఉత్తరార్చికమున సప్తమాధ్యాయ షష్ఠఖండము సంపూర్ణము.

———:o:———

## ౮ అధ్యాయము.

### ౧ ఖండము.

బన్ధుఋషిః-ద్విపదత్రిష్టుప్ఛంద-అగ్నిదేవత.

౧౦౯౧. అగ్నే త్వం నో అన్తమ ఉతత్రాతా శివో భువో వరూథ్యః॥

ఓ యగ్నీ! సేవింపందగిన నీవుమాకు మిగుల సమీపమందుండువాఁడవు కమ్ము. మఱియు రక్షకుఁడవు సుఖము కలిగించువాఁడవు కమ్ము.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౯౨. వసురగ్నిర్వసు శ్రవా అచ్ఛా నక్షిద్యుమత్తమో రయిందాః॥

నివాసాధారమైన యగ్నీ! సర్వవ్యాపివైన నీవు మా కభిముఖుఁడవు కమ్ము. మిగుల కాన్తిమంతుఁడవైన నీవు ధనమును మాకిమ్ము.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౯౩. తం త్వా శోచిష్ఠ దీదివః సుమ్నాయ నూనమీమహే సఖిభ్యః॥

మిక్కిలి ప్రకాశము కలవాఁడవై దీపించు నో యగ్నీ! ఆ నిన్ను సుఖము కొఱకు, సమానఖ్యాతిగల పుత్రుల సుఖమునకై, యాచించుచున్నాము.

ఆప్త్యఋషి-ద్విపదత్రిష్టుప్ఛందః-విశ్వేదేవ దేవత.

౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
౧౦౯౪. ఇమానుకం భువనా సీషధేమేంద్రశ్చ విశ్వేచ దేవాః।

ఈ కనంబడుచున్న లోకములు శీఘ్రము వశపఱచుకొందుముగాక. లేక సమస్తభూతములు మాకు (కం=) సుఖమును గలుగఁజేయుఁగాక. ఇంద్రుఁడు సర్వదేవతలను ప్రీతితో నీయర్థమును సాధింతురుగాక. (అనఁగా కోరినట్లు ఫలము కలిగింతురని తా।)

౩ ౧ ౨ ౩క ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨
౧౦౯౫. యజ్ఞంచ నస్తన్వంచ ప్రజాంచాదిత్యై రింద్రస్సహా సీషధాతు॥

మాయజ్ఞమును, మా శరీరమును, మా సంతానమును సర్వదేవతలతోఁ గూడిన యింద్రుఁడు సాధించుఁగాక. (రక్షించుఁగాకని తా॥)

౩ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
౧౦౯౬. ఆదిత్యైరింద్రస్సగణో మరుద్భిరస్మభ్యం భేషజా కరత్।

మిత్రాది దేవతలతోను, మరుద్గణముతోను, గూడిన యింద్రుఁడు మాకు నౌషధములను జేయునుగాక. (రోగశాంతి నొనర్పుఁగాకని తా॥)

సంపాతఋషి-ద్విపదాత్రిష్టుప్ఛంద-ఉషోదేవత.

౧౦౯౭. ప్రిహో౨చోఽహా

ఋత్విగ్యజమానులారా! మీరు సమీపమందు నింద్రుని బూజింపుఁడు.

నాలుగక్షరాల మంత్రము: ఋగ్వేదమందునుగూడ నిట్లే "భద్రంనో అపివాతయ మనః" ఒకే పాదము మంత్రము. ఇట్టివి మఱికొన్నియుఁ గలవు.

సామవేదోత్తరార్చికమున సప్తమ ఖండము సంపూర్ణము.

అధ్యాయమును సంపూర్ణము.

## ౯ అధ్యాయము.

### ౧ ఖండము.

అసిత దేవలులు ఋషులు-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౦౯౮. ప్రకావ్యముశనేవ బ్రువాణో దేవో దేవానాం జనిమా వివక్తి।
మహివ్రతః శుచిబన్ధుః పావకః పదావరాహో అభ్యేతి రేభన్॥

ఉశనఋషివలె స్తోత్రమును బలుకుచు స్తుతికర్త ఇంద్రాది దేవతల జన్మలను బాగుగాఁ జెప్పుచున్నాఁడు. అనేక కార్యములు చేయుచు దీపించుచున్నట్టి, పాపములను శుద్ధిచేయునట్టి, మంచిదినముగల సోమము (అనఁగా సోమము నభిషవించిన దినము శుభదినమని తా॥) ధ్వనించుచుఁ బాత్రములందుఁ బ్రవేశించుచున్నది. లేక పందిపాదముతో నేల ద్రవ్వుచు ధ్వనించునట్లు, ధ్వనించుచున్నదని యర్థము వ్రాసిరి.

౧౦౯౯. ప్రహంసాస స్తృపలా వగ్నుమచ్ఛామాదస్తం వృషగణా
అయాసుః। అఙ్గోషిణం పవమానగ్ం సఖాయో దుర్మర్షం
వాణం ప్రవదన్తి సాకం॥

హంసలు (శత్రువులచే బాధింపఁబడినట్లు) బాధింపఁబడుచు వృషగణులనెడు ఋషులు, శీఘ్రముగా నడచుచు చిదుకఁగొట్టునపుడు వినఁబడుచున్న యభిషవ ధ్వని కభిముఖముగా గృహమును (అనఁగా యజ్ఞశాల) ప్రవేశించుచున్నారు.

తరువాత సఖులైన స్తుతికర్తలు స్తుతింపఁదగినట్టి,ఇతరులకులొంగనట్టి,సోమమును గూర్చి వాణమనే వాద్యమును గూడను వాయించుచున్నారు. (వాణము వీణవంటి యంత్రము)

౧౨ ౩౧ ౨౩ ౨ఉ ౩ ౧ ౨ ౩౧ ౨ర ౩
౧౧౦౦. సయోజత ఉరుగాయస్య జూర్తిః వృథాక్రీడన్తం మిమతే న గావః। పరి
౧ ౨ ౩౧ ౨ ౨ ౨౩ ౨౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨
ణసం కృణుతే తిగ్మశృఙ్గో దివా హరిర్దదృశే నక్తమృజ్రః॥

ఆ సోమము పలువురు స్తుతింపఁదగిన తన గమనము నంతరిక్షమందుఁ గూర్చుచున్నది. అనాయాసముగా విహరించుచున్న (అనఁగాఁ గమనించుచున్న) సోమమును, గమనించు నితరులెవరును మించలేరు. తీక్ష్ణమగు తేజస్సుగలదై, విస్తారమైన తేజస్సునుగలిగించుచున్నది. అంతరిక్షమందుఁ బ్రవర్తించుచున్న సోమము పగలు పచ్చనికాన్తి గలదగుచుఁ బ్రకాశించుచున్నది. రాత్రి స్పష్టప్రకాశము కలదయి కనఁబడుచున్నది.

౨ ౩ ౨ ౩౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧
౧౧౦౧. ప్రస్వానాసో రథా ఇవార్వన్తో న శ్రవస్యవః। సోమాసో రాయే
౨
అక్రముః॥

అభిషవకాలమందుఁ బాత్రలలో ధ్వనించుచు సోమములు రథములవలెఁ గుఱ్ఱములవలె పరువిడుచు, శత్రువుల వద్దనుండి యన్నమును గోరుచు యాగకర్తలకు ధనము తెచ్చి యిచ్చుటకు గమనించుచున్నవి.

౩ ౨ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨ర ౧ ౨ ౩ ౧ ౨
౧౧౦౨. హిన్వానాసో రథా ఇవ దధన్విరే గభస్త్యోః। భరాసః కారిణామివ॥

యుద్ధమగుచోటికి రథములు పరువెత్తునట్లు యాగస్థలమునకుఁ బరువిడుచున్నట్టి సోమములు ఋత్విజులచేతులలో, మోతగాండ్ర చేతులలో మూటలు ధరింపఁబడునట్లు, ధరింపఁబడినవి.

౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ఉ ౩ ౨
౧౧౦౩. రాజానో న ప్రశస్తిభిః సోమాసో గోభిరంజతే। యజ్ఞో న సప్త
౩ ౧ ౨
ధాతృభిః॥

సోమములు స్తుతివాక్కులతోఁ రాజులవలె, నేడ్గురు ఋత్విజులతోఁ యాగము వలెను, గోరసములతోఁ గూడుచున్నవి.

౧౨౩ ౨౩ ౧౨౩ ౧ ౨ ౩౧ ౨౩౧ ౧ ౨ ౩౧ ౨
౧౧౦౪. పరిస్వానాస ఇన్దవో మదాయ బర్హణా గిరా। మధో అర్షన్తి ధారయా॥

అభిషవింపఁబడుచున్న సోమములు గొప్ప స్తుతివాక్కులతోఁ గూడి మదము కొఱకు మధురరసధారతో నంతటఁ బ్రసరించుచున్నవి.

౨ ౧ ౨ ౩౧౨ ౩ ౧ ౨ ౩౨ ౩ ౧ ౨ ౨ ౩ ౨ ౩
౧౧౦౫. ఆపానాసో వివస్వతో జిన్వన్త ఉషసో భగం। సూరా అణ్వం
౧ ౨
వితన్వతే॥

కాంతిమంతుఁడైన యింద్రుని యొక్క పానమునకుపయోగించునవి; ఉషస్సు యొక్క ప్రకాశమును ప్రేరణ చేయుచున్నవి, ప్రసరించుచున్నవియు నగు సోమములు (అభిషవ సమయమునఁ బాత్రలలో) ధ్వనించుచున్నవి.

౨౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౨ ౩ ౧ ౨
౧౧౦౬. అపద్వారా మతీనాం ప్రత్నా ఋణ్వన్తి కారవః। వృష్ణో హరస
౩ ౧ ౨
ఆయవః॥

స్తుతికర్తలు, పురాతనులు, వర్షించు సోమమును గొనివచ్చువారు నగు ఋత్విజులు యజ్ఞము యొక్క ద్వారములను దెఱచుచున్నారు.

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩౧ ౨ర౩ ౧ ౨
౧౧౦౭. సమీచీనాస ఆశత హోతారః సప్తజానయః। పదమేకస్య పిప్రతః॥

యోగ్యులు, సమానజాతికలవారు, (బంధువని తా॥) సోమస్థానమును బూరించువారు, నగుచు నేడ్గురు హోతలు(=ఋత్విజులు) యజ్ఞమును నడుపుచున్నారు.

౨3 ౧౨ 3౧ ౨3 ౧౨3 ౧ ౨ 3 ౨ 3౧౨ర3౧
౧౧౦౮. నాభా నాభిం న ఆ దదే చక్షుషా సూర్యం దృశే। కవేరపత్యమా

౨
దుహే॥

యజ్ఞమునకు ముఖ్యమయిన సోమమును కంటితో సూర్యునిం జూచుటకు మా నాభి (=బొడ్డు) యందుఁ (పానముచేసి) యుంచుచున్నాను. కర్మకాధారమైన సోమముయొక్క తీగను బిండుచున్నాను.

3 ౨ 3 ౨ 3౨3౧ ౨3 ౨3౧ ౨ 3 ౨ ౧౨ 3
౧౧౦౯. అభిప్రియం దివస్పద మధ్వర్యుభిర్గుహా హితం। సూరః పశ్యతి

౧౨
చక్షసా॥

మంచి పరాక్రమవంతుఁడైన ఇంద్రుఁడు, దృష్టితో ప్రకాశించు తనకుం బ్రియమైనట్టి, ఋత్విజులచేత హృదయమందు నుంచఁబడినది, (ఋత్విజు లివ్వఁగాఁ దాను ద్రాగినదని తా॥) యగు సోమమును ఎదురుగాఁ జూచుచున్నాఁడు.

ఉత్తరార్చికమున సప్తమాధ్యాయ ప్రథమ ఖండము సమాప్తము.

## ౮ అధ్యాయము.

### ౧ ఖండము.

జమదగ్ని, అసిత, దేవలులుఋషులు-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౨ 3 ౧౨ 3౧ ౨ర3 ౧౨ 3౧౨ 3 ౧ ౨3
౧౧౧౦. అసృగ్ర మిందవః పథా ధర్మన్నృతస్య సుశ్రియః విదానా అస్య

౧ ౨
యోజనా॥

ఈ యజమానుఁడు చేసిన ఆయా యీ (దేవతలకు గల) సంబంధములను దెలియుచు, మంచి వసువ్రులతో (పాలు పెరుగు మొదలగువానితో నని తా॥) గలిసినవయిన సోమములు కర్మయందు యాగముయొక్క మార్గము చేత హవిర్ధాని నుండి కారుచున్నవి.

౨ఉ ౩ ౧౨ ౩ ౨ ౩ ౨౩౧ ౨ర ౩ ౨ ౩ ౧
౧౧౧౧. ప్రధారా మధో అగ్రియో మహీరపో విగాహతే। హవిర్హవిష్షు
౧౨
వన్ద్యః॥

హవిస్సులలో స్తుతింపఁదగిన, హవిస్స్వరూపమయిన, యే సోమము గొప్ప వయిన యుదకములయందుఁ బ్రవేశించుచున్నది. ఆ సోమముయొక్క ముఖ్యమయిన ధారలు కారుచున్నవి.

౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨ర ౩౧ ౨ ౨ ౩ ౨ ౩౧
౧౧౧౨. ప్రయుజా వచో అగ్రియో వృషో అచిక్రదద్వనే। సద్మాభి సత్యో
౨౩ ౨
అధ్వరః॥

హవిస్సులలో ముఖ్యమయిన సోమము యుక్తమయిన వాక్కులను జేయుచున్నది. (స్తుతివాక్కులను బుట్టించుచున్నదని తా॥) (కోర్కెలను) వర్షించునట్టి, సత్యమయినట్టి, హింస లేనట్టి, సోమముయజ్ఞగృహమున కెదురుగా నుంచినయుదకమందు ధ్వని చేయుచున్నది.

౨౩౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౨ర ౩ ౧ ౨
౧౧౧౩. పరియత్కావ్యా కవిర్నృమ్ణా పునానో అర్షతి। స్వర్వాజీ సిషాసతి॥

కర్మలను సాధించునట్టి సోమము బలములను శోధించుచు, స్తోత్రములను ఎపుడు పొందుచున్నదో, యపుడు స్వర్గమందు బలవంతుఁడైన యింద్రుఁడు (యాగమునకు వచ్చుటకుఁ దన బలమును) బొంద నిశ్చయించుచున్నాఁడు.

౧౨ ౩౨ఉ ౩ ౨ ౧౨ ౧౨౩౧౨ ౩౧౨
౧౧౧౭. పవమానో అభిస్పృధో విశో రాజేవ సీదతి। యదీమృణ్వన్తి వేధసః॥

ఎపుడీ సోమమును కర్మకర్తలు ప్రేరించుచున్నారో, యపుడు కారుచు నీ సోమము యాగమునకు విఘ్నముచేయు శత్రువులను నశింపఁజేయ నెదిరించు చున్నది.

౨ ౩ ౨ ౩ ౧౨౩౨ఉ ౩౧౨ ౩౧ ౨ ౩౨
౧౧౧౮. అవ్యావారే పరిప్రియో హరిర్వనేషు సీదతి। రేభో వనుష్యతే మతీ॥

ఆకుపచ్చనిరంగు గలట్టి, దేవతలకుం బ్రియముయినట్టిదే యగు సోమము గొఱ్ఱెబొచ్చు వస్త్రమందు ఉంటున్నది. (అభిషవ సమయమున) ధ్వనించుచు స్తుతితో సేవింపఁబడుచున్నది.

౨౩ ౧ ౨ర ౩౧౨ ౩౧ ౨ర ౨౩ ౧ ౨౩
౧౧౧౯. సవాయు మింద్ర మశ్వినా సాకం మదేన గచ్ఛతి। రణా యో అస్య
౧౨
ధర్మణా॥

ఏ యజమానుఁడు సోమముయొక్క కర్మలతో (కొనుట-పిండుట మొదలగు పనులతో) విహరించునో, ఆ యజమానుఁడు వాయువును, ఇంద్రుని, అశ్వినులను మదముతోఁగూడఁ బొందుచున్నాఁడు

౨ ౩౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨౩
౧౧౨౦. ఆ మిత్రే వరుణే భగే మధోః పవన్త ఊర్మయః। విదానా అస్య
౧౨
శక్మభిః॥

ఏయజమానులు సిద్ధపఱచిన సోమముయొక్క తరంగములు, మిత్రావరుణులను భగదేవునిగూర్చి ప్రవహించుచున్నవో, యా యజమానులు ఈ సోమమును దెలియుచు సుఖములతోఁ గూడుచున్నారు.

౩౧ ౨ ౩౨ఉ ౩ ౧౨ ౩౧౨ ౨౩
౧౧౧౭. అస్మభ్యగ్ం రోదసీ రయిం మధ్వో వాజస్య సాతయే। శ్రవో
౧౨ ౩ ౧ ౨
వసూని సంజితం॥

ఓ ద్యావా పృథ్వ్యలారా! మీరు ( దేవతల ) మదింపఁజేయు సోమరూపాన్నముయొక్క లాభముకొఱకు మాకు ధనమును, అన్నమును, నివాసాధారములగు పశ్వాదులను ఇండు.

౨ ౩ ౧౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩౧
౧౧౧౯. ఆ తే దక్షం మయోభువం వహ్నిమద్యా వృణీమహే। పాన్తమా
౨ ౩ ౧ ౨
పురుస్పృహం॥

ఓ సోమమా! మేము ( యాగకర్తలని తా॥) నీ సంబంధమైనట్టి, సుఖము గలిగించునట్టి, ధనాదులను ఇచ్చునట్టి, ( శత్రువులనుండి ) రక్షించునట్టి, పలువురు కోరునట్టి, నీ బలమును ఈ యాగ దినమందు అభిముఖముగాఁ గోరుచున్నాము.

౨ ౩ ౧ ౨ర ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౨ ౩౧
౧౧౨౦. ఆ మన్ద్రమా వరేణ్యమా విప్రమా మనీషిణం। పాన్తమా
౨ ౩ ౧ ౨
పురుస్పృహం॥

ఓ సోమమా! మదకరమయిన, అందఱు సేవింపఁదగిన, నిన్ను గోరుచున్నాము మఱియు మేధావి యగునట్టి, స్తుతుల నొందినట్టి నిన్ను గోరుచున్నాము. పలువురు కోరఁదగిన, అందఱికి రక్షకమయిన నిన్ను సేవించుచున్నాము.

౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౨ ౩ ౧
౧౧౨౧. ఆ రయిమా సుచేతునమా సుక్రతో తనూష్వా। పాన్తమా
౨ ౩ ౧ ౨
పురుస్పృహం॥

మంచి ప్రజ్ఞలుకల యో సోమమా! నీ ధనమును మేము కూడఁబెట్టు

చున్నాము. మంచి జ్ఞానమును బొందుచున్నాము. మా పుత్రులయందు ధనమును, విజ్ఞానమును గలిగించుము. సర్వమును రక్షించునట్టి, యనేక యాగకర్తలు కోరునట్టి, నిన్ను సేవించుచున్నాము.

ఉత్తరార్చికమందు అష్టమ అధ్యాయ ద్వితీయ ఖండము సంపూర్ణము.

## ౮ అధ్యాయము.

### 3 ఖండము.

భరద్వాజఋషి-త్రిష్టుప్ఛంద-వైశ్వానరాగ్ని దేవత.

౧.౨.౨ మూర్ధానందివో అరతిం పృథివ్యా౩ వైశ్వానరమృత ఆజాతమగ్నిం। కవిగ్ం సమ్రాజమతిథిం జనానా మాసన్నః పాత్రం జనయన్త దేవాః॥

ద్యులోకమునకు శిరస్సువంటివాఁడును, భూమికి గమనించువాఁడును, అధిపతియును, నరులందఱికిని సంబంధించినవాఁడును, యజ్ఞమునకు నభిముఖుగా (అరణులందు) బుట్టినవాఁడును, కర్మలను జరపించు లేక ఆక్రమించినవాఁడును, బాగుగ బ్రకాశించువాఁడును, యాగకర్తలకు నతిథివలెఁ బూజనీయుఁడును, (దేవతలకు) నోరయి యున్నవాఁడు, (అనఁగా నితనిద్వారా హవిస్సులు భక్షింతురు కనుకనని తాత్పర్యము.) మాకు రక్షకుఁడు నయిన యగ్నిని స్తుతికర్తలు లేక ఋత్విజులు లేక దేవతలు పుట్టించిరి.

౧౧౨౩. త్వాం విశ్వే అమృత జాయమానగ్ం శిశుంచ దేవా అభిసంనవన్తే!
తవక్రతు భిరమృత త్వ మాయ న్వైశ్వానర యత్పితో ర్రదీ దేః॥

మరణము లేని యగ్ని! స్తుతికర్తలు (అరణులలోనుండి) పుట్టిన కొమారుని వంటి నిన్ను స్తుతించుచున్నారు. లేక (దేవాః) కిరణములు, పుట్టిన నిన్నుతలిదండ్రి మొదలగువారు కొమారుని బొందినట్లు పొందినవి. ఎపుడు పాలించునట్టి ద్యులోక భూలోకముల మధ్యను దీపించుచున్నావో అపుడు నీ కర్మలచేత దేవత్వమును (యజమానులు) పొందిరి.

౧౧౨౪. నాభింయజ్ఞానాగ్ం సదనగ్ం రయీణాం మహా మహాఽ మభిసం నవన్త! వైశ్వానరగ్ం రథ్య మధ్వరాణాం యజ్ఞస్య కేతుం జన యన్త దేవాః॥

యాగములకుఁ బ్రధానమయిన, ధనములకుఁ జోటైన, మహానుభావుఁ డయిన, హోమములు చేయు స్థానమయిన, లేక ఉదకముల ధారలకుఁ జోటైన (వైద్యుతాగ్నియని తా.) యగ్నిని (స్తుతికర్తలు) స్తుతించుచున్నారు. సర్వనరులకు సంబంధించిన యాగములకు రథికుఁడు (అనఁగా నడిపించువాఁడని తా.) యజ్ఞమును బ్రకటించువాఁడు నగు నగ్నిని దేవతలు (మథించి) పుట్టించిరి. (దేవాః=స్తుతికర్తలు-దేవతలు-ఋత్విజులు-కిరణములు-అని నానార్థములు కలవు. సందర్భము ననుస రించి చూచుకొనవలెను.)

యజతఋషి-గాయత్రీచ్ఛంద-మిత్రావరుణ దేవత.

౧౧౨౫. ప్రవో మిత్రాయ గాయత వరుణాయ విపాగిరా। మహిక్షత్రా వృతం బృహత్॥

(ఓ మా ఋత్విజులారా!) మీరు మిత్రుని కొఱకు, వరుణుని కొఱకును వ్యాపించిన వాక్కుతో స్తుతి చేయుఁడు. అధికబలముగల మిత్రావరుణులారా! గొప్పదయిన యాగమును గూర్చి రండు.

3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర 3 ౨
౧౧౨౬. సమ్రాజా యా ఘృతయోనీ మిత్రశ్చోభా వరుణశ్చ । దేవా
3 ౧ ౨ 3 ౨
దేవేషు ప్రశస్తా ॥

సర్వమునకుఁ బ్రభులయినవారు, ఉదకమును బుట్టించువారు, ప్రకాశించువారు, దేవతలలోఁ బ్రశస్తులు నగు మిత్రావరుణుల నిద్దఱిని స్తుతించుఁడు. (అని పూర్వ మంత్రములోని కన్వయము.)

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨
౧౧౨౭. తా నః శక్తం పార్థివస్య మహో రాయో దివ్యస్య । మహి వాం
3 ౨ 3 ౧ ౨
క్షత్రం దేవేషు ।

ఆ దేవత లిద్దఱును పృథివీ సంబంధమైన ద్యులోకమందుఁ బుట్టిన గొప్ప ధనము నిచ్చుటకు సమర్థులు. ఓ దేవతలారా! మీ యిద్దఱియొక్క పూజ్యమయిన, దేవతలలోఁ బ్రసిద్ధమయిన, బలమును స్తుతించుచున్నాము.

మధుచ్ఛందఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ర 3 ౧ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ 3 ౧ ౨
౧౧౨౮. ఇంద్రాయాహి చిత్రభానో సుతా ఇమే త్వాయవః । అణ్వీభిస్తనా
3 ౧ ౨
పూతాసః ॥

విచిత్రకిరణములుకల యింద్రా! యీ కర్మవద్దకు రమ్ము. అభిషవించిన యీ సోమములు నిన్ను గోరుచున్నవి. ఋత్విజుల వ్రేళ్ళతో నభిషవించిన ఆ సోమములు నిత్యము పవిత్రములు (అనఁగా దశాపవిత్రమను వస్త్రమందు వడకట్టఁబడినవి కనుక.)

౧ ౨ర 3౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ ౨3 ౧ ౨
౧౧౨౯. ఇంద్రాయాహి ధియేషితో విప్రజూతః సుతావతః। ఉపబ్రహ్మాణి
3 ౧ ౨
వాఘతః॥

ఓ యింద్రా! మా బుద్ధిచేతఁ బొందఁబడినట్టి, యితర ఋత్విజులచేతఁ బ్రేరింపఁబడినట్టి, నీవు సోమము నభిషవించి సిద్ధపఱచిన ఋత్విజునియొక్క స్తోత్రములను బొందుటకు రమ్ము.

౧ ౨ర3 ౧ ౨ 3 ౨3 ౧ ౨ 3 ౧ ౨
౧౧౩౦. ఇంద్రాయాహి తూతుజాన ఉపబ్రహ్మాణి హరివః। సుతే దధిష్వ
3౧ ౨
నశ్చనః॥

హరి యను నశ్వములు కల యింద్రా! త్వర కలవాఁడవగుచు స్తోత్రములను స్వీకరించుటకు రమ్ము. వచ్చి యీ సోమాభిషవకర్మయందు మా యన్నమును స్వీకరింపుము. (=పుచ్చుకొనుము.)

భరద్వాజఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్రాగ్నిదేవత.

౧ ౨ 3 ౨ 3౨ 3 ౨3 ౧ ౨ 3౧ ౨ 3 ౨
౧౧౩౧. తమీడిష్వయో అర్చిషా వనా విశ్వా పరిష్వజత్। కృష్ణా
3 ౧ ౨ 3౧ ౨
కృణోతి జిహ్వయా॥

ఓ స్తుతికర్తా! నీవు అగ్నిని స్తుతించుము. ఏ యగ్ని జ్వాలారూపమయిన కాంతితో నరణ్యముల నన్నిఁటిని యంతటను జుట్టుకొనుచున్నది. ఎవఁడా వనములను జిహ్వారూపమయిన మంటతో దహించి నల్లవానింగా నొనర్చుచున్నాఁడో, ఆ యగ్ని యని పూర్వాన్వయములు.

౨3౨ 3౧ ౨ 3 ౧ ౨ర3 ౧౨ 3 ౧ ౨ 3౧
౧౧౩౨. య ఇద్ధ ఆవివాసతి సుమ్నమింద్రస్య మర్త్యః। ద్యుమ్నాయ సుతే
౨3 ౨
రాఅపః।

ఏ మనుష్యుఁడు మండుచున్న అగ్నియందు సుఖకరమయిన హవిస్సును ఇంద్రునికొఱకు నిచ్చుచున్నాఁడో, ఆ మనుష్యునియొక్క చక్కని యన్నమును సుఖముగా సంపాదించు నుదకములను, (అనఁగా వర్షమని తా॥) ఇంద్రుఁడు చేయుచున్నాఁడు.

౧౧౩౩. తానో వాజవతీరిష ఆశూన్పి పృతమర్వతః। ఏంద్రమగ్నిం చ వోఢవే॥

ఓ యింద్రాగ్నులారా! ఆ మీ యిద్దఱు అన్నము కల వర్షములను లేక బలముగల యన్నములను వేగము నడచు గుఱ్ఱములను ఇంద్రునకు నగ్నికి సర్వత్ర హవిస్సుల నందించుటకుగా మాకు నిండు.

ఉత్తరార్చికమునందు అష్టమాధ్యాయ తృతీయ ఖండముసంపూర్ణము.

———:o:———

౯ అధ్యాయము.

౪ ఖండము.

సికతానివారి ఋషిగణము-ఋషి-జగతీచ్ఛంద-ఇంద్ర దేవత.

౧౧౩౪. ప్రోఅయాసీ దిందురిందస్య నిష్కృతగ్ం సఖా సఖ్యుర్నప్రమినాతి సంగిరం। మర్య ఇవ యువతిభిః సమర్షతి సోమ కలశే శత యామనా పథా॥

సోమము సంస్కరించిన ఇంద్రుని స్థానమును (అనఁగా నుదరమని తా॥) చేరుచున్నది. అట్లుచేరి స్నేహితుని వంటిదయి తనస్నేహితుఁడైన యింద్రుని కడుపును బాధింపదు. మనుష్యుఁడు స్త్రీలతోఁ గూడినట్లు ఈ సోమముకూడ తనతోఁ గలిసిన యుదకములతోఁగూడుచున్నది. తర్వాత నూఱుసందులుగల దశాపవిత్ర మను వస్త్రములోనుండి కలశములోఁబడుచున్నది.

౧౧౩౫. పరివోధియో మన్ద్రియువో విపన్యువః పనస్యువః సంవరణేష్వక్రముః।
హరిం క్రీడన్త మభ్యనూష తస్తుభోఽభి ధేనవః పయసే దశిశ్రయుః॥

ఓ సోమములారా! మీయందు ధ్యానముంచినవారు, మదము కలిగించు ధ్వనిని గోరుచున్నవారు, స్తుతిని గోరుచున్నవారు నగు స్తుతికర్తలు చాపలు పరిచియున్న యాగ గృహములందుఁ బ్రారంభించుచున్నారు. (అభిషవమును బ్రారంభించుచున్నారని తా॥) స్తుతికర్తలు ఆకుపచ్చనిరంగుగల్గి యాటలాడునట్లు ఎగిరిపడుచున్న సోమమును స్తుతించుచున్నారు. పాడియావులుకూడఁ దమ పాలతోనే యీ సోమము నుద్దేశించి పూర్తిగాఁగలియుచున్నది.

౧౧౩౬. ఆనః సోమ సంవతం పిప్యుషీ మిషమిన్దో పవస్వ పవమాన ఊర్మిణా। యా నో దోహతే త్రిరహన్న సశ్చుషీ క్షుమద్వాజవ న్మధుమత్సువీర్యం॥

ఓ సోమమా! వడకట్టఁబడుచున్న నీవు సంపాదింపఁబడినది, అధికమైనది యగు నన్నమును నీ రసముతో నిమ్ము. పగటిమూఁడు సవనములందు (సవన=యాగములో ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములం జేయు కర్మలు) ఆటంక మేమియుంగలిగింపనిదై (అనఁగా మాతో నేయాగములు నిలిచిపోకుండ) అంతటను బ్రసిద్ధుఁడైన

బలవంతుఁడై మాధుర్యముగల మంచి వీరుఁడైన, పుత్రుని బుట్టించునో (ఆయన్న మునిన్[illegible] యన్వయము)

పురుహన్మఋషి-బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౧౧౩౭. నకిష్టం కర్మణా నశద్యశ్చకార సదావృధం। ఇంద్రంన యజ్ఞైర్విశ్వ
గూర్తమృభ్వస మధృష్టం ధృష్ణుమోజసా॥

ఎల్లప్పుడు వృద్ధినందునట్టి, అందఱును స్తుతించునట్టి, మహాత్ముఁడగునట్టి, తనబలము చేత శత్రువులకు లొంగనివాఁడు, శత్రువులం దిరస్కరించువాఁడు నగు నింద్రుని యే నరుఁడు అనుకూలమయినవానింగా యజ్ఞకర్మలతోఁ జేయునో, అట్టి వానిని యితరుఁడెవఁడును తనహింసాదికర్మతో నెదిరింపఁజాలఁడు.

౧౧౩౮. ఆషాఢ ముగ్రం పృతనాసు సాసహిం యస్మిన్మహీ రురుజ్రయః।
సంధేనవో జాయమానే అనోనవు ద్యావః క్షామీరనోనవుః॥

సహింపరానట్టి, భయంకరమైనట్టి, శత్రుసేనలనోర్చునట్టి, యింద్రుని (స్తుతించుచున్నాను.) ఏ యింద్రుఁడు పుట్టుచుండఁగా బత్తైలు గోవులు (మేఁకలుకూడ) మిగుల స్తుతించినవో, ద్యులోకవాసులు, భూలోకవాసులునుగూడ స్తుతించిరో, ఆ యింద్రుఁడని పూర్వాన్వయము.)

సామవేదమునందష్టమాధ్యాయ చతుర్థఖండము సంపూర్ణము.

—:(॥):—

## ౯ అధ్యాయము.

### ౫ ఖండము.

నారదఋషి-ఉష్ణిక్ఛంద-సోమదేవత.

౧౨ 3 ౧ ౨ర ౨ ౨ 3 ౧౨ ౨3 ౨ 3 ౧ ౨ర
౧౧౭౯. సఖాయ ఆనిషీదత పునానాయ ప్రగాయత శిశుంన యజ్ఞైః పరి
3 ౨
భూషతశ్రియే॥

ఓ సఖులారా! (అనఁగా స్తుతికర్తలు-ఋత్విజులును) కూర్చుండుడు. వడకట్టంబడుచున్న సోమముకొఱకు గానము బాగుగాఁ జేయుఁడు స్తుతింపఁబడిన సోమమును హవిస్సులతో శోభకొఱకు (పాలు పెఱుగు మొదలగునవికలుపుఁడనితా॥) శిశువును (తలిదండ్రులు ఆభరణాదులతో) నలంకరించునట్లు అలంకరించుడు.

౧ 3 3 ౨ఉ 3 ౧౨ 3 ౧౨ 3 ౧ ౨ 3 ౨ ౧౨
౧౧౮౦. సమీవత్సం నమాతృభిః సృజతా గయసాధనం। దేవావ్యాꣳమద
3౧ ౨ర
మభి ద్విశవసం॥

ఓ ఋత్విజులారా! గృహమునకు సాధనమైనట్టి, దేవతల రక్షించునట్టి, మదమును గలిగించునట్టి, రెట్టించిన వేగముకలట్టి, యీ సోమమును, దూడను దమతల్లులతోఁ జేర్చునట్లు, (పాలు పెగుఱు మొదలగు) వాటితోఁ గలుపుఁడు.

3౧ ౨ 3౧ ౨ 3 ౨3 ౧౨ ౧ ౨ 3 ౨ 3
౧౧౮౧. పునాతా దక్షసాధనం యథా శర్ధాయ వీతయే। యథామిత్రాయ
౧౨ 3 ౧౨
వరుణాయ శన్తమం॥

బలమునకు సాధనమైన సోమమును వడకట్టుఁడు. వేగముకొఱకు, దేవతల

పానము కొఱకు, మిత్రుని కొఱకు, వరుణుని కొఱకు మిగుల సుఖకరమైనదానింగా (పవిత్రమందు) వడకట్టుడు.

ఐశ్వర్య-అగ్నిధిష్ణ్యఋషి-ద్విపదాచ్ఛంద-సోమదేవత.- - - - ద్విపదము.

౨ ౩క ౨ర　　౩౧ ౨　　౩౧ ౩౧౩　　౨ఉ ౩౧ ౨
౧౧౪౨ పరివాజ్యష్టాః సహస్రధార స్తిరః పవిత్రం వివారమవ్యం॥

బలముకలది, అనేకధారలు కలది, యగు సోమము గొఱ్ఱెబొచ్చు వస్త్రమును దాటి వివిధముగాఁ గారుచున్నది.

౨౩క ౨ర　　౩ ౧ ౨　　౩౧ ౨ ౩ ౧　　౨ర　　౩ ౨
౧౧౪౩. సవాజ్యక్షాః సహస్రరేతా అద్భిర్మృజానో గోభిః। శ్రీణానః॥

అనేకోదకములు కలది, (వసతీ వరీ అనెడు) నుదకములతో శుద్ధిచేయఁబడినది, ఆవుపాలు మొదలగువాటితోఁ గూర్పఁబడినది, యగు సోమము కారుచున్నది.

౧ ౨　　౩ ౧ ౨　　౩ ౧　　౨ర　　౩ ౧　　౧ర ౩ ౨
౧౧౪౪. ప్రసోమ యాహీన్ద్రస్య కుక్షానృభిర్యేమాణో। అద్రిభిస్సుతః॥

ఓ సోమమా! ఋత్విజులచేత నియమింపఁబడి శిలలతోఁ బిండఁబడి, యింద్రుని కుక్షియగు కలశమందు బాగుగాఁ బ్రవేశించుము.

(వారుణి) భృగు-జమదగ్నిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౨ర　　౧ ౨ ౩　　౧ ౨౩ ౧ ౨　　౩ ౨　　౨ ౩ ౧
౧౧౪౫, యే సోమాసః పరావతి యే అర్వావతి సున్విరే యే వాదః
౨౩ ౧ ౨
శర్యణావతి॥

ఓ సోమములారా! దూరదేశమందుఁగాని, సమీపస్థలమందుఁగాని అభిషవింపఁబడునపుడు లేక శర్యణావతియును సరస్సునందలివిగాని యగు నేయే సోమ

ములు కలవో, యేవి యింద్రునికొరకు నభిషవింపఁబడుచున్నవో, యవన్నియు మా కోర్కె సఫలము చేయుఁగాక.

౧ ౨౩ ౨౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩క ౨ర ౨ ౩ ౧ ౨

౧౧౮౬. య ఆర్జీకేషు కృత్వసు యే మధ్యే పస్త్యానాం। యేవా జనేషు

౩ ౧ ౨

పఞ్చసు॥

ఏ సోమములు ఆర్జీకదేశములందు (=దూర దేశములు) ఏవి కృత్వానదేశములందు, నదుల సమీపములందు, నే సోమము లభిషవింపఁబడుచున్నవో, (ఆయా చోట్ల ఋషుల యాగములు చేతురుగనుక అట్లు చెప్పఁబడె. (మఱియు నిషాదులయిదవజాతిగాఁగల నాల్గుజాతులవారియందును, ఏ సోమము లభిషవింపఁబడుచున్నవో అవి మా యభీష్టము సఫలము చేయుంగాక.

౧ ౨ ౩ ౩౨ఉ౩ ౧౨౩ ౨ ౩౧ ౨ ౩ ౨ ౩౨౩ ౧ ౨

౧౧౮౭. తేనోవృష్టిం దివస్పరి పవ న్తమా సువీర్యం। స్వానాదేవాస ఇన్దవః॥

అక్కడక్కడ నభిషవింపఁబడుచున్న, ప్రకాశించుచున్న, పాత్రలందుఁ గారుచున్న, ఆయా సోమములు మాకు సూర్యునినుండి వర్షమును, మంచి వీర్యవంతుఁడయిన కొమారుని, లేక ధనమును, బొందించుఁగాక.

ఉత్తరార్చికమునందు అష్టమాధ్యాయ పంచమ ఖండము సమాప్తము.

## ౮ అధ్యాయము.

### ౬ ఖండము.

వత్సఋషి-గాయత్రీచ్ఛంద-అగ్నిదేవత.

౧౧౪౮. ఆ తేవత్సో మనో యమత్పరమాచ్చిత్సధస్థాత్। అగ్నే త్వాం కామయే గిరా॥

ఓ యగ్నీ! వత్సఋషి నీ మనస్సును ఉన్నతమైన ద్యులోకమునుండి నిన్ను గోరుచున్న స్తుతివాక్కులతో నాకర్షించెను.

౧౧౪౯. పురుత్రాహి సదృఙసి దిశో విశ్వా అను ప్రభుః। సమత్సు త్వా హవామహే॥

ఓ యగ్నీ! అనేక స్థలములందు నీవు సమానదృష్టికలవాఁడవగుచున్నావు. సర్వదిక్కులకుఁ బ్రభువవు అగుదువు. నిన్ను యుద్ధములందు రక్షణకొఱకుఁ బిలుచుచున్నాము.

౧౧౫౦. సమత్స్వగ్నిమవసే వాజయన్తో హవామహే। వాజేషు చిత్రరాధసం॥

యుద్ధములందు బలముం గోరుచున్న మేము రక్షణకొఱకు యుద్ధములందు ధనముం గూడఁబెట్టు నగ్నిని బిలుచుచున్నాము. (స్తుతించు, లేక ప్రార్థించుచు)

నృమేధర్షి-గాయత్రీచ్ఛంద-ఇంద్రదేవత.

౧౧౫౧. త్వం న ఇంద్రా భర ఓజో నృమ్ణం శతక్రతో విచర్షణే। ఆ వీరం పృతనాసహం॥

బహు కర్మలాచరించునట్టి, సర్వమును జూచునట్టి యింద్రా! నీవు మాకు బలమును ధనమును దెచ్చిపెట్టుము. వీర్యముగలట్టి, సేనల నోర్చునట్టి, నిన్ను బ్రార్థించుచున్నాము

౧౧౫౨. త్వగ్ం హినః పితావసో త్వం మాతా శతక్రతో బభూవిథ
అథాతే సుమ్నమీమహే॥

నివాసమును గలిగించునట్టి, బహుకర్మ లాచరించునట్టి, యింద్రా! నీవు మాకుఁ దండ్రివి (తండ్రివలె రక్షింతువని) అగుచున్నావు. తల్లివలె నాధార మగుచున్నావు. మేము నీ యొక్క సుఖమును గోరుచున్నాము.

౧౧౫౩. త్వాగ్ం శుష్మి న్పురుహూత వాజయన్త ముపబ్రువే సహస్కృత
సనోరాస్వ సువీర్యం॥

బలముతోఁ గూడినట్టి, (స్తుతికర్తలచే) బలము కలిగింపఁబడినట్టి, పలువురచేతఁ బిలువంబడునట్టి యింద్రా! బలముం గోరుచున్న నిన్ను స్తుతించుచున్నాను, అట్టి నీవు మాకు మంచి వీర్యవంతమైన ధనము నిమ్ము.

భౌమ-అత్రిఋషి-అనుష్టుప్ఛంద-ఇంద్ర దేవత.

౧౧౫౪. యదింద్ర చిత్ర మ ఇహ నాస్తి త్వాదాతమద్రివః। రాధ స్తన్నో
విదద్వస ఉభయా హస్త్యాభర॥

వజ్రాయుధధారివి, కోరఁదగినవాఁడవు నగు నింద్రా! నీ వివ్వఁదగిన ధనము నా కీ లోకమునందు లేదు. ధనమును బొందియున్నవాఁడా! రెండు చేతులతోను మా కివ్వవలసిన ఆ ధనమును దెచ్చి యిమ్ము.

౧౧౫౫. యన్నన్యాసే వరేణ్యమింద్ర ద్యుక్షం తదాభర। విద్యామ తస్యతే వయమ కూపారస్య దావనః॥

ఇంద్రా! ఏ యన్నమును శ్రేష్ఠమయిన దానింగాఁ దలఁతువో, దాని నిమ్ము. నీ వారలమగు మేము హద్దు మిగిలినట్టి అట్టి దానమునకు పాత్రుల మగుదుముగాక. (పొందుదుమని తా॥)

౧౧౫౬. యత్తే దిక్షు ప్రరాధ్యం అస్తి శ్రుతం బృహత్ తేన దృఢా చిదద్రివ వాజందర్షి సాతయే॥

ఓ యింద్రా! దిక్కులయందు స్తుతింపఁదగినదై, వినఁబడుచున్న నీ గొప్ప మనస్సు ఏది కలదో, ఆ మనస్సుతో నో వజ్రాయుధధారీ దృఢమయిన యన్నమును మా లాభమునకు నిచ్చుచున్నావు.

ఇట్లు సామవేద ఉత్తరార్చికమున అష్టమాధ్యాయమును,
ఆరవఖండమును ముగిసెను.

## ౯ అధ్యాయము.

### ౧ ఖండము.

ప్రతర్దనఋషీ-త్రిష్టుప్ఛంద-సోమదేవతే.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
౧౧౪౭. శిశుం జజ్ఞానగ్ం హర్యతం మృజన్తి శుమ్భన్తి విప్రంమరుతో గణేన
3 ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ర 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨
కవిర్గీర్భిః కావ్యే కవిః సన్త్సోమః పవిత్ర మత్యేతి రేభన్॥

శిశువువలె నున్న, అపుడే పుట్టుచున్నట్టి, యందముఁ గోరఁ దగినట్టి, సోమమును మరుత్తులు (వాయువులు) శుద్ధి చేయుచున్నవి. మేధావి యగు సోమమును తమగణము (=సమూహము. వాయువు లేదు.) చేత అలంకరించుచున్నవి. ప్రజ్ఞాశాలి యగు సోమము కర్మవంతమై, ధ్వనించుచున్నదై, స్తోత్రములతో ధ్వనించుచు పవిత్రమును దాటు చున్నది. (వడపోత వస్త్రములో నుండి క్రిందికిఁ గారుచున్నదని తాత్పర్యము.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3౧ ౨ 3౧ ౨ 3౧
౧౧౪౮. ఋషిమనాయ ఋషికృత్స్వర్షాః సహస్రనీథః పదవీః కవీనాం।
3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨
తృతీయం ధామ మహిషః సిషాసం త్సోమో విరాజ మనురాజ
3 ౨
తిష్టుప్॥

సర్వముం దెలియు మనస్సు గల వాఁడు గనుకనే యన్నిటిం జూచు నట్టి, సూర్యునిం బొంది యున్నట్టి, పలువురచే స్తుతింపఁబడునట్టి, కవుల పొరపాట్లను సవరించు నట్టి యీసోమము ఏది కలదో యది గొప్పదియగుచు ప్రకాశించుచున్న యింద్రుని ద్యులోకమును బొంద గోరుచున్నదై ప్రకాశింపఁజేయుచున్నది.

౩ ౨ ౩ ౨ ౩౧ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ర ౧ ౨
౧౧౫౯. చమూషచ్ఛ్యేనః శకునో బిభృత్వా గోవిన్దుర్ద్రప్స ఆయుధాని బిభ్రత్
౩ ౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
అపామూర్మిగ్ం సచమానః సముద్రం తురీయంధామ మహిషోవివక్తి॥

పానపాత్రలు లేక అభిషవణఫలకములలోనుండునది, స్తుతింపఁదగినది, శక్తినిగలిగించునది, పాత్రలందు విహరించుచున్నది, (యాగకర్తలకు) గోవులనుసంపాదించునది, ఉదకములను బట్టుకొనుచుఁగార్చుచున్నది, అంతరిక్షమునావరించినది, గొప్పదియగు నేసోమము కలదో, అది నాల్గవస్థానమును (అనగాఁ జంద్రుని) బొందుచున్నది.

అసిత-దేవలులు ఋషులు-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౩౧ ౨ర ౩ ౨ ౩ ౧ ౨ర౩ ౧ ౨ ౧ ౨
౧౧౬౦ ఏతే సోమా అభిప్రియ మింద్రస్య కామమక్షరన్। వర్ధన్తో
౩క ౨ర
అస్యవీర్యం॥

ఈ యభిషవించిన సోమములు ఇంద్రునియొక్క శక్తిని వృద్ధిచేయుచు నింద్రుఁడు కోరుచున్న ప్రియమైన రసమును వర్షించుచున్నవి

౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౨ ౩౧ ౨ ౧ ౨ ౩౧ ౨
౧౧౬౧ పునానాసశ్చమూషదో గచ్ఛన్తో వాయుమశ్వినా। తేనోధత్త సువీర్యం॥

అభిషవింపఁబడుచున్న సోమములారా! పాత్రలలోను బ్రవేశించుచు, వాయువును అశ్వినులను బొందుచు, మాకు మంచి వీర్యమును ఇండు.

౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ర ౩ ౨ ౩
౧౧౬౨. ఇంద్రస్య సోమ రాధసే పునానో హార్ది చోదయ। దేవానాం
౧ ౨ ౩ ౧ ౨
యోనిమాసదం॥

ఓ సోమమా! అభిషవింపఁబడుచున్న నీవు ఇంద్రుని యారాధనకొఱకు

హృదయ స్థానమును బంపుము. (అనఁగాఁ గోరుమని తా.) నేను దేవతల స్థానమయిన స్వర్గమును బొందితిని. లేక యాగశాలను బొందితిని.

౧౧౬౩. మృజన్తి త్వా దశక్షిపో హిన్వన్తి సప్తధీతయః। అను విప్రా అమాదిషుః॥

సోమమా! నిన్ను పది వ్రేళ్ళు శుద్ధిచేయుచున్నవి. (ముందుగా వ్రేళ్ళతోఁ దుడిచినారని తా॥) తర్వాత నేడ్గురు ఋత్విజులును నిన్ను (వారి వారి పనులతో) సంతసింపఁజేసిరి. అట్లు మేధావులైన స్తుతికర్తలుకూడ నిన్ను త్సాహపఱచుచున్నారు.

౧౧౬౪. దేవేభ్యస్త్వా మదాయకꣳ సృజాన మతిమేష్యః। సంగోభిర్వాసయామసి॥

సోమమా! సుఖస్వరూపమయిన నిన్ను దేవతల మదముకొఱకు గొఱ్ఱె బొచ్చు వస్త్రము నతిక్రమించినదానవై యుండ నావు పాలతోఁ గూర్చుచున్నాము.

౧౧౬౫. పునానః కలశే ష్వా వస్త్రాణ్యరుషో హరిః। పరిగవ్యా న్యవ్యత॥

అభిషవింపఁబడుచున్న, ద్రోణకలశమలందుఁబోయఁబడుచున్న, ప్రకాశించుచున్న, ఆకుపచ్చని రంగుగల సోమము గో సంబంధములయిన క్షీరాదులను, నట్టి వస్త్రములను, దనచుట్టు కప్పుకొనుచున్నది.

౧౧౬౬. మఘోన ఆపవస్వ నో జహి విశ్వా అపద్విషః। ఇన్దో సఖాయమావిశ॥

ఓ సోమమా! ధనవంతులమగు మా కభిముఖముగాఁ గారుము. సమస్త శత్రువులనుజంపుము. మిత్రుఁడైన యింద్రునిలోఁ బ్రవేశించుము.

3 ౧ ౨ 3౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ 3
౧౧౬౭. నృచక్షసం త్వా వయమింద్రపీతగ్ం స్వర్విదం। భక్షీమహి ప్రజా
౨ర
మిషం॥

సోమమా! నరులను జూచుచున్న, సర్వము నెఱింగిన యింద్రుని పానమున కుపయోగించిన నీవల్ల పుత్రాది సంపదను, అన్నమును, మేము అనుభవింతుము గాక.

3 ౨ 3౧ ౨ర 3 ౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨
౧౧౬౮. వృష్టిం దివః పరి స్రవ ద్యుమ్నం పృథివ్యా అధి। సహో న సోమ
3 ౧ ౨
పృత్సుధాః।

సోమమా! నీవు ద్యులోకమునుండి వర్షమును అంతటను కురియించుము. భూమిమీఁద నన్నమును (అనఁగా సస్యమును) బుట్టించుము. యుద్ధములందు మాకు బలమునుఁ గలిగింపుము

ఉత్తరార్చిక నవమాధ్యాయ ప్రథమ ఖండము సంపూర్ణము.

———:౦:———

౯ అధ్యాయము.

౨ ఖండము.

అసిత-దేవలుఋషులు-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౧ 3 ౧ ౨ 3 ౧ ౨ర
౧౧౬౯. సోమః పునానో అర్షతి సహస్రధారో అత్యవిః। వాయోరింద్రస్య
3 ౨
నిష్కృతం॥

ఈ యభిషవింపఁబడుచున్న సోమము, అనేక ధారలు కలిగి, గొఱ్ఱెబొచ్చు వస్త్రము నతిక్రమించి వాయువుయొక్క, యింద్రుని యొక్క, పానము కొఱకు సంస్కరించిన పాత్రమునఁ జేరుచున్నది.

3 2 3 1 2 3 1 2 ర 3 2 3 1 2
౧౧౭౦. పవమాన మవస్యవో విప్రమభిప్రగాయత సుష్వాణం దేవవీతయే॥

రక్షణమును గోరిన ఋత్విజులారా! పవిత్రతను గలిగించునది, దేవతలకుం బ్రియమైనది, దేవతల భక్షణము కొఱ కభిషవింపఁబడుచున్నది, యగు సోమమును అభిముఖముగా స్తుతించుఁడు.

3 2 3 1 2 3 1 2 3 1 2 3 2 3 1 2
౧౧౭౧. పవన్తే వాజసాతయే సోమాః సహస్రపాజసః। గృణానా దేవవీతయే॥

సోమములు అధిక బలము నిచ్చునవి, స్తుతింపఁబడుచున్నవి, యగుచు యాగము కొఱకు, అన్నలాభము కొఱకు, నభిషవింపఁబడుచున్నవి.

3 2 3 1 2 3 1 2 3 1 2 ర 3 1 2 3 1 2
౧౧౭౨. ఉతనో వాజ సాతయే పవస్వ బృహతీరిషః। ద్యుమదిందో సువీర్యం॥

సోమమా! దీపించునట్టి, మంచి వీర్యము గలట్టి, దానవగుచు మా యుద్ధములకు గొప్ప యన్నధారలను గూర్చుము.

1 2 3 2ఉ 3 2 3 1 2 3 1 2 2ఉ 3 1 2
౧౧౭౩. అత్యా హియానా నహేతృభిరసృగ్రం వాజసాతయే। వి వారమవ్య
3 1 2
మాశవః॥

యుద్ధమునకై ప్రేరింపఁబడుచున్న గుఱ్ఱములవలె శీఘ్రము హోతలచేతను పిండఁబడుచు, సోమములు పరువు లిడుచున్నవి. అన్నలాభము కొఱకు గొఱ్ఱెబొచ్చుతో నల్లిన వస్త్రము దాటి కారుచున్నవి.

౧ ౨ ౩ ౧ ౨ ౩౧ ౨౪౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨
౧౧౭౪. తేనస్సహస్రిణగ్ం రయిం పవన్తామా సువీర్యం। స్వానా దేవాస ఇందవః॥

సోమములు అభిషవింపఁబడుచుఁ బ్రకాశించుచు, మాకు వేలకొలఁది ధనమును మంచి వీర్యమును ఇచ్చునుగాక.

౩ ౧ ౨౩౧ ౨ ౩ ౨ ౨ ౨ఉ ౩ ౧ ౨ ౩ ౧ ౨౪
౧౧౭౫. వాశ్రా అర్షన్తీందవో ऽభి వత్సం నమాతరః। దధన్విరే గభస్త్యోః॥

అరచుచున్న తల్లులు దూడనుగూర్చి యభిముఖములై వచ్చునట్లు, సోమములు ధ్వనించుచుఁ నెదురుగా వచ్చుచున్నవి. అవి బాహువులందు ధరింపఁబడుచున్నవి.

౨౩ ౧ ౨ ౩ ౧ ౨౪ ౩ ౧ ౨ ౨ ౩ ౧ ౨
౧౧౭౬. జుష్ట ఇంద్రాయ మత్సరః పవమానః కనిక్రదత్। విశ్వా అపద్విషో జహి॥

సోమము ఇంద్రునకు సరిపడినంతగాఁ దృప్తిని గలిగించు నదయ్యెను. ధ్వనించుచున్న సోమమా! సర్వ శత్రువులను జయింపుము లేక చంపుము.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౨
౧౧౭౭. అపఘ్నన్తో అరావ్ణః పవమానాః స్వర్దృశః। యోనావృతస్య సీదత॥

ఓ సోమములారా! దానములు చేయని యాగకర్తలను జంపుచు, సర్వమును జూచుచున్న, మీరు యాగస్థానమందుఁ గూర్చుండుఁడు. (ఉండుఁడని తా.)

ఉత్తరార్చిక నవమాధ్యాయ ద్వితీయ ఖండ సమాప్తము.

—:౦:—

## ౯ అధ్యాయము.

### 3 ఖండము.

అసిత-దేవలులుఋషులు-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3౨ 3౨౨ ౧౨ ౧ ౨ 3
౧౧౭౮. సోమా అసృగ్ర మిన్దవః సుతా ఋతస్య ధారయా। ఇంద్రాయ
౧౨
మధుమత్తమాః॥

యాగమునకై యభిషవించిన, మిగులఁ దియ్యనయిన, సోమములు ఇంద్రుని కొఱకు ధారలతోఁ గారుచున్నవి.

3౧ ౨ర 3 ౧౨ 3౨ర 3౧౨ ౨ 3 ౧౨
౧౧౭౯. అభి విప్రా ఽనూషత గావో వత్సం న ధేనవః। ఇంద్రగ్ం సోమస్య
3౧౨
పీతయే॥

మేధావులయినవారు సోమపానము కొఱకు నింద్రుని కభిముఖముగాఁ బాడిమొదవులు దూడ కభిముఖముగా ధ్వనించునట్లు ధ్వనించుచు నభిషవింపఁబడు చున్నవి.

3 ౧ ౨3 ౧౨3 ౧ ౨ 3 ౧ ౨3౨ ౧ ౨ 3౧
౧౧౮౦. మదచ్యుత్ క్షేతి సాదనే సింధో రూర్మా విపశ్చిత్। సోమో గౌరీ
౨ర3౨
అధిశ్రితః॥

మదముఁ గలిగించు రసమును స్రవింపఁజేయుచున్న సోమము యజ్ఞశాలలో నున్నది. నదియొక్క కెరటమునందు విద్వత్తు (=పాండిత్యము) గల సోమము మధ్యమవాక్కునందు నున్నది. (మాధ్యమిక వాక్కనఁగా వర్షము కురియుటకు

ముందు ఆకాశమందుఁ బుట్టినదని యభిప్రాయము కావచ్చును. నదిలోఁ గెరట మెగురునట్లు తా నెగుచుచున్నదనియుఁ దాత్పర్యము.)

3౧ ౨ర 3 ౨ 3 ౧౨ ౨ 3 ౨ 3 ౧
౧౧౮౧. దివో నాభా విచక్షణో ऽ వ్యా వారే మహీపతే। సోమో యః సుక్ర
౨ 3౨
తుః కవిః॥

ఏది మంచి ప్రజ్ఞ గలిగినదియు, సర్వమును జూచునదియో, యా సోమము అంతరిక్షమునకు నాభి యయిన గొఱ్ఱెబొచ్చు వస్త్రమునందుఁ బూజింపఁబడుచున్నది. (నాలుగు రాటలు పాతి నాలుగు వస్త్రము చివరలు కట్టినందున నది అంతరాళమున వ్రేలాడుటచేత నాకాశమున కది మధ్య. అందుచే నాభి.)

౧ ౨ర 3౨3 ౨ 3 ౨ 3౨3 ౧ ౨ ౨ఉ 3 ౧౨
౧౧౮౨. యః సోమః కలశేష్వా అన్తః పవిత్ర ఆహితః। తమిన్దుః పరిషస్వజే॥

ఏ సోమము కలశములందు నున్నదో, యేది పవిత్రము మధ్యమందు నుంచఁబడినదో, ఆ నీయఁశమయిన సోమమును సోమాభిమాన దేవత యెవఁడు గలఁడో, అతఁడు ప్రవేశించుచున్నాఁడు.

౨ఉ 3 ౧ ౨ 3 ౧ ౨ర 3౧౨ ౨ 3 ౧ ౨ 3
౧౧౮౩. ప్రవాచ మిందురిష్యతి సముద్రస్యాధి విష్టపి। జిన్వన్ కోశం మధు
౧ ౨
చ్యుతం॥

సోమము మధువును గార్చునట్టి ద్రోణకలశమును బూరించుచు, అంతరిక్షస్థానమునందు ధ్వనిని జేయుచున్నది. (మధువు=మధురరసము)

౧౨ 3 ౨3౧౨ 3౧ 3౧ ౨ 3౧౨ ౨ ౧
౧౧౮౪. నిత్యస్తోత్రో వనస్పతి ర్ధీనామన్తః స్సబర్దుఘాం। హిన్వానో మా
౨ర 3 ౧
నుషాయుజా॥

స్తోత్రము లెల్లపుడుఁ బొందుచున్న, వనములకు స్వామియయిన సోమము మనుష్యులు చేయునట్టి (అహీనము-ఏకాహము) అనెడు యాగములను జేయించుచు నమృతముతో సమానమయిన వాక్కులను ప్రేరించునది, స్తుతికర్తలమధ్య నున్నది యగు స్తుతివాక్కును ప్రేరించుఁగాక.

౧౨ ౩ ౨ ౩౧ ౨ ౩ ౧ ౨
౧౧౮౫. ఆపవమాన ధారయా రయిగ్ం సహస్ర వర్చసం। అస్మే ఇందో
౩ ౧ ౨
స్వాభువం॥

అభిషవింపఁబడుచున్న సోమమా! నీవు విశేషకాంతి కలట్టి, మంచి జన్మము కలట్టి, ధనమును మాయందుఁ గలిగింపుము.

౩౨ ౩ ౨ ౩ ౨ ౩౨ఉ ౩ ౧ ౨ర ౩ ౨ ౧ ౨ ౩
౧౧౮౬. అభిప్రియా దివఃక కవిర్విప్రః సధారయా సుతః। సోమో హిన్వే పరా
౧౨
వతి॥

కర్మ నవలంబించినట్టి, అభిషవింపఁబడినట్టి, సోమము దూరస్థలమందునుండిన దయి, మేధావంతమగుచుఁ దన ధారతో ద్యులోకమునకుఁ బ్రియమయిన స్థానములం గూర్చి ప్రేరింపఁబడుచున్నది.

ఉత్తరార్చికమున నవమాధ్యాయ తృతీయ ఖండము సంపూర్ణము.

—:o:—

## ౯ అధ్యాయము.

### ౪ ఖండము

ఉచథ్యఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౧౮౭ ఉత్తే శుష్మాస ఈరతే సిన్ధోరూర్మే రివస్వనః। వాణస్య చోదయా పవిం॥

సోమమా! నీవేగములు సముద్రతరంగములవలె ధ్వనించుచు లేచుచున్నవి. అట్టినీవు వాణము(=నూఱుతీగల వీణపేరు వాణము.) యొక్క ధ్వనిని ప్రేరించుము. (స్రవించునపుడు వీణాధ్వనివంటి ధ్వని కలదని తా.)

౧౧౮౮. ప్రసవేత ఉదిరతే తిస్రోవాచో మఖస్యువః। యదవ్య ఏషిసానవి॥

ఓ సోమమా! నీవు పుట్టఁగానే యాగమును గోరుచున్న యజమానుని మూఁడు వాక్కులు (ఋగ్యజ సామవాక్కులని తా.) బయలు దేరుచున్నవి. ఎపుడు నీవు గొఱ్ఱెబొచ్చు వస్త్రమందుఁ జేరితివో (అపుడని పూర్వాన్వయము.)

౧౧౮౯. అవ్యావారైః పరిప్రియగ్ంహరిగ్ంహిన్వన్త్యద్రిభిః। పవమానం మధుశ్చ్యుతం॥

దేవతలకు ప్రియమైన, ఆకుపచ్చని రంగుగల, శిలలతో నభిషవింపఁబడిన మధురరసమును గార్చుచున్న సోమమును గొఱ్ఱెబొచ్చు దారములలోనుండి ఋత్విజులు వడకట్టుచున్నారు.

౧౧౯౦. ఆపవస్వ మదింతమ పవిత్రం ధారయా కవే। అర్కస్య యోనిమాసదం॥

అధికముగా మదము కలిగించునట్టి, కర్మను నడిపించునట్టి, సోమమా! పూజ్యుఁడయిన యింద్రుని యుదర స్థానమును బొందుటకుఁ బవిత్రమునుదాటి ధారతో నభిముఖముగాఁ గారుము.

౧౨ 3 ౧౨ 3 ౨ 3౧౨ ౧ ౨ 3౧౨
౧౯౯౧. సపవస్వ మదింతమ గోభిరంజానో అక్తుభిః। ఏంద్రస్య జఠరంవిశ॥

మదము గలిగించువాటిలో శ్రేష్ఠమయిన సోమమా! నీలోఁ గలియునట్టి యావుపాలు మొదలగు వాటితోఁ గలసినదానవగుచు (స్తుతింపఁబడుచు) నీవు స్రవించుము. తర్వాత నింద్రుని గర్భమును బ్రవేశించుము.

ఉత్తరార్చిక నవమాధ్యాయ చతుర్థఖండము సమాప్తము.

౯ అధ్యాయము.

౫ ఖండము.

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

3 ౨ ౧3 ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౨ 3 ౧ ౨ 3౧ ౨ర
౧౯౯౨. అయా వీతీ పరి స్రవ యస్త ఇన్ద్రో మదేష్వా॥ అవాహ న్నవతీ ర్నవ॥

ఓ సోమమా! యీ రసముతో భక్షణముకొఱకు స్రవింపుము. నీ యే రసము యుద్ధములందు తొంబది శత్రుపట్టణములను జంపెనో, (ఆ రసముతో నని యన్వయము)

౧ ౨ 3 ౨ 3 ౧ ౨3 ౧ ౨ 3 ౧ ౨ ౨ 3 ౨ 3 ౨ 3
౧౯౯3. పురస్సద్య ఇత్థాదియే దివోదాసాయ శంబరం। అధత్యం తుర్వశం యదుం॥

ఒక్కనాఁడే శత్రుపట్టణములను సోమరసము నశింపఁజేసెను. సత్యమయిన కర్మగల దివోదాసుఁడను రాజునకై శంబరుఁడనువానిని, దర్వాత తుర్వశుఁడను వానిని, యదువను వానిని, (వీరిద్దఱును దివోదాసుని శత్రురాజులు) చంపెను. (అనఁగా సోమరసమువల్లనట్టి శక్తి దివోదాసునకుఁ గల్గెనని తా.)

౧౧౯౪ పరిణో అశ్వమశ్వవిద్గోమదిందో హిరణ్యవత్। క్షరా సహస్రిణీరిషః॥

సోమమా! అశ్వముల లభింపఁజేయునట్టి నీవు మాకు అశ్వమును, గోవులతోఁ గూడిన బంగారము మొదలగు ధనమును, అనేకములయిన యన్నములను స్రవింపుము. (ఇమ్మని తా)

అమహీయుఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేత.

౧౧౯౫. అపఘ్నన్పవతే మృధోఽప సోమో అరావ్ణః। గచ్ఛన్నింద్రస్య నిష్కృతం॥

సోమము శత్రువులను జంపుచు, (శక్తియుండి) దానము చేయనివారిని జంపుచు, సంస్కరించిన యింద్రుని స్థానమును బొందుచు ధారగాఁ గారుచున్నది.

౧౧౯౬. మహో నో రాయ ఆ భర పవమాన జహీ మృధః। రాస్వేందో వీరవద్యశః॥

ఓ సోమమా! మాకు గొప్ప ధనములను దెచ్చియిమ్ము. శత్రువులను జంపుము. కొమాళ్ళు మొదలగువారింగూడిన కీర్తిని మాకు నిమ్ము.

౧౧౯౭. నిత్వాశతం చన హుతో రాధో దిత్స న్తమా మినన్। యత్పునానో మఖస్యసే॥

సోమమా! ధనమును బుచ్చుకొనం గోరుచున్న నిన్ను అనేకులయ్యు శత్రువులు ఎపుడు నీవు పడకట్టఁబడుచు ధనమును ఇవ్వఁదలఁచితివో, యపుడే హింసింపలేరు.

నిధ్రుఋషి—గాయత్రీచ్ఛంద—సోమదేవత.

౧౧౯౮. అయాపవస్వ ధారయా యయా సూర్య మరోచయః। హిన్వానో మానుషీరపః॥

సోమమా! మానవులకు హితమైన యుదకములను ప్రేరించుచు, నీవు ఏ ధారతో సూర్యుని ప్రకాశింపఁజేయుచున్నావో, యా ధారతో స్రవించుము.

౧౧౯౯. అయుక్త సూర ఏతశం పవమానో మనావధి అంతరిక్షేణ యాతవే॥

అభిషవింపఁబడుచున్న సోమము మనుష్యునివిషయమై అంతరిక్షముద్వారా గమనించుటకు సూర్యునకు అశ్వమును బూన్చెను.

౧౨౦౦. ఉతత్యా హరితో రథే సూరో అయుక్త యాతవే। ఇందురింద్ర ఇతి బ్రువన్॥

మఱియు సోమము ఇంద్రుఁడని పలుకుచు ఆ యాకు పచ్చని గుఱ్ఱములను సూర్యునియొక్క గమనము కొఱకుఁ బూన్చుచున్నది.

ఉత్తరార్చిక నవమాధ్యాయ పంచమ ఖండము సంపూర్ణము.

## ౯ అధ్యాయము.

### ౬ ఖండము.

వశిష్ఠఋషి-త్రిష్టుప్ఛంద-అగ్నిదేవత.

౩౧ ౨ ౩౨౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨౩ ౧౨
౧౨౦౧. అగ్నిం వో దేవమగ్నిభిః సజోషా యజిష్ఠం దూత మధ్వరే కృణుధ్వం।
౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨
యో మర్త్యేషు నిధ్రువి ఋతావా తపుర్మూర్ధా ఘృతాన్నః
౩౨
పావకః॥

ఓ దేవతలారా! మీరు ప్రకాశించుచున్నట్టి, ఇతరములైన గార్హపత్య-దక్షిణాగ్ని-మొదలగు నగ్నులతోఁ గూడినట్టి, యాగమును నిర్వహించువాటిలో ముఖ్యమయినట్టి, యగ్నిని యాగమందు దూతను జేయుఁడు. ఏ యగ్ని దేవుఁడయ్యు మనుష్యులందు నెల్లపున్నాఁడో, సత్యవంతుఁడును, తాపము గలిగించువాఁడు, పవిత్రము చేయువాఁడును అయి యున్నాఁడో (అట్టి యగ్నిని దూతం జేయుఁడని తా.)

౨ ౩౨౩ ౧ ౨ర ౩౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧౨౩ ౧౨
౧౨౦౨. ప్రోథదశ్వో న యవసే ఽవిష్యన్యదా మహః సంవరణా ద్వ్యస్థాత్।
౧౨౩ ౨ ౩ ౧౨ ౩ ౧ ౨ర ౩ ౧ ౨ ౩ ౧ ౨
ఆదస్యవాతో అనువాతి శోచిరధ స్మతే వ్రజనం కృష్ణమస్తి॥

గడ్డిలో మేయుచు, ధ్వనించుచున్న గుఱ్ఱమువలె, గొప్ప నిరోధమునుండి (రాపాడుటవల్ల) దవాగ్ని యావరించిన చెట్లలోఁ బ్రసరించుచున్నదో, యపుడుఅగ్ని జ్వాల గాలితోఁ గలిసి వీచుచున్నది. ఓ యగ్నీ! నీ మార్గము నల్లనిదై యున్నది కదా!

౧౨౦౩. ఉదస్య తే నవజాతస్య వృష్ణోఽగ్నే చరన్త్యజరా ఇధానాః। అచ్ఛా ద్యా మరుషో ధూమ ఏషి సం దూతో అగ్న ఈయసే హి దేవాన్॥

ఓ యగ్నీ! క్రొత్తగా బుట్టినట్టి, వర్షము కురియించునట్టి, నీ యొక్క ముదిమి లేని మంటలు మండుచునే ధ్వనిం జేయుచు లేచుచున్నవి. ప్రకాశించుచున్న పొగతోఁ గూడిన యో యగ్నీ! దూతవగు నీవు ద్యులోకముం గూర్చి బాగుగాఁ బోవుచున్నావు. తర్వాత నచటనున్న దేవతలం బొందుచున్నావు. అగ్నీ! నీ ధూమమే ద్యులోకమునకుఁ బోవుచున్నదికదా! (నీవు బోవుటకేమి వింతయని తా.)

సుకక్ష-లేక-శ్రుతకక్షఋషి-గాయత్రీచ్ఛంద-ఇంద్ర దేవత.

౧౨౦౪. తమింద్రం వాజయామసి మహే వృత్రాయ హన్తవే। స వృషా వృషభో భువత్॥

(యజమానుల మాటలు) ఆ యింద్రుని (సోమముతోను, స్తుతులతోను) బలవంతునిం జేయుదము. (ఎందుకంటే) ఉదకముల నావరించి వృత్రునిం జంపుటకు ధనముల వర్షము కురియించు నా యింద్రుఁడు మాకు ధనమును గురియించువాఁడు అగుఁగాక.

౧౨౦౫. ఇంద్ర స్సదామనే కృత ఓజిష్ఠః స బలే హితః। ద్యుమ్నీ శ్లోకీ స సోమ్యః॥

ఆ యింద్రుఁడు ధనము నిచ్చుటకై పుట్టినాఁడు. మహా బలవంతుఁడైన ఆ యింద్రుఁడు బలముగల సోమమందుంచఁబడినాడు. కీర్తివంతుఁడు లేక అన్నవంతుఁడు కనుకనే స్తుతింపఁదగినవాఁడు, సోమమున కర్హుఁడును అగుచున్నాఁడు.

౧౨౦౯. గిరా వజ్రోన సంభృతః సబలో అనపచ్యుతః। వవక్ష ఉగ్రో అస్తృతః॥

వజ్రాయుధము ఎట్లు వాఁడిగలదిగా సానపెట్టునో, యట్లు స్తుతులతో తీవ్ర పఱచఁబడిన యింద్రుఁడు బలవంతుఁడగుచున్నాఁడు. కనుకనే యితరులకు లొంగనట్టి భయంకరుఁడు, మహాత్ముఁడు, శత్రువులచే హింసింపఁబడనివాఁడు, నగు నింద్రుఁడు (ధనము మొదలగు నిష్టములను స్తుతి కర్తలకు) మోసి తేఁ దలఁచుచున్నాఁడు.

ఉత్తరార్చిక నవమాధ్యాయ షష్ఠఖండ సమాప్తము.

—:o:—

## ౯ అధ్యాయము.

## ౭ ఖండము.

ఉచథ్యఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౨౧౭. అధ్వర్యో అద్రిభిః సుతగ్ం సోమం పవిత్ర ఆనయ। పునాహీంద్రాయ పాతవే॥

ఓ యధ్వర్యుఁడా! శిలలచేత నభిషవింపఁ (=పిండ) బడిన సోమమును బవిత్రమందు (ఉన్నితోఁ జేసిన బట్ట) బోయుము. ఇంద్రుని పానమునకై వడకట్టుము.

౧౨౧౮. తవ త్య ఇందో అంధసో దేవా మధో వ్యాశత। పవమానస్య మరుతః॥

ఓ సోమమా! నీసంబంధమయినట్టి, మదము కలిగించునట్టి, పడకట్టఁబడినట్టి, రసరూపమయిన యన్నమును ఈ దేవతలు పొందుచున్నారు.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ఉ ౧ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩
౧౨౦౯. దివః పీయూష ముత్తమ గం సోమ మింద్రాయ వజ్రిణే। సునోతా
౧ ౨
మధుమత్తమం॥

ఓ యధ్వర్యులారా! మీరు మిగుల మధురమైన, ద్యులోకమున కమృతమైన, శ్రేష్ఠమైన, సోమమును వజ్రధారియగు నింద్రునకు అభిషవించుఁడు.

కవిఋషి-జగతీచ్ఛంద-సోమదేవత.

౩ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩
౧౨౧౦. ధర్త్రాదివః పవతే కృత్వ్యో రసో దక్షో దేవా నా మను మాద్యో
౧ ౨ ౧ ౨ ౩ ఉ ౩ ౧ ౨ ర ౩ ౨ ౩ ౧ ౨
నృభిః। హరిః సృజానో అత్యో న సత్వభి ర్వృథా పాజాగంసి కృణుషే
౩ ౨
నదీష్వా॥

సర్వమున కాధారమయినట్టి, శోధింపఁదగినట్టి, రసరూపమయినట్టి, దేవతలకు బలమిచ్చునట్టి, ఋత్విజులచేత స్తుతింపఁబడునట్టి, సోమము అంతరిక్షము (=అనఁగా దశా పవిత్రము)నుండి కారుచున్నది. ఆకుపచ్చని రంగుగలది,మాచేత విడువంబడినది) గుఱ్ఱమువలె నడచునది,అనాయాసముగా నుదకములందు బలములను గూర్చుచున్నది. (నీటితోఁగలిసి పానయోగ్యమై బలమునిచ్చుచున్నదనితా.)

౨ ౩ ౧ ౨ ౧ ౨ ౩ ౧ ౩ ౨ ౧ ౨ ౩ ౧ ౨ ర
౧౨౧౧. శూరో న ధత్త ఆయుధా గభస్త్యోః స్వాః సిషాస న్రథిరో గవిష్టిషు।
౧ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨ ౩ ౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
ఇంద్రస్య శుష్మమీర యన్నపస్యుభి రిందు ర్హిన్వానో అజ్యతే
౩ ౧ ౨
మనీషిభిః॥

ఈసోమము హస్తములందు ఆయుధములను శూరునివలె ధరించుచున్నది. సుఖసాధనమైన యాగమును జేయఁగోరుచు, రథముకలదయి యజమానులకు గవాదివస్తువులను ఇవ్వఁదలఁచి యింద్రునకు బలమును బ్రేరించుచు, సోమము కర్మలను గోఁరు విద్వాంసులచేత, స్తుతికర్తలచేతఁ బ్రేరింపఁబడి (గవాదిక్షీరములతో) గూడుచున్నది.

౧౨౧౨ ఇంద్రస్య సోమ పవమాన ఊర్మిణా తవిష్యమాణా జఠరేష్వావిశ।
ప్రనః పిన్వ విద్యుదభ్రేవ రోదసీ ధియా నో వాజాగ్ం ఉపమాహి
శశ్వతః॥

ఓసోమమా! వడకట్టఁ బడుచున్నదానా! నీవువృద్ధినొందించు దానవై, యింద్రుని యుదరములందు విశేషమైన ధారతోఁ బ్రవేశించుము. (గర్భములోని భాగము లనేకములగుటచే బహువచము చెప్పఁబడెను) మెఱుపు మేఘములం బిదుకునట్లు మాకొఱకు ద్యులోక భూలోకములను బిదుకుము. (ద్యులోకము నుండివర్షము- భూలోకమునుండి సస్యమునుఇమ్మనితా॥) మఱియుం గర్మచేత మాకునసేకములైన యన్నములను సమీపమున నిర్మించుము.

దేవాతిథిఋషి. బృహతీచ్ఛంద-ఇంద్రదేవత.

౧౨౧౩. యదింద్ర ప్రాగపా గుదగ్న్య గ్వా హూయసే నృభిః। సిమా పురూ
నృషూతో అస్యానవేఽసి ప్రశర్ధతుర్వసే॥

ఓ యింద్రుఁడా! తూర్పు దిక్కునందుఁగాని, పడమటి దిక్కునందుఁగాని యున్నట్టి; ఉత్తర దిక్కునందుగాని, దక్షిణ దిక్కునందుఁగాని యున్నట్టి; నరులచేత నీవు పిలువఁబడు చున్నావేమో! శ్రేష్ఠుఁడవైన యింద్రా! అయినప్పటికిని అనువను

రాజపుత్రుని విషయమై యతని స్తుతికర్తలచేతఁ బ్రేరింపఁబడున్న వాఁడవు. మిగుల శ్రద్ధ కలుగఁజేయు నింద్రా! తుర్వశరాజ విషయమై స్తుతికర్తలచేత బ్రేరింపఁబడుచున్నావు. (ప్రార్థింపఁబడుచున్నావని తా.)

౨ ౩   ౨ ౩   ౧ ౨ ౩   ౧ ౨౩   ౨ ౩ ౧ ౨   ౩ ౧ ౨ ౩ ౧ ౨   ౧ ౨
౧౨౧౪. యద్వారుమే రుశమే శ్యావకే కృపఇంద్ర మాదయసే సచా। కణ్వా
౩   ౧ ౨౩ ౧ ౨   ౩ ౧   ౨ర౩ ౧ ౨
సస్త్వా స్తోమేభిర్బ్రహ్మ వాహస ఇంద్రా యచ్ఛన్త్యాగహి।

ఒకవేళ రుమ-రుశమ-శ్యావక-కృపయను నల్వురు రాజులతో నీ వింద్రా! కూడి యానందించుచుందువేమో! అయినప్పటికి స్తుతికర్తలు కాక హావిస్సుల నిచ్చువారు నైన కణ్వవంశ్యులు స్తోత్రములతోఁగూడ నిన్ను బిలుచుచున్నారు కనుక శీఘ్రము రమ్ము.

భర్గఋషి-బృహతీచ్ఛంద-అగ్ని దేవత.

౩౧ ౨   ౩౧౨   ౩ ౧ ౨   ౩ ౨౩౧ ౨ర   ౩ ౧ ౨
౧౨౧౫. ఉభయగ్ం శృణవచ్చ న ఇంద్రో అర్వాగిదంవచః। సత్రాచ్యా
౩ ౨౩ ౧ ౨   ౩ ౧ ౨ర౩ ౧ ౨
మఘవాన్సోమ పీతయే ధియాశవిష్ఠ ఆగమత్।

స్తోత్ర శస్త్రరూపమయిన రెండు విధముల స్తుతిమంత్రములను మా కభిముఖముగా నింద్రుఁడు వినుఁగాక. ధనవంతుఁడైనయింద్రుఁడు మాతోఁగూడియున్న యనుగ్రహబుద్ధితోఁ బాగుగా సోమపానము చేయుటకు వచ్చుఁగాక.

౨ఉ   ౩ ౧ ౨   ౩౧   ౨ర   ౩౧౨   ౩౧ ౨
౧౨౧౬. త్వగ్ం హి స్వరాజం వృషభం తమోజసా ధిషణే నిష్టతక్షతుః
౩ ౨౩౧ ౨   ౩౧   ౨ర౩ ౧ ౨   ౨   ౨ ౩ ౧ ౨
ఉపోతమానాం ప్రథమో నిషీదసి సోమ కామగ్ం హితేమనః॥

స్వయముగాఁ బ్రకాశించునట్టి, వర్షము కురియించునట్టి, యా యింద్రు నే ద్యులోక, భూలోకముల బలముతో, నిర్మించినవి. మఱియు నందువల్ల నో యింద్రా!

ఉపమాన భూతులైన (అనఁగా మేలువారయిన) దేవతలలోపల ముఖ్యుఁడవై యున్నావు. నీ మనస్సు సోమమును గోరుచున్నదికదా!

ఉత్తరార్చికమందు నవమాధ్యాయ సప్తమ ఖండము సంపూర్ణము.

—:(౧):—

## ౯ అధ్యాయము.

### ౮ ఖండము.

నిధ్రువిఋషి-గాయత్రీచ్ఛంద-సోమదేవత.

౧౨౧౭. పవస్వ దేవ ఆయుషగింద్రం గచ్ఛతు తేమదః। వాయు మారోహ ధర్మణా॥

సోమమా! ప్రకాశించునట్టి నీవు ధారగాఁ గారుము. మఱియు నీ మదము గలిగించు రసము ఇంద్రుని గూర్చి పోవుఁగాక. నీవు ధారకమైన రసముతో వాయువును బొందుము.

౧౨౧౮. పవమాన నితోశసే రయిగ్ం సోమ శ్రివాయ్యం। ఇందో సముద్రిమా విశ॥

వడకట్టుచున్న, చలువ గలిగించుచున్నట్టి, లేక జారుచున్నట్టి, సోమమా! ప్రశిద్ధమయిన శత్రుధనమును బాగుగాఁ బీడింతువు. ఆ నీవు ద్రోణకలశమును బ్రవేశించుము.

౧౨౧౯. అపఘ్నన్పవసేమృధః॥

శత్రువులం జంపుచుం గారుచున్నావు.

అమ్బరీషఋషి-ఋజాశ్వోవాఋషి-అనుష్టుప్ఛంద-సోమదేవత.

3౧౨ 3౧౨
౧౨౨౦. అభీనోవాజసాతమం॥

మా యుద్ధమును గూర్చి యభిముఖముగమ్ము.

3౧ ౧ ౨౧ ౨ర3 ౧౨ 3 ౧ ౨ ౧ ౨ర
౧౨౨౧. వయంతే అస్య రాధసో పవసోర్వసో పురుస్పృహః। నినేదిష్ఠతమా
3౧ ౨ర 3 ౧ ౨
ఇషః స్యామ సుమ్నేతే అధ్రిగో॥

నివాసాధారమయిన సోమమా! యిట్టి నీ యొక్క, పలువురు కోరఁదగిన, కాపురమున కాధారమయిన, నీ విచ్చఁదగిన ధనమునకుఁ జాలదగ్గఱ వారల మగుదుము గాక.

౨3౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨3 ౧౨ ౨3 ౨ 3 ౧
౧౨౨౨. పరిస్యస్వానో అక్షరదిందురవ్యో మదచ్యుతః। ధారాయ ఊర్ధ్వో
౨3 ౨ 3 ౧ ౨ర 3 ౨
అధ్వరేభ్రాజా నయాతి గవ్యయుః॥

గోవులం గోరుచున్న, యన్నిఁటికంటె ముఖ్యమయిన యే సోమము ప్రకాశముతో నంతరిక్షమునందువలె యాగమందుఁ దన ధారతో గమనించుచున్నది అభిషవింపఁబడుచు నా సోమము మదముకొఱకు వేదములతోఁ బ్రేరింపఁబడుచు గొఱ్ఱె బొచ్చు వస్త్రమునందు నంతటను గారుచున్నది.

౧౨ 3 ౧ ౨ 3 ౨ 3 ౨3౨ 3 ౨ 3 ౧ ౨ర
౧౨౨౩. పవస్వసోమ మహాన్త్సముద్రః। పితాదేవానాం విశ్వాభిధామ

సోమమా! మహిమగలట్టి, స్రవించునట్టి, సర్వముం బాలించునట్టి, నీవు దేవతల శరీరముల నన్నిఁటిని గూర్చి స్రవించుము.

౩౧ ౨ ౩ ౩౧౨ ౩౧ ౨౩౧ ౨౪ ౩౧౨
౧౨౨౪. శుక్రఃపవస్వ దేవేభ్యః సోమదివే పృథివ్యై శంచప్రజాభ్యః ॥

సోమమా! దీపించుచున్న నీవు దేవతలకై కారుము. ద్యులోక భూలోకముల కొఱకుఁ బ్రజలకొఱకును సుఖమును జేయుము.

౩ ౨౩ ౧౨ ౩౨ ౩ ౧౨ ౩౧ ౨౪ ౩౧౨
౧౨౨౫. దివోధర్తాసి శుక్రః పీయూషః సత్యేవిధర్మన్వాజీపవస్వ॥

సోమమా! దీపించునట్టి, త్రావఁదగినట్టి, నీవు ద్యులోకమును బోషించు వాఁడవగుచున్నావు. బలముగల నీవు సత్యఫలము లిచ్చు యజ్ఞమందు స్రవించుము.

ఉత్తరార్చికమున నవమాధ్యాయ అష్టమ ఖండము సంపూర్ణము.

౯ అధ్యాయము.

౯ ఖండము.

ఉశనఋషి-గాయత్రీచ్ఛంద-అగ్నిదేవత.

౧ ౨ ౩౧౨ ౩ ౨ ౩ ౧౨౩ ౨ ౨౩ ౨ ౩ ౨౪
౧౨౨౬. ప్రేష్ఠంవో అతిథిగ్ం స్తుషే మిత్రమివప్రియమ్। అగ్నేరథంన వేద్యం॥

ఓ యగ్నీ! శ్రేష్ఠుఁడవు, మిగుల ప్రియమగువాఁడవు, అతిథినిబోలి పూజింపఁదగినవాఁడవు, స్నేహితునివలెఁ బ్రియుఁడవు, రథమువలె ధనలాభము చేయువాఁడవు, పొందఁదగినవాడవు నగు నిన్ను స్తుతించుచున్నాను.

౩౧ ౨ ౩ ౨ ౩ ౨ ౩౨ ౩ ౧౨౩ ౨ ౧ ౨౪ ౩౨
౧౨౨౭. కవిమివప్రశగ్ంస్యం యందేవాస ఇతిద్వితా నిమర్త్యేష్వాదధుః ॥

దేవతలు ఏ యగ్నిని మనుష్యులలో నిట్లు కవినివలె రెండు కార్యములలో

సుంచిరో, (ఇహలోక పరలోక కార్యములని రెండు.) అట్టివానిని (స్తుతింతును.)

౧ ౨ 3 ౨ 3 ౧ ౨ 3 ౧ ౨ర ౧ ౨ 3 ౨ 3౧
౧౨౨౮. త్వంయవిష్ఠ దాశుషో నృగ్ంపాహి శృణుహీగిరః। రక్షాతోకముత
౨ర
త్మనా ॥

యౌవనవంతులలో నుత్తముఁడవయిన యింద్రా! హవిస్సుల నిచ్చునట్టి, నరులను బాలించుము. నీ స్తుతులను వినుము. మఱియు స్వయముగానే నా పుత్రుని రక్షించుము.

నృమేధఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౧ ౨ 3 ౧ ౨ 3 ౨ఉ 3 ౧ ౨ 3 ౧
౧౨౨౯. ఏన్ద్రనో గధిప్రియ సత్రాజిదగోహ్య। గిర నః విశ్వతః పృథుః
౨ర 3 ౧
పతి ర్దివః॥

ఓ ప్రియుఁడవు, గొప్ప శత్రువు జయించువాఁడవు, దాచ శక్యముకానివాఁడవు, నగు నింద్రా! పర్వతమువలె నన్నిఁటికంటె నెక్కుడువాఁడవు, స్వర్గమునకుఁ బతివియగు నీవు మావద్దకు రమ్ము.

3౧ ౨ర 3 ౨ 3 ౨ 3 ౧ ౨ ౧ ౨ర 3 ౨
౧౨౩౦. అభిహి సత్య సోమపా ఉభే బభూథ రోదసీ। ఇంద్రాసి సున్వతో
3 ౧ ౨ర 3 ౨
వృధః పతి ర్దివః॥

సత్యస్వరూపుఁడవు, సోమపానము చేయువాఁడవునగు నీవు ఇంద్రా! ద్యులోక భూలోకముల రెంటెని తిరస్కరించితివి. అట్టి నీవు సోమము నభిషవించుచున్న యజమానుని వృద్ధి నొందించు వాఁడవగుచున్నావు.

౧ ౨ర 3 ౧ ౨ 3 ౨ 3 ౧ ౨ర 3 ౨ఉ 3 ౧ ౨
౧౧౩౧. త్వగ్ం హిశశ్వతీనా మింద్ర ధర్తా పురామసి। హన్తా దస్యోర్మనో
3 ౧ ౨ర 3 ౨
ర్వృధః పతిర్దివః॥

ఇంద్రా! అనేక శత్రుపట్టణములను బ్రద్దలుచేసితివి. దస్యువును (=కాలమును వృథాగాఁ గడపువాఁడు.) సంహారింతువు. మనుష్యునకు (యాగాదులు చేయువానికి) వృద్ధిని గలిగించువాఁడవు, స్వర్గమునకు నాయకుఁడవు నగుదువు.

జేతఋషి-ఉష్ణిక్ఛంద-ఇంద్రదేవత.

౧౨౩౨. పురాంభిన్దుర్యువా కవి రమితౌజా అజాయత ఇంద్రోవిశ్వస్య కర్మ
ణోధర్తా వజ్రీపురుష్టుతః॥

ఈ యింద్రుఁడు శత్రుపురముల భేదించువాఁడు, నిత్యయౌవనశాలి, మేధావి, అతి బలవంతుఁడు, సర్వకర్మలకు నాధారమగువాఁడు, వజ్రము ధరించినవాఁడు, పలువురుచేత స్తుతింపఁబడువాఁడు, నగుచుఁ బుట్టెను.

౧౨౩౩. త్వంబలస్య గోమతోऽపావరద్రివో బిలం। త్వాం దేవా అభిభ్యుష
స్తుజ్యమానా స ఆవిషుః॥

వజ్రముకల యింద్రా! నీవు గోవులతోఁగూడిన బలాసురుని గుహను దెరచితివి. అపుడు బలముచేత హింసింపఁబడుచున్న దేవతలు భయములేనివారగుచు నిన్ను జేరిరి. ( బలాసురుఁడు దేవతల గోవుల నెత్తుకపోయి గుహలో దాచితే ఇంద్రుడు దానిం బ్రద్దలుకొట్టి గోవుల బయలుదీసి తెచ్చి దేవతల కిచ్చెనని కథ.

౧౨౩౪. ఇంద్రమీశాన మోజసాభి స్తోమేనా నూషత। సహస్రం యస్య రా
తయ ఉతవాస న్తి భూయసీః॥

స్తుతికర్తలారా! బలముచేత నీశ్వరుఁడయిన యింద్రుని స్తోత్రమంత్రములచేత అంతట నుతించుఁడు. ఏ యింద్రుని ధన దానములు వేలకొలఁది గలవో అథవా యింక నధికముగఁగలవో ఆయింద్రుని స్తుతింపుఁడు.

ఉత్తరార్చికమున నవమాధ్యాయము, నవమ ఖండము సంపూర్ణము.